## ఎందుకీ పుస్తకం ?

సువిశాలమైనట్టిది – మన భారతదేశం. విభిన్న శీతోష్ణ పరిస్థితులు. వివిధములైన వేషధారణలు. రకరకాలైన ఆహారపుటలవాట్లు. ఒక్కోచోట ఒక్కో భాష. ఒక్కో ప్రాంతానికొక ప్రాధాన్యత. కేరళలో కొబ్బరి తోటల సౌభాగ్యం. కుమాయన్ కొండల్లో హరిత సంపద. మధ్యలో మైదాన ప్రాంతాలు. ప్రక్కనే పీఠభూములు. ప్రపంచంలో అత్యధిక వర్షపాతం గల చిరపుంజీ, అత్యల్ప వర్షపాతం గల పామూర్ పీఠభూమి–రెండూ భారత్‌లో అంతర్భాగాలే. ఎంతటి అద్భుతము సువిశాల, సుసంపన్న భారతదేశం!

దీనినంతటినీ మించిన అద్భుతం! పండిత నెహ్రూ ప్రవచించారు. ఎంతటి వైవిధ్యమున్నదో అంతటి ఏకత్వమున్నదీ సువిశాల భారత ఖండంలో. ఎవరే భాషలో పలికినా ఆలోచన ఒక్కటే. ఎవరే దేవుని ఆరాధించినా మన ధర్మం ఒక్కటే. కాలడిలోని కాథలిక్ చర్చిలో, కాశ్మీర్‌లోని శంకర్ మఠం పరికించేది – ముముక్షువులనే. మన సంస్కృతీ స్రవంతి అవిచ్ఛిన్నమైనట్టిదే. మన సాంప్రదాయ సర్వజనామోదమైనట్టిదే. మనలనందరినీ బంధించే అంతస్సూత్రమే – మన యీ సంస్కృతీ సాంప్రదాయాలు.

గాంధీజీ దక్షిణాఫ్రికా నుండి తిరిగి వచ్చారు. గోఖలే శిష్యులైనారు. శిష్యులకు గోఖలే అప్పగించిన మొదటి పని – భారతదేశ సందర్శన చేసి రమ్మని. ఈ దేశపు అఖండత్వాన్ని దర్శించి రమ్మని. ఇందలి వైవిధ్యాన్ని పరికించమని. కాస్తోకూస్తో సామాజిక చింతన, దేశహితైషి భావ ఉన్నవారందరికీ అత్యవసరమైనట్టిది – ఇట్టి భారత సందర్శన.

అట్టి భారతయాత్రపై పాఠకులను తీసుకొని వెళ్ళటానికే – ఈ పుస్తకం.

'మన రాష్ట్రాల కథలు' శీర్షికన శ్రీ వేమూరి జగపతిరావు లేఖిని నుండి వెలువడి, "తెలుగు విద్యార్థి"లో సీరియల్‌గా ప్రచురించబడిన వ్యాసాల సంకలనమే – ఈ పుస్తకం. ఈ వ్యాసాలన్నీ చదివిన మిత్రులు మన విద్యార్థులకిట్టి సంకలనం ఎంతో ప్రయోజనకారిగా ఉండగలదని సూచించారు. అందరికీ యిందెతో స్ఫూర్తిదాయకంగా కూడ ఉండగలదని, మనదసలు ఒక జాతే కాదని, జాతీయత అంటూ మనకసలు ఏమీ లేదని వాదించే వారికీ వ్యాసాలలోని వివరాలు కనువిప్పుగా ఉండగలవని భావించారు. మన జాతీయ సమైకత్యకీ సంకలనం ఎంతో దోహదకారిగా ఉండగలదని ఆశించారు.

అందుకే ఈ పుస్తకం మా అన్ని ప్రచురణలలాగే దీనిని కూడ మా పాఠకులైన విద్యార్థులు, విద్యావేత్తలు ఆదరించగలరని ఆశిస్తున్నాం.

– తెలుగు విద్యార్థి ప్రచురణలు



ప్రముఖ పత్రికా రచయిత శ్రీ వేమూరి జగపతిరావు వృత్తి రీత్యా వ్యవసాయదారులు. బందరు ఆంధ్ర జాతీయ కళాశాలలో బి.ఎ. వరకూ చదివారు. హాబీగా పత్రికలకు వ్యాసాలు రాస్తూ వుంటారు. వీరు గత 30 సంవత్సరాలుగా ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి, ఈనాడు పత్రికలకు అసంఖ్యాకంగా వ్యాసాలు వ్రాసారు. వీరు రచించిన "ప్రపంచ రాజ్యాంగ సంగ్రహ చరిత్ర" బహుళ ప్రచారం పొంది అనేక ముద్రణలు పడింది. వీరింకా బాపూజీ కథలు, మహనీయుల ముచ్చట్లు, ప్రముఖుల ప్రేమాయణాలు అనే పుస్తకాలు కూడా రాశారు. జగపతిరావు గారి వయస్సు 56 సంవత్సరాలు.

— పబ్లిషర్స్

# జనగణమన అధినాయక జయహే .............

మనదేశం భారత్ – 25 రాష్ట్రాలు 7 కేంద్రపాలిత ప్రాంతాలతో – 32 లక్షల 87వేల చదరపు కిలోమీటర్ల వైశాల్యం 86 కోట్ల జనాభాతో – వేల సంవత్సరాల చరిత్ర, నాగరికత కల్గిన మహత్తర దేశం. విభిన్న ఆచారాలు, రకరకాల పద్ధతులు కట్టుబాట్లు, అనేక భాషలు, అనేక మతాల సమ్మేళనం మన భారత్.

అటు కాశ్మీర్ నుంచి కన్యాకుమారి వరకూ ఇటు గుజరాత్ నుంచి అరుణాచల్ ప్రదేశ్ వరకూ రంగురంగుల దుస్తులతో కానవచ్చే ప్రజలు, రకరకాల సాంప్రదాయాలు, ఎటుచూసినా పచ్చని పంటపొలాలు, దట్టమైన అడవులు, ఎత్తైన కొండలు, ఎంతో పొడవైన కోస్తా ప్రాంతం, అపారమైన సహజ సంపదలు,ఎన్నో జీవనదులతో కూడిన రంగుల హరివిల్లు భారత్. వేల సంవత్సరాల నాగరికత సంస్కృతులకు తార్కాణంగా మిగిలిన ప్రాచీన కట్టడాలు, అవశేషాలు దేశంలో ఏమూల కెళ్ళినా దర్శనమిస్తాయి. సుందర మనోహర దృశ్యాలు అడుగడుగునా సాక్షాత్కరిస్తాయి.

ఈ సుందరనందన వనాన్ని టూకీగా పాఠకుల ముందుంచటమే మన రాష్ట్రాల కథల రచన ఉద్దేశ్యం. మహత్తరమైన దేశ రూపురేఖల్ని పాఠకులకు పరిచయం చేయటానికే ఈ ప్రయత్నం. మన రాష్ట్రాల కథలు చదవటం ఒకసారి భారత్‌ను చుట్టిరావటమే! భారత్‌ను దర్శించటమే – భిన్నత్వంలో ఏకత్వాన్ని కాంచటమే – వివిధ భారతిలో సమైక్య భారతిని దర్శించటమే.

జై భారత్

– వేమూరి జగపతి రావు

# భారతదేశం

అఫ్ఘనిస్తాన్
జె & కె.
శ్రీనగర్
హెచ్.పి.
సిమ్లా
పాకిస్థాన్
పంజాబ్
చండీగర్
చైనా టిబెట్
హర్యాన
ఢిల్లీ
నేపాల్
సిక్కిం
రాజస్థాన్
ఉత్తర్ ప్రదేశ్
జైపూర్
లక్నో
గంగటాక్
భూటాన్
ఇటానగర్
డిస్పూర్
అస్సాం
నాగాలాండ్
కోహిమ
పాట్నా
మేఘాలయ
ఇంఫాల్
గుజరాత్
బీహార్
త్రిపుర
మణిపూర్
భోపాల్
గాంధీనగర్
పశ్చిమ బెంగాల్
అగర్తల
ఐజ్వాల్
మధ్యప్రదేశ్
కలకత్తా
మిజోరామ్
డయు డామన్
సిల్వాస్సా
ఒరిస్సా
బంగ్లాదేశ్
మహారాష్ట్ర
బొంబాయి
భువనేశ్వర్
బర్మా
అరేబియా సముద్రం
హైదరాబాద్
యానం
గోవా
పనజి
కర్నాటక
ఆంధ్రప్రదేశ్
బంగాళాఖాతం
బెంగుళూర్
మద్రాసు
మాహె
పాండిచ్చేరి
తమిళనాడు
కరైకల్
లక్షద్వీప్: కావరత్తి
కేరళ
అండమాన్ & నికోబార్ దీవులు
త్రివేండ్రం
శ్రీలంక
భారత మహా సముద్రం

# విషయ సూచిక

# 1 ఆంధ్రప్రదేశ్

ఆంధ్రప్రదేశ్ వైశాల్యం 2,75,068 చ కిలోమీటర్లు జనాభా 6 కోట్ల 63 లక్షలు రాజధాని హైదరాబాద్. వాడుక భాషలు – తెలుగు, ఉర్దూ జనాభా, వైశాల్యం రీత్యా కూడా భారతదేశంలోని పెద్ద రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ అయిదో స్థానంలో వుంటుంది పశ్చిమ జర్మనీ, బ్రిటన్ దేశాలకన్నా వైశాల్యం రీత్యా పెద్దది మన రాష్ట్రం ఫ్రాన్సు వైశాల్యంలో మన రాష్ట్రం సగం పైగా వుంటుంది జనాబా రీత్యా చూస్తే మన రాష్ట్రం పశ్చిమ జర్మనీ, బ్రిటన్, ఫ్రాన్సులతో ఇంచుమించుగా సమానంగా వుంటుంది ఐక్య రాజ్యసమితిలో సభ్యత్వం కల్గిన 159 దేశాలలో వందకు పైగా దేశాలు మన రాష్ట్రం కన్నా వైశాల్యం, జనాభా రీత్యా కూడా చిన్నవే



ఆంధ్రులు పురాతన కాలంనాటివారు. రామాయణ, భారతాలలో ఆంధ్రుల ప్రస్తావన వుంది. అయితే ఆంధ్రుల గురించి చరిత్రలో నమోదయింది మౌర్యుల కాలంనుండే అశోక చక్రవర్తి తదనంతరం అతని సామంతులు శాతవాహనులు ప్రస్తుత అమరావతి (గుంటూరు జిల్లా) ప్రాంతంలో ఒక చిన్న స్వతంత్ర రాజ్యాన్ని ఏర్పరచారు. శాతవాహన వంశీకులైన 30 మంది రాజులు ఈ ప్రాంతాన్ని 450 సంవత్సరాలు పాలించారు.

శాతవాహన రాజ్యం తరువాత ఇక్ష్వాకులు అధికారంలోకి వచ్చి దాదాపు 60 సంవత్సరాలు రాజ్యం ఏలారు. ఈ కాలంలోనే ఆంధ్రప్రాంతం అంతటా అనేక బౌద్ధ స్థూపాలు నిర్మాణం అయినాయి. నాగార్జున కొండ దగ్గర స్థూపాలు కూడా అప్పట్లోనే నిర్మించబడినాయి. ఇక్ష్వాకుల తదనంతరం పల్లవ వంశీకులు రాజ్యపాలనకు వచ్చారు. దక్షిణ భారతం అంతా వారి ఆధీనంలో వుండేది. పల్లవ వంశం క్రీ॥ శ॥ 6వ శతాబ్దం వరకూ కొనసాగింది. వీరి తర్వాత 7వ శతాబ్దంలో తూర్పు చాళుక్యులనబడే మరొక రాజవంశం అధికారంలోకి వచ్చింది. నాలుగు వందల సంవత్సరాలు పరిపాలించిన వీరి హయాంలో ఆంధ్రదేశంలో ఎంతో అభివృద్ధి జరిగింది. తెలుగు సంస్కృతికి స్పష్టమైన రూపురేఖలలో గట్టి పునాది అప్పట్లోనే పడింది.

13వ శతాబ్దంలో కాకతీయ రాజవంశం వరంగల్ రాజధానిగా చేసుకొని ఆంధ్రదేశాన్ని పరిపాలించారు. 1323లో డిల్లీ సుల్తాన్ తుగ్లక్ దండయాత్రలో కాకతీయ పాలన అంతమైంది. 1336లో ఏర్పడిన విజయనగర సామ్రాజ్యం 1565 వరకూ ఉచ్ఛదశ అనుభవించింది. ఒకానొకదశలో విజయనగర సామ్రాజ్యం దక్షిణ భారతదేశం అంతటికీ విస్తరించింది. కృష్ణదేవ రాయలు (1509-1529) కాలంలో ఈ సామ్రాజ్యం మహావైభవంగా వెలుగొందింది. కృష్ణదేవరాయల తర్వాత ఈ మహాసామ్రాజ్యం ముక్కచెక్కలై కుతుబ్‌షాహీల పాలన ప్రారంభమయింది. కుతుబ్‌షాహీ రాజులకు కళలన్నా, వాస్తు నిర్మాణాలన్నా అమిత ప్రీతి. హైదరాబాద్ నగరానికి పునాదులు వేసింది వీరే. మొగల్ చక్రవర్తి ఔరంగజేబు కుతుబ్‌షాహీలను ఓడించి అసఫ్‌జాహిని మొగలాయి ప్రతినిధిగా నియమించాడు. ఢిల్లీలో మొగలాయి సామ్రాజ్యం క్షీణించటంలో అసఫ్‌జాహీలు స్వతంత్రం ప్రకటించుకున్నారు. వీరే నిజాంలుగా ప్రసిద్ధి పొందారు.

1947లో భారత్‌కు స్వతంత్రం వచ్చేనాటికి ప్రస్తుతం తెలంగాణా ప్రాంతం నిజాం పాలనక్రింద వుండేది. రాయలసీమ, కోస్తా జిల్లాలు మద్రాసు రాష్ట్రంలో వుండేవి. 1948లో పోలీసు చర్యతో తెలంగాణా స్వతంత్రం పొందగా, తెలుగువారి ఆందోళన అమరజీవి పొట్టి శ్రీరాములు ఆత్మార్పణతో కర్నూలు రాజధానిగా ఆంధ్రరాష్ట్రం ఏర్పడింది 1956 అక్టోబర్ 1న. 1956 నవంబరు 1న తెలంగాణాతో కూడా కలిపి

ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది భాషా ప్రాతిపదికమీద ఏర్పడిన తొలి రాష్ట్రం ఆంధ్రప్రదేశ్.

టంగుటూరి ప్రకాశంగారు తొలి ముఖ్యమంత్రి అయ్యారు. గోపాల రెడ్డి, నీలం సంజీవరెడ్డి, దామోదరం సంజీవయ్య, కాసు బ్రహ్మానందరెడ్డి, పి వి నరసింహారావు, జలగం వెంగళరావు, డా॥ ఎం చెన్నారెడ్డి, టంగుటూరి అంజయ్య, భవనం వెంకట్రామిరెడ్డి, కె. విజయభాస్కరరెడ్డి, యన్ టి రామారావు, యన్ జనార్ధనరెడ్డి మన రాష్ట్ర ప్రముఖులు.

భారతదేశ వైశాల్యంలో ఆంధ్రప్రదేశ్ 8.4 శాతంగా వుంటుంది. జనాభా రీత్యా దేశ జనాభాలో ఆంధ్రులు 7 82 శాతంగా వుంటారు

మన రాష్ట్రం 23 జిల్లాలుగా విభజించబడి వుంటుంది. అవి చిత్తూరు, కడప, కర్నూలు, అనంతపురం (రాయలసీమ) నెల్లూరు, ప్రకాశం, గుంటూరు, కృష్ణా, పశ్చిమ గోదావరి, తూర్పు గోదావరి, విశాఖపట్నం, విజయనగరం, శ్రీకాకుళం (కోస్తా), నల్గొండ, ఖమ్మం, వరంగల్, మెహబూబ్‌నగర్, రంగారెడ్డి, హైదరాబాద్, మెదక్, నిజామాబాద్, ఆదిలాబాద్, కరీంనగర్, (తెలంగాణా).

జనాభా రీత్యా మన రాష్ట్రంలో పెద్ద జిల్లా తూర్పు గోదావరి జిల్లా. జనాభా 37 లక్షలు. చిన్న జిల్లా రంగారెడ్డి. జనాభా 16 లక్షలు. వైశాల్యం రీత్యా అయితే పెద్ద జిల్లా గుంటూరు. 11390 చ॥ కి॥ మీటర్లు. చిన్నజిల్లా హైదరాబాద్. 217 చ॥ కి॥ మీటర్లు. రాజధాని హైదరాబాద్ జనాభా 43 లక్షలు.

ఆంధ్రప్రదేశ్‌లో గ్రామాల్లో వుండే జనాభా 4 కోట్ల 30 లక్షలు అంటే దాదాపు 75 శాతం ప్రజలు గ్రామాల్లోనే నివసిస్తున్నారు. రాష్ట్ర ప్రజలలో హిందువులు 5 కోట్ల 20 లక్షలు ముస్లింలు 50 లక్షలు, క్రిష్టియన్లు 20 లక్షలు. మన రాష్ట్ర జనాభాలో అక్షరాస్యులు 45 శాతం. భారతదేశంలో అక్షరాస్యులు 52 శాతం కాగా ఈ విషయంలో మన రాష్ట్రం 10 రాష్ట్రాల కన్నా వెనుకబడి వుంది

ఆంధ్రప్రదేశ్‌లో ముఖ్యమైన నదులు మూడు – గోదావరి, కృష్ణ, పెన్నార్. ఇంకా చిన్న చిన్న నదులు 30కి పైగా వున్నాయి. భారతదేశంలో కెల్లా రెండవ పెద్ద నది గోదావరి. దీని మొత్తం పొడవు 1584 కిలోమీటర్లు కాగా మన రాష్ట్రంలో 772 కిలోమీటర్లు దూరం నిజామాబాద్, కరీంనగర్, ఖమ్మం, తూర్పుగోదావరి జిల్లాల గుండా ప్రవహిస్తుంది.

అయితే గోదావరి నీరును మనం సరిగా సద్వినియోగం చేసుకోకపోవటం వలన గోదావరిలో హెచ్చు నీరు సముద్రంలోకి పోతున్నాయి. కాటన్ బ్యారేజి, శ్రీరాంసాగర్,

నిజాంసాగర్, గోదావరి మీద నిర్మించబడిన ఆనకట్టలు కృష్ణానది మన రాష్ట్రంలో రెండవ పెద్దనది. 1440 కి మీ. పొడవు వుండే కృష్ణానది మనరాష్ట్రంలో 620 కి మీ. ప్రవహిస్తుంది. కృష్ణానది మీద నిర్మించబడ్డ నాగార్జునసాగర్ డామ్ ప్రపంచ ప్రసిద్ధి పొందింది. కృష్ణానదిపై నిర్మించబడ్డ మిగతా డాంలు శ్రీశైలం, కె సి. కెనాల్, ప్రకాశం బ్యారేజి, మూసీ, జూరాల. పెన్నానది మన రాష్ట్రంలో 568 కి.మీ. ప్రవహిస్తుంది. దీనిపై నిర్మించే సోమశిల ప్రాజెక్టు చెప్పుకోదగినది. ఇక చిన్న నదులల్లో నాగావళి, వంశధార ముఖ్యమైనవి. ఇవి చిన్న నదులైనా ఎల్లప్పుడూ వీటిలో నీరు ప్రవహిస్తూ వుంటుంది శ్రీకాకుళం, విజయనగరం జిల్లాలకు ఇవి మిక్కిలి ఉపయోగంగా వుంటాయి.

ఆంధ్రప్రదేశ్ శాసనసభలో 294 మంది శాసనసభ్యులు, ఒక నామినేటెడ్ సభ్యుడు వుంటారు శాసనమండలిని 1985లో రద్దు చేశారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం నుంచి లోకసభకు 42 మంది రాజ్యసభకు 18 మంది సభ్యులుగా ఎన్నుకోబడతారు.

ఆంధ్రప్రదేశ్‌లో 70 శాతం మంది ప్రజల వృత్తి వ్యవసాయమే. రాష్ట్రంలో వున్న 2 కోట్ల 74 లక్షల హెక్టర్ల భూమిలో వ్యవసాయం చేసే భూమి 1 కోటి 21 లక్షల హెక్టార్లు. 58 లక్షల హెక్టర్లలో అడవులు వుంటాయి. నిరుపయోగమైన భూమి 23 లక్షల హెక్టర్లు. మిగతా భూమి ఇతరత్రా ఉపయోగంలో వుంది. ఆంధ్రప్రదేశ్‌లో, వరి ప్రధాన పంట. ఇంకా మొక్కజొన్న, జొన్న, పొగాకు, వేరుశెనగ, చెరకు పండుతాయి. దక్షిణ భారతదేశానికి ధాన్యాగారంగా ప్రసిద్ధిపొందిన ఆంధ్రప్రదేశ్‌లో వరి పుష్కలంగా పండుతుంది. వరి మన రాష్ట్ర అవసరాలకే గాక ఇతర రాష్ట్రాలకు కూడా ఎగుమతి చేయబడుతుంది. పొగాకు పండించటంలో కూడా మన రాష్ట్రం మిగతా రాష్ట్రాలకన్నా మిన్నగా వుంటుంది.

ఆంధ్రప్రదేశ్‌లో సహజ వనరులు పుష్కలంగా వున్నాయి. బొగ్గు, ముడిఇనుము, సున్నపురాయి, బైరేట్లు, అభ్రకం విరివిగా దొరుకుతాయి. కృష్ణా గోదావరి తీర ప్రాంతాలలో పెట్రోల్, గ్యాస్ నిక్షేపాలు కనుగొనబడ్డాయి. పారిశ్రామికంగా మన రాష్ట్రం దేశంలో అయిదో స్థానంలో వుంటుంది.

ఆంధ్రప్రదేశ్ చారిత్రక సంపదకు పెన్నిధి. దక్షిణ భారత దేశంలో ఇంత చారిత్రక సంపద మరే రాష్ట్రంలోనూ కానరాదు. మనరాష్ట్రంలో వందకు పైగా బౌద్ధక్షేత్రాలున్నాయి. వీటిలో ముఖ్యంగా చెప్పుకోదగినవి అమరావతి. నాగార్జున కొండ, భట్టిప్రోలు, జగ్గయ్యపేట, గుంటుపల్లి, నేలకొండపల్లి, ఘంటసాల మొదలైనవి. క్రీ॥ పూ॥ 4వ శతాబ్దం నాటికి ఆంధ్రదేశమంతా బౌద్ధమతం వ్యాప్తి చెందింది. ఈ కాలంలో ఆంధ్రప్రజలు అత్యధికులు బౌద్ధమతం స్వీకరించినట్లు కనబడుతుంది. ఆంధ్రదేశాన్ని పాలించిన తొలిపాలకులు శాతవాహనులు, ఆ తర్వాత ఇక్ష్వాకులు కూడా బౌద్ధ మతాన్ని ఆదరించిన ఫలితంగా చాలా జిల్లాలలో ముఖ్యంగా ఖమ్మం, వరంగల్, కరీంనగర్, నల్గొండ, రాయలసీమ

జిల్లాలలో ఈ బౌద్ధమతావశేషాలు విరివిగా కానవస్తాయి

దేవాలయ వాస్తుకు, శిల్పాలకు కాకతీయులకాలం స్వర్ణయుగం, హనుమకొండ వరంగల్ పట్టణాలను రాజధానులుగా చేసుకొని పాలించిన కాకతీయుల కాలంలోనే హనుమకొండలోని ేయి స్తంభాల గుడి నిర్మించబడింది. అద్దంకి, కొండవీటిరెడ్డి రాజులు కూడా శిల్పకళను పోషించారు. విజయనగర రాజులకాలంలో నిర్మించబడిన దేవాలయాలన్నీ రాయలసీమ, మహబూబ్ నగర్ జిల్లాలో కానవస్తాయి.

ఆంధ్రప్రదేశ్ వైవిధ్యంతో కూడిన ప్రాంతం బారులుతీరిన కొండలలో, దట్టమైన అడవులు, పచ్చని పంటచేలతో అలరారుతూ పూర్వపు ఔన్నత్యాన్ని చాటి చెప్పే బ్రహ్మాండమైన హిందూ, బౌద్ధ, ముస్లిం సంస్కృతులకు సాక్షీభూతంగా నిల్చిన దేవాలయాలు, బౌద్ధ స్థూపాలు, మసీదులతో సాక్షాత్కరిస్తుంది. ఆంధ్రప్రదేశ్ విభిన్న సంస్కృతుల సమ్మేళనం.

ఆంధ్రప్రదేశ్‌లో చూడచక్కని ప్రదేశాలు అనేకం నిత్యం దేశం నలుమూలల నుంచి వేలాదిగా యాత్రికుల్ని ఆకర్షించే తిరుపతి వేంకటేశ్వర స్వామి ఆంధ్రప్రదేశ్‌కి ఒక ప్రత్యేక ఆకర్షణ హైదరాబాద్‌లో చార్మినార్, బిర్లామందిర్, సాలార్‌జంగ్ మ్యూజియం, గోల్కొండ కోట, నెహ్రూ జూలాజికల్ గార్డెన్సు, మొదలైనవి చూడదగ్గ విశేషాలు, క్రీ॥ శ॥ 1590లో నిర్మించబడిన చార్మినార్ చతురస్రాకారంలో 80 అడుగుల ఎత్తుండే నాలుగు గోపురాలలో వుండే బ్రహ్మాండమైన ఈ కట్టడం ముస్లింపాలకుల పనితనానికి నిదర్శనం. చార్మినార్ ఎక్కితే నగరం యావత్తూ కనబడుతుంది మీర్ ఆలం చెరువు దగ్గరలో వుండే నెహ్రూ జూలాజికల్ పార్కులో అన్ని రకాల జంతువులను పక్షులను చూడవచ్చును. హైదరాబాద్‌కు, కొద్ది దూరంలో వుండే గోల్కొండకోట కుతుబ్‌షాహి రాజులకు రాజధానిగా వుండేది. కోహినూర్ వజ్రం ఇక్కడే దొరికిందని చెబుతారు వెయ్యి టన్నుల స్వచ్ఛమైన పాలరాతితో నిర్మించబడిన బిర్లామందిర్ చూడవల్సిందే. ఈ పాలరాతిని ప్రత్యేకంగా రాజస్థాన్‌నుంచి తీసుకువచ్చారట. అపురూపమైన రకరకాల చిత్రాలు, పెయింటింగ్సు, శిలావిగ్రహాలు,కంచు విగ్రహాలు పింగాణీ వస్తువులు, జలతారు తివాసీలు, వెండి బంగారు వస్తువులతో కనువిందు చేసే సాలార్‌జంగ్ మ్యూజియంను చూడవలసిందేతప్ప వర్ణించనలవికాదు ఇంకా హైదరాబాద్. సికింద్రాబాద్‌లలో చూడదగిన ప్రదేశాలు అనేకం. హైదరాబాద్ చుట్టుపట్ల అనేక భారీ పరిశ్రమలునెలకొని వున్నాయి

మిగతా రాష్ట్రంలో చూడతగినవి ముఖ్యంగా నాగార్జునసాగర్ ప్రాజెక్టు ఆంధ్రప్రదేశ్‌ను ధాన్యాగారంగా మార్చిన ప్రాజెక్టు ఇది. బౌద్ధమతాచార్యుడు నాగార్జుని పేరుమీదగానే నిర్మించబడిన 124 మీటర్లు ఎత్తువుండే ఈ డామ్ ప్రపంచంలోనేఎత్తయినదిగా ప్రసిద్ధి పొందింది ఇచ్చట లభించిన బౌద్ధ శిల్పాలలో ఒక మ్యూజియంకూడా ఏర్పరచారు.

శ్రీశైలం, శ్రీకాళహస్తి, సింహాచలం, భద్రాచలంలు హిందువులకు పవిత్రపుణ్య క్షేత్రాలు. పారిశ్రామికంగా విశాఖపట్నం చూడదగిన ప్రదేశం అచ్చట ఉక్కు కర్మాగారం నౌకా నిర్మాణ కేంద్రం లాంటి భారీపరిశ్రమలున్నాయి శ్రీహరి కోటలో రాకెట్ ప్రయోగ కేంద్రం వుంది. చరిత్ర ప్రసిద్ది గాంచిన వరంగల్ (ఓరుగల్లు) బుద్ధుని అవశేషాలపై నిర్మించబడిన స్థూపం కల్గిన అమరావతి, ప్రకృతి అందాలను ఒలికించే అరకులోయ ఆంధ్రప్రదేశ్‌లో చూడవల్సిన ప్రదేశాలలో కొన్ని మాత్రమే.

6కోట్ల మంది మాతృభాష తెలుగు. దేశంలో హిందీ తర్వాత ఎక్కువమంది మాట్లాడే భాష తెలుగే. ఆనాటి విజయనగర సామ్రాజ్యాదీశుడు శ్రీకృష్ణదేవరాయలంతటి వాడిచేత "దేశభాషలందు తెలుగు లెస్స" అనీ విదేశీయులచేత "ఇటాలియన్ ఆఫ్ ది ఈస్టు" అనీ కీర్తించబడిన మృధుమధురమైన భాష తెలుగు.

తెలుగు సారస్వతాన్ని టూకీగా ఆరుదశలుగా విభజించవచ్చు. నన్నయకు ముందు కాలం (1020కి పూర్వం) పురాణ కాలం లేక కవిత్రయకాలం (1020-1400) శ్రీనాధ కాలం (1400-1510) ప్రబంధకాలం (1510-1600) నాయకరాజుల లేదా దక్షిణ కాలం (1600-1820) ఆధునిక కాలం.

నన్నయ సంస్కృత భారతాన్ని రెండున్నర పర్వాలు తెలుగించటంతో తెలుగు సారస్వతం ప్రారంభమైందని కొందరు అంటారుగాని నిజానికి అందుకుముందే తెలుగు సారస్వతం వుండెడిదని చరిత్ర కారుల అంచనా. ఎందువలనంటే నన్నయ తెలుగు భారత రచనా శైలిని బట్టి తెలుగు భాష అంతకుముందే ఎంతో అభివృద్ధిలో వుండటం వలనే నన్నయ్య ఆ శైలిలో వ్రాయగలిగాడని వారి వాదన. అయితే నన్నయ పూర్వపు రచనలేవి మనకు లభ్యం కావటంలేదు. తెలుగులో శాసనాలు మాత్రమే ఇంతవరకూ మనకు లభిస్తున్నాయి. వీటిని బట్టిచూచినా నన్నయకు ముందు తెలుగు భాషా సారస్వతం ఎంతో కొంత వుండేదని చెప్పవచ్చును. సాక్ష్యాధారాలతో లభించే తెలుగు సారస్వతం నన్నయ్యనుంచే ప్రారంభం. నన్నయ ప్రారంభించిన తెలుగు భారతం రెండున్నర పర్వాలతో ఆగిపోయింది. ఆ తర్వాత చాలాకాలానికి తిక్కన 15 పర్వాలను తెలుగులో వ్రాశాడు. మిగతా సగం అరణ్యపర్వాన్ని ఎర్రన్న పూర్తి చేశాడు. వీరే మన కవిత్రయం.

పోతన తెలుగు వారి ఇష్టకవి. ఆయన తెలుగు వారికి అందించిన భాగవతం ఆంధ్రుల అభిమాన గ్రంథం. 'కలయో వైష్ణవ మాయయో' వంటి పోతన పదప్రయోగాలెన్నో తెలుగువారు నిత్య వ్యవహారంలో వాడుతూ వుంటారు.

కవిత్రయంతో పోల్చదగిన కవి శ్రీనాధుడు. కవి సార్వభౌమ బిరుదాంకితుడు.

శృంగార నైషధం, హరివిలాసం, కాశీఖండం భీమఖండం లాంటి గ్రంథాలు వ్రాసి తెలుగు సారస్వత చరిత్రలో తనదంటూ ఒక యుగాన్ని సాధించుకున్న మహాకవి శ్రీనాధుడు. శ్రీనాధుడు కొండవీడులోను, రాజమహేంద్ర వరంలోనూ రెడ్డిరాజుల కొలువులో వుండేవాడు.

పెద్దనతో తెలుగు కవిత్వం ఒక మలుపు తిరిగి ప్రబంధ యుగంలో ప్రవేశిస్తుంది. ఈయన వ్రాసిన మనుచరిత్ర సుప్రసిద్ధం పెద్దన విజయనగర సామ్రాజ్య ప్రభువు శ్రీ కృష్ణదేవరాయలు ఆస్థానంలో వుండి 'ఆంధ్రకవితా పితామహ' అనే బిరుదుకూడా పొందినవాడు. శ్రీ కృష్ణదేవరాయలు కూడా తెలుగులో 'ఆముక్త మాల్యద' అనే కావ్యం వ్రాసి తెలుగు భాషా సేవ చేసినవాడే! ఈ కాలాన్ని దక్షిణకాలం అని ఎందుకంటారంటే శ్రీ కృష్ణదేవరాయలు కాలంలో మనుచరిత్ర, ఆముక్తమాల్యద లాంటి గొప్ప గ్రంథాలు వెలువడటమే గాక తెలుగు భాషా కవితా సౌరభాలు దక్షిణ భారతదేశంలోని మధురై, తంజావూర్ మొదలైన ప్రాంతాలకుకూడా. వ్యాపించటంవలన ఆవిధంగా పిలుస్తారు. తెలుగు సారస్వతం ఈ కాలంలో ఉచ్చ దశనందు కొని స్వర్ణయుగంగా భాసిల్లింది.

ఆధునిక కాలానికొస్తే ముందుగా చెప్పుకోదగినవాడు కందుకూరి వీరేశలింగం (1848-1919) వీరేశలింగం కవేగాక గొప్ప సంఘ సంస్కర్త. నవలారచనకు, స్వీయ చరిత్రకు శ్రీకారం చుట్టిన వాడు. ఈయన రచించిన రాజశేఖర చరిత్ర తెలుగులో మొట్టమొదటి నవల. తెలుగు భాషకు విశేషమైన సేవలు చేసిన సి.పి. బ్రౌన్ అనే విదేశీయుణ్ణి కూడా ప్రముఖంగా చెప్పుకోవాల్సిందే. యోగివేమన తన వేమనశతకం ద్వారా జన సామాన్యంలోకి చొచ్చుకు పోయాడు.

వీరేశలింగం తర్వాత తెలుగు సారస్వతంలో చెప్పుకోదగిన వ్యక్తి గురజాడ అప్పారావు. (1863-1915) ఆయన సృష్టించిన "కన్యాశుల్కం" నాటికి నేటికి చెప్పుకోదగిన నాటకమే. నవ్యకవితా పితామహుడు రాయప్రోలు సుబ్బారావు (1892-1984) తెలుగు కవితను ఒక మలుపు త్రిప్పాడు. ఇక శ్రీనాధుడితో పోల్చదగిన ఆధునిక కవి విశ్వనాథ సత్యనారాయణ (1895-1976) వేయిపడగలు లాంటి నవలలు, అనార్కలి లాంటి నాటకాలే గాక ఎన్నో కావ్యాలు నవలలు, కథలు, వ్యాసాలు వ్రాసి వివిధ సాహిత్య ప్రక్రియల లోనూ తన సామర్థ్యం వెల్లడించుకున్న కవి సామ్రాట్ విశ్వనాథ. ఈయన వ్రాసిన రామాయణ కల్పవృక్షం అనే గ్రంథానికి జ్ఞానపీఠ్ బహుమతి లభించింది.

ఈ శతాబ్దంనాది అని సగర్వంగా చాటుకున్న మహాకవి శ్రీరంగం శ్రీనివాసరావు శ్రీ శ్రీ (1910-1983) ఆయన వ్రాసిన 'మహా ప్రస్థానం' గీతాలు విశేష ప్రచారం పొందినాయి. సాహిత్యం వినోదానికి, కాలక్షేపానికి కాదని సాంఘిక ప్రయోజనం

వుండాలని చెప్పినవాడు శ్రీ శ్రీ ఇంకా ఆధునిక సాహిత్యంలో చెప్పుకోదగిన వారు చిలకమర్తి లక్ష్మీనరసింహం, తిరుపతికవులు వలెం, కృష్ణశాస్త్రి పాలగుమ్మి పద్మరాజు జాషువా, సురవరం ప్రతాపరెడ్డి, మొక్కపాటి నరసింహశాస్త్రి, ఉన్నవ లక్ష్మీనారాయణ, దువ్వూరి రామిరెడ్డి, కట్టమంచి రామలింగారెడ్డి అడవిబాపిరాజు, తుమ్మల సీతారామమూర్తి మునిమాణిక్యం. దాశరధి. సి. నారాయణరెడ్డి, కొడవటి గంటి కుటుంబరావు, ఆరుద్ర మొదలైనవారు శ్రీ సి. నారాయణ రెడ్డికి జ్ఞానపీఠ్ బహుమతి కూడా లభించింది

తెలుగు వాడులో భావ విప్లవానికి పునాదులు వేసి మూఢనమ్మకాలపై తిరుగుబాటు చేసిన ప్రసిద్ధులు త్రిపుర్నేని రామస్వామి చౌదరి(1887-1943)వైదికమత ప్రాబల్యాన్ని ధిక్కరించి ఖూనీ, శంభూకవధలాంటి కావ్యాల ద్వారాను తన భావాల్ని ప్రచారం చేసిన కలంవీరుడు రామస్వామిచౌదరి.

జాతీయోద్యమంలో పాల్గొనటమే గాక తొలి తెలుగు దినపత్రిక "ఆంధ్రపత్రిక" స్థాపించి తెలుగు జర్నలిజానికి విశేషకృషి చేసినవారు దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు (1876-1938)పత్రికాసంపాదకులంటే ఇలా వుండాలని నిరూపించి, పత్రికా సంపాదకుల పవిత్ర కర్తవ్యాన్ని అకుంఠిత దీక్షతో నిర్వహించిన "కృష్ణా పత్రిక" సంపాదకులు ముట్నూరి కృష్ణారావు గార్ని మర్చిపోరాదు తెలుగు జర్నలిజానికి ఒక నూతన ఒరవడి పెట్టి ప్రఖ్యాతులైన నార్ల వెంకటేశ్వరరావుగార్ని కూడా ఈ సందర్భంలో పేర్కొనాలి.

ఆంధ్రప్రదేశ్‌లో జాతీయ స్థాయిలో చెప్పుకోదగిన పెద్దలు ఎందరో వున్నారు. కాంగ్రెసు చరిత్రకారుడు, గాంధీజీ సిద్ధాంతాలకు భాష్యకారుడు డాక్టరు పట్టాభి సీతారామయ్య అతి చిన్న వయస్సులోనే ఆ నాడు అఖిలభారత కాంగ్రెసు కార్యదర్శి కాగలిగిన ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులు మనవారే. ప్రపంచ ప్రసిద్ధ తత్వవేత్త, అసాధారణ మేధావి ప్రధమ ఉపరాష్ట్రపతి. ఆ తర్వాత రాష్ట్రపతి పదవుల్ని ఎంతో హుందాగా నిర్వహించిన డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ మనవారే.

# 2 తమిళనాడు

వైశాల్యం 130058 చ. కిలోమీటర్లు జనాభా - 5 కోట్ల 56 లక్షలు. వాడుక భాష - తమిళం, రాజధాని - మద్రాసు

తమిళనాడు వైశాల్యం రీత్యా దేశంలో 11వ స్థానంలోను, జనాభారీత్యా 7వ స్థానంలో వుంటుంది తమిళనాడుకు తూర్పున బంగాళాఖాతము, దక్షిణాన హిందూ మహాసముద్రం, పడమర కేరళ, కర్నాటక రాష్ట్రాలు, ఉత్తరాన కర్నాటక, ఆంధ్రప్రదేశ్‌లు



వుంటాయి. తమిళనాడు వైశాల్యం రీత్యా మాత్రం మన రాష్ట్రంలో సగం కన్నా కొంచెం తక్కువగా వుంటుంది మన రాష్ట్రం కన్నా అక్కడ జన సాంద్రత హెచ్చుగా వుంటుంది. రాష్ట్ర జనాభాలో 89 శాతం హిందువులు, 5 శాతం ముస్లింలు, మిగతా వారు క్రిష్టియన్లు తదితరులు. అక్షరాస్యత శాతం 64.

తమిళనాడుకు 6000 సంవత్సరాల సుదీర్ఘ చరిత్ర వుంది. తమిళ ప్రజలుండే దే తమిళనాడు. తమిళం ప్రాచీన భారతీయ భాషలలో ఒకటి. క్రీస్తుకు పూర్వమే తమిళ భాష బహుళ వ్యాప్తంలో వుండేది. ద్రావిడ నాగరికత, సంస్కృతి తమిళనాడులో ప్రస్ఫుటంగా కానవస్తుంది. భారతదేశమంతా అనేక మార్లు విదేశీ దండయాత్రలు దోపిడీలు, విధ్వంసకాండకు గురైనా తమిళనాడుకు మాత్రం ఈ బెడద లేకుండా చెక్కు చెదరకుండా వుంది. అందువలనే అక్కడ ప్రాచీన భారతీయ శిల్పాలు, దేవాలయాలు అతి పవిత్రంగా స్వచ్ఛమైన రూపంతో దర్శనమిస్తాయి.

క్రీ॥ పూ॥ 4 వేల సంవత్సరాలనాడు భారతదేశమంతా ద్రావిడులే వుండే వారని ఆనాడు వారు మహోజ్వల నాగరికత, సంస్కృతులు కలిగి వుండే వారని చరిత్రకారులు చెబుతారు. ఉత్తరాన్నుంచి ఆర్యుల రాకతో ఈ ద్రావిడులు క్రమేపీ దక్షిణానికి సర్దుకున్నారు. ద్రావిడ సంతతి వారే తమిళనాడు, ఆంధ్రప్రదేశ్, కర్నాటక, కేరళ ప్రజలు. ఈ నాలుగు రాష్ట్రాలో కెల్లా ద్రావిడ సంస్కృతి, నాగరికత ప్రభావం ఇప్పటికీ తమిళనాడులో అధికంగా కనబడుతుంది.

తమిళ ప్రాంతాన్ని పరిపాలించిన వారిలో చోళ, పాండ్య, చేర, పల్లవ రాజవంశాలు ప్రసిద్ధి పొందినాయి. ప్రస్తుత తంజావూర్, తిరుచురాపల్లి పరిసర ప్రాంతాలను పాలించిన చోళ రాజులు ఆనాడు సైనికంగా మహాశక్తింతులై వుండేవారు. క్రీ॥ పూ॥ 2వ శతాబ్దంలో చోళ రాజైన ఇలార శ్రీలంక (సింహళం) ను కూడా జయించాడు. ప్రస్తుత మదురై, తిరునల్వేలి ప్రాంతాలను పాలించిన పాండ్యులు వర్తక వ్యాపారాలలో, విద్యా విషయాలలో విశేష ప్రాముఖ్యం పొందారు. ఒకానొక పాండ్యరాజు ఆ రోజుల్లోనే అంటే క్రీ॥ పూ॥ 11వ శతాబ్దంలో రోమ్ చక్రవర్తి అగస్టస్ వద్దకు రాయబారిని పంపాడట! కంచిని పాలించిన పల్లవులు క్రీ॥ శ॥ 4వ శతాబ్దంలో అధికారంలోకి వచ్చి 400 సంవత్సరాల పాటు పాలించారు. ఈ పల్లవులు చోళ రాజ్యాన్ని కూడా జయించి సింహళం మీదకు కూడా వెళ్ళారు. 13వ శతాబ్దం నాటికి పాండ్య రాజులు మళ్ళా అధికారంలోకి వచ్చారు. వీరి పాలనలో అంతర్జాతీయ వ్యాపారం ముమ్మరంగా సాగింది. విజయనగర సామ్రాజ్యం వృద్ధి పొందటంతో పాండ్యరాజులు విజయనగర పాలకుల ధాటికి తట్టుకోలేక పోయారు. పాండ్య రాజ్యం విజయనగర సామ్రాజ్యంలో కలిసిపోయింది. ముస్లిం ప్రభావం తమిళనాడు ప్రాంతం పై పెద్దగా కానరాదు. 1639 లో మద్రాసులో ఈస్టు ఇండియా

కంపెనీ స్థాపించటంతో తమిళనాడు చరిత్ర ఒక మలుపు తిరిగింది క్రమేపీ తమిళనాడంతా బ్రిటిష్ వారి చేతుల్లోకి వెళ్ళింది

మనకు స్వతంత్రం వచ్చేనాటికి తమిళనాడు, ఆంధ్రప్రాంతం, కేరళలో కొంతభాగం మద్రాసు రాష్ట్రంగా వుండేది రాష్ట్రా పునర్నిర్మాణ చట్టం ప్రకారం మద్రాసు, కేరళ రాష్ట్రాలు కొన్ని ప్రాంతాలను బదలాయింపు చేసుకున్నాయి. మద్రాసులో కొంతప్రాంతం కర్నాటకకు వెళ్ళింది. 1953 అక్టోబరు 1న ఆంధ్ర ప్రాంతం ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడింది 1969లో మద్రాసు రాష్ట్రం పేరును తమిళనాడుగా మార్చారు.

సంస్కృతం, గ్రీక్, లాటిన్ లాగా. తమిళం కూడా ప్రాచీన భాష. క్రీ॥ పూ॥ 5వ శతాబ్దం నాటికే తమిళభాషకు వ్యాకరణం ఏర్పడిందని చెబుతారు ద్రావిడ భాషలలో కెల్లా ఒక్క తమిళం మీదే సంస్కృత భాషా ప్రభావం తక్కువగా వుంటుంది. క్రీ॥ పూ॥ 5వ శతాబ్దం నుంచి క్రీ॥ శ॥ 2వ శతాబ్దం వరకూ తమిళంలో వ్రాయబడిన సాహిత్యాన్ని సంగం సాహిత్యం అంటారు. తిరువాళ్వర్ రచించిన 'తిరక్కురళ్' తమిళసాహిత్యంలో ప్రసిద్ధి పొందింది. 133 అధ్యాయాలుండే ఈ గ్రంథలో ఒక్కో అధ్యాయంలో 10 పద్యాలుంటాయి. సద్గుణం, సంపద, ఆనందం గురించి వివరించబడివుంటాయి. కంబార్ రచించిన కంబరామాయణం కూడా తమిళంలో ప్రసిద్ధి పొందిన గ్రంథం. కంబ రామాయణం వాల్మీకి రామాయణం ఆధారంగా రచించినదే అయినా సన్నివేశ చిత్రణ, ఇతివృత్త పోకడలలో తేడా వుంటుంది కంబరామాయణం లో 10వేలకుపైగా పద్యాలుంటాయి. తమిళంలో భక్తి సాహిత్యం విరివిగా వుంటుంది. ఆనాడు నయనార్లు అంటే శైవభక్తులు, ఆల్వార్లు అంటే విష్ణుభక్తులు దైవ చింతనతో అనేక కావ్యాలు వ్రాసి ప్రజలలో భక్తి ప్రబోధం చేశారు. ఆధునిక తమిళ సాహిత్యంలో సుబ్రమణ్య భారతి అగ్రగణ్యుడు దేశభక్తి, మానవులలో స్వేచ్ఛ, స్వతంత్రం సమానత్వం చాటి చెప్పే ఆయన సాహిత్యం కలకాలం నిల్చి వుంటుంది.

తమిళనాడులో 21 జిల్లాలు వుంటాయి. అవి చెంగల్పట్, కోయంబత్తూర్, ధర్మపురి, కన్యాకుమారి, మద్రాసు, మధురై, అన్నా, నీలగిరి, ఉత్తర ఆర్కాట్, పెరియార్, పుదుకోట్టై, రామనాధపురం, కామరాజ్ పొన్నముత్తు రామలింగం, సేలం,దక్షిణ ఆర్కాట్, తిరుచురాపల్లి, తంజావూర్, తిరునల్వేలి, చిదంబరనార్, తిరువానమలై. 1989లో ఉత్తర ఆర్కాట్ జిల్లాను రెండుగా చీల్చి ఉత్తర ఆర్కాట్, తిరువానమలై అనే రెండు జిల్లాలుగా చేశారు.

తమిళనాడు శాసనసభలో 234 మంది సభ్యులు వుంటారు. శాసన మండలిని 1986లో రద్దు చేశారు. ఈ రాష్ట్రం నుంచి 39 లోక్‌సభ సీట్లు, 18 రాజ్యసభ సీట్లు వుంటాయి.

తమిళనాడులో కావేరి, పొన్నయార్. పాలార్, వెయ్యార్, భవాని ముఖ్యనదులు. వీటన్నింటిలోకి కావేరి నది చెప్పుకోదగినది. 760 కిలోమీటర్ల పొడవుండే ఈ నది పశ్చిమ కనుమలలో పుట్టి తంజావూర్ జిల్లాను సస్యశ్యామలం చేస్తుంది మిగతానదులు అంతగా చెప్పుకోదగినవి కావు. రాష్ట్రంలో సగటున ప్రతి సంవత్సరం 99 సెం.మీటర్ల వర్షం పడుతుంది

తమిళనాడు ప్రధానంగా వ్యవసాయ రాష్ట్రం. వరి బాగా పండుతుంది. వరి తర్వాత చెప్పుకోదగిన పంట చెరకు చెరకు దిగుబడి కూడా ఈ రాష్ట్రంలో హెచ్చుగా వుంటుంది. ఇంకా ప్రత్తి, టీ, కాఫీ పంటలు కూడా పండుతాయి.

తమిళనాడులో లిగ్నైట్, ఇనుము, సున్నపురాయి బాగా దొరుకుతాయి. లోగడ ఈ రాష్ట్రం విద్యుత్‌శక్తికి ఎక్కువగా జలవిద్యుత్ మీద ఆధారపడి వుండేది. ప్రస్తుతం ధర్మల్ పవర్ మీద కూడా దృష్టి కేంద్రీకరించుతున్నారు. కేంద్ర ప్రభుత్వ ఆధీనంలోని నైవేలీ, కల్పాకం ప్రాజెక్టులు ఇచ్చట వున్నాయి. ఇంకా ఆవడిలో భారీ యంత్ర పరికరాల ఫ్యాక్టరీ, సేలంలో ఉక్కు ఫ్యాక్టరీ, పెరంబూర్‌లో ఇంటెగ్రల్ కోచ్ ఫ్యాక్టరీ, తిరుచ్చిలో భారీ విద్యుత్ పరికరాల ఫ్యాక్టరీ మొదలైన కేంద్ర ప్రభుత్వ ఆధీనంలోని భారీ పరిశ్రమలు ఈ రాష్ట్రంలో వున్నాయి. ప్రవేటు రంగంలో 11 వేలకు పైగా లిమిటెడ్ కంపెనీలు కూడా వున్నాయి.

తమిళనాడు పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన రాష్ట్రం. దేశంలో తయారయ్యే సిమెంటులో అయిదో వంతు ఈ రాష్ట్రంలోనే తయారవుతుంది. అలాగే దేశంలో తయారయ్యే కాస్టిక్‌సోడా, ఎరువులలో కూడా అయిదో వంతు ఇక్కడనే ఉత్పత్తి జరుగుతున్నాయి. దేశంలో తయారయ్యే పంచదార, సైకిళ్ళలో పదో వంతు ఇక్కడే జరుగుతాయి. ఇక అగ్గిపెట్టెల విషయాని కొస్తే దేశంలో తయారయ్యే అగ్గిపెట్టెలలో 60 శాతం ఇక్కడే తయారవుతాయి. తమిళనాడులో అనేక నూలు మిల్లులు కూడా వున్నాయి. చర్మ వస్తువుల తయారీలో కూడా తమిళనాడు అగ్రస్థానంలో ఉంది

తమిళనాడు ఉష్ణమండలంలో వుంది. జనవరిలో అతి చల్లగాను,మే నెలలో అతి వేడిగాను వుంటుంది. ఈశాన్య రుతు పవనాల వలన తమిళనాడులో ఎక్కువగా వర్షం కురుస్తుంది. కోస్తా ప్రాంతాలైన చెంగల్పట్, ఉభయ ఆర్కాట్‌లు, తంజావూర్, తిరుచరాపల్లి జిల్లాలో అధిక వర్షాలు కురుస్తాయి. లోతట్టు ప్రాంతం మెట్ట ప్రాంతంగా వుంటుంది. తమిళనాడులో పశ్చిమ ప్రాంతం అంతా పశ్చిమ కనుమలు వ్యాపించి వుంటాయి. పశ్చిమ కనుమలు సముద్ర మట్టానికి సగటున 1220 మీటర్ల ఎత్తున వుంటాయి. బాగా ఎత్తుగా వుండే చోట 2440 మీటర్ల ఎత్తున కూడా వుంటాయి. ఈ

కొండ ప్రాంతం అంతా ఎల్లప్పుడూ పచ్చని చెట్లతో నిండి వుంటుంది. కావేరి, తామ్రపర్ణి, వైగె నదులు ఈ కనుమలలోనే పుడతాయి. నీలగిరి (ఊటీ), అన్నామలై కొండలు ఇచ్చటనే వున్నాయి.

పవిత్ర దేవాలయాల పుణ్య భూమి తమిళనాడు ఏ పట్టణానికి గాని, పల్లెకుగాని వెళ్ళినా ఆలయ గోపురాల మనోహర దృశ్యాలు సాక్షాత్కరిస్తాయి. గుడిగంటల మ్రోతలు వినిపిస్తాయి. ప్రాచీన వాస్తు శిల్పకళావైభవాన్ని ఇవి వేనోళ్ళ చాటి చెబుతూవుంటాయి. దాదాపు ప్రతి ఊళ్ళోనూ, పట్టణంలోనూ మధ్యగా దేవాలయం తప్పనిసరిగా వుంటుంది.

భారతదేశంలోని 4 మహాపట్టణాలలో మద్రాసు ఒకటి. 1640లో ప్రస్తుత మద్రాసు వుండే ప్రాంతంలో ఒక చిన్న పల్లెటూరు మాత్రమే వుండేది. బ్రిటిష్ వారు ఇచ్చట ఈస్టు ఇండియా కంపెనీ ఏర్పాటు చేసిన తర్వాత క్రమేపి పెరుగుతూ వచ్చింది. మద్రాసు జనాభా 54 లక్షలు. మద్రాసులో మెరీనాబీచ్, జీసస్ శిష్యులలో ఒకరైన సెయింట్ థామస్ సమాధి పొందిన శాంతోమ్ చర్చి, లైట్ హవుస్, హైకోర్టు, సెయింట్ జార్జిఫోర్టు మొదలైనవి చూడదగిన ప్రదేశాలు.

సెయింట్ జార్జికోట 1640లో బ్రిటిష్ వారిచేత కట్టించబడింది. ఆ రోజుల్లో ఇచ్చట బ్రిటిష్ సైన్యం వుండేది. ప్రస్తుతం ఈ భవంతిలో తమిళనాడు అసెంబ్లీ సమావేశాలు జరుగుతాయి. రాష్ట్ర సచివాలయం కూడా ఈ భవంతిలో వుంటుంది.

మెరినీ బీచ్ ప్రపంచ అందమైన బీచ్‌లలో ఒకటి. 12 కిలోమీటర్ల పొడవునా వుంటుంది ఈ సుందర సముద్రతీరం. సాయంత్రం అయ్యేటప్పటికి వేలాది నగరవాసులు కాలక్షేపం కోసం ఈ బీచ్‌కి తరలి వస్తారు.

మెరీనాబీచ్‌కు ఉత్తరంగా అన్నా స్క్వేర్ వుంటుంది. తమిళ ప్రజల ప్రియతమ నాయకుడు సి.యన్. అన్నాదొరై స్మారక చిహ్నంగా దీన్ని నిర్మించారు. అందాల సుందర వనంలో అన్నా సమాధిని నిర్మించారు. సమాధి వద్ద పెద్ద ఆర్చి నిర్మించబడింది. ఈ ప్రదేశం తమిళ ప్రజలకు పవిత్ర స్థలం. అన్నా సమాధి వద్ద ఎల్లప్పుడూ జ్యోతి వెలుగుతూ వుంటుంది. తమిళ ప్రజల మరో ప్రియతమ నాయకుడు మాజీ ముఖ్యమంత్రి యం.జి. రామచంద్రన్ సమాధి కూడా ఇచ్చటనే వుంటుంది.

మైలాపూర్‌లోని కపాలేశ్వర్(శివాలయం) దేవాలయం ద్రావిడ వాస్తు విజ్ఞానానికి నిదర్శనంగా వుంటుంది. ఈ దేవాలయం బహు పూరాతమైన దని చెబుతారు.

శాంథోమ్‌లోని సెయింట్ థామస్ చర్చి చూడదగిన ప్రదేశం సెయింట్ థామస్ ఇచ్చట ఖననం చేయబడినట్లు చెబుతారు. పురాతన గోతిక్ పద్ధతిలో నిర్మించబడిన ఈచర్చి కడురమణీయంగా వుంటుంది.

అడయార్‌లోని థియోసాఫికల్ సొసైటి (దివ్య జ్ఞాన సమాజం) చూడదగిన మరో ముఖ్యమైన ప్రదేశం. ప్రపంచ దివ్యజ్ఞాన సమాజానికి ఇది కేంద్ర కార్యాలయం 1882 లో ఈ సమాజాన్ని స్థాపించారు. ఈ భవంతి ఆవరణలో ఒక బ్రహ్మాండమైన మర్రి చెట్టు వుంది. శాఖోపశాఖలతో ఈ మర్రి చెట్టు 40 వేల చదరపు అడుగులు విస్తరించి వుంటుంది. దేశంలో ఇదే పెద్ద మర్రిచెట్టు అంటారు.

1936లో శ్రీమతి రుక్మిణి అరండేల్‌చే స్థాపించబడిన కళాక్షేత్రం కూడా చూడదగినదే. ఈ కళాక్షేత్రం అంతర్జాతీయ ప్రాముఖ్యం పొందింది. విదేశాల నుంచి కూడా అనేక మంది వచ్చి ఈ కళా క్షేత్రంలో శాస్త్రీయ నాట్యం, సంగీతాలను నేర్చుకుంటారు.

డేర్ పార్క్‌లోని గాంధీ, కామరాజ్, రాజాజీల స్మారక చిహ్నాలు కూడా దర్శించదగినవే.

ప్రస్తుం రాజాజీ హాలుగా పిలవబడుతున్న భవంతి టిప్పుసుల్తాన్ మీద విజయం పొందిన బ్రిటిష్‌వారు ఆ విజయ సూచకంగా నిర్మించబడింది. ప్రస్తుతం ఈ రాజాజీ హాలులో సభలు, సమావేశాలు ఏర్పాటు చేస్తున్నారు.

కన్న మెరాగ్రంధాలయం చెప్పుకోదగిన లైబ్రరీ. 1851లో ఈ గ్రంధాలయం స్థాపించబడింది. లక్షన్నరకు పైగా గ్రంధాలు వుంటాయి.

మద్రాసు నగరంలో అన్నిటి కన్నా గొప్పగా చెప్పుకోవలసింది మౌంట్‌రోడ్. నగరంలో ఇదే పెద్ద బజార్ నగరం నడి బొడ్డున వుంటుంది ఈ రోడ్డు. ప్రసిద్ధ కంపెనీల ప్రధాన ఆఫీసులు, ప్రసిద్ధ హొటళ్ళు, పెద్ద పెద్ద షాపులు ఈ రోడ్డులోనే వుంటాయి. ఈ రోడ్డు 12 కిలో మీటర్ల పొడవున వుంటుంది.

మద్రాసుకు దక్షిణంగా 60 కిలోమీటర్ల దూరంలో సముద్రం ఒడ్డున వుండే మహాబలిపురం పల్లవ రాజుల కళాభిరుచికి చక్కని నిదర్శనం ఇచ్చట కాన వచ్చే ఏక శిలారధాలు, గుహల్లో చెక్కిన కళాఖండాలు, చుట్టూ వుండే ప్రకృతి సౌందర్యం ఆహ్లాదకర వాతావరణం యాత్రీకులను పులకింపజేస్తాయి. మద్రాసుకు 77 కిలోమీటర్ల దూరంలో వుండే కంచి కాశీ తర్వాత ప్రసిద్ధి కెక్కిన పుణ్యక్షేత్రం. ఇది మొదట్లో పల్లవులకు ఆ తర్వాత చోళులకు రాజధానిగా వుండేది. కంచిలో ఏకాంబరనాధ, వరదరాజ దేవాలయాలు ప్రసిద్ధిచెందినవి. ఏకాంబరనాధ ఆలయం గోపురం ఎత్తు 57 మీటర్లు వుంటుంది. ఈ ఆలయంలో వెయ్యిస్థంబాల మండపం కూడా వుంటుంది. ఆలయ ఆవరణలో ఒక బ్రహ్మాండమైన మామిడి చెట్టు వుంది. దీని వయస్సు 2500 సంవత్సరాలని చెబుతారు. కంచిలో కామాక్షి దేవాలయం కూడా ప్రసిద్ధి పొందింది. ఈ ఆలయంలోనే శంకరాచార్యుల

వారు తన వాదనా పటిమతో బౌద్ధ పండితులను ఓడించాడట కంచి పట్టు చీరలకు ప్రసిద్ధి

చిదంబరంలోని నటరాజ దేవాలయం వెయ్యి సంవత్సరాల క్రిందట నిర్మించబడింది. 12 ఎకరాల విస్తీర్ణంలో నిర్మించ బడ్డ ఈ ఆలయంలో వెయ్యిస్తంబాల మంటపం కూడా వుంది. నటరాజ దేవాలయం పై కప్పు బంగారు తొడుగుతో శోభిల్లుతూ వుంటుంది. కుంభకోణం ఒకప్పుడు చోళరాజుల రాజధాని. ఇది తంజావూర్‌కు 36 కి.మీ దూరంలో వుంది ఇక్కడ అనేక దేవాలయాలు వున్నాయి. ఇక తంజావూర్ కూడా ఒకప్పటి చోళరాజుల రాజధానే. క్రీ॥ శ॥ 1003 సంవత్సరంలో రాజరాజ చోళుడు నిర్మించిన బ్రహ్మాండమైన భృహదేశ్వరాలయం ఇక్కడ వుంది తంజావూర్‌లో వున్న సరస్వతీ మహల్ లైబ్రరీ ప్రపంచ ప్రఖ్యాతి గాంచినది ఇందులో అనేక అపురూప తాళపత్ర గ్రంథాలున్నాయి

మదురై 2వేల సంవత్సరాలకు పాండ్య రాజులకు రాజధానిగా వుండేది.వైగెనది ఒడ్డున వుండే ఈ నగరంలో ప్రసిద్ధి పొందిన మీనాక్షి ఆలయం వుంది. ఇంకా అనేక దేవాలయాలు కూడా ఇక్కడ వున్నాయి. ప్రస్తుతం మదురై ప్రముఖ వాణిజ్య కేంద్రంగా వుంది.

ఇంకా తమిళనాడులో చెప్పుకోదగిన ప్రాంతాలు - కోయంబత్తూరు వస్త్ర పరిశ్రమలకు నియలం. తిరువణామలై రమణ మహర్షి ఆశ్రమానికి ప్రసిద్ధి పొందింది. నీలగిరి కొండలలో వుండే ఉదక మండలం (ఊటీ) వేసవి విడిది కేంద్రం. నైవేలి బొగ్గుగనుల కేంద్రం.

ఇక రామేశ్వరం ద్వీపం తమిళనాడు కోస్తాలో మధురైకు 173 కిలో మీటర్ల దూరంలో వుంటుంది. ఈ దీవికి వెళ్ళాలంటే మండపం నుంచి పాంబన్ బ్రిడ్జి మీదగా రైలులో వెళ్ళాలి. ఈ దీవికి శ్రీ లంక 72 కి॥ మీ॥ దూరంలో వుంటుంది. ఇచ్చట వున్న రామనాథస్వామి ఆలయం 15 ఎకరాల విస్తీర్ణంలో వుండి బ్రహ్మాండమైన వసారాలతో యాత్రీకుల్ని ఆశ్చర్యచకితుల్ని చేస్తూ వుంటుంది. ఇచ్చటనే ఆనాడు రాముడు రావణుడ్ని చంపి వస్తూ దారిలో ఇక్కడ ఆగి శివపూజ చేశాడట. రామేశ్వరానికి కొద్ది దూరంలో ధనిష్కోడి వుంటుంది. ఇక్కడొక ఆలయం వుంది. ఇచ్చటనే ఆనాడు విభీషణుడు రాముడ్ని శరణు వేడుకున్నాడట.

భారత ఉపఖండానికి దక్షిణ కొన కన్యాకుమారి. ఇచ్చట హిందూ మహాసముద్రం, బంగాళా ఖాతం, అరేబియా సముద్రాలు కలుస్తాయి. ఇచ్చట సూర్యాస్తమయం, చంద్రోదయం ఒకే మారు చూడవచ్చును. ఇచ్చటకు కొద్ది దూరంలో ఒక కొండపై

1892 పై స్వామి వివేకానంద ధ్యాన నిమగ్నులై వున్నారు. ఆ స్థలంలోనే వివేకానంద స్మారక మందిరం నిర్మించబడింది.

తమిళనాడు ప్రగతికి అవిరళ కృషి చేసి శ్రీ సి రాజగోపాలచారి, సత్యమూర్తి, వి.ఎస్ శ్రీనివాస శాస్త్రి కామరాజ్ వాడార్, శ్రీ ఆర్ వెంకట్ రామన్, శ్రీ ఎం భక్తవత్సలం, శ్రీ పి. సుబ్రహ్మణ్యం, శ్రీ రామస్వామి నాయకర్, అన్నాదొరై శ్రీ ఎం కరుణానిధి, శ్రీ ఎం.జి. రామచంద్రన్, కుమారి జయలలిత, ప్రముఖ విద్యావేత్త లక్ష్మణస్వామి మొదలియార్, ప్రముఖ శాస్త్రవేత్త సర్.సి.వి.రామన్, ప్రముఖ గణిత శాస్త్రవేత్త శ్రీ ఎస్ రామానుజం, ప్రఖ్యాత జాతీయ కవి శ్రీ సుబ్రహ్మణ్య భారతి ప్రభృతులు తమిళ ప్రజల హృదయాలలో చెరగని ముద్ర వేసుకున్నారు.

# 3 కేరళ

వైశాల్యం - 38,863 చదరపు కిలోమీటర్లు  జనాభా - 2 కోట్ల 90 లక్షలు. మాతృ భాష - మలయాళం  రాజధాని - త్రివేండ్రం



వైశాల్యం రీత్యా కేరళ రాష్ట్రం భారతదేశ వైశాల్యంలో 1 18 శాతం మాత్రమే ఆంధ్రప్రదేశ్ వైశాల్యంలో ఏడో వంతు మాత్రమే వుంటుంది జనాభారీత్యా మాత్రం దేశ జనాభాలో 3 80 శాతం వుంటారు మన రాష్ట్ర జనాభాలో సగానికి లోపుగా వుంటారు ఇంత తక్కువ వైశాల్యంలో ఇంత ఎక్కువ జనాభా వుండటం వలన కేరళలో జనసాంద్రత సగటున చదరపు కిలోమీటరుకు 655 మందిగా వున్నారు ఢిల్లీ, చండీఘర్, పాండిచేరిల తర్వాత దేశంలో కెల్లా హెచ్చు జనసాంద్రత కేరళ రాష్ట్రంలోనే

క్రీ॥ పూ॥ వెయ్యి సంవత్సరాల ముందు నుంచి కూడా కేరళకు ఇతర దేశాలతో వాణిజ్య సంబంధాలు వుండేవి. ఆ రోజుల్లోనే ఇచ్చట నుంచి సుగంధద్రవ్యాలు ఇతర దేశాలకు ఎగుమతి అయ్యేవి కాలికట్ గొప్ప వ్యాపార కేంద్రంగా వుండి చైనా తదితర దేశాలకు సుగంధ ద్రవ్యాలు ఎగుమతి అయ్యేవి హిబ్రూ (నేటి ఇజ్రేల్) రాజు సోలమన్ హయాంలో కేరళకు హిబ్రూకు వర్తక సంబంధాలు వుండేవి

క్రీ॥ శ॥ 9వ శతాబం నుంచి 'చేర' రాజుల పాలనలో వుంది కేరళ చేర రాజ్య వంశం పతనమైన తర్వాత కేరళ ప్రాంతం విభజించబడి స్థానికంగా బయలుదేరిన చిన్న చిన్న రాజుల చేతుల్లోకి వెళ్లింది 1498లో వాస్కోడిగామా కాలికట్ సందర్శించాడు అప్పుడు కాలికట్ జమోరియన్లు అనే హిందూ రాజుల రాజధానిగా వుండేది. అయితే వాస్కోడిగామా రాకముందే ఐరోపానుంచి అనేక మంది క్రైస్తవులు, యూదులు కేరళకు వచ్చి స్థిరపడ్డారు వాస్కోడిగామా వచ్చిన తర్వాత పోర్చుగీసువారు కాలికట్, కొచ్చిన్ రాజులతో వాణిజ్య ఒప్పందాలు చేసుకున్నారు. పోర్చుగీసువారి తర్వాత డచ్చివారు ఆ తర్వాత ఈస్టు ఇండియా కంపెనీ వారు క్రమేపీ తిరువాన్కూర్, కొచ్చిన్ పాలకులను అదరించి బెదిరించి తమ చెప్పుచేతుల్లోకి తెచ్చుకొని ఆధిపత్యాన్ని చలాయించారు

భారత్‌కు స్వతంత్రం వచ్చిన తర్వాత తిరువాన్కూర్, కొచ్చిన్ సంస్థానాలను ఏకం చేసి 1949లో తిరువాన్కూర్, కొచ్చిన్ రాష్ట్రంగా ఏర్పరిచారు ఆ తర్వాత 1956లో రాష్ట్రాల పునర్విభజన ప్రకారం మద్రాసు రాష్ట్రంలో ఉన్న మలబార్‌ను కూడా కలిపి కేరళ రాష్ట్రంగా ఏర్పాటుచేశారు ఈ సమయంలో మద్రాసు, కేరళ రాష్ట్రాలు పరస్పరం ఇంకా కొన్ని ప్రాంతాలను కూడా మార్చుకున్నాయి

కేరళకు తూర్పు, దక్షిణాన తమిళనాడు, పడమర అరేబియా సముద్రం, ఉత్తరాన కర్ణాటక రాష్ట్రాలు వుంటాయి.

కేరళ రాష్ట్రాన్ని భౌగోళికంగా మూడు ప్రాంతాలుగా విభజించవచ్చు పర్వత ప్రాంతం, పల్లపు ప్రాంతం, ఈ రెండిటికి మధ్యగా వుండే పర్వత ప్రాంతాలు సగటున 900 మీటర్ల ఎత్తుగా వుంటాయి కేరళలో సగటునప్రతి సంవత్సరం 279 సెం మీ వర్షం

కురుస్తుంది ఈ రాష్ట్రంలో నలభైకి పైగా నదులు ఇంకా వీటికి ఉపనదులు ఉన్నాయి. కాని ఇవన్నీ చిన్న చిన్న నదులు పైగా ఇవన్నీ వర్షాధార ప్రవాహాలు. వేసవిలో వీటిలో నీరు వుండదు దాదాపు ఈ నదులన్నీ పశ్చిమ దిశగా ప్రవహిస్తాయి మూడు నదులు మాత్రం తూర్పు ముఖంగా ప్రవహిస్తాయి

కేరళ 14 జిల్లాలుగా విభజించబడివుంటుంది అవి - త్రివేండ్రం, క్విలన్, అలెప్పి, పతనామ్ తిట్ట, కొట్టాయం, ఇడుక్కి, ఎర్నాకుళం, త్రిచూర్, పాల్ఘాట్, మల్లపురం, కోజికోడ్, వైనాడ్, కన్నూర్, కాసరగోడ్ 1990 నుంచి కేరళ రాష్ట్ర ప్రభుత్వం కొన్ని జిల్లా పేర్లను మార్పు చేశారు. త్రివేండ్రంను తిరువనంతపురం అని, క్విలన్ ను కొల్లాం అని, అలెప్పీని అల్లపూజ అని పిలుస్తున్నారు

కేరళ శాసనసభలో 141 మంది సభ్యులు వుంటారు. శాసన మండలి లేదు. లోక్‌సభ సట్లు 20, రాజ్యసభ సీట్లు 9.

కేరళ జనాభాలో అక్షరాస్యత శాతం 90. భారతదేశంలో అక్షరాస్యత శాతం 52 మాత్రమేనని. మన రాష్ట్రంలో అక్షరాస్యత శాతం 45 మాత్రమేనని గుర్తు తెచ్చుకుంటే ఈ విషయంలో కేరళ ఎంత ఆధిక్యతలో వుందో అర్థం చేసుకోవచ్చును. దేశంలో కెల్లా నూటికి నూరు శాతం అక్షరాస్యత సాధించిన ఏకైక పట్టణం కేరళలోని కొట్టాయం. ఈ పట్టణంలోని 64 వేలకు పైగా ప్రజలంతా అక్షరాస్యులే. కేరళ జనాభాలో హిందువులు 58 శాతం, క్రిష్టియన్లు 20 శాతం, ముస్లింలు 21 శాతం వుంటారు.

కేరళ ప్రజల మాతృ భాష మళయాళం సంపన్నమైన భాష. ప్రాచీన మళయాళం అంటే స్వచ్ఛమైన మళయాళంపై ఏ ఇతర భాషా ప్రభావం కానరాదు. ఈ స్వచ్ఛమైన మళయాళ భాషలో భక్తి, మత సంబంధమైన రచనలే ఆనాటి తియాతుపట్టు (పట్టువంటి పాటలు) మార్గం కళి పట్లు, భద్రాకాళి పట్టు మొదలైనవి. పండుగల పేరుమీదగా ఏర్పడిన సారస్వతం ఓనం పట్టు, కృషి పట్టు అనేవి కూడా ఆ నాటివే.

తర్వాత కొంత కాలానికి మళయాళంపై తమిళ ప్రభావం పడింది మళయాళం తమిళం సంకరం అయిన సారస్వతం వెలువడింది. ఈవిధంగా వచ్చిన వాటిలో 12వ శతాబ్దంలో వెలువడిన 'రామచరితం' చెప్పుకోవాలి. ఆ తర్వాత వచ్చిన రామాయణం, భగవద్గీత, భారతమాల అనే గ్రంధాలపై కూడా తమిళ ప్రభావం కానవస్తుంది. మళయాళం సారస్వతంపై సంస్కృత ప్రభావం కూడా హెచ్చుగానే వుంది. 16వ శతాబ్దంలో జుతచన్‌చే వ్రాయబడ్డ ఆధ్యాత్మిక రామాయణం, భారతం, భాగవతం మళయాళంలో ఆనాటి నుంచి ఈ నాటి వరకూ ప్రసిద్ధ గ్రంధాలే. అంతేగాక ఈజుతచన్‌కు సాటి రాగల కవి కూడా మరొకవి లేరు మళయాళంలో. ఇక ఇప్పటి కాలానికి వస్తే

శంకర్‌కురుప్‌చెప్పుకోదగిన కవి. మొట్ట మొదటి జ్ఞానపీఠ్ బహుమతి ఈయనకే లభించింది

కేరళ వ్యవసాయ రంగం పరిశీలిస్తే దేశంలో ఉత్పత్తి అయ్యే రబ్బర్‌లో 92 శాతం, దేశంలో పండే కొబ్బరి కాయలలో 90 శాతం, దేశంలో యాలక్కాయలలో 70 శాతం, దేశంలో ఉత్పత్తి అయ్యే మిరియాలలో 70 శాతం, దేశంలో ఉత్పత్తి అయ్యే పోకచెక్కలలో 60 శాతం, దేశంలో పండే జీడిపప్పులో 80 శాతం ఒక్క రాష్ట్రంలోనే పండుతాయి. నిమ్మగడ్డి నూనె నూరు శాతం ఇక్కడే ఉత్పత్తి అవుతుంది. కాఫీ, టీలు కూడా విరివిగా పండుతాయి. ఈ విధమైన వాణిజ్య పంటలకు పశ్చిమ కనుమలకు దిగువనున్న పర్వత ప్రాంతాలు బహుఅనువైనవి. అయితే ప్రజలు ప్రధాన ఆహారమైన వరి మాత్రం చాలా తక్కువగా పండుతుంది ఈ రాష్ట్ర ప్రజలకు కావల్సిన ధాన్యంలో సగం మాత్రమే ఇచ్చట పండుతుంది. మిగతా ధాన్యం ఇతర రాష్ట్రాల నుంచి దిగుమతి చేసుకోవాల్సిందే.

పారిశ్రామికంగా కేరళలో జింక్, న్యూస్ ప్రింట్, సుగంధద్రవ్యాలు, రబ్బర్, కొబ్బరికి సంబంధించిన పరిశ్రమలు వున్నాయి. కేంద్ర ప్రభుత్వ ఆధీనంలోని కొచ్చిన్ నౌకాశ్రయం, వల్లూరు (కొట్టాయం జిల్లా) లోని హిందుస్తాన్ ఆర్గానిక్స్ అండ్ కెమికల్స్, ఉద్యోగ మండల్‌లో పాక్ట్ ఎరువుల కర్మాగారం, త్రివేంద్రంలో గర్భనిరోధక సాధనాలు (నిరోధ్) తయారుచేసే హిందూస్తాన్ లాటెక్స్ మొదలైనవి చెప్పుకోదగిన భారీ పరిశ్రమలు. ఇవిగాక ఇంకా 3 వేల పైన చిన్నా పెద్దా పరిశ్రమలు ప్రవేటు రంగంలోను, ప్రభుత్వ రంగంలో కూడా స్థాపించబడి వున్నాయి.

కేరళ ప్రజల ప్రధాన పండుగ ఓనం. రైతులకు పంట చేతికొచ్చే రోజుల్లో వస్తుంది కాబట్టి రైతులు ఈ పండుగను ఘనంగా జరుపుకుంటారు. ఇళ్ళు, వాకిళ్ళు శుభ్రపర్చుకొని ఆనందోత్సాహాలతో ఈ పండుగను చేసుకొంటారు. కేరళ ప్రజలు ఈ పండుగను పదిరోజులు సంబరంగా జరుపుకుంటారు. పదోరోజు పడవల పోటీతో ఈ పండుగ వేడుకలు తారస్థాయికి వస్తాయి. ఇంకా పూరం, శివరాత్రి పండుగలు కూడాకేరళ ప్రజలు ఘనంగా జరుపుకుంటారు.

కేరళ అంటే ప్రతివారికి కథాకళి డాన్సు గుర్తుకు వస్తుంది. 400 సం॥ ల నాడు సృష్టించబడిన ఈ కథాకళి నృత్యం మనదేశంలోనే గాక ప్రపంచమంతా ప్రసిద్ధిపొందింది. త్రివేంద్రం, కొచ్చిన్‌లలో ఈ కథాకళి ప్రదర్శనలు ప్రతిరోజు జరుగుతూనే వుంటాయి.

కేరళ రాజధాని త్రివేంద్రం ఏడు చిన్న కొండలపై నిర్మించబడిన నగరం. లోగడ ఈ నగరం దేశంలో కెల్లా పరిశుభ్ర నగరంగా చెప్పుకునేవారు. జనాభా 8 లక్షలు. త్రివేంద్రంలో ప్రధానంగా చెప్పుకోదగిన కట్టడం పద్మనాభస్వామి ఆలయం. తిరువాన్కూర్

మహారాజు 1733లో దీన్ని నిర్మించారు ఈ దేవాలయంలోకి హిందువులకుమాత్రమే ప్రవేశం ఉంది హిందువులు కూడా తెల్లటి బట్టలు ధరిస్తేనే ఆలయ ప్రవేశం లభిస్తుంది.

త్రివేండ్రంకు 16 కి॥ మీ॥ దూరంలో వుండే కోవలం బీచ్ ప్రపంచంలోని అందమైన బీచ్‌లలో ఒకటి.

ప్రపంచంలోని అందమైన సహజ నౌకాశ్రయాల్లో కొచ్చిన్ ఒకటి. కొచ్చిన్ పూర్వంనుంచి ఇప్పటివరకూ పెద్ద వ్యాపార కేంద్రమే! చిన్న ద్వీపాల సముదాయం కొచ్చిన్. ప్రధాన భూభాగాన్ని ఎర్నాకుళం అంటారు విల్లింగ్‌టన్, బోల్‌గట్టే, గుండు దీవులను కొచ్చిన్ అంటారు ఈ దీవులలో అనేక క్రైస్తవమత చర్చీలు పురాతన కట్టడాలు వున్నాయి.

'కొచ్చిన్‌కు 208 కి॥ మీ దూరంలో వుండేపెరియార్ పార్క్ మనదేశంలోనే గొప్ప వన్య ప్రాణి సంరక్షణ కేంద్రం 26 కి॥ మీ పెరియార్ సరస్సు చుట్టూ 675 చ॥ కి మీటర్లలో వుండే ఈ పార్క్‌లో వన్య మృగాలు అన్నింటినీ సహజ వాతావరణంలో చూడవచ్చు పెరియార్ సరస్సులో మోటారు లాంచిపై ప్రయాణిస్తూ ఈ పెరియార్ పార్కును నేత్రానందంగా చూడవచ్చును.

కాలికట్ (కోజికోడ్) పురాతన పట్టణం. జమోరియన్ రాజులకు ఈ పట్టణం రాజధానిగా వుండేది. 1498లో వాస్కోడిగామా ఈ పట్టణంలోనే అడుగు పెట్టాడు ఈ పట్టణం 'కాలికో' బట్టలకు ప్రసిద్ధి.

త్రివేండ్రంకు 180 కి॥ మీ దూరంలో శబరిమలైలో అయ్యప్ప దేవాయలం వుంది.

కొచ్చిన్‌కు 45 కి॥ మీ దూరంలో పెరియార్ నది ఒడ్డున వుండే కాలడి హిందువులకు పుణ్యక్షేత్రం. జగద్గురు శంకరాచార్యులు జన్మించింది ఇక్కడే. ఆయన స్మృత్యర్థం ఇక్కడ దక్షిణమూర్తి అనే ఆలయం శారదాదేవి పేరుమీదగా మరొక ఆలయం నిర్మించబడింది. ఇంతేగాక శంకరాచార్య జీవితం గురించి తెలియజెప్పే మరొక స్మారక మందిరం కూడా ఇచ్చట వుంది.

త్రిచూర్ జిల్లాలోని గురువయ్యూరులో శ్రీ కృష్ణ దేవాలయం ప్రసిద్ధిపొందిన దేవాలయం.

కేరళ రాష్ట్రాభివృద్ధికి కృషి చేసిన రాజకీయ ప్రముఖులు శ్రీ నంబూద్రిపాద్, కరుణాకరన్, ఇ.కె.నయనార్ మొదలైన వారు ముఖ్యులు.

# 4 కర్ణాటక

వైశాల్యం - 1,91,791 చదరపు కిలోమీటర్లు, జనాభా - 4 కోట్ల 48 లక్షలు, రాజధాని బెంగుళూరు. వాడుక భాష కన్నడం.

కర్ణాటక రాష్ట్రానికి ఉత్తరాన మహారాష్ట్ర, గోవా తూర్పున ఆంధ్రప్రదేశ్, దక్షిణాన తమిళనాడు, కేరళ, పశ్చిమాన అరేబియా సముద్రం హద్దులుగా వుంటాయి



భారతదేశంలో కర్ణాటక వైశాల్యం, జనాభారీత్యా కూడా 8 వస్థానంలో వుంటుంది. వైశాల్యం రీత్యా మన రాష్ట్రంతో పోలిస్తే సగానికిపైగాను, జనాభా రీత్యా మన రాష్ట్రం కన్నా దాదాపు 2 కోట్లు తక్కువ గానూ వుంటుంది. కర్ణాటక జనాభాలో 86 శాతం హిందువులు 11 శాతం ముస్లింలు మిగతా వారు క్రైస్తవులు వగైరా రాష్ట్ర జనాభాలో 59 శాతం అక్షరాస్యులు

కర్ణాటక అనే పేరు కరునాడు అనే మాటను బట్టి వచ్చింది. కరునాడు అంటే ఎత్తైన ప్రదేశం అని అర్థం. కర్ణాటక ఎత్తైన పీఠ భూమి కాబట్టి ఈ పేరు వచ్చింది. కర్ణాటక చరిత్ర పురాణ కాలం నుంచి మొదలవుతుంది. రామాయణంలోని వానర రాజులు వాలి, సుగ్రీవులు పాలించిన ప్రదేశం ఈ రాష్ట్రంలోని హంపి (బళ్ళారి జిల్లా)గా చెబుతారు. బీజాపూర్ జిల్లాలోని బాదామి వద్ద ఆనాడు అగస్త్యముని ఆశ్రమం కూడా వుండేదని చెబుతారు కర్ణాటకను ప్రాచీన కాలంలో కుంతల దేశం అని పిల్చేవారు కుంతల దేశానికి ఈజిప్టు తదితర దూర దేశాలతో వాణిజ్య సంబంధాలు కూడా వుండేవి.

క్రీ.పూ. 4వ శతాబ్దంలో కర్ణాటక మౌర్య సామ్రాజ్యంలో భాగంగా వుండేది. రాయచూర్ జిల్లాలోని కనకగిరి (ఆ రోజుల్లో దీని పేరు శివమగిరి) మౌర్య సామ్రాజ్యానికి దక్షిణాది రాజధానిగా వుండేది. మౌర్య చంద్ర గుప్తుడు తన అవసాన దశలో ఇక్కడే వున్నాడని చెబుతారు. క్రీ.పూ. 1వ శతాబ్దంలో కర్ణాటక శాతవాహనుల పాలన లోకి వచ్చింది. ఆనాటి శాతవాహనుల రాజ్యం ఉత్తరాన వింధ్య పర్వతం నుంచి దక్షిణాన్నదక్కన్ ప్రాంతం అంతా విస్తరించి వుండేది. వీరి పాలన 300 సంవత్సరాలు సాగింది. శాతవాహన వంశం పతనమైన తర్వాత ఉత్తర కర్ణాటకను కదంబ రాజవంశం, దక్షిణ కర్ణాటకను గాంగ వంశీయులు రాజ్యమేలారు. ఈ గాంగ వంశీయుల పాలనలోనే శ్రావణ బెల్‌గోలాలో బ్రహ్మాండమైన గోమతేశ్వర శిలా విగ్రహం ఏర్పాటు చేయబడింది.

కీ.శ. 6వ శతాబ్దంలో కర్ణాటక చాళుక్యుల పాలనలోకి వచ్చింది. వీరి తర్వాత యాదవ, హొయసల వంశీయులు పాలించారు. 14వ శతాబ్దంలో విజయనగర సామ్రాజ్యం ఏర్పడింది. శ్రీకృష్ణ దేవరాయల్లు పాలనలో విజయనగరం సామ్రాజ్యం మహర్దశలో వుంది. హంపిలోని శిథిలాలు ఈ నాటికీ విజయనగర సామ్రాజ్యం ఔన్నత్యాన్ని వేనోళ్ళ చాటుతాయి. తళ్ళికోట యుద్ధం (1565) తో విజయనగర సామ్రాజ్యం పతనమైన తర్వాత వడయార్లు శ్రీరంగ పట్నం రాజధానిగా కర్ణాటకను పాలించారు. ముస్లిం సైన్యాధిపతి హైదరాలీ చేత వడయార్లు నెట్టి వేయబడ్డారు. హైదరాలీ కుమారుడే ప్రఖ్యాత టిప్పు సుల్తాన్. టిప్పు సుల్తాన్ బ్రిటిష్ వారి కుతంత్రాలను ఎదిరిస్తూ 30 సంవత్సరాలు శ్రీరంగపట్నం రాజధానిగా మైసూర్‌ని పాలించాడు. తర్వాత టిప్పు సుల్తాన్ బ్రిటిష్ వారి చేతుల్లో ఓడిపోగా బ్రిటిష్ అజ్మాయిషీ

క్రింద వడయార్లు మళ్ళీ అధికారంలోకి వచ్చారు

1956లో రాష్ట్రాల పునర్విభజన ప్రకారం హైదరాబాద్ రాష్ట్రంలోని కన్నడ ప్రాంతాలు, మద్రాసురాష్ట్రంలోని ఊర్లు ప్రాంతాన్ని మైసూర్ రాష్ట్రంలో కలిపారు 1973లో మైసూర్ రాష్ట్రం పేరును కర్ణాటకగా మార్చారు.

కర్ణాటకలో రెండు సభలు గల చట్టసభ వుంది. అసెంబ్లీలో 224 మంది కౌన్సిల్‌లో 63 మంది సభ్యులుగ వుంటారు. లోక్‌సభలో 36 మంది రాజ్యసభలో 11 మంది కర్ణాటకకు ప్రాతినిధ్యం వహిస్తారు. కర్ణాటక 20 జిల్లాలుగా విభజించబడి వుంది. వాటి పేర్లు బెంగుళూరు, బెంగుళూరు రూరల్, బెల్గాం, బళ్ళారి, బీజాపూర్, బీదర్, చిక్‌మగ్‌ళూరు చిత్ర దుర్గ, దక్షిణ, కన్నడ, ధార్వాడ్, గుల్బర్గా, హసన్, కూర్గు, కోలార్, మాండ్యా, మైసూర్, రాయిచూర్, షిమోగా, తూంకూర్, ఉత్తర కన్నడ.

కన్నడ భాషకు సుదీర్ఘ చరిత్ర ఉంది. సంస్కృతం, తమిళం తర్వాత కన్నడమే ప్రాచీన భాష. కన్నడం పుట్టుకతో ద్రావిడ జాతికి చెందినదైనా దానిపై సంస్కృత ప్రభావం విరివిగా వుంది. క్రీ.శ 5వ శతాబ్దం నాటికే కన్నడ భాష సుసంపన్నమైంది. 9వ శతాబ్దానికి చెందిన నిర్పతుంగ తాను రచించిన "కవిరాజు మార్గ"లో 5వ శతాబ్దం నుంచి రచనలు చేసిన అనేక మంది కవులను గురించి పేర్కొన్నాడు. మిగతా భారతీయ భాషలలాగానే సంస్కృతంలోని రామాయణ, భారతాలను తర్జుమా లేక ఆధారంగా వ్రాయబడిన సారస్వతమే మొదటి కన్నడ సాహిత్యం, పంప, రన్న, పొన్న అనే కవులు రామాయణం, భారతాలను కన్నడంలోకి మార్చారు.

12వ శతాబ్దంలో బసవేశ్వరుడు వచన రచనతో కన్నడ సాహిత్యం ఒక మలుపు తిరగింది. సామాన్య ప్రజలకు అందుబాటులోకి వచ్చిన ఈ వచన సాహిత్యం ద్వారా నాటి సంఘంలో ఒక విప్లవమే వచ్చింది. పంప, కుమార వ్యాసులు కూడా కన్నడ సాహిత్యానికి విశేష కృషి సల్పిన మహాకవులు. కన్నడ సాహిత్యంపై జైన మత ప్రభావం కూడా హెచ్చుగ కానవస్తుంది.

ఆధునిక కాలానికి వస్తే శ్రీ కంఠయ్య (1884-1946) గోవింద పాయ్ (1883 - 1963) చెప్పుకోదగిన వారు. ఇక ప్రస్తుతానికి వస్తే కే.వి. పుట్టప్ప చెప్పుకోదగిన మహాకవి. ఈయన రచించిన "రామాయణ దర్శనం" కు జ్ఞానపీఠ్ అవార్డు వచ్చింది. ప్రఖ్యాత నవలాకారుడు మాస్తి వెంకటేశ్ అయ్యంగార్ (1891 - 1986) శివరాం కారంత్లకు కూడా జ్ఞానపీఠ్ అవార్డులు వచ్చినాయి. వీరిద్దర్నీ కన్నడ కథా రచనకు ఆద్యులుగా చెప్పుకోవచ్చును. సాహిత్య అకాడమీ బహుమతిని అందుకున్న డా. డి.ఆర్. బింద్రే కూడా కర్ణాటకకు చెందినవాడే.

కర్ణాటకలో ప్రధాన నదులు రెండు - కృష్ణా, కావేరి, వీటికి భీమ, తుంగభద్ర, వేదవతి, హేమావతి, అర్కావతి, లక్ష్మణ తీర్థ అనే ఉప నదులు కూడా ఉన్నాయి. కృష్ణానది కర్ణాటకలో తూర్పుదిశగా పయనించి ఆంధ్రప్రదేశ్‌లోకి వచ్చి ఆ తర్వాత బంగాళా ఖాతంలో కలుస్తుంది కావేరి కూడా కర్ణాటకలో తూర్పు దిశగా ప్రవహించి తమిళనాడులో ప్రవేశిస్తుంది. ఇవి గాక ఇంకా శరావతి, నేత్రావతి, కాళింది అనే చిన్న నదులు కూడా ఉన్నాయి ఇవి పశ్చిమంగా పయనించి అరేబియా సముద్రంలో కలుస్తాయి ఈ చిన్న నదులు జల విద్యుత్‌కు తోడ్పడుతున్నాయి

కర్నాటకను భౌగోళికంగా నాలుగు భాగాలుగా విభజించవచ్చును. కోస్తా ప్రాంతం, మల్నాడు, ఉత్తరమైదానం, దక్షిణ మైదానం అనీ, కోస్తా ప్రాంతాలలో వర్షాలు విస్తారంగా పడతాయి భారతదేశంలో అత్యధికంగా వర్షాలు పడే 14 కేంద్రాలలో 5 కేంద్రాలు ఈ కోస్తా ప్రాంతంలోనే వున్నాయి. కోస్తా ప్రాంతంలో సాధారణంగా సంవత్సరానికి 348 సెం మీ. వర్షం పడుతుంది. లోతట్టు ప్రాంతంలో మాత్రం 70 సెం.మీ. మాత్రం పడుతుంది. అది కూడా ఒక్కో సంవత్సరం పడదు.

కర్ణాటక ప్రధానంగా వ్యవసాయం రాష్ట్రం 71 శాతం జనాభాకు వ్యవసాయమే జీవనాధారం. 76 శాతం ప్రజలు గ్రామాల్లోనే నివసిస్తున్నారు. రాష్ట్ర ఆదాయంలో 50 శాతం వ్యవసాయం దాని అనుబంధ పరిశ్రమల ద్వారానే వస్తుంది దేశంలో పండే రాగులలో 47 శాతం ఈ రాష్ట్రంలోనే పండుతాయి. ఇంకా వరి, జొన్నలు వేరుశనగ వగైరా ఇచ్చట బాగా పండుతాయి ఇవి గాక రాష్ట్రంలో కాఫీ విరివిగా పండుతుంది. దేశంలో పండే కాఫీలో 60 శాతం ఇక్కడే పండుతుంది. కూర్గు ప్రాంతం కాఫీ పంటకు ప్రసిద్ధి

కర్ణాటకలో అనేక భారీ పరిశ్రమలు నెలకొని వున్నాయి. కేంద్ర ప్రభుత్వం అధీనంలోని హిందుస్థాన్ ఎయిరోనాటిక్స్, హిందూస్థాన్ మిషిన్‌టూల్సు, భారత్ ఎర్త్‌మూవర్స్, భారత్ ఎలక్ట్రానిక్స్, ఇండియన్ టెలిఫోన్ ఇండస్ట్రీస్, నేషనల్ ఎయిరోనాటికల్ లాబరేటరీ మొదలైన పరిశ్రమలు బెంగుళూరులోనే వున్నాయి. కోలార్ గోల్డ్‌ఫీల్డ్స్ కూడా ప్రభుత్వ ఆధీనంలోనివే. రాష్ట్ర ప్రభుత్వ ఆధీనంలోని విశ్వేశ్వరయ్య ఇనుము ఉక్కు కర్మాగారం (భద్రావతి) ప్రత్యేక రకమైన ఉక్కు తయారు చేస్తుంది. కుద్రేముఖ్ ఇనుపగనులు ఈ రాష్ట్రంలోనివే. కర్నాటక బంగారం ఉత్పత్తికి ప్రసిద్ధి.

దేశంలో తయారయ్యే ముడి సిల్కులో 85 శాతం ఇక్కడే తయారవుతుంది. ఇక్కడ చందనంతో తయారయ్యే నూనె, చందనపు సబ్బులు ప్రపంచ ప్రఖ్యాతిగాంచినవి. కార్వార్‌లో బ్రహ్మాండమైన నౌకాశ్రయం వుంది. ఇవి గాక ఇంకా 2500 కోట్ల పెట్టుబడితో ప్రయివేటు రంగంలో 6700 చిన్నా పెద్ద పరిశ్రమలు నెలకొని వున్నాయి.

ఇక కర్ణాటకలో చూడదగిన ప్రదేశాలు అనేకం. రాజధాని బెంగుళూరు (జనాభా 41 లక్షలు) సముద్ర మట్టానికి 920 మీటర్ల ఎత్తున వుండే సుందర నగరం అందంగా తీర్చిదిద్దిన గృహాలతో, పార్కులతో బెంగుళూరు చూడచక్కని నగరం. వాతావరణం కూడా సమశీతోష్ణంగా వుంటుంది ఎప్పుడు. ఈ నగరం పునాది 1537 లో కెంపగౌడ అనే సైన్యాధిపతిచే వేయబడింది. లాల్ బాగ్ గార్డెన్స్ హైదరాలీ, టిప్పు సుల్తాన్‌ల కాలంలో ఏర్పరచబడింది. ఈ గార్డెన్స్ 240 ఎకరాలలో వుంటాయి. ఇందులో దాదాపు ప్రపంచంలో వున్న అన్ని రకాల మొక్కలు చెట్లు వుంటాయి. కర్నాటక అసెంబ్లీ, సచివాలయం వుండే విధానసౌధ గొప్ప కట్టడం. టిప్పు సుల్తాన్ కోట 18వ శతాబ్దం సైనిక వాస్తు శాస్త్ర పద్ధతులకు నిదర్శనం. ఇంకా కబ్బన్ పార్క్ శ్రీమోక్షగుండం విశ్వేశ్వరయ్య మ్యూజియం, నేషనల్ పార్క్, ఉల్సూర్ సరస్సు చూడదగిన ప్రదేశాలు.

బెంగుళూరుకు 68 కిలోమీటర్ల దూరంలో వుండే నందిహిల్స్ చక్కటి విశ్రాంతి కేంద్రం. ఇక్కడ రెండు శివాలయాలు కూడా వున్నాయి. బెంగుళూరుకు 96 కిలోమీటర్ల దూరంలో కోలార్‌గోల్డు ఫీల్డ్ వున్నాయి. ఈ గనుల్లో ఒకటి 2855 మీటర్ల లోతు వుంటుంది. ఇదే ప్రపంచంలో కెల్లా లోతైన గని. బెంగుళూరుకు 377 కిలోమీటర్ల దూరంలో బెల్గాంకు దక్షిణంగా వుంటాయి జోగ్‌ఫాల్స్. ఈ ఫాల్స్ అందచందాలు చూడవల్సిందేగాని వ్రాయనలవి కాదు.

బెంగుళూరు తర్వాత పెద్ద నగరం మైసూరు. జనాభా 28 లక్షలు. బెంగుళూరు కన్నా సుందర నగరం మైసూరు. లోగడ మైసూరు హొయసల రాజుల రాజధాని. ఇక్కడ దసరా పండగ రోజుల్లో జరిగే బ్రహ్మాండమైన ఉత్సవాలు చూడటానికి దేశం నలుమూలల నుంచి జనం వస్తారు. మైసూరు మహారాజు భవంతి 1911లో 42 లక్షల వ్యయంతో కట్టారట. దేశంలోని సుందరమైన పెద్ద కట్టడాలలో ఇదొకటి. చాముండేశ్వరి ఆర్ట్సు మ్యూజియంలో ప్రఖ్యాతి గాంచిన రవివర్మ చిత్రాలను చూడవచ్చు. ఇంకా శాండల్‌వుడ్ ఫ్యాక్టరీ, సిల్క్ ఫ్యాక్టరీలు నగరంలో చూడవల్సిన ప్రదేశాలు. మైసూరు నగరానికి 12 కిలోమీటర్ల దూరంలో చాముండీ హిల్స్ మీద చాముండేశ్వరి ఆలయం వుంది. చాముండేశ్వరి దేవి ఈ నగర ప్రజల ఆరాధ్య దేవత, మైసూరుకు 8 కిలో మీటర్ల దూరంలో కావేరి నదిపై కట్టిన కృష్ణరాజ సాగర్‌డాం, బృందావన్ గార్డెన్స్ యాత్రికులను విశేషంగా ఆకర్షిస్తాయి. కృష్ణరాజసాగార్ డాం సిమెంటు అనేది లేకుండా కేవలం రాళ్ళతోనే కట్టటం విశేషం. బృందావన్‌గార్డెన్స్ సోయగాలు ప్రపంచ ప్రసిద్ధి పొందినాయి.

మైసూరుకు 16 కిలోమీటర్ల దూరంలో కావేరి నది రెండుగా చీలి ఒక దీవిగా ఏర్పడింది. ఆ దీవిపై కట్టినదే శ్రీరంగపట్టణం, టిప్పు సుల్తాన్ ముఖ్యపట్టణం.

కూర్గు ప్రాంతం కాఫీ తోటలకు ప్రసిద్ధి.

మైసూరుకు 93 కిలోమీటర్ల దూరంలో వుండే శ్రావణ బెలగోల జైన మతస్తులకు యాత్రాస్థలం ఇచ్చట జైనులకు ఆరాధ్యమైన గోమటేశ్వర విగ్రహం వుంది. ఈ విగ్రహం 17 మీటర్ల ఎత్తున ఒకే శిలలో మలిచారు ఈ విగ్రహం 1800 సంవత్సరాలనాటిది 12 సంవత్సరాలకు ఒకసారి జైన మతస్తులు "మస్తకాభిషేకం" జరిపి ఈ విగ్రహాన్ని పాలు, పెరుగు, తేనె, కొబ్బరి నీళ్ళు, పసుపు నీళ్ళతో అభిషేకిస్తారు. శ్రావణ బెలగోల అంటే అర్థం మహాపర్వతంపై మహానుభావుడు అని

బెల్గాంకు తూర్పుగా 250 కిలోమీటర్ల దూరంలో హంపి వుంది. ఆనాటి విజయనగర సామ్రాజ్యానికి ముఖ్యపట్టణం విజయనగరం ఇదే. హంపి నేడు ఒక చిన్నకుగ్రామం. తుంగభద్ర ఒడ్డున పంపావతి ఆలయం చుట్టూ వుంది. ఆనాడు మహావైభవంగా వెలుగొందిన కర్ణాటక, ఆంధ్రా సామ్రాజ్యానికి ఇదే ముఖ్యపట్టణం. 26 చదరపు కిలోమీటర్ల వైశాల్యంలో పడి వున్న ఈ హంపి శిథిలాలు ఆనాటి విజయనగర సామ్రాజ్య వైభవానికి మిగిలిన సాక్ష్యాధారాలు. హంపికి మరొక ప్రాముఖ్యత కూడా వుంది. కర్ణాటక సంగీతానికి పుట్టిల్లు హంపి.

శ్రావణ బెలగోలకు 90 కిలోమీటర్ల దూరంలో వుండే బేలూరు 800 సంవత్సరాల క్రితం హొయసల రాజుల ముఖ్యపట్టణం. బేలూరులో చెన్నకేశ్వర దేవాలయం ప్రసిద్ధి పొందింది. బేలూరుకు 16 కిలోమీటర్ల దూరంలో హళిబేడు హొయసలరాజుల రెండో రాజధాని. ఇచ్చట శివాలయం, కేదారేశ్వర ఆలయం శిథిలావస్థలో వున్నాయి. హళీబేడుకు ఉత్తరంగా తుంగభద్ర ఒడ్డున శృంగేరి వుంది. శంకరాచార్యుల వారు స్థాపించిన మొట్టమొదటి పీఠం ఇదే. దీన్ని మొదట శృంగగిరి అనేవారు తరువాత శృంగేరిగా మారింది. పురాణాల్లో దీన్ని ఋశ్యశృంగ పర్వతంగా పేర్కొన్నారు.

కర్ణాటక ప్రజలు దసరా పండుగను ఉత్సాహంగా చేసుకుంటారు. మార్చి నెలలో కర్ణాటక ప్రజలు కరాగ పండుగను కూడా వైభవంగా చేసుకుంటారు. ఈ కరాగ పండుగ ఈ ఒక్క రాష్ట్రంలోనే కనపడుతుంది. పాండవుల పట్టమహిషి ద్రౌపదిని కొలిచే పండుగ ఇది. ద్రౌపదిని శక్తి స్వరూపిణిగా కొలుస్తారు కర్ణాటక ప్రజలు.

కర్ణాటక అభివృద్ధికి అనేక ఇంజనీరింగ్ పనులు చేబట్టిన ప్రఖ్యాత ఇంజనీర్ సర్ మోక్షగుండం విశ్వేశ్వరయ్యను కర్ణాటక ప్రజలు ఎన్నటికీ మర్చిపోరు. మన దేశపు మొట్ట మొదటి భారతీయ సైన్యాధిపతి జనరల్ కె.యం. కరియప్ప కర్ణాటకలోని కూర్గ ప్రాంతానికి చెందిన వారు. మాజీ సుప్రీం కోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ ఇ.ఎస్. వెంకట్రామయ్య కర్నాటక రాష్ట్రానికి చెందిన వారే.

రాజకీయంగా శ్రీ బి.డి. జెట్టి, శ్రీ కె. హనుమంతయ్య, శ్రీ దేవరాజ్ అర్స్, శ్రీ నిజలింగప్ప, శ్రీ బంగారప్ప, శ్రీ గుండూరావు, శ్రీ రామకృష్ణ హెగ్డే, శ్రీ వీరేంద్ర పాటిల్ మొదలైనవారు కర్ణాటకలో చెప్పుకోదగినవారు.

# 5 ఒరిస్సా

వైశాల్యం - 155 707 చదరపు కిలోమీటర్లు. జనాభా - 3 కోట్ల 15 లక్షలు. రాజధాని - భువనేశ్వర్, మాతృభాష - ఒరియా.

ఒరిస్సాకు ఉత్తరాన బీహార్, పశ్చిమ బెంగాల్, తూర్పున బంగాళాఖాతం, పడమర మధ్యప్రదేశ్, దక్షిణాన (ఆగ్నేయంగా) ఆంధ్రప్రదేశ్ హద్దులుగా వుంటాయి.

భారతదేశంలో ఒరిస్సా వైశాల్యం రీత్యా 9వ స్థానంలోను, జనాభారీత్యా 11వ స్థానంలోను వుంటుంది. మన రాష్ట్రంతో పోలిస్తే - వైశాల్యం రీత్యా ఒరిస్సా ఆంధ్రప్రదేశ్‌లో సగానికన్నా కొంచెం ఎక్కువగాను, జనాభారీత్యా సగం గాను వుంటుంది.

ఒరిస్సాను ప్రాచీన కాలంలో 'కళింగ' అనేవారు. మహాభారతంలో ఒరిస్సాను ఋషులు నివసించే ప్రాంతమని అభివర్ణించబడింది. బ్రహ్మ పురాణంలో కూడా ఒరిస్సా సద్గుణ వంతులు, వర పుత్రులు నివసించే ప్రాంతంగా పేర్కొనబడింది. ప్రాచీన



కాలంలో ఒరిస్సా (కళింగ) కు సింహళం, జావా, సుమిత్రా, కంబోడియా మొదలైన దేశాలతో వర్తక సంబంధాలు వుండేవి ఆ రోజులలో అనేక మంది కళింగ రాజ్యానికి చెందిన వారు పై దేశాలకు వెళ్ళి స్థిరపడ్డారు కూడా. వారిని క్లింగులు (కళింగ నుంచి వచ్చినమాట) అనేవారు. అసలు సింహళం ( శ్రీలంక) మొట్టమొదటి రాజు 'విజయ' కళింగకు చెందిన ఒక రాజకుమారుడేనని చెబుతారు.

మహాశక్తివంతమైన కళింగ రాజ్యాన్ని జయించటం ఆనాడు మౌర్య చక్రవర్తుల వల్లే కాలేదు. కాని మౌర్య చంద్రగుప్తుని మనుమడు ప్రఖ్యాత అశోకచక్రవర్తి కళింగపై దండెత్తి భీకర పోరాటం జరిపి లక్షమంది సైనికుల్ని చంపి మరో లక్షన్నర మంది సైనికుల్ని బందీలుగా పట్టుకుని కళింగ సామ్రాజ్యాన్ని జయించాడు. కళింగ యుద్ధం జరిగిన ప్రాంతం ప్రస్తుత భువనేశ్వర్‌కు సమీపంలోనే. అయితే అశోక చక్రవర్తి యుద్ధంలో అయితే జయించాడు గాని దారుణ యుద్ధం ఫలితంగా జరిగిన బీభత్సకాండ, ప్రజల కడగండ్లు చూసి పూర్తిగా పరివర్తన చెంది ఇక ఎన్నడూ యుద్ధం చేయనని శపథం చేసి బౌద్ధ మతం స్వీకరించి అహింసామార్గాన్ని చేపట్టాడు.

అశోక చక్రవర్తి తర్వాత కళింగ రాజ్యం తిరిగి స్వతంత్రం పొంది ఖరవేలుని పరిపాలనలో ఉచ్ఛదశకు చేరుకుంది. ఖరవేలుడు జైన మతాన్ని ప్రోత్సహించాడు. ఇతని పాలనలో వ్యాపార, సాంస్కృతిక రంగాలలో కూడా ఉన్నతి పొంది కళింగ రాజ్యం దక్షిణానికి, ఉత్తరానికి కూడా విస్తరించింది. ఖరవేలుడు గ్రీక్ రాజు డిమిత్రియస్ దండయాత్రను కూడా తిప్పికొట్టాడు.

ఖరవేలుడు తర్వాత కళింగ రాజ్యం విచ్ఛిన్నమయింది. కొంతకాలం మౌర్య సామ్రాజ్యంలో కలిపి వేసుకోవటం కూడా జరిగింది. 7వ శతాబ్దంలో స్థానిక గాంగ వంశీయుల పాలనలో కళింగ రాజ్యం తిరిగి శక్తి పుంజుకుంది. ఈ గాంగ వంశీయులలో ఒకడైన మహాశివ గుప్తయయాతి పాలనలో చిన్నాభిన్నమైన కళింగ ప్రాంతాలన్నీ ఏకం చేయబడినాయి. ప్రసిద్ధ పూరీ జగన్నాధ ఆలయం నిర్మింప చేసింది ఇతడే. మరో గాంగ వంశరాజైన నరసింహదేవ సుప్రసిద్ధ కోణార్క దేవాలయాన్ని నిర్మించాడు.

ముస్లిం దండయాత్రలను ఎదుర్కొంటూ 1588 వరకూ ఎలాగోలా స్వతంత్రంగా నిల్చిన కళింగ ఆఖరికి ముస్లిం పాలకుల వశం అయింది. 1592లో అక్బర్ చక్రవర్తి ఒరిస్సాను తన సామ్రాజ్యంలో కలిపివేసుకున్నాడు. మొగల్ సామ్రాజ్యం పతనమైన తర్వాత ఒరిస్సా కొన్నాళ్ళు మహారాష్ట్రుల వశం కూడా అయింది 1803లో ఒరిస్సా ఆంగ్లేయుల చేతుల్లోకి వెళ్ళింది. దేశానికి స్వతంత్రం రాకముందు ఒరిస్సా ఇంగ్లీషు వారి పర్యవేక్షణలో 26 చిన్న రాజ్యాలుగా వుండేది వీటన్నింటినీ ఏకం చేసి 1949లో ఒరిస్సా రాష్ట్రంగా ఏర్పాటు చేయబడింది.

ఒరిస్సా 23 జిల్లాలుగా విభజించబడి వుంటుంది. అవి - పూల్‌బని, బాలంగిర్ కటక్, డెంకనాల్, గంజాం, కలహంది, కెంజర్, కోరాపుట్, మయూర్ భంజ్, పూరి సంబల్‌పూర్, సుందర్‌ఘర్, బాలాసోర్ 1990లో ఈ 13 జిల్లాలు గాక మరో 10 జిల్లాల ఏర్పాటు చేశారు. అవి కేంద్రపడ, జైపూర్, బర్కార్, జాయ్‌పూర్, భువనేశ్వర్, అంగుల్ బమండ, నౌపాడ, గజపతి, భద్రక్.

ఒరిస్సాలో ఒకే సభగల చట్టసభ వుంది. దాంట్లో 147 మంది సభ్యులుంటారు 21 మంది లోకసభలోను, 10 మంది రాజ్యసభలోను ఈరాష్ట్రానికి పార్లమెంటులో ప్రాతినిధ్యం వహించుతారు.

ఒరిస్సాలో ముఖ్యంగా మూడు నదులు చెప్పుకోదగినవి. మహానది, బ్రహ్మణి, వైతరణి, ఇంకా చిన్న చిన్నవి కొద్దిగా వున్నాయి. ఇవన్నీ తూర్పుగా ప్రవహించి బంగాళాఖాతంలో కలుస్తాయి. సమశీతోష్ణంగా వుండే ఒరిస్సాలో సాలుకు సగటున 150 సె.మీ. వర్షం పడుతుంది ప్రసిద్ధిచెందిన చిలక సరస్సు ఒరిస్సాలోనే వుంది. లోగడ చిలక సరస్సు బంగాళాఖాతంలో ఒక భాగంగా వుండేది. రానురాను పెద్ద పెద్ద ఇసుకమేటలు వేయటం వలన 64 కి.మీ. పొడవు, 20 కి.మీ వెడల్పు గల గొప్ప సరస్సుగా రూపొందింది ఈ సరస్సులో మన దేశంలో వుండే అన్ని రకాల పక్షులను చూడవచ్చును. అంతేగాక శీతాకాలంలో సైబీరియా(సోవియట్ యూనియన్) నుంచి కూడా కొన్ని రకాల పక్షులు వచ్చి ఇక్కడ కొన్నాళ్ళు వుండి వెళతాయి.

ఒరిస్సా రాష్ట్ర జనాభాలో 95.4 శాతం హిందువులు, ముస్లింలు 1 6 శాతం, క్రైస్తవులు 1.8%. ఈ రాష్ట్రంలో షెడ్యూలు తెగలు, జాతుల వారు అధికంగా వున్నారు. రాష్ట్ర జనాభాలో నాలుగో వంతు వీరే. రాష్ట్ర జనాభాలో అక్షరాస్యత శాతం 48.

ఒరియా భాసా చరిత్ర 13వ శతాబ్దం నుంచి మాత్రమే మొదలవుతుంది. మిగతా భారతీయ భాషల లాగానే ఒరియాపై సంస్కృ ప్రభావం హెచ్చుగా వుంటుంది. అయితే ఉత్తరాది భాషలలోలాగా గాకుండా ఒరియా భాషపై ఉర్దు, పర్షియన్ భాషల ప్రభావం తక్కువగా వుంటుంది. సరళదాసు ఒరియా భాషకు వేదవ్యాసుడంతడివాడుగా చెప్పవచ్చును. వ్యవసాయదారుడైన సరళదాసు అసలు పేరు సిద్దేశ్వర పరిద. చదివింది కొద్ది చదువే. అయితేనేం ఇతడు సంస్కృత భారతాన్ని ఒరియాలోకి అద్భుతంగా అనువదించాడు. ఈయన వ్రాసిన చాంది పురాణం కూడా ఒరియాలో ప్రసిద్ధగ్రంథం. ఆ తర్వాత వచ్చిన బలరామదాసు, జగన్నాధ దాసులు కూడా రామాయణ భారతాల్ని సులభశైలిలో సామాన్యులకు కూడా అర్ధమయే విధంగా ఒరియాలో వ్రాశారు. ఒరియాలో వచన రచన కేవలం బ్రిటిష్ వారి హయాంలో మాత్రమే ప్రారంభమయింది. ఆధునిక ఒరియా భాషలో ప్రముఖంగా చెప్పుకోదగిన వాడు మోహన్ సేనాపతి (1843-1918) మోహన్

సేనాపతి గొప్ప రచయితే గాకుండా సంస్కర్త, పరిపాలనాదక్షుడు, వ్యాపారస్తుడు, దేశ భక్తుడు కూడా అయితే ఆశ్చర్యం ఏమంటే ఇన్ని గొప్ప విశేషాలున్న మోహన్ సేనాపతి చదివింది రెండో క్లాసు మాత్రమే! మోహన్ సేనాపతి మహాభారత, రామాయణాలను ఒరియాలో వ్రాయటమేగాక అనేక కథలు, నవలలు కూడా వ్రాశాడు ఇంకా ఆధునిక ఒరియా సాహిత్యంలో చెప్పుకోదగిన వారు గోప బంధుదాసు, వైకుంఠనాథ్ పట్నాయక్, కాళి చరణ్ పాణిగ్రహి, గోపీనాథ్ మొహంతా మొదలైనవారు. గోపీనాథ్ మొహంతా వ్రాసిన "సారవంతమైన నేల" అనే రచనకు జ్ఞానపీఠ్ బహుమతి కూడా వచ్చింది గోపీనాథ్ ఈ నవలలో షెడ్యూల్ జాతుల జీవితం గురించి కళ్ళకు కట్టినట్లు వివరిస్తాడు.

ఒరిస్సా ముఖ్యంగా వ్యవసాయ రాష్ట్రం. 75 శాతం ప్రజలు జీవనాధారం వ్యవసాయమే ఒరిస్సాలో ప్రకృతి వైపరీత్యాలు తరుచుగా వస్తువుంటాయి. ఒక సంవత్సరం తుఫాను బీభత్సం, వరదలైతే మరో సంవత్సరం కరువుకాటకాలు. ఇచ్చట పండే ప్రధాన పంటలు వరి, పప్పుధాన్యాలు, చెరుకు, కొబ్బరి, పసుపు దేశంలో పండే వరిలో 11 శాతం ఈ రాష్ట్రంలో పండుతుంది రాష్ట్రంలో వున్న 87 లక్షలు హెక్టర్ల భూమిలో 20 లక్షల హెక్టర్లలకు నీటి పారుదల సౌకర్యం వుంది.

ఒరిస్సాలో ఖనిజ సంపదకూడా తగినంతగా వుంది. అటవీ సంపద కూడా బాగానే వుంది. 175 పెద్ద మధ్యతరహా పరిశ్రమలు నెలకొని ఉన్నాయి. కేంద్ర ప్రభుత్వ అధీనంలోని రూర్కెలా ఉక్కు ఫ్యాక్టరీ (రూర్కెలా) సొడ్ సముదాయం (ఛత్రపూర్) హెవీ వాటర్ ప్రాజెక్టు (తాల్చెర్) కోచ్ రిపేరింగ్ వర్క్ షాపు (మంచేశ్వర్) అల్యూమినియం కర్మాగారం (కోరాపుట్) కాప్టివ్‌పవర్ ప్లాంట్ (తాల్చెర్) ఎరువుల కర్మాగారం (పరాదీప్) మొదలైనవి చెప్పుకొనదగిన పెద్ద పరిశ్రమలు. ఇంకా ప్రయివేటు రంగంలో 3500 దాకా చిన్నా పెద్ద పరిశ్రమలు నెలకొన్ని వున్నాయి.

ఒరిస్సా జనాభాలో నాలుగోవంతు మంది షెడ్యూలు జాతులని చెప్పుకున్నాంగదా. వీరు ఒరిస్సా పశ్చిమ ప్రాంతంలోని కొండ ప్రాంతాలలో అత్యధికంగా వుంటారు. కోస్తా ప్రాంతంలో పల్చగా వుంటారు. ఆర్యులు ఇక్కడకు రాకముందునుంచి ఈ ఆదివాసులు ఇక్కడ వున్నారు. 62 తెగలుగా వుండే ఈ ఆదివాసుల ఒక్కొక్క తెగకు ఒక్కో సంస్కృతి, సాంప్రదాయం. వీటిలో ముఖ్యమైన తెగలు కొండ, బొండ, గొడబ, కోయ

ఒరిస్సా రాజధాని భువనేశ్వర్ జనాభా 3 లక్షల 50 వేలు. దేవాలయాల నగరం భువనేశ్వర్. ఒకప్పుడైతే ఇక్కడ 700 దేవాలయాలు వుండేవట. ఇప్పుడు 500 దాకా వున్నాయి. ప్రధాన దేవాలయం లింగరాజ ఆలయం. ఇది శివాలయం. అయినా హిందూ దేవుళ్ళ అందరి శిల్పాలు ఇక్కడ చూడవచ్చును. ఈ దేవాలయం 11వ శతాబ్దంలో నిర్మించబడింది. లింగరాజ ఆలయంలో హిందువులకు మాత్రమే ప్రవేశం

వుంది. అయితే ఆలయం ఉత్తర ప్రహరీ వైపున ఒక ప్లాట్‌ఫారం వుంది. ఇచ్చట నుంచి అన్యులు దైవదర్శనం చేసుకోవచ్చు. ఈ ప్లాట్‌ఫారం లోగడ కర్జన్ ప్రభువు లింగరాజ ఆలయ దర్శనానికి వచ్చినప్పుడు కట్టారు 10వ శతాబ్దంలో నిర్మించబడ్డ ముక్తేశ్వర ఆలయం ఒరియా వాస్తు శిల్పానికి ప్రతీక. పంచతంత్రంలోని కథలన్నీ ఒరియా భాషలో ఈ ఆలయంలో చెక్కబడినాయి. 11వ శతాబ్దంలో నిర్మించబడిన మరో ఆలయం రాజా రాణి ఆలయం. ఈ ఆలయం గోడల మీద శృంగారంలో వున్న జంటల బొమ్మలను బహు నైపుణ్యంగా చెక్కారు ఈ ఆలయంలో ఏ దేవతా విగ్రహం వుండదు

భువనేశ్వర్‌లో మూడు చక్కని మ్యూజియంలు వున్నాయి. ఒక మ్యూజియంలో పురాతన కాలపు నాణాలు, రాగి ఫలకాలు, తాళపత్రాలు ఉంటాయి. రెండోది చేతి పనుల మ్యూజియం. దీంట్లో ఒరిస్సాకు చెందిన చేతి పనుల వస్తువులన్నీ చూడవచ్చు. ఇక మూడోదాంట్లో ఆదివాసులకు సంబంధించిన అన్ని విశేషాలు చూడవచ్చును.

భువనేశ్వర్‌కు 8 కి.మీ దూరంలో ధావులి కొండవుంది. ఈ కొండపైనే అశోకుని శిలా శాసనాలు చెక్కబడినాయి. కళింగయుద్ధం, అశోకుడు బౌద్ధమతం స్వీకరించి అహింసామార్గం అవలంబించటానికి ప్రత్యక్ష సాక్షి ఈ ధావులి కొండ. "ప్రజలందరూ నా పిల్లలే" అని అశోకుని ఆనతిపై వ్రాయబడ్డ శాసనం ప్రత్యేకంగా చూడవల్సిన శాసనం. ఈ కొండ మీద నుంచి ఆనాడు దయానది ఒడ్డున భీకర కళింగ యుద్ధం జరిగిన ప్రదేశాన్ని చూడవచ్చును.

భువనేశ్వర్‌కు 62 కి.మీ. దూరంలో సముద్రం ఒడ్డున వుంటుంది. ప్రసిద్ధ పూరీ పట్టణం హిందువుల ముఖ్య పుణ్యక్షేత్రాలలో ఇదొకటి. పూరీ జగన్నాథ ఆలయంలో జగన్నాథుని విగ్రహమేగాక అన్నగారైన బలరాముడు, చెల్లెలు సుభద్ర విగ్రహాలు కూడా వుండటం విశేషం. ఈ దేవాలయం ఎత్తు 65 మీటర్లు. 12వ శతాబ్దంలో నిర్మించబడింది. ఆలయం చతురస్రంగా వుండి గోపురం 58 మీటర్లు వుంటుంది. గోపురంపై సుదర్శన చక్రం వున్న జెండా రెపరెపలాడుతూ వుంటుది. పూరి జగన్నాధుని రధయాత్ర ప్రపంచ ప్రసిద్ధమైనది. ప్రతి సంవత్సరం జూన్, జులై మాసాల్లో జరిగే ఈ రధయాత్రలో పాల్గొనటానికి దేశం నలుమూలలనుంచే గాక ఇతర దేశాల నుంచి కూడా జనం విపరీతంగా వస్తారు. జగన్నాధ రధం ఎత్తు 14 మీటర్లు. రధానికి 16 చక్రాలు వుంటాయి. ఒక్కో చక్రం 2 మీటర్ల ఎత్తున వుంటుంది. ఎన్ని అవాంతరాలు వచ్చినా ప్రతి సంవత్సరం ఈ రధ యాత్ర జరిగితీరాల్సిందే. ఆపటానికి వీల్లేదు. రధం లాగటానికి వృత్తి పరంగా ప్రత్యేకంగా లాగే వాళ్ళు వున్నా లక్షలాది భక్తులు కూడా ఈ రధం లాగటంలో ఎంతో పుణ్యం వుందనే ఉద్దేశ్యంతో లాగటంలో పోటీపడి మరీ లాగుతారు. రధయాత్ర గమ్యం చేరిన తర్వాత అక్కడ 8 రోజులు అట్టిపెట్టి తిరిగి రధాన్ని ఆలయానికి తీసుకువచ్చి ఆ

రధాన్ని ముక్కలు ముక్కలుగా చేస్తారు ఆ ముక్కల్ని కొందరు పవిత్రచిహ్నంగా దాచుకుంటారు అలాగా ప్రతిసంవత్సరం నూతన రధం తయారు కావల్సిందే.

భువనేశ్వర్‌కు 65 కిలోమీటర్లు, పూరీకి 35 కిలోమీటర్ల దూరంలో వుంది కోణార్క సూర్య దేవాలయం సూర్య భగవానుడు ఆకాశమార్గాన 7 గుర్రాల రధంపై పయనిస్తున్న ఆకారంలో రధాకృతిలో కనిపించే ఈ ఆలయం 13వ శతాబ్దంలో నిర్మించబడింది. ఆనాటి ఒరియా కళాకారుల కళానైపుణ్యానికి నిదర్శనం ఈ ఆలయం పునాది 24 రధ చక్రాలపై నిర్మించబడి వుంది ఈ అద్భుత ఆలయాన్ని ఆనాడు 1200 మంది శిల్పులు 12 సంవత్సరాల పాటు నిర్మించారంటే ఈ సూర్య దేవాలయం నిర్మాణం వెనుకనున్న దీక్ష, దక్షత, శ్రమ అర్ధం కాగలదు ఈ దేవాలయం ప్రస్తుతం కొంత శిధిలావస్థలో వుంది

కటక్ పట్టణం మహానది ఒడ్డున వుంది. ఇది ఒకప్పుడు ఒరిస్సాకు రాజధానిగా వుండేది. ప్రస్తుతం వ్యాపార కేంద్రంగా వుంది. చేతితో తయారు చేసిన వస్తువులు ఇక్కడ విరివిగా అమ్ముతారు.

సంబల్‌పూర్‌కు 15 కిలోమీటర్ల దూరంలో మహానదిపై నిర్మించబడిన హీరాకుడ్ డాం ప్రపంచంలో నాలుగవ పెద్ద డాం హీరాకుడ్ జలాశయం వైశాల్యం 964 చదరపు కిలో మీటర్లు.

బాలసోర్‌కు 16 కి.మీ దూరంలో వుండే చాంద్‌పూర్, బెర్హంపూర్‌కు 16 కి.మీ. దూరంలో వుండే గోపాల్‌పూర్‌లలో సుందరమైన బీచ్‌లు వున్నాయి. ఈ రెండు బీచ్‌లకు అనేకమంది టూరిస్టులు విహారార్ధం వస్తూ వుంటారు.

ఒరిస్సాలో ప్రత్యేకంగా భువనేశ్వర్‌లో చైత్రమాసంలో అశోకాష్టమి అనే పండుగ చేసుకొంటారు. ఆ రోజున లింగరాజ విగ్రహాన్ని రధం మీద ఘనంగా ఊరేగింపుతో రామేశ్వర గుడికి తీసుకు వెళ్ళి అక్కడ నాలుగు రోజులు వుంచి తిరిగి యధాస్థానంలోకి తెస్తారు. కార్తీకపౌర్ణమినాడు కటక్‌లో బాలియాత్ర అనే ఉత్సవం చేస్తారు. మహానది ఒడ్డున చేసే ఈ ఉత్సవం పూర్వం ఒరిస్సా నుంచి చిలి, సుమిత్రా, జావా మొదలైన దేశాలకు వెళ్ళిన వారి గుర్తుగా చేస్తారు ఆ రోజున చిన్నపిల్లల దగ్గర నుంచి వృద్ధులు కూడా రంగురంగు కాగితం పడవలను నీళ్ళలో వదులుతారు

ఒరిస్సా ఒడిస్సీ నృత్యానికి ప్రసిద్ది. ఒడిస్సీ నృత్యానికి 2వేల సంవత్సరాల చరిత్ర వుంది. క్రీపూ॥ 2వ శతాబ్దంలోనే ఖరవేలుడు పాలించిన కాలంలోనే ఒడిస్సీ ప్రసిద్ధిపొందినట్లు తార్కాణాలున్నాయి. అసలు ఖరవేలుడు కూడా ఒడిస్సీ నృత్యంలో సిద్ధహస్తుడేనట!

ఒరిస్సా రాష్ట్రాభివృద్ధికి కృషిచేసిన ప్రముఖులలో విశ్వనాధ దాస్, హరే కృష్ణమెహతాబ్, నవ కృష్ణ చౌదరి, నీలమనిరౌత్రాయ్, ఆర్.యన్ సింగ్ దేవ్, బిజూ పట్నాయక్, జె.బి. పట్నాయక్, నందినీశతపధి మొదలైన వారిని చెప్పుకోవచ్చును.

# 6 మహారాష్ట్ర

వైశాల్యం - 307690 చదరపు కిలోమీటర్లు జనాభా - 7 కోట్ల 87 లక్షలు రాజధాని - బొంబాయి వాడుక భాష మరాఠీ. అయినా హిందీ, గుజరాతీ కూడా చాలా మంది మాట్లాడుతారు.

వైశాల్యం జనాభారీత్యా కూడా మహారాష్ట్ర భారతదేశంలో మూడో స్థానంలో వుంటుంది జనాభా రీత్యా ఉత్తరప్రదేశ్, బీహార్ రాష్ట్రాల తర్వాత వైశాల్యం రీత్యా మధ్యప్రదేశ్, రాజస్థాన్ రాష్ట్రాల తర్వాత పెద్ద రాష్ట్రం ఇదే భారతదేశ వైశాల్యంలో మహారాష్ట్ర 9.16 శాతంగా వుంటుంది. వైశాల్యం రీత్యా మహారాష్ట్ర ఆంధ్రప్రదేశ్ కన్నా సుమారు 30వేల చదరపు కిలోమీటర్లు పెద్దదిగాను జనాభారీత్యా సుమారు ఒక కోటి జనాభా ఎక్కువగానూ వుంటుంది

మహారాష్ట్రకు పడమర అరేబియా సముద్రం ఉత్తరంగా మధ్యప్రదేశ్, గుజరాత్‌లు,



ఆగ్నేయంగా ఆంధ్రప్రదేశ్, దక్షిణంగా గోవా, కర్నాటకలు హద్దులుగా వుంటాయి

మహారాష్ట్రకు పడమర 720 కిలోమీటర్ల పొడవు 80 కిలోమీటర్ల వెడల్పు గల కోస్తా ప్రాంతం వుంది ఈ కోస్తా ప్రాంతాన్ని కొంకణ్ అంటారు కొంకణ్ ప్రాంతం బహు సారవంతమైనది. వరి, కొబ్బరి తోటలతో నిండివుంటుంది సముద్రతీరానికి సమాంతరంగా విస్తరించి వున్నవే పశ్చిమ కనుమలు లేక శాయాద్రి పర్వత శ్రేణులు. దట్టమైన అడవులతో నిండి వుంటాయి. పశ్చిమ కనుమలకు తూర్పున వుండే పీఠభూమి కూడా బాగా సారవంతమైనది. రాష్ట్రంలో ఎక్కువ భాగం ఈ పీఠభూమే ఆక్రమించుకొని వుంటుంది గోదావరి, భీమ, కృష్ణా నదుల నీటితో ఈ పీఠభూమిలో ప్రత్తి, చెరకు, నూనె గింజలు విరివిగా పండుతాయి

దక్షిణ భారతదేశంలో పెద్ద నదులైన గోదావరి, కృష్ణల జన్మ స్థలం పశ్చిమ కనుమలే. మహారాష్ట్రంలో కొంతదూరం ప్రవహించి అరేబియా సముద్రంలో కలిసే తపతి నది కూడా జల్గాన్, ధూలే జిల్లాలో ప్రత్తి విరివిగా పండటానికి ఉపకరిస్తుంది. మహారాష్ట్రలో ప్రతి సంవత్సరం 50 సెంటిమీటర్ల నుంచి 75 సెంటీమీటర్ల దాకా వర్షం పడుతుంది. పశ్చిమ కనుమలకు పడమరగా వుండే తానే, రాయ్‌గడ, రత్నగిరి, సింధు దుర్గ జిల్లాలో ఇంకా ఎక్కువగా వర్షాలు పడతాయి. ఒక్కో సంవత్సరం 200 సెంటీ మీటర్ల వర్షం కూడా పడుతుంది

చరిత్ర దృష్టితో చూస్తే మహారాష్ట్రను మూడు భాగాలుగా విభజించవచ్చు. పశ్చిమ మహారాష్ట్ర, విదర్భ, మరాట్వాడా అని. విదర్భ గురించి మహాభారతంలో అనేకసార్లు ప్రస్తావించబడింది. శ్రీ కృష్ణుడ్ని ప్రేమించి పెళ్ళి చేసుకున్న రుక్మిణీ విదర్భ రాకుమారే! క్రీ॥ పూ॥ 3వ శతాబ్దంలో మహారాష్ట్ర మౌర్యసామ్రాజ్యంలో భాగంగా వుండేది. మౌర్య రాజుల పాలనలో ప్రస్తుతం బొంబాయికి చుట్టుపట్ల వున్న సొపర, చౌల్ ప్రదేశాలు బౌద్ధ మత విజ్ఞాన కేంద్రాలుగా వుండేవి

మౌర్య సామ్రాజ్య పతనానంతరం మహారాష్ట్ర వెయ్యి సంవత్సరాల పాటు శాతవాహనులు, వాకాటకులు, చాళుక్యులు, యాదవ రాజవంశాల పాలనలో వుంది. శాతవాహనులు క్రీ॥ శ॥ 2వ శతాబ్దం వరకూ పాలించారు. వీరి తర్వాత యాదవులు పరిపాలనలోకి వచ్చారు. 1294లో యాదవుల పాలన అంతమై ముస్లింల పాలనలోకి వెళ్ళింది మహారాష్ట్ర.

16వ శతాబ్దం చివరలో మహారాష్ట్ర చరిత్రలో శివాజీరాకతో ఒక సువర్ణాధ్యాయం ప్రారంభమయింది. సమర్ధ రామదాసు ప్రబోధాలతో చైతన్యాన్ని నింపుకొని, ఛిన్నాభిన్నంగా నున్న మహారాష్ట్ర ప్రాంతాలన్నింటినీ ఒకటిగా చేసి మహాశక్తి వంతమైన రాజ్యంగా

రూపొందించాడు – ఛత్రపతి శివాజీ శివాజీ మొగల్ చక్రవర్తి ఔరంగజేబును ఎదిరించటమే గాక మధ్య భారతం వరకూ తన అధికారాన్ని విస్తరించుకున్నాడు. శివాజీ తర్వాత వచ్చిన పీష్వాలు కూడా మహారాష్ట్ర రాజ్యాన్ని ఇంకా కొంత విస్తరింప చేశారు. 1761లో జరిగిన పానిపట్ యుద్ధంలో మరాఠా సైన్యాలు ఆఫ్ఘన్ పాలకుడు అహ్మద్ షా చేతిలో ఓడిపోవటంలో మహారాష్ట్ర పరాధీనమయింది 1818లో మహారాష్ట్ర బ్రిటిష్ వారి చేతుల్లోకి వెళ్ళింది.

భారత్‌కు స్వతంత్రం వచ్చిన కొత్తలో మహారాష్ట్ర, గుజరాత్‌లు బొంబాయి రాష్ట్రంగా వుండేవి. 1960లో బొంబాయి రాష్ట్రాన్ని విడదీసి గుజరాత్ మహారాష్ట్ర రాష్ట్రాలుగా ఏర్పరచారు.

మహారాష్ట్ర విధానసభలో 288 మంది సభ్యులు వుంటారు. విధాన పరిషత్ కూడా వుంది. ఈ రాష్ట్రానికి లోక్‌సభలో 48 సీట్లు, రాజ్యసభలో 19 సీట్లు వున్నాయి

మహారాష్ట్ర 31 జిల్లాలుగా విభజించబడి వుంటుంది. అవి – గ్రేటర్ బాంబే, తానే, రాయ్‌ఘడ్, రత్నగిరి, సింధు, దుర్గ, నాసిక్, ధూలే, జల్గాన్, అహమ్మద్‌నగర్, పూనే, సతారా, సాంగ్లి, షోలాపూర్, కొల్లాపూర్, ఔరంగాబాద్, జాల్నా, పార్‌బని, బిద్, నాంధేడ్, ఉస్మాన్ బాద్ లాటూర్, బుల్‌దానా, అకోలా, అమరావతి, యవత్‌మల్, వార్ధా, నాగపూర్, భండ్రా, చంద్రపూర్, గడచిరొలి, బాంబే సుబర్బన్.

మహారాష్ట్ర జనాభాలో 81.5 శాతం హిందువులు, 9.2 శాతం ముస్లింలు, క్రైస్తవులు 1.3 శాతం, మిగతా వారు పార్శీలు, బౌద్ధులు వగైరా. ఈ రాష్ట్రంలో అక్షరాస్యత శాతం 63.

మహారాష్ట్రలో 70 శాతం ప్రజల ప్రధాన వృత్తి వ్యవసాయం. రాష్ట్రంలో వున్న భూమిలో 13 శాతం భూమికి మాత్రమే నీటి పారుదల సౌకర్యం వుంది. ప్రధాన పంటలు గోధుమ, వరి, చెరకు, ప్రత్తి, పప్పు ధాన్యాలు, పొగాకు.

మహారాష్ట్ర పారిశ్రామికంగా బాగా అభివృద్ధి చెందిన రాష్ట్రం. దేశం మొత్తం మీదగల పారిశ్రామిక యూనిట్లలో 12 శాతం ఇక్కడే నెలకొని వున్నాయి. దేశంలో వున్న మొత్తం కార్మికులలో 17 శాతం మంది ఇక్కడే వున్నారు. అంతేగాక దేశం మొత్తం మీద పరిశ్రమలలో పెట్టిన పెట్టుబడులలో 16 శాతం ఇక్కడ పరిశ్రమలలో పెట్టుబడిగా వుండి, దేశం మొత్తం పారిశ్రామిక ఉత్పత్తులలో 23 శాతం ఇక్కడే ఉత్పత్తి అవుతాయంటే ఈ రాష్ట్ర పారిశ్రామకాభివృద్ధిని అర్ధం చేసుకోవచ్చును. మహారాష్ట్రలో మందులు, రసాయనాలు, బట్టలు, ఎలక్ట్రికల్, పెట్రోలియం, ఇనుము ఉక్కుకు సంబంధించిన పరిశ్రమలు లెక్కకు మిక్కిలిగా వున్నాయి. కేంద్ర ప్రభుత్వ ఆధీనంలోని హెచ్.యం.టి.

(ఔరంగాబాద్) హెచ్.ఎ.యల్ (నాసిక్) హిందూస్తాన్ యాంటిబయటిక్స్ (పింప్రి) హిందూస్తాన్ ఆర్గానిక్స్ కెమికల్స్ (రసాయని) రాష్ట్రీయ కెమికల్స్ అండ్ ఫెర్టిలైజర్స్ (ట్రాంబే) మొదలైన ప్రసిద్ధ కంపెనీలు ఇక్కడ స్థాపించబడినాయి ఇంకా బొంబాయిలో రెండు ఆయిల్ రిఫైనరీలు కూడా వున్నాయి. బిర్లా, తాతాల వంటి ప్రముఖ పారిశ్రామిక వేత్తలు, కమలాదేవి వంటి సంఘసేవా పరాయణులు యిక్కడివారే. బాబా ఆటమిక్ కేంద్రం (ట్రాంబే) కూడా ఇచ్చటే వుంది. ప్రభుత్వ కంపెనీలు గాక ప్రవేటు రంగంలో చిన్నా, పెద్దా 37 వేల కంపెనీలు దాకా వున్నాయి. హోమీ బాబా వంటి ప్రపంచ ప్రఖ్యాత అణుశాస్త్రజ్ఞులు ఇక్కడివారే.

మరాఠీ అనే మాట మహారాష్ట్ర అనే మాటను బట్టి వచ్చింది. సుసంపన్నమైన మరాఠీ భాషలో 11వ శతాబ్దం నుంచి 15వ శతాబ్దం వరకూ వచ్చిన సారస్వతం అంతా మత వేదాంత సంబంధమైనది. పైగా ఆ సారస్వతం అంతా పద్యరూపంలోనే వుండేది ఆ రోజుల్లో ముకుందరాజ్‌చే రచించబడిన వివేకసింధు (వేదాంతసాగరం) అనే పద్య కావ్యం మరాఠా భాషలో మొదటి గొప్ప కావ్యంగా పేర్కొనవచ్చును. అయితే ఇదే కాలంలో పద్యరచనలు జన సామాన్యానికి అందుబాటులో వుండవని భావించి వచన రచనలు చేస జన సామ్యానికి అందుబాటులో వున్న రచయితలు కూడా కొద్దిమంది వున్నారు ఈ రచయితలను "మహానుభావులు" అని పిల్చేవారు సామాన్యజనం. ఈ వచన రచయితలు సంస్కృతాన్ని తిరస్కరించి పూర్తిగా మరాఠీ భాషలో మత సంబంధమైన రచనలు సాగించి జనంలోకి చొచ్చుకు పోయారు.

తర్వాత జ్ఞాన దేవుడు హిందూమత మౌఢ్యాన్ని సనాతన వాదాన్ని ఎదిరించి జ్ఞానేశ్వరి (భగవద్గీతావ్యాఖ్యానం) అమృతానుభవ అనే గొప్ప రచనలు చేసి ప్రజల్లో నవ చైతన్యం సృష్టించాడు. మహారాష్ట్ర అంతటా జ్ఞాన దేవుడికి అసంఖ్యాకంగా శిష్యగణం తయారయింది ఇందులో నామ దేవుడు ముఖ్యుడు. వృత్తిరీత్యా దర్జీ వాడైన నామదేవుడు జ్ఞానదేవుడి ప్రబోధంతో గొప్ప కవి అయి ప్రజలకు జ్ఞాన బోధ గావించాడు. నామ దేవుని రచనలు క్రింద కులాల వారిలో అపూర్వ చైతన్యం రేకెత్తించినాయి

మహారాష్ట్ర ముస్లింల పాలన క్రిందకు వెళ్లేసరికి అనేక మంది జనం మతమార్పిడి చేసుకున్నారు. హిందూమతం ఒకింత వెనుకడుగు వేసింది. హిందూ సారస్వతం కూడా వెనుకంజ వేసింది. అయితే ఇదే కాలంలో ఏకనాద్ అనే గొప్ప సంఘ సంస్కర్త వేదాంతి తిరిగి హిందూ సారస్వతానికి ప్రాణం పోసి భావర్త రామాయణం అనే గొప్ప రచన చేసి జనాన్ని మళ్ళీ హిందూ మతం వైపుకు మళ్ళించగలిగాడు. ఇదే కాలంలో జైన మత ప్రభావం కూడా మరాఠీ సారస్వతంపై పడింది.

ముస్లిం పాలన తరువాత ఇంగ్లీషు వారి పాలనలో మరాఠీ భాష మరొక మలుపు తిరిగింది. క్రిస్టియన్ మిషనరీగా వచ్చిన ఫాదర్ సెపెన్స్ (1549-1619) అనే విదేశీయుడు మరాఠీ క్షుణ్ణంగా నేర్చుకొని 'కృష్ణపురాణం' అనే గొప్ప మరాఠీ పద్యకావ్యం వ్రాయటం విశేషం. కృష్ణపురాణాన్ని ఈ నాటికీ మరాఠీలో గొప్ప గ్రంధంగా చెప్పుకొంటారు.

మహాభక్తుడు, కవి, తుకారాం (1608-1649) మరాఠీ భాషపైనే గాక ఆ ప్రజలపై కూడా ఎన్నటికీ చెరగని ముద్ర వేశాడు. పుట్టుకతో శూద్రుడైన తుకారాం కొన్ని వేల భక్తి గీతాలు రచించి ఆ గీతాలతో ప్రజల్ని భక్తి మార్గంలోకి మళ్ళించాడు. తుకారాం పేరు ఈ నాటికీ మహారాష్ట్రలో మారు మోగుతూనే వుంటుంది.

ఆధునిక మరాఠీ సాహిత్య వికాసానికి క్రిష్టియన్ మిషనరీలు కూడా విశేష కృషి చేశాయి. 1840లో మరాఠీలో 'దిగ్ దర్శన్', 'దర్పణ్' అనే పత్రికలు కూడా వెలువడినాయి ఆధునిక మరాఠీ సాహిత్యంలో చెప్పుకోదగినవారు కేల్కర్, హరినారాయణ ఆప్టే, కండేకర్ మొదలైన వారు. కండేకర్ రచించిన 'యయాతి' అనే నవల కు జ్ఞాన పీఠ్ బహుమతి లభించింది. విజయ్ టెండూల్కర్, ధనోల్కర్ కూడా చెప్పుకోదగిన రచయితలు. సానే గురూజీ సుప్రసిద్ధ సాంస్కృతిక చైతన్యం.

మహారాష్ట్ర రాజధాని బొంబాయి దేశంలో ప్రథమ నగరంగా చెప్పుకోవచ్చును. 603 చ.కిలోమీటర్ల వైశాల్యంలో కోటి 29 లక్షలు జనాభాతో కిటకిటలాడే ఈ నగరం భారతదేశపు వాణిజ్య రాజధాని. 17వ శతాబ్దానికి పూర్వం బొంబాయి 7 దీవులుగా వుండేది. పల్లెకార్లు నివసించేవారు. ఈ పల్లెకారుల ఇష్ట దేవత ముంబాదేవి. ఈ దేవత పేరు మీదగానే వచ్చింది బొంబాయి అనే పేరు. తరువాత తరువాత ఈ 7 దీవులను కలుపుతూ వంతెనలు కట్టి నేల చదును చేసి నివాసయోగ్యం చేశారు. నిత్యం అనేక మంది బొంబాయి నగరానికి ఉపాధికోసం వస్తూ వుంటారు. దేశంలోని ప్రధాన కంపెనీల హెడ్డాఫీసులన్నీ ఇక్కడే వుంటాయి. దేశ ఆర్థిక పరిస్థితులకు ప్రతీకగా వుంటుంది బొంబాయి నగరం. అసలు ఇంకొకమాట ఛలోక్తిగా అంటారు - బొంబాయి తుమ్మిందంటే దేశానికి జలుబు చేసిందన్న మాటే అని. విదేశీ వాణిజ్యం సగం పైగా బొంబాయి నగరంలోనే జరుగుతుందంటే వాణిజ్య పరంగా బొంబాయి ప్రాముఖ్యత తెలుసుకోవచ్చును. బొంబాయి నౌకాశ్రయం ప్రపంచంలోని గొప్ప నౌకాశ్రయాల్లో ఒకటి.

వందేళ్ళకు పూర్వం భారతీయ జాతీయ కాంగ్రెసు పుట్టింది బొంబాయి లోనే! దేశంలో కెల్లా మొట్టమొదటి సారిగా రైలు నడిచింది కూడా ఇక్కడే! సర్ఫిరోజ్ షా మెహతా, దాదాభాయ్ నౌరోజీ, లోకమాన్యతిలక్, గోపాలకృష్ణ గోఖలే, గోవింద రెనడే,

డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ వంటి స్వాతంత్ర్య సమరయోధులకు ఆధునిక కాలపు ఎస్.కె. పాటిల్, వై.బి. చవాన్, డాంగే, మసానీ, ఎస్.ఎం. జోషీ, జార్జి ఫెర్నాండెజ్, ఎస్.జి. గోరే, యూసుఫ్ మెహరాలీ వంటి రాజకీయవేత్తలకు జన్మస్థానం మహారాష్ట్ర.

ప్రసిద్ధ పారిశ్రామిక వేత్త సర్ జమ్‌షెడ్జీ టాటా కూడా ఇక్కడివారే. గాంధీజీ 'క్విట్ ఇండియా' ఉద్యమానికి ఈ నగరం నుంచే పిలుపు ఇచ్చారు. మన దేశంలో తయారయ్యే సినిమాలలో సగంపైగా ఇక్కడే తయారవుతాయి. సినిమాల నిర్మాణంలో అమెరికాకు హాలీవుడ్ ఎంతో భారత్‌కు బొంబాయి అంత.

ఇంతటి ప్రాముఖ్యం కల్గిన బొంబాయిలో చూడదగిన ప్రదేశాలు కూడా అనేకం. ప్రసిద్ధి చెందిన 'గేట్ వే ఆఫ్ ఇండియా' 1927 లో సముద్రం ఒడ్డున నిర్మించారు. బ్రిటిష్ చక్రవర్తి 5వ జార్జి 1911లో బొంబాయి సందర్శించిన సందర్భంగా ఈ బ్రహ్మాండమైన కట్టడాన్ని నిర్మించారు. మనకు స్వతంత్రం వచ్చిన తరువాత బ్రిటిష్ సైన్యానికి ఇక్కడి నుంచే వీడ్కోలు చెప్పారు. ఫ్లోరా ఫౌంటన్ (మహాత్మా చౌక్) అయిదు రాస్తాలు కలిసే కూడలి. ప్రసిద్ధ వాణిజ్య కేంద్రం, బ్యాంకులు, కంపెనీల కార్యాలయాలు ఇక్కడే వుంటాయి. విక్టోరియా టెర్మినస్ గొప్ప రైల్వే కూడలి. నిత్యం లక్షలాది రైలు ప్రయాణీకులతో కళకళలాడుతూ వుంటుంది. మెరీన్ డ్రైవ్ (నేతాజీ సుభాష్ రోడ్) నారిమన్ పాయింట్ నుంచి మొదలై చౌపతి బీచ్ మీదుగా మలబార్ హిల్స్ వరకూ వెళుతుంది. ఈ ప్రదేశాన్ని "రాణిగారి మణిహారం" గా కూడా వ్యవహరిస్తారు. చాలా విలువైన ప్రాంతం. చౌపతి బీచ్ ప్రసిద్ధ బీచేగాక పెద్ద పెద్ద బహిరంగ సభలు ఇక్కడ జరుగుతూ వుంటాయి. ఇక్కడ తిలక్, సర్దార్ పటేల్ విగ్రహాలు కూడా వున్నాయి. హాంగింగ్ గార్డెన్స్ (ఫిరోజ్ షా మెహతా గార్డెన్స్) 1881లో మలబార్ హిల్స్‌లో ఏర్పాటు చేయబడినాయి. ఈ హాంగింగ్ గార్డెన్స్‌లో పొదలను జంతువులు, పక్షుల ఆకారంలో ఏర్పాటు చేయటం విశేషం. ఈ మలబార్ హిల్స్ నుండే బొంబాయి నగరానికి నీటి సరఫరా అవుతుంది. మలబార్ హిల్స్ మీద పార్శీల శ్మశాన వాటిక (దోక్మా) వుంది. ఇక్కడ పార్శీ వారు చనిపోయిన వారి శవాన్ని గద్దలకు ఆహారంగా వదిలేస్తారు. ఆ విధంగా చేయటం వలన వారు పవిత్రంగా చూసుకునే భూమి, నీరు, వాయువు అగ్ని కలుషితం కాదని వారి నమ్మకం. ఈ ప్రాంతాన్ని 'టవర్ ఆఫ్ సైలెన్స్' అంటారు. జుహుబీచ్ సుందరమైన బీచ్. సినిమా ప్రముఖుల భవంతులు అనేకం ఈ బీచ్‌కు దగ్గరలో వుంటాయి.

మణిభవన్ (గాంధీ స్మారక భవన్) గాంధీజీ బొంబాయి వచ్చినప్పుడల్లా ఇక్కడే వుండేవారు. గాంధీజీ సాహిత్యం చిత్రాలతో ఇక్కడొక ప్రదర్శన ఏర్పాటు చేశారు. ఇంకా బొంబాయిలో నెహ్రూ ప్లానిటోరియం, ప్రిన్స్ ఆఫ్ వేల్స్ మ్యూజియం, జహంగీర్ ఆర్ట్ గ్యాలరీ, కమలా నెహ్రూ పార్క్, కల్బాదేవి, సెయింట్ థామస్ కాథడ్రెల్, మహాలక్ష్మి

ఆలయం, ముంబాదేవి ఆలయం, క్రాఫర్డ్ మార్కెట్ మొదలైనవి చూడదగిన ప్రదేశాలు.

గేట్ వే ఆఫ్ ఇండియాకు 10 కిలో మీటర్ల దూరంలో సముద్రంలో ఉంటుంది ఎలిఫెంటా దీవి ఈ దీవిలో కొండలను తొల్చి ఆలయాలుగా నిర్మించటం విశేషం. ఇక్కడ వున్న 7 దేవాలయాలు శివుని పేరుమీదుగానే నిర్మించబడినవే. ఇవి 4, 9 శతాబ్దాల మధ్యాకాలంలో నిర్మించబడినవని చెబుతారు

ప్రపంచ ప్రసిద్ధి గాంచిన అజంతా గుహలు ఔరంగాబాద్‌కు 105 కిలోమీటర్ల దూరంలోను ఎల్లోరా గుహలు 30 కిలోమీటర్ల దూరంలోను వుంటాయి. బౌద్ధ జాతక కథలు వివరించే వర్ణ చిత్రాలతో నిండిన ఈ అజంతా గుహలను క్రీ॥ పూ॥ 2వ శతాబ్దంలో చెక్కబడినవని చెబుతారు. మొత్తం 30 గుహలలో ఫ్రెస్కో పెయింటింగ్స్‌తో చిత్రించబడిన ఈ గుహలు ఆనాటి చిత్రకారుల కళానైపుణ్యాన్ని ప్రపంచానికి చాటి చెబుతాయి. ఔరంగాబాద్‌కు 30 కిలోమీటర్ల దూరంలో వుండే ఎల్లోరా గుహలు మొత్తం 34. ఈ గుహల్లో హిందూ, బౌద్ధ, జైన దేవాలయాలు చెక్కబడినాయి. వీటిల్లో 12 బౌద్ధాలయాలు, 17 హిందూ దేవాలయాలు, 5 జైన దేవాలయాలు, ఇవి క్రీ॥ శ॥ 4, 6 శతాబ్దాల మధ్య కాలంలో చెక్కబడినవని చెబుతారు. అజంతా ఎల్లోరా గుహల కళానైపుణ్యాల్ని దర్శించటానికి ప్రపంచం నలుమూలలనుంచి యాత్రీకులు విశేషంగా వస్తారు.

ఔరంగాబాద్‌కు 12 కిలోమీటర్ల దూరంలో దౌలతాబాద్ వుంటుంది. 11వ శతాబ్దంలో ఇచ్చట యాదవ రాజులు భూగర్భ సొరంగాలు, కందకాలతో దుర్భేద్యమైన కోట నిర్మించారు. లోగడ దీన్ని దేవగిరి అనేవారు 1294లో అల్లాఉద్దీన్ ఖిల్జీ దీన్ని వశం చేసుకున్నాడు. చరిత్రలో పిచ్చి తుగ్లక్‌గా పేరొందిన మహ్మద్ బిన్ తుగ్లక్ తన రాజధానిని ఢిల్లీ నుంచి ఇచ్చటకు మార్చి దేవగిరిని దౌలతాబాద్ గా మార్చాడు.

ఇంకా మహారాష్ట్రలో ముఖ్యంగా చెప్పుకోదగిన ప్రదేశాలు - పూణే. ఈ పట్టణాన్ని లోగడ పూనా అనేవారు. ఛత్రపతి శివాజీకి ఆ తర్వాత పీష్వాలకు రాజధానిగా వుండేది. బాలగంగాధర తిలక్ జన్మస్థలం ఇదే. బొంబాయికి 110 కిలోమీటర్ల దూరంలో వుంటుంది. విద్యాసాంస్కృతికి రంగాలకు నిలయం. పూణెలో సైనిక స్థావరాలే గాక సైన్యానికి సంబంధించిన డిఫెన్స్ ఎకాడమీ, మిలటరీ ఇంజనీరింగ్, వైద్యకళాశాలలు కూడా వున్నాయి. ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్ కూడా ఇక్కడ వుంది. పూణెకు సమీపంలో వున్న "దేహు" భక్త తుకారాం జన్మ స్థలం.

పూణెకు 120 కి॥ మీ॥ దూరంలో పశ్చిమ కనుమలలో మహాబలేశ్వర్ వుంటుంది. బ్రిటిష్ వారి పాలనలో బొంబాయికి వేసవి రాజధానిగా వుండేది. కృష్ణానది జన్మస్థలం ఇక్కడే. మహాబలేశ్వర్‌కు 20 కిలోమీటర్ల దూరంలో ప్రతాప్ ఘర్ కోట వుంది. శివాజీ చే నిర్మించబడింది ఈ కోట. ఇచ్చట శివాజీ ఆరాధ్య దేవత భవానీ ఆలయం కూడా

వుంది పూణె బేల్గాం దారిలో సజ్జన్ ఘడ్ వుంటుంది. వీర శివాజీకి ఆధ్యాత్మిక గురువు సమర్ధ రామదాసు నివసించిన ప్రదేశం శివాజీ చే ఉపయోగించబడిన రకరకాల ఆయుధాలు ఇచ్చట భద్రపర్చబడినాయి.

కొల్హాపూర్ ఒకప్పుడు మరాఠా రాజ్యానికి రాజధానిగా వుండేది ఇక్కడ బౌద్ధమత అవశేషాలు కూడా ఎన్నో కానవస్తాయి

పూణెకు 80 కిలోమీటర్ల దూరం వుండే అహమ్మద్ నగర్ చరిత్ర కల్గిన నగరం మొగల్ చక్రవర్తి ఔరంగజేబు ఇచ్చటనే మరణించాడు 1550లో నిజాం షాహి ప్రభువులచే నిర్మించంబడిన కోట ఒకటి వుంది. ఇచ్చటనే మన ప్రధమ ప్రధానమంత్రి పండిట్ నెహ్రూను బ్రిటిష్ వారు కొన్నాళ్ళు చెరసాలలో పెట్టారు

బొంబాయికి 185 కిలోమీటర్ల దూరంలో వుంటుంది నాసిక్. ఇక్కడే రామాయణ కాలంలో లక్ష్మణుడు శూర్పణఖ ముక్కు చెవులు కోశాడని అందువలనే ఈ పేరు వచ్చిందని చెబుతారు. నాసిక్ హిందూవులకు పుణ్యక్షేత్రం. భారత ప్రభుత్వ సెక్యూరిటీ ప్రెస్ ఇక్కడ వుంది మనం ఉపయోగించే నాణాలు కరెన్సీ ఇచ్చటనే ముద్రించబడతాయి. నాసిక్ వద్ద గోదావరి చిన్న కాలవగా ప్రవహిస్తుంది. నాసిక్‌కు 30 కిలోమీటర్ల దూరంలో త్ర్యయంబకం వుంటుంది. ఇచ్చటనే గోదావరి నది పుట్టింది.

నాగాపూర్ ఒకప్పుడు మధ్యప్రదేశ్‌కు రాజధానిగా వుండేది. బౌగోళికంగా భారతదేశానికి ఖచ్చితంగా మధ్యన వుంటుంది ఈ పట్టణం. నాగపూర్‌కు 80 కిలోమీటర్ల దూరంలో వుండే సేవాగ్రాం (వార్ధా) అనగానే మహాత్మా గాంధీ గుర్తుకు వస్తారు. 1933లో ఇచ్చట బాపూజీ ఆశ్రమం ఏర్పరచారు. ఈ ఆశ్రమమంలోనే ఆనాడు అనేక ముఖ్యమైన రాజకీయ నిర్ణయాలు గైకొనబడ్డాయి. దీనికి దగ్గరలోనే బాపూజీ ముఖ్య శిష్యుడు వినోభావే ఏర్పర్చిన పౌనార్ ఆశ్రమం వుంది.

మహారాష్ట్ర ప్రజలు ముఖ్యంగా చేసుకునే పండుగలు గణేష్ చతుర్థి, హెూళీ, దీపావళి, దసరా. గణేశ్ ఉత్సవాల ద్వారా తిలక్ మహాశయుడు అద్భుతమైన సామాజిక చైతన్యాన్ని సృష్టించగలిగాడు. ఇవిగాక ఇంకా 'నారియల్ పూర్ణిమ' అనే పండుగను ఆగష్టులో చేసుకొంటారు. జీవనోపాధి కోసం సముద్రం మీద ఆధారపడిన పల్లెకార్లు, నౌకా వ్యాపారస్తులు సముద్ర దేవుడికి కొబ్బరి కాయలు కొట్టి ప్రార్థించుకొంటారు. మహారాష్ట్ర వీరుడు శివాజీ జయంతిని కూడా వారు ఘనంగా జరుపుకొంటారు. పార్శీ ప్రజలు ఆగస్టులో "పటేటి" అనే పండుగను చేసుకొంటారు. పర్షియా నుంచి ఇండియాకు వచ్చి వారు వచ్చిన గుర్తుగా ఈ పండుగను చేసుకొంటారు.

వివిధ రంగాలలో అనేక మంది ప్రముఖులకు జన్మస్థలం మహారాష్ట్ర. రాజకీయంగా చూస్తే వై.బి.చవాన్, యస్.ఏ. డాంగే, యస్.కె. పాటిల్, యం.ఆర్.మసాని యస్.బి.చవాన్ మొదలైన వారు ఇక్కడివారే.

# 7 గోవా

వైశాల్యం - 3702 చదరపు కిలోమీటర్లు. జనాభా - 11 లక్షల 68వేలు రాజధాని। పనాజి మాట్లాడే భాషలు - కొంకణి, మరాఠీ

గోవా మహారాష్ట్ర, కర్నాటక రాష్ట్రాల సరిహద్దున వుంటుంది. గోవాకు పశ్చిమాన అరేబియా సముద్రం, దక్షిణం, తూర్పున కర్నాటక, ఉత్తరాన మహారాష్ట్ర వుంటాయి.

1987లో భారతదేశంలో 25వ రాష్ట్రంగా అవతరించిన గోవా చిన్న రాష్ట్రం. వైశాల్యం రీత్యా చూస్తే గోవా కృష్ణాజిల్లాలో సగం కన్నా ఇంకా తక్కువగా వుంటుంది రంగారెడ్డి జిల్లాతో పోల్చితే సగంగా మాత్రమే వుంటుంది. గోవా రాష్ట్రం పొడవు 105 కిలోమీటర్లు, వెడల్పు 65 కిలోమీటర్లు వుంటుంది.




గోవా చిన్న రాష్ట్రమైనా సుదీర్ఘ చరిత్రే వుంది. క్రీస్తుకు చాలా పూర్వం ఇచ్చట ఆదివాసులు వుండేవారు. ఆ తర్వాత ఉత్తరాది నుంచి ఆర్యులు వచ్చారు. పూర్వకాలంలో గోవాను 'గోమంత' అనేవారు. భారతం భీష్మ పర్వంలో గోమంత పేరు ప్రస్తావించబడింది. క్రీ॥ పూ॥ 3వ శతాబ్దంలో గోవా మౌర్య సామ్రాజ్యంలో భాగంగా వుండేది. తర్వాత బాదామి చాళుక్యులు గోవాను పరిపాలించారు. ఆ తర్వాత శాతవాహనులు. కదంబులు, యాదవులు వరుసగా ఈ ప్రాంతంపై ఆధిపత్యం వహించారు. లోగడ గోవాను గౌబా, గోపపురం అని కూడా పిల్చేవారు. క్రీ॥శ॥ 6,7 శతాబ్దాల నుంచి గోవాకు అరేబియా, ఐరోపా దేశాలతో వర్తక సంబంధాలు వుండేవి. 1312లో గోవా మహమ్మదీయుల చేతుల్లోకి వెళ్ళింది. అయితే విజయనగర రాజులు ముస్లిం పాలకుల నుంచి గోవాను

తమ వశం చేసుకున్నారు వంద సంవత్సరాలు విజయనగర రాజులు గోవాను తమ పాలనలో వుంచుకోగలిగారు తర్వాత గోవా బాదామి సుల్తానుల చేతుల్లోకి వెళ్ళింది. బీజపూర్‌సుల్తాన్‌తో ఘోర సంగ్రామం చేసి పోర్చుగీసు వారు గోవాను ఆక్రమించుకున్నారు. ఈ సంగ్రామంలో ఇరు పక్షాల వారు అనేక వేలమంది చనిపోయారు బీజపూర్ సుల్తాన్ అదిల్ షా ఆనాడు ఉపయోగించిన బ్రహ్మాండమైన ఫిరంగి ఈనాటికీ పనాజిలో వుంది

పోర్చుగీసువారు గోవాను తమ సామ్రాజ్యంలో 'ఆణిముత్యం'గా పిల్చేవారు గ్రాహం గ్రీన్‌లాంటి పాశ్చాత్య ప్రముఖులు గోవాను "సుందర ప్రదేశంగా చీకు చింతలన్నీ పారద్రోలే ఆహ్లాదకరమైన ప్రాంతంగా వర్ణించారు. 1510లో పోర్చుగీసువారి క్రిందకు వెళ్ళిన గోవా 1961 వరకూ వారి క్రిందనే వుంది. పోర్చుగీసువారు మొదట్లో పాత గోవాను తమ కార్యస్థానంగా చేసుకున్నారు. అయితే పాత గోవాలో తరచు అంటువ్యాధులు ప్రబలటంలో పనాజిని రాజధానిగా చేశారు. భారత దేశానికి 1947లో స్వతంత్రం వచ్చినా గోవాకు మాత్రం 1961లో లభించింది.

1961 నుంచి గోవా, డయ్యు డామన్‌లు కేంద్రపాలిత ప్రాంతాలుగా వుండేవి. ప్రజాభిప్రాయ సేకరణ ప్రకారం 1987లో గోవా ప్రత్యేక రాష్ట్రంగా అవతరించగా డయ్యు డామన్ కేంద్రపాలిత ప్రాంతంగా మిగిలిపోయింది.

గోవా ఉత్తర గోవా, దక్షిణ గోవా అని రెండే రెండు జిల్లాలుగా విభజించబడి వుంటుంది. రాజధాని పనాజిగాక మిగతా ముఖ్య పట్టణాలు మపూక, మార్మగోవా, ఓటల్, చౌరి, కోడల్, గోవాలో విధానసభ ఒకటే వుంటుంది. 40 మంది శాసన సభ్యులు. గోవాలో 2 లోక్‌సభ సీట్లు రాజధాని పనాజిలో గోవా యూనివర్శిటి వుంది.

గోవాలో ముఖ్య నదులు టెరాకల్, చపోరా, మండోవి, జువారి. ఈ నదుల ద్వారా 250 కిలోమీటర్లు చక్కటి జలమార్గం వుంది. గోవా నుంచి ప్రధానంగా ఎగుమతి అయ్యే ఇనుము, మాంగనీసు ఈ నదుల ద్వారానే మార్మగోవా రేవుకు చేరతాయి. తూర్పు గోవా ప్రాంతం అంతా కొండలుతో నిండి వుంటుంది. గోవా విస్తీర్ణంలో మూడో వంతు అడవులు, తూర్పు పశ్చిమ తీరాలను కలుపుతూ పూర్వం మచిలీపట్నం నుంచి మార్మగోవా వరకు మీటరుగేజి రైలు మార్గం ఉండేది.

గోవా అంతా చక్కటి వాతావరణం కలిగి వుంటుంది. కొబ్బరి, మామిడి, వరి పొలాలతో గోవా కళకళలాడుతూ వుంటుంది. సంవత్సరంలో 3200 మిల్లీమీటర్ల వర్షం జూన్ నుంచి సెప్టెంబరు వరకు పడుతుంది వేసవిలో కూడా పెద్దగా ఉష్ణోగ్రత వుండదు. గోవాలో ప్రధాన పంట వరి. చేపల వేట కూడా ప్రజల ప్రధాన వృత్తి. 105 కిలోమీటర్లు కోస్తా కల్గిన గోవా చేపల వేటకు అనువుగా వుంటుంది. 30వేల టన్నుల వరి

పండుతుంది. సాలీనా 60వేల టన్నుల చేపల పడతారు. ఇంకా గోధుమ, రాగులు, కొబ్బరి కాయలు కూడా బాగా పండుతాయి

గోవా నుంచి జపాన్‌కు ఇనుము ఎగుమతి అవుతూ వుంటుంది. ఏటా కోటిన్నర టన్నులు పైగా ఇనుము జపాన్‌కు ఎగుమతి అవుతుంది. గోవాలో 12 పెద్ద పరిశ్రమలు, 11 మధ్యతరహా పరిశ్రమలు నెలకొని వున్నాయి అతి చిన్న పరిశ్రమలు 3500 దాకా వున్నాయి.

దేశంలో పంజాబ్ తర్వాత గోవాలోనే ప్రజల తలసరి ఆదాయం ఎక్కువ. అక్షరాస్యత కూడా ఎక్కువే 75 శాతం మంది చదవనూ, వ్రాయనూ వచ్చినవారే. గోవా జనాభాలో 66 శాతం మంది హిందువులు, క్రైస్తవులు 30 శాతం, మిగతావారు ముస్లింలు తదితరులు.

కొంకణి భాష హిందీకి మరాఠీకి దగ్గరగా వుంటుంది దేవనాగరి లిపి ఎక్కువ మంది వాడతారు. గోవాను పోర్చుగీసువారు జయించక ముందు కొంకణి భాష, సారస్వతం ఎక్కువ ప్రచారంలో వున్నట్లు కానవచ్చినా ఆనాటి సాహిత్యం ఏదీ ప్రస్తుతం లభ్యం కావటం లేదు. 16వ శతాబ్దంలో కృష్ణదాస్ శర్మ మరాఠీ రామాయణ, భారతాల్ని కొంకణిలోకి తర్జుమా చేయటమే కొంకణి సాహిత్యానికి మొదలుగా చెప్పాలి పోర్చుగీసు పాలన మూలంగా గోవాలో క్రైస్తవ సాహిత్యం విరివిగా ప్రచారంలోకి వచ్చింది. 18వ శతాబ్దంలో ఫాదర్ మిరండా కొంకణి భాషలో 'క్రీస్తు పునరుద్ధానం' అనే రచన చేశాడు. డోనా బారెట్టా అనే మరో క్రైస్తవుడు కొంకణి భాషలో "పాపుల రక్షకుడు" అనే పుస్తకం కూడా వ్రాశాడు. ఆధునిక కాలంలో చెప్పదగిన రచయితలు షెనాయ్ గోయంబాచ్, యం. సర్దేశాయ్, రెజినాల్డో ఫెర్నాండెజ్, జె వి. సాల్దానా మొదలైనవారు.

గోవా అనగానే విహారయాత్రలు గుర్తుకు వస్తాయి. అందమైన బీచ్‌లు, ఆహ్లాదకరమైన వాతావరణంతో టూరిస్టుల స్వర్గంగా ఇది ప్రసిద్ధి చెందింది. గోవా జనాభా 12 లక్షలైతే అచ్చటకు విహారయాత్రకు వచ్చేవారు సాలీనా 10 లక్షల మందిదాకా వుంటారంటే గోవా టూరిస్టులకు ఎంత ప్రియమైనదో ఆలోచించవచ్చు. ఇందులో విదేశీయాత్రికులు 2 లక్షల దాకా వుంటారు. 105 కిలోమీటర్ల కోస్తా తీరం వున్న గోవాలో అనేక బీచ్‌లు వున్నాయి. ఇందులో కొన్ని ప్రపంచ ప్రసిద్ధి పొందినాయి. మిరామర్, వగటోర్, అంజున్, కలన్‌గూటి ఇవి ఉత్తర గోవాలోని బీచ్‌లు, మగోర్డా, కోల్వా, బీటుల్ ఇవి దక్షిణ గోవాలోని వివిధ బీచ్‌లు.

విదేశీ పర్యాటకులను విశేషంగా ఆకర్షించే ఈ బీచ్‌లు విచ్చలవిడితనానికి కూడ

అపఖ్యాతి పొందినై. మార్జువానా మత్తులో తేలిపోతూ వళ్ళు మరిచి ప్రవర్తించే హిప్పీలు ఒకప్పుడీ బీచ్‌లను 'పావనం' చేస్తుండేవారు వీరి స్వైర విహారాలను తిలకించటానికి భారతీయులు గోవా వెళ్తుండేవారు ఇపుడిపుడే ఈ కంగాళీ అంతా కొంత తగ్గు తున్నట్లున్నది.

గోవాకు విమాన నౌకామార్గాలు అనేకం వున్నాయి బెంగుళూర్, బాంబే, కొచ్చిన్, ఢిల్లీల నుంచి గోవాలోని డబోలిమ్ విమానాశ్రయానికి విమానాలు తిరుగుతూ వుంటాయి. హైదరాబాద్ నుంచి వాయుదూత్ సర్వీసు కూడా ఉంది. గోవా చూడటానికి సంవత్సరంలో ఏ రోజుల్లోనైనా బాగా వున్నా నవంబరు నుంచి ఫిబ్రవరి వరకూ గోవా పర్యటనకు మిక్కిలి అనువైన సమయం ఈ సమయంలో ఎక్కువ మంది యాత్రీకులు ఇచ్చటకు వస్తారు.

గోవా చిన్న రాష్ట్రమైనట్లే దాని ముఖ్యపట్టణం కూడా చిన్న పట్టణమే. 1843 నుంచి పనాజి గోవా రాజధానిగా వుంటోంది. పనాజిలో పోర్చుగీసు సంస్కృతి బాగా కానవస్తుంది. రోడ్లు ఇరుకుగా వుంటాయి. పోర్చుగీసువారు కట్టిన కట్టడాలు వారి సంస్కృతి సాంప్రదాయాలకు అద్దంపడతాయి. మండోవి నది ఒడ్డున వుంటుంది పనాజి. ఇచ్చట ముఖ్యమైన చారిత్రక కట్టడం బిజాపూర్ సుల్తాన్ అదిల్‌షా భవంతి. గోవా వైస్రాయిలు దీనిలో నివసించేవారు. ఇప్పుడు ఈ భవంతి గోవా సచివాలయంగా వుంది. దీనికి దగ్గరగా దేశభక్తుడు, విప్లవవీరుడు, హిప్నటిస్టు అబ్బే ఫారియా విగ్రహం వుంది. అబ్బే ఫారియా ఒక స్త్రీని హిప్నటైజ్ చేస్తున్నట్లుగా ఆ విగ్రహం వుంటుంది. అబ్బేఫారియా గోవా స్వతంత్రం కోసం పోరాడిన విప్లవయోధులలో ప్రథముడు. అబ్బే ఫారియా పోర్చుగీసు పాలనను అంతమొందించటానికి టిప్పు సుల్తాన్‌తో కలిసి ఒక పథకం రూపొందించాడు. గోవాను రిపబ్లిక్‌గా ఏర్పాటు చేయాలని ఆ విప్లవ వీరుని సదాశయం. కాని ఈ పథకం ముందుగానే పోర్చుగీసు వారికి తెలిసిపోవటంతో అబ్బే ఫారియా లిస్బన్ (పోర్చుగీసు రాజధాని) నుంచి పారిపోయి పారిస్‌లో తలదాచుకున్నాడు. అలెగ్జాండర్ డ్యూమస్ రచించిన ప్రసిద్ధ గ్రంథం "కౌంట్ ఆఫ్ మాంటిక్రిస్టో"లో ఫారియాను ప్రస్తావించటం జరిగిందంటే ఆనాటి మేధావులపై అబ్బే ఫారియా ప్రభావం ఎంతటిదో ఊహించుకోవచ్చు.

పనాజిలో మహాలక్ష్మి దేవాలయం చెప్పుకోదగినది. పనాజి చర్చి కూడా ప్రసిద్ధమైనదే. చర్చిమీద నుంచి చూస్తే పనాజి పట్టణం అంతా కనిపిస్తుంది. పనాజి దగ్గరలో వుంటాయి మిరామర్, డోనాపవులా బీచ్‌లు. మిరామర్‌ను గోపర్ డయాస్ అని కూడా పిలుస్తారు. ఈ బీచ్ దగ్గర మండోవి నది అరేబియా సముద్రంలో కలుస్తుంది. రోడ్డు మార్గంలో పనాజి బొంబాయికి 590 కిలోమీటర్లు, బెల్గాంకు 157 కిలోమీటర్లు

దూరంలో వుంటుంది. పాశ్చాత్య తరహా హోటళ్ళు, భారతీయ హోటళ్ళు చాలా వున్నాయి ఇక్కడ

పాత గోవాలో ముఖ్యంగా చెప్పుకోదగిన ప్రదేశాలు ఆగుడాకోట, బామ్ జీసెస్ చర్చి ఆగుడాకోట 16వ శతాబ్దంలో పోర్చుగీసు వారిచే నిర్మించబడిన బ్రహ్మాండమైన కోట. మండోవివి నదీ ద్వారంలో నిర్మించబడిన ఈ కోట పనాజికి 15 కిలోమీటర్ల దూరంలో వుంటుంది. ఈ కోట మీది నుంచి చూస్తే అరేబియా సముద్రం, మండోవివి నది దర్శించవచ్చు. ఈ కోటలో లోగడ అనేకమంది గోవా విప్లవ వీరులను బంధించారు ప్రస్తుతం ఈ కోట అన్ని సదుపాయాలతో ఒక విశ్రాంతి కేంద్రంగా ఏర్పాటు చేశారు.

బామ్ జీసెస్ చర్చి భారతదేశంలోనే పురాతనమైన చర్చిగా చెబుతారు అపురూప కళాసంపదతో అలరారే ఈ చర్చి ఇటలీ నుంచి తెప్పించిన పాలరాతితో నిర్మించబడింది ఈ చర్చి సందర్శించటానికి దేశ దేశాల నుంచి క్రైస్తవులు వస్తారు. ఈ చర్చిలో క్రైస్తవులకు పరమ పూజ్యుడైన సెయింట్ ఫ్రాన్సిస్ జావియర్ భౌతిక కాయం భద్రపర్చబడింది. 1552లో సెయింట్ ఫ్రాన్సిస్ జావియర్ చైనాలో చనిపోతే వారి భౌతిక కాయాన్ని ఇక్కడకు తెచ్చి ప్రత్యేక ఏర్పాట్లతో భద్రపర్చారు. సెయింట్ ఫ్రాన్సిస్ భౌతిక కాయాన్ని లోగడ ప్రతి పది సంవత్సరాలకు ఒకసారి భక్తుల దర్శనార్థం ప్రదర్శించేవారు. ఇప్పుడు మాత్రం అలా చేయటం లేదు. సెయింట్ ఫ్రాన్సిస్ జ్ఞాపకార్థం డిసెంబరు 3వ తేదీన గోవా క్రైస్తవులు ఒక పండుగ చేసుకుంటారు. పాతగోవాలో పాండా పట్టణంలో శివాలయం, (మంగేషి ఆలయం) శాంత దుర్గ ఆలయాలు వున్నాయి గోవాలోని సప్త కోటీశ్వర ఆలయం అతి ప్రాచీన ఆలయంగా చెబుతారు ఈ దేవాలయాన్ని కదంబ రాజులు నిర్మించగా శివాజీ మహరాజ్ దాన్ని పునర్నిర్మించాడట

గోవాలో ప్రసిద్ధ మసీదులు కూడా వున్నాయి. 1683లో మొగల్ చక్రవర్తి ఔరంగ జేబు కుమారుడు అక్బర్ రాకుమారుడు మరాఠా పాలకుడు శంభాజీ కలిసి పోర్చుగీసు వారితో పోరాడిన గుర్తుగా చీచోలిం కొండపై 'నమాజ్‌ఘ' మసీదు నిర్మించారు ఆ తర్వాత సంగెంలో జుమా మసీదు కూడా నిర్మించబడింది. ఈ జుమా మసీదు చూడ చక్కని సుందర కట్టడం.

మార్గోవా ఇప్పటికీ పోర్చుగీసు వైభవానికి నిదర్శనంగా వారి సంస్కృతీ సాంప్రదాయాలు వెదజల్లుతూ వుంటుంది. మార్గోవాకు దగ్గరలోనే ప్రసిద్ధ కోల్వాబీచ్ వుంది.

పనాజికి 13 కిలోమీటర్ల దూరంలో మపుసా పట్టణం వుంది. ప్రతి శుక్రవారం

ఇక్కడ గొప్ప సంత జరుగుతుంది మార్మోవా నౌకాశ్రయానికి 4 కిలోమీటర్ల దూరంలో వుండే వాస్కోడిగామా (శంబాజీనగర్) చూడవల్సిన పట్టణం

గోవా ప్రజలు మిగతా దేశంలో మాదిరిగానే వినాయకచవితి, దీపావళి, హోళీ పండుగలు ఉత్సాహంగా చేసుకుంటారు క్రైస్తవులు క్రిస్టమస్, ఈస్టర్ పండుగలను చేసుకుంటారు ఏప్రిల్‌లో క్రైస్తవులు 'కార్నివాల్' అనే గొప్ప ఉత్సవాన్ని చేసుకుంటారు రంగు రంగుల దుస్తులు ధరించి సంగీత నృత్యాలతో ఈ కార్నివాల్ ఉత్సవాన్ని మూడు రోజులు జరుపుకుంటారు ఇవిగాక ఇంకా స్థానికంగా జాతర్లు కొన్ని జరుపు కుంటారు

# 8 మధ్యప్రదేశ్

వైశాల్యం -443446 చదరపు కిలోమీటర్లు, జనాభా 6 కోట్ల 61 లక్షలు రాజధాని - భోపాల్, వాడుక భాష - హిందీ

భారతదేశానికి సరిగ్గా మధ్యన ఉండేది, మధ్యప్రదేశ్, అందువలనే దానికి ఆ పేరు వచ్చింది. లోగడ మధ్య భారత్, భోపాల్, వింధ్యప్రదేశ్, మహాకోసల్‌గా పిలవబడే ప్రాంతాలను కలిపి 1956లో రాష్ట్రాల పునర్విభజన చట్టం క్రింద మధ్య ప్రదేశ్‌గా ఏర్పరిచారు.

మధ్యప్రదేశ్‌కు ఉత్తరాన ఉత్తరప్రదేశ్ పడమర గుజరాత్, రాజస్తాన్, దక్షిణం



మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్, తూర్పున బీహార్, ఒరిస్సాలు సరిహద్దులుగా వుంటాయి

మధ్యప్రదేశ్ మన రాష్ట్రాలన్నింటిలోకి వైశాల్యం రీత్యా అతి పెద్ద రాష్ట్రం ఎంత పెద్ద రాష్ట్రం అంటే - మన ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, కేరళ రాష్ట్రాల మొత్తం వైశాల్యం ఎంత వుంటుందో దాదాపు అంత వైశాల్యం కల్గి వుంటుంది మధ్యప్రదేశ్. జనాభా రీత్యా చూస్తే మాత్రం మన రాష్ట్ర జనాభా కన్నా మధ్యప్రదేశ్ జనాభా కొంచెం తక్కువ ఇందుకు కారణం అడవులు, పీఠభూమి ప్రాంతం ఎక్కువగా ఉండటం

మధ్యప్రదేశ్‌ను 5 భాగాలుగా విభజించవచ్చును మాల్వా మైదానం, ఉత్తర ప్రాంతం, నర్మదాలోయ, సాత్పూరా పర్వత శ్రేణులు, చతీష్‌ఘర్ మైదానాలు, మాల్వా మైదానంలో మాల్వా (అవంతి) వింధ్య పర్వత శ్రేణులు వుంటాయి. ఉత్తర ప్రాంతంలో గ్వాలియర్ మండలం, బుందేల్ ఖండ్ (వేడి) ప్రాంతాలుంటాయి. వింధ్య పర్వత శ్రేణులు, సాత్పూరా పర్వత శ్రేణులకు మధ్య వుండేదే నర్మదాలోయ సాత్పూరా పర్వత శ్రేణులు పశ్చిమాన్నుంచి తూర్పుకు వ్యాపించి వుంటాయి. సాత్పూరా పర్వత శ్రేణులకు తూర్పుగా వుండేది మహా కోసల్ లేక చతీష్ ఘర్. ఈ విధంగా మధ్యప్రదేశ్ ఎక్కువగా పర్వత ప్రాంతంగా చిక్కటి అడవులతో నిండి వుంటుంది.

మధ్యప్రదేశ్ లో ముఖ్యనదులు నర్మదా (దీన్ని రేవా అని కూడా అంటారు). చంబల్, బెట్వా, మహానది, ఇంద్రావతి, దాసన్, కెన్. అన్ని నదులలో కెల్లా నర్మదా నది మధ్యప్రదేశ్ రాష్ట్ర ప్రజలకు ఎంతగానో తోడ్పడుతూ వారి జీవనాధారంగా వుంటోంది.

శ్రీరాముడు మధ్యప్రదేశ్ లోని వివిధ ప్రాంతాలు దాటి దక్షిణాదికి వెళ్ళాడని రామాయణం చెబుతోంది. అగస్త్య మహాముని కూడా వింధ్య పర్వతాలు దాటి దక్షిణాదికి వెళ్ళినట్లు ఒక పురాణగాథ. క్రీ॥పూ॥ వేయి సంవత్సరాల నాడే మధ్యప్రదేశ్ ప్రాంతంలో ప్రజలు గొప్ప నాగరికత కల్గి వుండేవారని రాగి పని ముట్లు వాడే వారని, చక్కటి పట్టణాలు నిర్మించారని ఈ మధ్య పురావస్తు శాఖ వారి త్రవ్వకాలను బట్టి తెలుస్తోంది. గౌతమ బుద్ధుని కాలంలో అవంతి (అప్పుడు దీని రాజధాని ఉజ్జయిని) ఉత్తర భారతదేశంలోని 16 పెద్ద రాజ్యాలలో ఒకటిగా వుండేది. మౌర్యుల కాలంలో మధ్యప్రదేశ్ అంతా మౌర్య సామ్రాజ్యంలో భాగంగా వుండేది. ఆనాడు అశోక రాకుమారుడు అవంతి రాజ్యానికి గవర్నరుగా వుండేవాడు. అశోకుడు విదిషీరాకుమార్తెను కూడా పెళ్లి చేసుకున్నాడని బౌద్ధ సారస్వతంలో చెప్పబడింది. అందువలనే విదిషీకి దగ్గరలోని సాంచిలో బ్రహ్మాండమైన బౌద్ధ స్తూపాలు నిర్మించాడు. సాంచి బౌద్ధమత ప్రచార కేంద్రంగా ప్రపంచ ప్రసిద్ధి చెందింది.

మౌర్యుల తర్వాత శాతవాహనులు క్రీ॥ పూ॥ 2వ శతాబ్దం నుంచి 1వ శతాబ్దం

వరకూ మధ్యప్రదేశ్‌లోని కొంత ప్రాంతాన్ని పాలించారు. 4వ శతాబ్దంలో ఉత్తర భారతంలో గుప్తవంశీయుల పాలన మొదలైంది. సముద్రగుప్తుడు మధ్యప్రదేశ్‌నేగాక మొత్తం ఉత్తర భారత దేశాన్ని తన పాలనలోకి తెచ్చుకున్నాడు. గుప్త రాజుల వంశంలోని వాడే ప్రసిద్ధి చెందిన విక్రమాదిత్యుడు ఉజ్జయిని ఇతడి రాజధాని. కళా సారస్వత పోషకుడైన విక్రమాదిత్యుని కాలంలో మహాకవి కాళిదాసు, భవభూతి, వరహమిహిరుడు ఆయన ఆస్థాన కవులుగా వుండేవారు.

గుప్తరాజుల తర్వాత మధ్యప్రదేశ్‌లో కొంత ప్రాంతం కనూజ్‌కు చెందిన హర్షవర్ధనుని చేతుల్లోకి వెళ్లింది. ప్రసిద్ధ కవి బాణభట్టు ఇతడి ఆస్థానకవే. క్రీ॥ శ॥ 6వ శతాబ్దం నుంచి 12వ శతాబ్దం వరకూ అనేక రాజకుటుంబాలు మధ్యప్రదేశ్‌ను పాలించాయి. వీరిలో చాందెల్లా వంశీకులు సుప్రసిద్ధులు. వీరే ఖజూరహో శిల్పాలను చెక్కించినవారు. 12వ శతాబ్దం తర్వాత మధ్యప్రదేశ్ ముస్లిం పాలకుల వశం అయింది. 19వ శతాబ్దం నాటికి మధ్యప్రదేశ్ లో చాలా ప్రాంతాలను బ్రిటిష్ వారు ఆక్రమించుకున్నారు. 1857లో జరిగిన ప్రథమ స్వతంత్ర సంగ్రామం మధ్యప్రదేశ్ లోనే ప్రారంభమయింది. వీరనారి ఝాన్సీలక్ష్మి బాయ్ బ్రిటిష్ వారిపై వీరోచితంగా పోరాడిన ఘట్టం మధ్యప్రదేశ్‌లోనే జరిగింది. ఝాన్సీ లక్ష్మి బాయ్ ఆమెకు మద్దతుగా నిల్చిన తాంతియా తోపీ సాహసగాథలు ఇప్పటికి మధ్యప్రదేశ్ ప్రజలు కథలు కథలుగా చెప్పుకుంటారు.

మధ్యప్రదేశ్ 45జిల్లాలుగా విభజించబడి వుంటుంది. అవి – బాలాఘాట్, బస్తర్, బెటుల్, బింద్, భోపాల్, బిలాస్‌పూర్, చత్తర్‌పూర్, బింద్‌వరా, దమో, దాటియా, దేవాస్, దర్, తూర్పునిమర్, గుణ, దుర్గ్, గ్వాలియర్, ఇండోర్, హోషంగబాద్, జబల్‌పూర్, జాబువా, మండియా, మండ్‌సార్, మోరెనా, నర్సింగ్‌పూర్, పన్నా, రాయ్‌ఘర్, రాయ్‌పూర్, రెయ్‌సెన్, రాజ్‌ఘర్, రాజ్‌నంద గోవన్, రట్‌లం, రేవా, సాగర్, సాత్నా, సిహోర్, సియోని, షహ్‌దోల్, షాజాపూర్, శివపురి, సిద్ధి, సర్గుజ, తికంఘర్, ఉజ్జయిని, విదిష, పశ్చిమనిమీర్.

మధ్యప్రదేశ్ పెద్ద రాష్ట్రం కావటం వలన వర్షపాతంలో కూడ ఒక ప్రాంతానికి మరొక ప్రాంతానికి తేడా వుంటుంది ఉత్తర ప్రాంతంలో సగటున 75 సెం.మీ పడుతుంది. భోపాల్‌లో సగటున 75 నుంచి 125 సెం.మీ. వరకూ వర్షపాతం వుంటుంది. మాల్వాలో 100 సెం.మీ వరకూ వర్షం పడుతుంది. వింధ్య పర్వత శ్రేణులలో కూడా 75 నుంచి 90 సెం.మీ వర్షం కురుస్తుంది. చతీష్‌ఘర్ ప్రాంతంలో మాత్రం అత్యధిక వర్షపాతం 150 సెం.మీ. వర్షం పడుతుంది.

మధ్యప్రదేశ్‌లో ఒకే సభగల చట్టసభ వుంటుంది. దీంట్లో 320 సీట్లు వుంటాయి. మధ్యప్రదేశ్‌కు లోక్‌సభలో 40 సీట్లు రాజ్యసభలో 16 సీట్లు ఉన్నాయి.

మధ్యప్రదేశ్ జనాభాలో 93 శాతం హిందువులు, 5 శాతం ముస్లింలు, మిగతావారు క్రైస్తవులు తదితరులు ఈ రాష్ట్రంలో అక్షరాస్యత 42 శాతం మధ్యప్రదేశ్‌లో ఉన్నంత మంది షెడ్యూలు తెగలవారు మరే రాష్ట్రంలోను లేరు రాష్ట్ర జనాభాలో 4వ వంతు మంది వీరే 45 జిల్లాలలోను 23 జిల్లాల్లో వీరే ఆధిక్యంలో వుంటారు ఈ తెగలలో ముఖ్యంగా పేర్కొనదగినవారు గోండులు, బిల్లులు, కోర్కొన్లు, కోలులు. ఈ వేర్వేరు తెగలు విభిన్న ఆచార వ్యవహారాలు, విభిన్న సంస్కృతీ సాంప్రదాయాలు కలిగి వుంటారు.

మధ్యప్రదేశ్‌లో ప్రధానంగా మాట్లాడే భాష హిందీ అయితే ఈ హిందీ మాట్లాడం రాష్ట్రం అంతటా ఒక రకంగా వుండదు. ఉచ్చారణ, యాసలో తేడాలుంటాయి. గ్వాలియర్ ప్రాంతంలో మాట్లాడే భాషను గ్వాలియరీ లేక బ్రాజా అంటారు బుందేల్ ఖండ్ ప్రాంతంలో మాట్లాడే దాన్ని బుందేలి అంటారు. మాల్వా ప్రాంతంలో మాట్లాడే దాన్ని మాల్వీ అంటారు. చత్తీష్ఘర్‌లో మాట్లాడే దాన్ని చత్తీష్ఘర్ అని అంటారు

సంస్కృతంలో మహాకవులైన కాళిదాసు, భవభూతి, బాణభట్టు, రాజశేఖర, మొదలైన వారు మధ్యప్రదేశ్‌కు చెందినవారే. హిందీలో ముఖ్యంగా చెప్పుకోదగిన కవి కేశవదాస. ఈయన రచించిన రామచంద్రిక, రసికప్రియ, కవిప్రియ గ్రంథాలు ప్రసిద్ధి చెందినవి. ఇక ఆధునిక కాలంలో చెప్పుకోదగినవారు భానుకవి, మఖిల్‌లాల్ చతుర్వేది, బాలకృష్ణ శర్మ, ద్వారకాప్రసాద్‌మిశ్రా, గిరిజా కుమార్ మాధుర్ మొదలైనవారు

అమరగాయకులు తాన్‌సేన్, బైజులు మధ్యప్రదేశ్‌కు చెందిన వారే గ్వాలియర్ దగ్గరలోని "బైహట్" అనే గ్రామం తాన్‌సేన్ జన్మ స్థలమని చెబుతారు.

మధ్యప్రదేశ్ ముఖ్యంగా వ్యావసాయిక రాష్ట్రం. 80 శాతం ప్రజలు గ్రామాల్లోనే నివసిస్తున్నారు రాష్ట్రంలో 52 శాతం భూమి సేద్యయోగ్యంగా వున్నా 13శాతం భూమికే నీటి పారుదల సౌకర్యం వుంది. ప్రధాన పంటలు జొన్న, గోధుమ, వరి, నూనె గింజలు ప్రత్తి, చెరకు, సోయాచిక్కుడు లాంటి వాణిజ్య పంటలు కూడా పండుతాయి.

మధ్యప్రదేశ్‌లో సహజవనర్లు పుష్కలంగా వున్నాయి ఇనుము, మాంగనీసు, బొగ్గు, సున్నపురాయి, తగరం బాగా దొరుకుతాయి. కేంద్ర ప్రభుత్వ అధీనంలోని బిలాయ్ ఉక్కు కర్మాగారం, నేపాల్‌లోని న్యూస్‌ప్రింట్ ఫ్యాక్టరీ, భోపాల్‌లో భారత్ భారీ విద్యుత్ కర్మాగారం, కోర్బాలోని అల్యూమినియం కర్మాగారం, హోసంగాబాద్‌లోని సెక్యూరిటీ ప్రెస్, దేవాస్‌లోని బ్యాంకు నోట్ల ప్రెస్ ముఖ్యంగా చెప్పుకోదగిన కర్మాగారాలు. పన్నా వజ్రాలకు ప్రసిద్ధి. నేషనల్ మినరల్ డెవలప్‌మెంటు కార్పోరేషన్ ఈ వజ్రాల పరిశ్రమను చేపట్టింది. 3000దాకా ప్రవేటు లిమిటెడ్ కంపెనీలు మధ్య ప్రదేశ్‌లో నెలకొని వున్నాయి.

మధ్యప్రదేశ్‌లో చారిత్రక ప్రదేశాలు, దర్శనీయ స్థలాలు అసంఖ్యాకంగా వున్నాయి వాటిలో ముఖ్యమైన వాటిని చూద్దాం. మధ్య ప్రదేశ్ అనగా ముందుగా గుర్తుకు వచ్చేది ఖజురహో. ఖజురహో పేరు ఇచ్చట వుండే ఖర్జూర చెట్లను బట్టి వచ్చిందంటారు. బుందేల్ ఖండ్ ప్రాంతాన్ని క్రీ.శ. 5వ శతాబ్దం నుంచి 11వ శతాబ్దం వరకూ పాలించిన చాందెల్లా రాజులు ఈ ఖజురహో దేవాలయాల్ని నిర్మింపజేశారు. ఈ దేవాలయాలు 9వ శతాబ్దం నుంచి 11వ శతాబ్దం మధ్యలో నిర్మించబడినాయి. చత్రపూర్‌కు 42 కిల్లోమీటర్ల దూరంలో వుంటాయి ఈ దేవాలయాల సముదాయం అసలు ఈ దేవాలయాలు మొత్తం 85. కాగానాటి నుంచి ఈనాటి వరకూ ప్రతికూల వాతావరణ పరిస్థితుల్ని తట్టుకొని నిల్చి వున్నవి 22 మాత్రం. ఈ దేవాలయాలు మూడు సముదాయాలుగా వుంటాయి. పశ్చిమ సముదాయం చాందెల్లా శిల్ప కళ ఉట్టిపడుతూ వుంటుంది. తూర్పు సముదాయంలో జైన దేవాలయాలు వుంటాయి దక్షిణ సముదాయంలో రెండు దేవాలయాలు మాత్రమే వుంటాయి. పశ్చిమ సముదాయంలో ఎక్కువ దేవాలయాలు వుంటాయి. ఈ సముదాయం లోని కందరీయ మహా దేవాలయం ఖజురాహో దేవాలయాల న్నింటిలోకి పెద్దది. 31 మీటర్ల ఎత్తు వుంటుంది. ఇంకా ఈ సముదాయంలో బౌసత్, మోగిని, కాళి ఆలయం, చిత్రగుప్తుని ఆలయం, విశ్వనాథ ఆలయం, లక్ష్మన్న ఆలయం, మాతంగేశ్వర ఆలయం మొదలైనవి వుంటాయి. తూర్పు సముదాయంలో పరస్వంత,ఘాంతయి ఆదినాధ జైనదేవాలయాలు వుంటాయి. దక్షిణ సముదాయంలో దులాదేవ ఆలయం, చతుర్భుజ ఆలయం వుంటాయి

ఈ ఖజురహో దేవాలయాల్లో చెక్కిన అసంఖ్యాక శిల్పాలు శృంగార భంగిమల్లో వుంటాయి. స్త్రీ పురుషులు జంటలు జంటలుగా కామకేళీ విలాసంలో మునిగివున్నట్లు చెక్కబడి వుంటాయి. కామశాస్త్ర సూత్రాలన్నీ అద్భుతమైన సజీవ శిల్పాలుగా మలచబడినాయి. ఈ విధంగా ఎందుకు చెక్కబడినాయని పరిశీలించితే ఆనాడు సృష్టికార్యం పవిత్రంగా భావించి దీనికింత ప్రాముఖ్యత ఇచ్చినట్లు కానవస్తుంది. కామకేళీ విలాసాన్ని చెక్కటమేగాక ఆనాటి జనం ముఖ్యంగా స్త్రీలు చేసే దినచర్యలను కూడా శిల్పాలుగా చెక్కారు. తలంటి పోసుకుంటున్నట్లు, తలదువ్వు కొంటున్నట్లు, ఉత్తరాలు వ్రాస్తున్నట్లు, అద్దంలో అందాలు చూసుకొంటున్నట్లు, చేతులకు కాళ్ళకు గోరింటాకు పెట్టుకుంటున్నట్లు, పాటలు పాడుతున్నట్లుగా రకరకాలుగా అద్భుతంగా ఆశ్చర్యం కల్గించే విధంగా ఎంతో కళానైపుణ్యం తో చిత్రించారు.

రాజధాని భోపాల్ జనాభా 11లక్షలు. భోజరాజు ఇక్కడ 11వ శతాబ్దంలో ఒక చెరువు త్రవ్వించాడట పాల్ అంటే చెరువు కాబట్టి, భోజరాజు త్రవ్వించిన చెరువు కాబట్టి భోజపాల్ అని ఆ తర్వాత అదే భోపాల్‌గా మారిందని చెబుతారు. భోజరాజు

పాలించిన పట్టణం కాబట్టి భోపాల్ అయిందని కూడా అంటారు భోపాల్ అనేక శత్రురాజుల దాడికి గురై విధ్వంసం చేయబడింది. మొగల్ చక్రవర్తుల పాలనలో దీన్ని పునరుద్ధరించారు మొగల్ సామ్రాజ్యం క్షీణదశకు రావటంతో వారి ప్రతినిధులు ఈ భోపాల్‌ను స్వతంత్రంగా ప్రకటించుకున్నారు. వీరే దేశానికి స్వతంత్రం వచ్చే వరకూ బ్రిటిష్ వారి అజ్మాయిషీ క్రింద ఈ ప్రాంతాన్ని పాలించారు 19వ శతాబ్దంలో భోపాల్ రాజ్యాన్ని వరుసగా కొంత మంది బేగంలు కూడా పాలించారు. షాజహాన్ బేగం చేత నిర్మించబడిన తాజ్-ఉల్- మసీదు దేశంలో పెద్ద మసీదులలో ఒకటిగా చెప్పవచ్చు. అయితే ఈ కట్టడం అసంపూర్తిగా మాత్రమే నిర్మించబడింది. 1837 లో నిర్మించబడిన జుమ్మామసీదు కూడా చెప్పుకోదగిన కట్టడం. లక్ష్మీనారాయణ ఆలయం ఈ మధ్య నిర్మించబడిన సుందర దేవాలయం. భోపాల్‌కు శోభ చేకూర్చే రెండు పెద్ద సరస్సులున్నాయి. ఇందులో ఒక సరస్సు 2 కిలో మీటర్లు వైశాల్యం వుంటుంది రెండోది ఇంతకన్నా చిన్న సరస్సు ఈ రెంటినీ కలుపుతూ ఓవర్ బ్రిడ్జి నిర్మింబడింది. ఈ సరస్సులలో బోటు షికారు యాత్రీకులను ఆహ్లాదపరుస్తుంది. ప్రసిద్ధి చెందిన భారత్ భవన్‌లో చక్కటి మ్యూజియం, ఆర్టు గ్యాలరీలు వున్నాయి.

భోపాల్‌కు 70 కిలోమీటర్లు, విదిషకు, 10 కిలోమీటర్ల దూరంలో వుంటుంది సాంచి ప్రపంచ ప్రసిద్ధ బౌద్ధ కేంద్రం సాంచి. క్రీ.శ.3వ శతాబ్దం నుంచి 11వ శతాబ్దం వరకూ సాంచి బౌద్ధ మత ప్రచార కేంద్రంగా కొనసాగి విశ్వ విఖ్యాతినొందింది. ఇక్కడ కన్పించే మూడు స్థూపాల్లో (అసలు లోగడ ఇక్కడ ఎనిమిది స్థూపాలు వుండేవి. ప్రస్తుతం 3 మాత్రమే మిగిలి వున్నాయి) మహాస్థూపం అన్నింటి కన్నా ప్రాముఖ్యం చెందింది. అశోక చక్రవర్తి వీటిని నిర్మింపజేశాడు. మహాస్థూపం వ్యాసం 36.5 మీటర్లు, ఎత్తు 16.4 మీటర్లు ఈ స్థూపం యొక్క నాలుగు ప్రవేశ ద్వారాల మీద బౌద్ధ జాతక కథలు చెక్కబడినాయి 12.6 మీటర్ల ఎత్తు వుండే అశోక స్తంభం, శిధిలావస్థలో నున్న బౌద్ధ విహారాలు, ఆలయాలు ఇక్కడ చూడవచ్చు. శిధిలావశేషాలను భద్రపర్చిన పురావస్తు ప్రదర్శనశాల కూడా ఇక్కడ వుంది. భోపాల్‌కు 28 కిలోమీటర్ల దూరంలో భోజ్‌పూర్ వుంటుంది. ఇక్కడ అసంపూర్తిగా నిర్మించబడిన బ్రహ్మాండమైన భోజేశ్వర ఆలయం వుంది.

ఉజ్జయిని అనగానే విక్రమాదిత్య చక్రవర్తి, మహాకవి కాళిదాసు మదిలో మెదులుతారు. లోగడ దీన్ని 'అవంతిక' అనేవారు. హిందువులకు పుణ్యక్షేత్రం ప్రతి 12 సంవత్సరాలకు ఒక సారి ఇక్కడ కుంభమేళా జరుగుతుంది. ఇచ్చట భర్తృహరి గుహ ఒకటి వుంది. విక్రమాదిత్య వంశంలోని భర్తృహరి అనే రాజు ఇహలోక సుఖాలపై విరక్తి చెంది సన్యసించి ఈ గుహలోనే వున్నాడట. ఇతడు వ్రాసినవే భర్తృహరి సుభాషితాలు. తెలుగులో కూడా

ఈ సుభాషితాలు ప్రసిద్ధమైనవే! ఇంకా ఇక్కడ జంతర్‌మంతర్ అనే నక్షత్ర వేధశాల, క్షిప్రానది మధ్యలో కట్టబడిన కలిమాదే భవంతి ప్రసిద్ధి చెందినవి ఈ భవంతిలో బ్రహ్మాండమైన మండపాలు వున్నాయి కుంభమేళా జరిగేటప్పుడు ఇచ్చట భక్తులు స్నానాలు గావించి ఈ నదీ మాతకు పూలు పళ్ళు సమర్పించుకుంటారు

ఉజ్జయినికి 52 కిలోమీటర్ల దూరంలో వుంటుంది ఇండోర్. రాష్ట్రంలో కెల్లా పెద్ద పట్టణం ప్రసిద్ధి చెందిన రాణి అహల్యా బాయ్ పాలించిన నగరం ఇది. అహల్యాబాయ్ ఈ నగరాన్ని ఎంతో అభివృద్ధి చేసింది. ప్రస్తుతం ఇది వ్యాపార కేంద్రంగా వుంది. ఇక్కడ చూడదగినవి చత్రబాగ్, గీతాభవన్, కాంచనమందిరం.

గ్వాలియర్‌ను పూర్వం గోపాద్రి, గోపాచల అనేవారు. స్వతంత్రం రాకమునుపు గ్వాలియన్ సింధియా రాజుల రాజధానిగా వుండేది గ్వాలియర్‌లో ముఖ్యంగా చూడదగినది బ్రహ్మాండమైన గ్వాలియర్ కోట. దీన్ని రాజామాన్‌సింగ్ నిర్మించాడు. 100 మీటర్ల ఎత్తు కొండపై నిర్మించబడింది కోటగోడలు 10 మీటర్ల ఎత్తు వుండి 3 కిలోమీటర్ల పొడవు వుంటాయి. ఈ కోటలో అనేక కట్టడాలు వున్నాయి. లోపలికి వెళ్ళటానికి 5 మహాద్వారాలుంటాయి. ఈ కోటలో పురావస్తు మ్యూజియం, మాన్‌సింగ్ భవనం, అత్తాకోడళ్ళ దేవాలయాలు, జయవిలాస్ భవంతి ( ఈ భవంతిలోని కొంత భాగంలో సింధియా వంశీకులు నివసిస్తున్నారు) అమర గాయకుడు తాన్‌సేన్ సమాధి వుంటాయి. గ్వాలియర్ నుంచి ఆగ్రా వెళ్ళే దారిలో బందిపోటు దొంగలకు ప్రసిద్ధి చెందిన చంబల్‌లోయ వుంటుంది. స్వర్గీయ జయప్రకాష్ పిలుపు మేరకు వీరిలో అనేకులు ప్రభుత్వానికి లొంగిపోయి నూతన జీవితాలను ఆరంభించారు.

ఇండోర్‌కు 95 కిలోమీటర్ల దూరంలో మాండు వుంటుంది. 11వ శతాబ్దంలో పార్మార్ రాజుల (మాల్వా) రాజధానిగా వుండేది. భోజరాజు చేత నిర్మించబడిన పట్టణాలలో ఇదొకటి. మాండు రాజులలో ఒకడైన బాజ్ బహదూర్ రూపమతి అనే సామాన్యురాల్ని ప్రేమించటం ఆ ప్రేమ వ్యవహారగాధ ఈనాటికీ మాండు ప్రజలు చెప్పుకుంటూనే వుంటారు. ఇక్కడ వున్న హొషంగ్‌షా (14వ శతాబ్దంలో మాల్వాను పాలించిన రాజు) సమాధి మన దేశంలో ప్రథమంగా నిర్మించబడిన పాలరాతి సమాధి. షాజహాన్ తాజ్‌మహల్ నిర్మించటానికి ముందు శిల్పులను ఈ సమాధి వద్దకు పంపి ఈ నమూనాలోనే తాజ్‌మహల్ నిర్మించాలని చెప్పాడట. ఇంకా మాండులో జాజ్‌మహల్, హిందోలమహల్; బాజ్‌బహదూర్ భవంతి, రూపమతి భవంతి చూడదగిన కట్టడాలు.

ఇండోర్‌కు 77 కిలోమీటర్ల దూరంలో 'ఓంకారేశ్వర్' వుంటుంది. నర్మదానదిలో ఇదొకదీవి 'ఓం' ఆకారంలో వుండటంతో దీనికి ఆ పేరు వచ్చింది. ద్వాదశ జ్యోతిర్లింగాలలో ఇదొకటి ఈ దీవిలో అనేక దేవాలయాలు ఉన్నాయి. ఇండోర్‌కు

90 కిలోమీటర్ల దూరంలో వుండే మహేశ్వర్ లనే చిన్న గ్రామం నర్మదానది ఒడ్డున వుంటుంది. ఇచ్చట అపురూప శిల్పకళతో ఉట్టిపడే అనేక దేవాలయాలు వున్నాయి. ఇచ్చట నేయబడే చీరలు భారత దేశమంతటా ప్రసిద్ధి చెందినాయి

శివపురి మొగల్ చక్రవర్తులకు వేట స్థలంగాను, సింధియా రాజుల వేసవి విడిదిగా వుండేది శివపురి చుట్టూ 156 చ మై విస్తీర్ణంలో అడవులు వుంటాయి దీన్నే మాధవ్‌నేషనల్ పార్కు అంటారు. దీంట్లో అన్ని రకాల మృగాలను, పక్షులను చూడవచ్చును

శివపురికి 130 కిలోమీటర్ల దూరంలో వుండే చాందేరి లేక చంద్రపురలో (గుణజిల్లా) బుందేల్ శిల్ప కళకు ప్రసిద్ధి చెందినమధ్యయుగం నాటి కట్టడాలు చూడవచ్చును. ఇక్కడ నేయబడే చాందేరి చీరలు దేశమంతటా ప్రసిద్ధిచెందినాయి

జబల్‌పూర్ మధ్యప్రదేశ్‌లో రెండో పెద్ద పట్టణం. ఒకప్పుడు ఇది గోండు రాజుల విహార కేంద్రంగా వుండేది. ఇక్కడ క్రీ. శ. 1116లో రాజామదన్‌సింగ్ చేత నిర్మించబడిన మదన్‌మోహన్ కోట ఇంకా గోండు రాజు సంగ్రాం సింగ్ చే నిర్మించబడిన సంగ్రాంసాగర్ చెప్పుకోవదగిన కట్టడాలు. జబల్‌పూర్‌కు 24 కిలోమీటర్ల దూరంలో పాలరాతి కొండలు చూడదగిన విశేషం. ఇక్కడ నర్మదానది తెల్లని పాలరాతి చరియలు మీదుగా ప్రవహిస్తూ వుంటే దీని అందచందాలు పున్నమి వెన్నెలలో చూడటం ఒక మధురానుభూతి కల్గిస్తుంది.

మిగతా దేశంలో ప్రజలు జరుపుకునే దీపావళి, దసరా, హోలీ వగైరా పండుగలు మధ్యప్రదేశ్ ప్రజలు కూడా ఘనంగా జరుపుకుంటారు షెడ్యూల్ తెగలవారు వారి సాంప్రదాయసిద్ధమైన జాతర్లు, సంబరాలు చేసుకుంటారు. బస్తర్ జిల్లాలోని షెడ్యూలు తెగలు వారు చేసే 'గౌర్' నృత్యం ప్రసిద్ధి పొందినది. ఈ నృత్యం కోసం వీరు ప్రత్యేక ఆభరణాలు ధరించి రకరకాల వాయిద్యాలతో స్త్రీ పురుషులు ఈ నృత్యంలో పాల్గొంటారు. మరో తెగవారు చేసే 'కరమ' నృత్యం కూడా చెప్పుకోదగినది.

# 9 గుజరాత్

వైశాల్యం - 196024 చ॥ కి॥ మీ॥. జనాభా - 4 కోట్ల 12 లక్షలు  మాతృభాష - గుజరాతీ. రాజధాని - గాంధీ నగర్.

గుజరాత్ రాష్ట్రానికి పడమర అరేబియా సముద్రం, ఉత్తరాన రాజస్తాన్, తూర్పున మధ్యప్రదేశ్, దక్షిణాన మహారాష్ట్ర సరిహద్దులుగా వుంటాయి. గుజరాత్ (రాన్ ఆఫ్ కచ్)కు వాయువ్యంగా పాకిస్తాన్ ఆనుకొని వుంటుంది

వైశాల్యం రీత్యా గుజరాత్ భారతదేశంలో 7వ స్థానంలోనూ జనాభా రీత్యా 10వ స్థానంలోనూ వుంటుంది  ఆంధ్రప్రదేశ్‌తో పోలిస్తే వైశాల్యం రీత్యా కోస్తా, రాయలసీమ



జిల్లాల వైశాల్యం కంటే కొంచెం ఎక్కువగానూ జనాభారీత్యా మన రాష్ట్రం కన్నా సుమారు 2 కోట్లు తక్కువగానూ వుంటుంది

భౌగోళికంగా గుజరాత్‌ను మూడు ప్రాంతాలుగా విభజించవచ్చును (1) సౌరాష్ట్ర (కధియవార్) ద్వీపకల్పం - గుట్టలు, చిన్న చిన్న కొండలు వున్న ప్రాంతం (2) కచ్ ప్రాంతం - ఈ ప్రదేశం అంతా బీడు, ఎడారిగా వుంటుంది ఇచ్చటనే ప్రసిద్ధ కచ్ ఎడారి (రాన్ ఆఫ్ కచ్) వుంటుంది ఉత్తర ప్రాంతాన్ని పెద్ద ఎడారి అని తూర్పు ప్రాంతాన్ని చిన్న ఎడారి అని అంటారు (3) కచ్ ఎడారి, ఆరావళి పర్వత పంక్తుల నుంచీ దామన్ గంగా నది వరకూ వ్యాపించిన ప్రాంతమే మిక్కిలి సారవంతమైన మైదాన ప్రాంతం

గుజరాత్‌కు సుదీర్ఘమైన కోస్తా ప్రాంతం వుంది దేశానికి మొత్తం వున్న కోస్తా ప్రాంతంలో 3వ వంతు - 1290 కిలోమీటర్లు ఈ రాష్ట్రానికి వుంది

దేశ స్వతంత్రానికి పూర్వం గుజరాత్‌లో అనేక సంస్థానాలు (చిన్న చిన్న రాజ్యాలు) వుండేవి. అసలు ఇండియా మొత్తంమీద ఎక్కువ సంస్థానాలు ఈ రాష్ట్రంలోనే వుండేవి. ముఖ్యంగా సౌరాష్ట్ర ద్వీపకల్పంలో అనేకం వుండేవి. అందువలనే దానికి సౌరాష్ట్ర (వందరాజ్యాలు) అనే పేరు కూడా వచ్చింది. దేశానికి స్వతంత్రం వచ్చిన తర్వాత ఈ రాజ్యాలన్నింటినీ భారత్‌లో కలిపి వేశారు.

పురాణ కాలంలో శ్రీ కృష్ణుడు పాలించిన ద్వారక, ఈనాడు పూజ్య బాపూజీ జన్మించిన స్థలం గుజరాత్‌లోనే వున్నాయి. గూర్జర అనే పేరును బట్టి గుజరాత్ వచ్చింది. క్రీ శ 5వ శతాబ్దంలో గూర్జర అనే తెగ ప్రజలు ఇచ్చటకు వచ్చి స్థిర నివాసమేర్పరచుకున్నారని కొందరంటారు. వారిని బట్టే గుజరాత్ అనే పేరు వచ్చిందని కొందరు అభిప్రాయం. గుజరాత్ చరిత్ర క్రీ॥పూ॥ 2 వేల సంవత్సరాల నుంచి ప్రారంభమవుతుంది. అహమ్మదాబాద్‌కు 80 కిలోమీటర్ల దూరంలో వున్న "లోధల్" అనే చోట జరిపిన త్రవ్వకాలను బట్టి గుజరాత్ చరిత్ర కందని కాలం నుంచి గొప్ప నాగరికత, సంస్కృతి, విదేశాలతో వాణిజ్య సంబంధాలు వుండేవని తెలుస్తోంది. ఆరోజుల్లోనే ఇచ్చటి ప్రజలు చక్కటి ఇళ్ళు నిర్మించుకున్నారని, ఇళ్ళలో స్నానాల గదులు వుండేవని, డ్రైనేజి వ్యవస్థ కూడా ఉండేదని తెలుస్తోంది. మహాభారతంలో శ్రీ కృష్ణుడు పాలించిన ద్వారకా నగరం గురించి పలుమార్లు ప్రస్తావించబడింది. అశోకచక్రవర్తి కాలంలో గుజరాత్ అశోక సామ్రాజ్యంలో వుంది గుప్తుల కాలంలో గుప్త సామ్రాజ్యం లో వుంది. తర్వాత గుజరాత్ ఉత్తర ప్రాంతం గూర్జరుల పాలన క్రింద దక్షిణ ప్రాంతం చాళుక్యుల పాలన క్రింద సౌరాష్ట్ర మైత్రీకులు, ప్రతీహారుల పాలన క్రింద వుంది. ఆ తర్వాత ముస్లింలు గుజరాత్‌లో ఎక్కువ ప్రాంతాన్ని ఆక్రమించుకున్నారు. మొట్టమొదటి ముస్లింల దండయాత్రికుడు మహ్మద్ గజనీ దాడిచేసి, దోచుకున్నది సౌరనాధ్ దేవాలయాన్నే!

ముస్లింల తర్వాత బ్రిటిష్ వారి చేతి క్రిందకు వెళ్ళింది బ్రిటిష్ వారు మొట్టమొదటగా గుజరాత్‌లోని సూరత్‌ను తమ స్థావరంగా చేసుకొని క్రమేపీ ఇండియా అంతట్నీ ఆక్రమించుకున్నారు ఇద్దరు విదేశీ దురాక్రమణ దారులకూ గుజరాత్ ప్రవేశ ద్వారం కావటం చారిత్రక దురదృష్టమే.

భారత్‌కు స్వతంత్రం వచ్చిన కొత్తలో గుజరాత్, మహరాష్ట్ర బొంబాయి రాష్ట్రంగా వుండేవి. 1960లో ప్రజాందోళనకారణంగా గుజరాతీ భాష మాట్లాడే ప్రాంతాలన్నీ వేరు చేసి గుజరాత్‌గా ఏర్పరచారు.

గుజరాత్‌లో 19 జిల్లాలు వున్నాయి అవి - అహ్మదాబాద్, అమ్రేలి, బానస్కాంత, బరూచ్, భావ్‌నగర్, గాంధీనగర్, జాంనగర్, జునాగడ్, ఖేడే, కచ్, మహెసానా, పంచమహల్స్, రాజ్‌కోట, సబర్‌కాంత, సూరత్, సురేంద్ర నగర్, డంగ్స్, వడోద్ర, వల్సర్.

గుజరాత్‌లో ఒకే సభగల చట్ట సభ వుంటుంది. అందులో 182 మంది సభ్యులు వుంటారు. లోక్‌సభలో 26 మంది, రాజ్యసభలో 11 మంది సభ్యులు గుజరాత్‌కు ప్రాతినిధ్యం వమిస్తారు. గుజరాత్ రాష్ట్ర ప్రజలలో 89.5 శాతం హిందువులు, 8.5 శాతం ముస్లింలు మిగతా వారు క్రైస్తవులు. పారసీకులు, తదితరులు. ఈ రాష్ట్ర ప్రజలలో 61 శాతం మంది అక్షరాస్యులు.

గుజరాత్‌కు లోగడ అహ్మదాబాద్ రాజధానిగా వుండేది. 1970లో అహ్మదాబాద్‌కు 19 కిలోమీటర్ల దూరంలో సబర్మతీ నదీ తీరంలో గాంధీజీ పేరు మీదుగా గాంధీనగర్ ఏర్పాటు చేసి రాజధానిని అక్కడకు మార్చారు.

గుజరాత్‌లో ప్రధాన నదులు సబర్మతీ, మహి, నర్మద, తపతి, ఇంకా బనాస్, సరస్వతి, దమన్‌గంగా అనే చిన్న నదులు కూడా వున్నాయి. ఉత్తర గుజరాత్, సురేంద్రనగర్ జిల్లా తప్ప మిగతా రాష్ట్ర మంతా సగటున సంవత్సరానికి 65 నుంచి 127 సెంటీమీటర్ల వర్షం పడుతుంది.

దేశం మొత్తం మీద ప్రత్తి, వేరుశనగ పంటలు పండించటంలో గుజరాత్ రాష్ట్రానిదే అగ్రస్థానం. పొగాకు పండించటంలో రెండవ స్థానంలో వుంటుంది. ప్రతి, వేరుశెనగ పంటలే ఈ రాష్ట్రంలో విశేషంగా నెలకొన్న నూలు, నూనె, సోప్ పరిశ్రమలకు మూలాధారం. గుజరాత్‌లో ఇంకా వరి, గోధుమ, జొన్న కూడా తగు మాత్రంగా పండుతాయి. చెరకు, మామిడి, అరటి లాంటి వాణిజ్య పంటలు కూడా పండుతాయి.

గుజరాత్ పారిశ్రామికంగా కూడా అభివృద్ధి చెందిన రాష్ట్రం. అనేక రకాల రసాయనాలు తయారు చేసే ఫ్యాక్టరీలున్నాయి. అంకలేశ్వర్, కాంబే, కలోల్‌లో

పెట్రోల్ సమృద్ధిగా దొరుకుతోంది. సముద్రంలో నుంచి కూడా పెట్రోలు తీసే ప్రయత్నం ఇక్కడ జరుగుతుంది కొయాలి వద్ద బ్రహ్మాండమైన చమురు శుద్ధి కర్మాగారం నెలకొల్పబడింది. పెట్రోలు బాగా దొరికే అంకలేశ్వర్ చుట్టూ పారిశ్రామికంగా సత్వర అభివృద్ధి చెందుతోంది గుజరాత్‌లో 1400 దాకా బట్టల మిల్లులు వున్నాయి. దేశంలో తయారయ్యే ఉప్పులో 60 శాతం ఇక్కడే తయారవుతుంది. బరూచ్ దగ్గరలో గుజరాత్ నర్మదావాలీ ఎరువుల కర్మాగారం దేశంలో ప్రఖ్యాతిగాంచింది గుజరాత్‌లో ఎలక్ట్రానిక్ పరిశ్రమలు కూడా విరివిగా వున్నాయి. మందుల పరిశ్రమలలో కూడా గుజరాత్ అగ్రస్థానంలో వుంది. 80 వేలకు పైగా చిన్న పరిశ్రమలు ఈ రాష్ట్రంలో నెలకొని వున్నాయి 170 పారిశ్రామిక వాటికలు (ఇండస్ట్రియల్ ఎస్టేట్స్) వున్నాయి. పాడి పరిశ్రమలో కూడా గుజరాత్‌దే అగ్రస్థానం ఆనంద్‌డైరీ ప్రపంచ ప్రసిద్ధి పొందింది. దేశం మొత్తం మీద తయారయ్యే పసి పిల్లల పాలలో 60 శాతం ఈ రాష్ట్రంలోనే తయారవుతున్నాయి. ఇక్కడ పాల ఉత్పత్తి దార్ల సహకార సంఘాలు దేశానికే ఆదర్శంగా ఉండేట్లుగా పనిచేస్తున్నాయి.

గూర్జుల తెగల భాష అయిన గూర్జర అపభ్రంశం నుంచి ఉద్భవించనదే గుజరాతీ భాష. ఈ భాష 12 శతాబ్దం నుంచే ప్రాముఖ్యంలోకి వచ్చింది. గుజరాతీ భాష మీద జైన మత ప్రభావం ఎక్కువగా వుంటుది. 1250 నాటికి గుజరాత్ ప్రత్యేక రాజకీయ ప్రాంతంగా ఏర్పడటంతో గుజరాతీకి ప్రాముఖ్యం లభించింది. ఈ శతాబ్దంలో శైవ మతం ఉచ్ఛదశలో వుండటంతో గుజరాతీలో శైవ సాహిత్యం కొనసాగింది. ఇదే సమయంలో 'రస' అనే జానపద నృత్యాన్ని జైన గ్రంధ కర్తలు పద్యనాటికలుగా మల్చి విశేష ప్రచారంలోకి తెచ్చారు. చిన్న చిన్న పద్యాలుతో కూడిన "ఫగు" అనే సాహిత్య ప్రక్రియ కూడా జనాదరణ పొందింది. 14వ శతాబ్దానికి చెందని రాజశేఖర సూరి, జినపాదసూరి, జయ శేఖర సూరి ఈ 'ఫగు' ప్రక్రియను చేపట్టి గుజరాతీ ప్రజలకు చిరస్మరణీయులయ్యారు. జైన గ్రంథ కర్తలు సరళ సాహిత్యానికి విశేష ప్రాధాన్యం ఇచ్చారు.

15వ శతాబ్దంలో గుజరాతీ భాషపై జైన ప్రభావం తగ్గి హిందూ ప్రాబల్యం పెరిగింది. హిందూ మత గ్రంథాలన్నీ గుజరాతీలోకి తర్జుమా చేయబడినాయి. ఆనాటి ప్రముఖ కవులు నరసింహ మెహతా, మీరాబాయ్, గుజరాతీ పద్యరచనకు నరసింహ మెహతా ఆద్యుడుగా చెబుతారు. గోవిందగమన, సుధామ చరిత్ర అనే ఇతడి రచనలు గుజరాతీలో ప్రముఖ గ్రంథాలు. మీరాబాయ్ (1499-1547) గుజరాత్‌లోనే కాక దేశంలోనే సుప్రసిద్ధ కవయిత్రి. మహారాణి అయిన ఆమె శ్రీ కృష్ణుని గురించి రచించిన భక్తి సాహిత్యం సుప్రసిద్ధం. వీరిద్దరి తర్వాత 'బాలన' అనే కవి కాదంబరి. రామ బాల చరిత్ర గుజరాతీలో వ్రాశాడు. నాకర, విష్ణుదాశ అనే కవులు రామాయణ, భారతాల్ని

గుజరాతీలో వ్రాసి ప్రసిద్ధులయ్యారు

ముస్లింల పాలనా కాలంలో గుజరాతీలో పెద్దగా సాహిత్య సృష్టి జరగలేదు బ్రిటిష్ వారి హయాంలో పాశ్చాత్య ప్రభావం గుజరాతీ భాష మీద హెచ్చుగా పడింది. నందశంకర రచించిన "కరణగెలో" (1866) గుజరాతీలో మొట్టమొదటి నవల గోవర్ధనం త్రిపాఠీచే రచింపబడిన "సరస్వతీ చంద్ర" అనే నవల కూడా గుజరాతీ ప్రజలలో గొప్ప ప్రాచుర్యం పొందింది. కేంద్ర ప్రభుత్వం మాజీ మంత్రి, ప్రసిద్ధి రాజనీతిజ్ఞుడు కె.యం. మున్షీ కూడా గుజరాతీలో గొప్ప రచయిత. చరిత్రలు వ్రాయటంలోనూ కల్పనా సాహిత్యంలో కూడా మున్షీ ప్రసిద్ధులే. ఇంకా గుజరాతీలో కాకాసాహెబ్ కలేల్కర్, సుందరం, ఉమాశంకర్ జోషి, పన్నాలాల్ పటేల్ మొదలైన వారు ప్రసిద్ధులు పన్నాలాల్ పటేల్‌కు 1985లో జ్ఞానపీఠ్ బహుమతి కూడ లభించింది

గుజరాత్‌లో చూడదగిన ప్రదేశాలు అనేకం. రాష్ట్రంలో కెల్లా పెద్ద పట్టణం అహ్మదాబాద్. లోగడ దీన్ని "మాంచెస్టర్ ఆఫ్ ఇండియా" అనేవారు. ఇంగ్లాండులోని మాంచెష్టర్‌లో ఎక్కువ బట్టల మిల్లులు వున్నట్లు ఇండియాలోని అహమ్మదాబాద్‌లో కూడా ఎక్కువ బట్టల మిల్లులు వుండుట వలన ఆ విధంగా అనేవారు. ఇప్పటికీ ఈ పట్టణం బట్టల మిల్లులకు ప్రసిద్ధి. దేశంలో తయారయ్యే బట్టలలో నాలుగో వంతు ఇక్కడే తయారవుతాయి. అహ్మదాబాద్‌లో చిన్న చిన్న బంకులలో నడిచే బట్టల కొట్లు రోజుకి కొన్ని లక్షల రూపాయల వ్యాపారం చేస్తూ ఉంటాయి సబర్మతీ నదీ ఒడ్డున వున్న అహ్మదాబాద్ 1411లో సుల్తాన్ అహ్మద్ షా చే పునాది వేయబడింది. ఒకానొక బ్రిటిష్ ప్రముఖుడు "అహ్మదాబాద్ భారతదేశంలో కెల్లా అందమైన నగరం" గా అభివర్ణించాడు. అహ్మదాబాద్‌లోని భద్రకోట, హతీసింగ్ దేవాలయం, జమ్మా మసీదు, కంకారియా సరస్సు, రూపమతి మసీదు, సబర్మతీ ఆశ్రమం చూడదగిన ప్రదేశాలు ఒకప్పుడు పన్నెండు ద్వారాలు, పూతోటలతో అలరారిన కోట భద్రకోట. ఈ కోటలో భద్రకాళి ఆలయం వుంది. జైన దేవాలయం హతీసింగ్ దేవాలయం 1848లో సేఠ్ హతీసింగ్ చే నిర్మించబడింది అచ్చమైన పాలరాతితో రక రకాల నగిషీలతో నిర్మించబడిన ఈ ఆలయం కడ రమ్యంగా వుంటుంది జమ్మా మసీదు దేశంలోని పెద్ద మసీదులలో ఒకటి. కంకారియా సరస్సులో లోగడ ముస్లిం చక్రవర్తి జహంగీర్ ఆయన భార్య నూర్జహాన్ షికార్లు చేసేవారట. ఇప్పుడు కూడా ఈ సరస్సులో అనేక మంది యాత్రీకులు బోటు షికారు చేస్తారు. ఈ సరస్సు మధ్యలో ఒక దీవి కూడా వుంది. 1560లో నిర్మించబడిన రూపమతి మసీదు గుజరాతీ శిల్పుల పనితనానికి గీటురాయి. సబర్మతీ ఆశ్రమం 1918లో మహాత్మాగాంధీ చే స్థాపించబడింది. గాంధీజీ 1918 నుంచి 1930 వరకూ ఇక్కడే వున్నారు. దేశ స్వతంత్ర్యానికి పూర్వం, అనేక ముఖ్య రాజకీయ

నిర్ణయాలు ఈ ఆశ్రమంలోనే తీసుకోబడినాయి. గాంధీజీకి సంబంధించిన అనేక వస్తు విశేషాలు ఇక్కడ భద్రపరచబడినాయి. గాంధీజీ అప్పట్లో కూర్చునే గది, ఆయన ఉపయోగించిన చాపలు, చిన్న రాసుకునే బల్ల, దుప్పటి, గడియారం, కళ్ళజోడు, ప్రపంచ నలుమూలల నుంచీ ఆయనకు వచ్చిన లేఖల ఫోటోస్టాట్ కాపీలు చూడవచ్చును. ఆయన ప్రార్ధనా సమావేశాలు జరిపిన ఒక చిన్న చెట్టు, దాని తిన్నె ఎన్నో మధురమైన జ్ఞాపకాలను రేకెత్తిస్తాయి.

అహ్మదాబాద్‌కు 19 కిలోమీటర్ల దూరంలో అదాలజ్‌వాల్ అనే చోట 500 సంవత్సరాలకు పూర్వం రాణి రుదాబాయ్ నిర్మించి "ఎయిర్ కండిషన్డ్" గదులు చూడవచ్చును. పెద్ద నుయ్యి త్రవ్వి ఆ నూతి చుట్టూ గదులు నిర్మించి వేసవి కాలంలో చల్లగా వుండటానికి ఆవిడ నిర్మించిన విచిత్ర పద్ధతి అది

బరోడాని ఇప్పుడు వడోద్రా అంటున్నారు. బరోడా సంస్థానాధీశులు గయిక్వాడ్‌ల ముఖ్యపట్టణం. అందమైన పార్కులు, చూడచక్కని భవంతులతో వుంటుంది బరోడా. నగరానికి మధ్యనున్న సుర్‌సాగర్ సరస్సు నగరానికి మరింత శోభనిస్తుంది. బరోడాలో లక్ష్మివిలాస్ పాలెస్, మకర్‌పూర్ పాలెస్, ప్రతాప్ విలాస్ పాలెస్‌లు చూడదగిన చక్కని భవంతులు. ఇక్కడ వున్న యం. యస్. విశ్వవిద్యాలయంలో ఒకప్పుడు మహర్షి అరవింద యోగి, ఉపాధ్యాయులుగా పనిచేశారు. మన రాజ్యాంగ నిర్మాత బాబాసాహెబ్, అంబేద్కర్ బరోడా.వారి స్కాలరు షిప్పుతోనే విద్యాభ్యాసం గావించారు. కీర్తి మందిరంలో గయిక్వాడ్ రాజులకు సంబంధించిన వస్తు విశేషాలు భద్రపర్చబడినాయి.

బరోడాకు కొద్ది దూరంలో పావుగడ్ వుంటుంది. రామ రావణ యుద్ధం జరిగినపుడు లక్ష్మణుడు మూర్ఛపోతే హనుమంతుడు సంజీవినీ పర్వతం తెస్తూ వుండగా అందులో నాలుగోవంతు జారి ఇక్కడ పడిందట. ఆ చిన్న కొండనే పావుగడ్ అంటారు.

అహ్మదాబాద్‌కు 235 కిలోమీటర్ల దూరంలో వుంటుంది సూరత్. ఇంగ్లీషు వారు ఇక్కడే తమ మొట్టమొదటి స్థావరం ఏర్పర్చుకుని వాణిజ్య కేంద్రం నెలకొల్పారు. తపతి నది ఒడ్డున వుంటుంది ఈ పట్టణం. ఇచ్చట సిల్కు జరీ చీరలు తయారు చేసే చిన్న చిన్న పరిశ్రమలు అనేకం వున్నాయి. సూరత్‌కోట 1546లో మహమ్మద్ బిన్ తుగ్లక్ చే నిర్మించబడింది. సూరత్‌కు దగ్గరలో హజీరా, ఉబారత్ అనే చక్కటి బీచ్‌లు వున్నాయి.

జునాగడ్‌కు 125 కిలోమీటర్ల దూరంలో గిర్ అడవులుంటాయి. 1300 చ॥ కి। మీ॥ వైశాల్యంలో వుండే ఈ అడవులలో సహజ వాతావరణంలో అన్ని అడవి జంతువుల్ని చూడవచ్చును. ప్రత్యేకించి సింహాలు ఇక్కడి ఆకర్షణ.

అహమ్మదాబాద్‌కు 215 కి॥ మీ॥ దూరంలో పాలిటానా కొండలపై 863 జైన దేవాలయాలున్నాయి. 11వ శతాబ్దంలో నిర్మించబడిన ఈ పాలరాతి దేవాలయాలు జైన మతస్తుల్నేగాక యాత్రీకులను కూడా విశేషంగా ఆకర్షిస్తాయి ఈ కొండలపై రాత్రిపూట ఎవ్వరూ ఉండటానికి వీల్లేదు. ఆఖరికి పూజారులు కూడా వుండరు. ఆ విధంగా వుండటం జైన దేవతల ఏకాంతానికి భంగం అని చెబుతారు.

సోమనాధ దేవాలయం సుప్రసిద్ధ ద్వాదశ జ్యోతిర్లింగాలలో ఒకటే గాక ముఖ్య శైవ క్షేత్రం. జునాగడ్‌కు 85 కిలోమీటర్ల దూరంలో వుండే ప్రభాస్ పట్టణంలో వుంటుంది సోమనాధ దేవాలయం. మహాభారతంలో ప్రబాస్ పట్టనం గురించి అనేకసార్లు చెప్పబడింది. సరస్వతీ నది సముద్రంలో కలిసే చోటునే ప్రభాస్ పట్టణం వుంటుంది. శ్రీకృష్ణుడు తన అవతారం ఇక్కడే చాలించాడని ప్రతీతి సోమనాధ దేవాలయం క్రీస్తుకు పూర్వమే నిర్మించబడింది. ఆనాడు సోమనాధ దేవాలయం హిందూ సాంస్కృతిక వ్యాప్తికి కేంద్రంగా కూడా వుండేది 1026లో గజనీ మహమ్మద్ ఈ దేవాలయంపై 7 సార్లు దండెత్తి దేవాలయంలో వున్న సంపదనంతా ఎత్తుకుపోవటమే గాక దేవాలయాన్ని నేల మట్టం చేశాడు బండ్ల కొద్దీ బంగారం నగలు ఎత్తుకు పోవటమే గాక దేవాలయం గేట్లు కూడా పట్టుకుపోయాడు. తర్వాత ఈ దేవాలయం మొదటి భీమ అనే రాజుచే తిరిగి నిర్మించబడింది. 13వ శతాబ్దంలో ఢిల్లీ సుల్తాన్ అల్లాఉద్దీన్ ఖిల్జీ మళ్ళీ దేవాలయంపై దండెత్తి సర్వనాశనం చేశాడు. తర్వాత జునాగడ్ రాజు మహిపాల్ మళ్ళీ దేవాలయాన్ని నిర్మింపచేశాడు 18వ శతాబ్దంలో ఔరంగజేబు తిరిగి దేవాలయాన్ని నేలమట్టం చేస్తే ఇండోర్ రాణి అహల్యాబాయ్ తిరిగి దేవాలయాన్ని నిర్మించింది. ప్రస్తుత దేవాలయం 1951లో భారత ప్రభుత్వంచే పునర్నిర్మించబడింది.

మహాభారతంలో ద్వారకపేరు ఎన్నిసార్లు వస్తుందో చెప్పలేము అలనాడు శ్రీకృష్ణుడు ఏలిన రాజ్యం ఇది జాంనగర్‌కు 180 కిలోమీటర్ల దూరంలో సముద్రం ఒడ్డున వుంటుంది. అయితే అసలు ద్వారక యుగాంతంలో సముద్రంలో కల్సిపోయిందని చెబుతారు ఈ మధ్య జలగర్భంలో కట్టడాలు బయటపడినవని కూడ వార్త వచ్చింది. ఇక్కడ వున్న ఆలయాలలో ప్రసిద్ధి చెందినది ద్వారకాధీష్ ఆలయం. దీన్ని జగత్‌మందిర్ అని కూడా అంటారు శ్రీ కృష్ణునికి అంకితమైన ఆలయం ద్వారాకాధీష్ ఆలయానికి రెండు కిలోమీటర్ల దూరంలో శ్రీకృష్ణుని పెద్ద భార్య రుక్మిణి ఆలయం వుంటుంది. ఇచ్చట శంకరాచార్యుల వారు స్థాపించిన ద్వారకా పీఠం కూడా వుంటుంది.

అహ్మదాబాద్‌కు 475 కిలోమీటర్ల దూరంలో వుంటుంది పోర్‌బందర్ ఇక్కడనే పూజ్య బాపూజీ జన్మించినది. గాంధీజీ పుట్టిన ఇంటిని చూడవచ్చును. ఈ ఇంటికి కొద్ది దూరంలో "కీర్తి మందిర్" అనే పేరుతో 79 అడుగుల ఎత్తున బాపూజీ స్మృత్యార్థం

ఒక భవంతి నిర్మించారు. ప్రతి సాయంత్రం 79 దీపాలు వెలిగిస్తారు గాంధీజీ 79వ సంవత్సరంలో మరణించిన కారణంగా ఆ విధంగా చేస్తారు కీర్తి మందిర్‌లో గాంధీజీ జీవిత విశేషాలు చిత్రించబడినాయి. గాంధీజీ సాహిత్యంతో కూడిన లైబ్రరీ కూడా వుంది

పోర్‌బందర్‌కు 60 కిలోమీటర్ల దూరంలో మాధవ్‌పూర్ వుంటుంది శ్రీ కృష్ణుడు రుక్మిణిని ఎత్తుకుపోయి పెళ్ళాడింది ఇచ్చటేనని చెబుతారు. శ్రీకృష్ణ రుక్మిణీ కళ్యాణ మహోత్సవాన్ని 'మాధవోత్సవం' పేరుతో ప్రతి సంవత్సరం చైత్రమాసంలోజరుపుకుంటారు ఇచ్చట ప్రజలు ఈ మాధవోత్సవంలో జనం విశేషంగా పాల్గొని సంగీత, నృత్యాలతోకాలక్షేపం చేయటమే గాక యువజంటలు ఆనాడు శ్రీకృష్ణుడు రుక్మిణిని ఎత్తుకు పోయినట్లుగా ఈనాడు ఆ విధంగా అభినయించి పండుగను సరదాకా జరుపుకుంటారు.

గుజరాతీ ప్రజలు కష్ట జీవులే గాక వ్యాపార వేత్తలు కూడా దేశ దేశాలలో గుజరాతీలు వ్యాపార వేత్తలుగా ప్రసిద్ధి పొందారు. గుజరాతీ ప్రజల ముఖ్య పండుగ దీపావళి వారు ఈ పండుగను ఘనంగా చేసుకోవటమే గాక ఈ పండుగ నుంచే వారు వ్యాపార లావాదేవీలు ప్రారంభించుకొంటారు. పరస్పరం అభినందనలు తెలుపుకొని విందు భోజనాలు ఏర్పాటు చేసుకొంటారు. నవ రాత్రి కూడా గుజరాతీలకు ముఖ్య పండుగ. పార్సీవారు నౌరోజ్(నూతన సంవత్సరం) ఘనంగా చేసుకుంటారు. డాంగ్ అనే ఆదివాసులు మార్చి నెలతో 'డాంగ్ దర్బార్ గొప్పగా చేసుకుంటారు. ఈ ప్రజలు ఆ పండుగ రోజున నూతన వస్త్రాలు ధరించి పరస్పరం రంగునీళ్ళు గులాం జల్లుకుంటారు.

గుజరాత్ జరీ చీరలకు ముఖ్యంగా "పటోలా" చీరలు దేశ వ్యాప్తంగా ప్రసిద్ధం.

భారత స్వాతంత్ర ఉద్యమాన్ని సర్వజన ప్రజా ఉద్యమం నడిపిన కీర్తి గాంధీజీది కాగా, స్వతంత్ర భారత దేశాన్ని సమైక్యంగా నిలిపిన ఘనత సర్దార్‌పటేల్‌ది. 400కు పైగా స్వతంత్ర సంస్థానాలు నవ భారత్‌లో విలీనం చేశారు. బ్రిటిష్ వారి షడ్యంత్రాన్ని వమ్ము చేశారు. రాజకీయ ప్రముఖులలో మరొకరు శ్రీ మొరార్జీదేశాయి.

# 10 పంజాబ్

వైశాల్యం - 50362 చదరపు కిలోమీటర్లు. జనాభా - 2 కోట్ల 1 లక్ష రాజధాని - చండీఘర్. మాతృ భాష - పంజాబీ.

పంజాబ్‌కు పడమర పాకిస్తాన్, ఉత్తరాన జమ్ము, కాశ్మీర్, ఈశాన్యంగా హిమాచల్ ప్రదేశ్, దక్షిణాన హర్యానా, రాజస్తాన్ సరిహద్దులుగా వుంటాయి.

పంజాబ్ రాష్ట్రం వైశాల్యం రీత్యా ఆంధ్రప్రదేశ్‌లో అయిదో వంతు కన్నా ఇంకా తక్కువే వుంటుంది. గుంటూరు, ప్రకాశం జిల్లాలు మినహాయించి మిగతా కోస్తా జిల్లాలు ఎంత వైశాల్యం కల్గివుంటాయో సుమారు అంత వైశాల్యం కల్గి వుంటుంది పంజాబ్. జనాభా రీత్యా మన రాష్ట్ర జనాభాలో మూడో వంతు కన్నా ఇంకా తక్కువగా వుంటుంది పంజాబ్ రాష్ట్రం.

పంజాబ్‌ను టూకీగా రెండు ప్రాంతాలుగా విభజించవచ్చు. హోషియార్ పూర్, గురుదాస్‌పూర్ జిల్లాలు ఒక భాగంగాను (ఉపశివలిక ప్రాంతం) మిగతా జిల్లాలన్నీ రెండో భాగంగాను (సట్లేజ్, ఘాగర్ మైదానం) చెప్పవచ్చును. పంజాబ్ మొత్తం అంతా సారవంతమైన ప్రాంతమైనా సట్లేజ్ ఘాగర్ మైదాన ప్రాంతం ఇంకా మిక్కిలి సారవంతమైన ప్రాంతం రావి, బియాస్, సట్లేజ్‌ల ఉపనదుల ద్వారానూ ఇంకా ఘాగర్ నదీ జలాలతోనూ సస్యశ్యామలంగా వున్న ప్రాంతం.

పంజాబ్ అనే మాట పర్షియన్ భాష నుండి వచ్చింది 'పంజ' అంటే అయిదు 'అబ్' అంటే నీరు అని అర్థం కావటంతో అయిదు నదులు ప్రాంతం కాబట్టి పంజాబ్ అని పేరు వచ్చింది. ఇంతకు పూర్వం దీన్ని సప్తసింధు అంటే ఏడు నదుల ప్రాంతం అని కూడా అనేవారు. సింధు, జీలం, చీనాబ్, రావి, బివయాస్, సట్లేజ్, సరస్వతి అనేవి ఏడు నదులు. సరస్వతి నది ఇప్పుడు లేనేలేదు. 1947 లో భారత్ పాకిస్తాన్‌లు విడిపోయినప్పుడు రెండు నదులు పాకిస్తాన్‌కు వెళ్ళినా లోగడలాగానే పంజాబ్ (అయిదు నదుల దేశం) అనే పిలవబడుతోంది. ప్రస్తుత పంజాబ్ రాష్ట్రంలో బియాస్, సట్లేజ్ నదులు ప్రవహిస్తూ వుంటాయి. రావినది కొంతదూరం పంజాబ్‌లో ప్రవహించి పాకిస్తాన్‌లో ప్రవేశిస్తుంది. పంజాబ్‌లో సగటున సంవత్సరానికి 60 సెం.మీ. వాన పడుతుంది.

క్రీస్తుకు పూర్వం కొన్ని వేల సంవత్సరాల నుంచి పంజాబ్ చరిత్ర ప్రారంభమవుతుంది. ఉత్తరాన్నుంచి ఇండియాకు వచ్చే దండయాత్రలన్నీ ఈ పంజాబ్ మీదుగానే రావటంతో పంజాబ్ అంతా ఒక యుద్ధభూమిగానే వుండేది. మధ్య ఆసియా నుంచి వచ్చిన ఆర్యులు ఇచ్చట స్థిరనివాసం ఏర్పర్చుకున్నారని, దాంతో పంజాబ్‌కు మరింత ప్రాధాన్యం

లభించిందని వేదాలలో మొదటిదైన ఋగ్వేదం ఇక్కడనే వ్రాయబడిందని చెబుతారు. క్రీ. పూ. 522లో పర్షియా రాజు డేరియస్ దండెత్తి వచ్చి ఈ ప్రాంతం జయించి తన సామంత రాజ్యంగా చేసుకున్నాడట. క్రీ. పూ. 326లో అలెగ్జాండర్ దండెత్తి వచ్చి పంజాబ్‌ను తన పాలనలోకి తీసుకున్నాడు. తదుపరి కొంతకాలం పంజాబ్ గ్రీక్ సైనికాధికారుల పాలనలో కూడా వుంది. చంద్ర గుప్త మౌర్యుడు వీరిని తరిమి కొట్టి తన సామ్రాజ్యంలో కలుపుకున్నాడు. మౌర్య సామ్రాజ్య పతనానంతరం ఈ ప్రాంతం సింధియన్లు, పార్థియన్లు, కుషాన్ చేతుల్లోకి వెళ్ళింది. తర్వాత స్థానిక పాలకుల చేతుల్లోకి వచ్చింది.

10వ శతాబ్దం తర్వాత మొగల్ సామ్రాజ్య నిర్మాత బాబర్‌తో ముస్లిం దండయాత్రల మూలంగా పంజాబ్ తీవ్ర అల్లకల్లోల పరిస్థితికి గురైంది. ముస్లిం పాలకుల అఘాయిత్యాలు మితిమీరినాయి. హిందూ ముస్లిం పోరాటాలు తీవ్ర స్థాయికి చేరుకున్నాయి.

ఈ పరిస్థితులలో సిక్కు మత స్థాపకుడు గురునానక్ వేదిక మీదకు వచ్చాడు. 1469లో జన్మించిన గురునానక్ అసలు పేరు చాంద్. మాతా మహుల ఇంటి (నానక్) వద్ద జన్మించాడు. కాబట్టి నానక్ చాంద్ అని పిల్చేవారు. చిన్నప్పుడు పెద్దగా చదువు అబ్బలేదు. పెళ్ళి అయిన కొన్నాళ్లకు హిందూ ముస్లిం ఉద్రిక్తతల నేపథ్యంలో నానక్ సత్యాన్వేషణలో తీవ్రంగా నిమగ్న మయ్యాడు. హిందూ ముస్లిం మతాలకు మధ్యే మార్గంగా రెండు మతాల మేలు కలయికతో ఒక నూతన మతాన్ని ప్రారంభించాడు. "బాల"



అనే హిందూ రైతుని, "మర్దానా" అనే ముస్లిం సంగీతకారుని వెంటేసుకుని గ్రామ గ్రామం తిరుగుతూ తన సిద్ధాంతాలను ప్రచారం చేశాడు గురునానక్. హిందూ ముస్లిం సంఘర్షణలతో విసిగిపోయిన ప్రజలు ముఖ్యంగా గ్రామ ప్రాంత రైతులు నానక్ బోధనలకు ఆకర్షించబడ్డారు. అనేకమంది శిష్యులు నానక్ చుట్టూ పోగయ్యారు. ఈ శిష్యులే శిక్కులు. శిష్య అనే సంస్కృత మాటను పంజాబీలో శిక్కు అంటారు. గురునానక్ తర్వాత 9 మంది గురువులు ఈ శిక్కు మత వ్యాప్తికి మరింత తోడ్పడ్డారు. మొదట్లో శిక్కులు చాలా సాధువులుగా అహింసాయుతంగా వుండేవారు. రాను రాను శిక్కులపై ముస్లిం పాలకుల దౌర్జన్యాలు జరపటంతో వారిని ఎదిరించటం కోసం తీవ్రవాదులుగా తయారయ్యారు. ముఖ్యంగా గురు గోవింద్‌సింగ్ కాలంలో శిక్కులు సుశిక్షితులైన యోధులుగా తయారయ్యారు. అప్పటి నుంచి ప్రతి శిక్కు వారి మత ప్రత్యేకత నిల్పుకోవటం కోసం ఖడ్గం ధరించటం, జుట్టు కత్తిరించుకోకుండా వుండటం మొదలైన వాటిని ఆచరించటం ప్రారంభించారు. 15, 16 శతాబ్దాలలో ప్రత్యేక పంజాబ్ రాజ్యం రూపుదిద్దుకొంది. గురునానక్ తర్వాత వరుసగా అంగద్, అమర్‌దాస్, రామదాస్, అర్జున్, హరిగోవింద్ మొదలైన వారు సిక్కు గురువులుగా వచ్చారు. అంగద్ గురునానక్ బోధనలను గురుముఖిలో రచించాడు. రామదాస్ అమృతసర్‌లోని స్వర్ణదేవాలయానికి పునాదులు చేశాడు. 5వ గురువు అర్జున్ తనకు పూర్వం వున్న గురువుల బోధలలన్నీ క్రోడీకరించి గ్రంథసాహెబ్‌గా ఏర్పరచాడు. ఇదే సిక్కుల ఆదిగ్రంథం. 6వ గురువైన హర్‌గోవింద్ ఆనాటి ముస్లిం పాలకుల దౌష్ట్యాన్ని ఎదిరించటం కోసం శిక్కులను సుశిక్షితులైన యోధులుగా తీర్చిదిద్దాడు. దీన్నే "ఖల్సా" అని కూడా అంటారు. శిక్కుల ఆఖరి గురువు గోవింద్ సింగ్ (10వ గురువు) తనతో గురు వ్యవస్థ అంతమయిందని ప్రకటించాడు. శిక్కుజాతి పరిపూర్ణత పొందినదని ఇక నుంచి 'గ్రంథసాహెబ్' లో చెప్పినట్లుగా శిక్కులందరూ నడుచుకోవాలని గోవింద్‌సింగ్ ఆదేశించాడు.

1801లో మహారాజా రంజిత్‌సింగ్ పంజాబ్ సింహాసనాన్ని అధిష్టించటంతో పంజాబ్ చరిత్ర ఒక మలుపు తిరిగింది. రంజిత్‌సింగ్ హయాంలో పంజాబ్ ఎల్లలు కాశ్మీర్ వరకే గాక ఆఫ్ఘనిస్తాన్, వాయువ్య సరిహద్దు రాష్ట్రం వరకూ కూడా విస్తరించినాయి. రంజిత్‌సింగ్ మరణంతో మళ్ళీ పంజాబ్ రాజ్యం చిన్నాభిన్నమయింది. ఈ లోగా బ్రిటిష్ వారు పంజాబ్‌ను ఆక్రమించుకోవటానికి ప్రయత్నించటంతో శిక్కులకు, బ్రిటిష్‌వారికి 1845, 1848లో యుద్ధాలు జరిగినై. ఎట్టకేలకు బ్రిటీష్‌వారు శిక్కులను ఓడించి పంజాబ్‌ను తమ ఆధీనంలోకి తీసుకున్నారు.

దేశ విభజనతో పంజాబ్ రాష్ట్రాన్ని భారత్, పాకిస్తాన్‌లు పంచుకోవల్సి వచ్చింది. విభజన సమయంలో దేశంలో కెల్లా అన్ని విధాలా అష్టకష్టాలు పడిందీ పంజాబ్ వారే! 1956లో పంజాబ్‌ను ఆనుకొని వున్న సంస్థానాలను కూడా ఇందులో కలిపారు ఈలోగా పంజాబ్ అకాలీ నాయకులు సంత్‌ఫతేసింగ్, మాస్టర్ తారాసింగ్‌లు శిక్కులకు ప్రత్యేక రాష్ట్రం (పంజాబీసుభా) కోసం ఆందోళన ప్రారంభించారు. 1966లో శ్రీమతి ఇందిరా గాంధీప్రధాని అయిన తర్వాత అకాలీల కోర్కె మేరకు పంజాబ్‌ను విభజించి పంజాబ్ మాట్లాడే ప్రాంతాన్ని పంజాబ్‌గాను, హిందీ మాట్లాడే ప్రాంతాన్ని హర్యానాగాను, కొండ

ప్రాంతాలలో హిమాచల్ ప్రదేశ్‌గాను [illegible]. చండీఘర్‌ను కేంద్ర పాలిత ప్రాంతంగా చేసి పంజాబ్, హర్యానాల [illegible]రు.

నూతన పంజాబ్‌కు కాంగ్రెసుకు చెంది[illegible] [illegible]సింగ్ ముసాఫిర్ ముఖ్యమంత్రి అయ్యారు. ఆ తర్వాత జ్ఞాని జైల్‌సింగ్ ముఖ్యమంత్రి అయ్యారు. ఇందిరా గాంధీ అత్యవసర పరిస్థితి తదనంతరం జరిగిన ఎన్నికలలో అకాలీదళ్ అధికారంలోకి వచ్చింది. ప్రకాశ్‌సింగ్ బాదల్ ముఖ్యమంత్రి అయ్యారు. ఈ ప్రభుత్వం ఎంతో కాలం నిలవలేదు. తరువాత దర్బార్‌సింగ్ నాయకత్వాన కాంగ్రెసు అధికారంలోకి వచ్చింది. అధికారం కోల్పోయిన అకాలీలు లోగడ ఎప్పుడో చేసిన ఆనంద్‌పూర్ సాహిబ్ తీర్మానాన్ని అమలు పర్చాలని రాష్ట్రానికి ఎక్కువ అధికారాలు ఇవ్వాలని డిమాండ్ చేయడం ప్రారంభించారు. ఇదిలా వుండగా భింద్రేన్ వాలా నాయకత్వంలో ఉగ్రవాదులు తలెత్తి అసలు పంజాబ్ ప్రత్యేక రాజ్యంగా విడిపోవాలని ఖలిస్తాన్ ఏర్పడాలని అందుకోసం ప్రాణత్యాగం కూడా చేస్తామని చెబుతూ ఉగ్రవాద చర్యలలకు పాల్పడ్డారు. అంతేగాక స్వర్ణదేవాలయాన్ని ఆయుదాలలతో నింపి తమ స్థావరంగా చేసుకొని కేంద్ర ప్రభుత్వాన్ని ఎదిరించటం ప్రారంభించారు.. దాంతో గత్యంతరం లేక కేంద్ర ప్రభుత్వం 1984లో "ఆపరేషన్ బ్లూస్టార్" పేరిట స్వర్ణదేవాలయంలోకి సైన్యాన్ని పంపి ఉగ్రవాదులను తరిమి వేయాల్సి వచ్చింది. ఈ చర్యలో భింద్రేన్‌వాలాతో సహా ఇరుపక్షాలలోనూ అనేకమంది మరణించారు తర్వాత ఆకాలీ ప్రభుత్వం ఏర్పడ్డా ఉగ్రవాదుల ఆటకట్టించటంలో విఫలం కావటంతో రాష్ట్రపతి పాలన విధించవల్సి వచ్చింది. 1966 తర్వాత పంజాబ్‌లో రాష్ట్రపతి పాలన విధించటం ఇది 9వ సారి. పంజాబ్‌లో ఇప్పటికీ అల్లకల్లోల పరిస్థితిగానే వుంది. శాంతి భద్రతలు కరువయ్యాయి. ఉగ్రవాదులు ఇప్పటికీ తమ ధోరణి మార్చుకోలేదు.

పంజాబ్ 12 జిల్లాలుగా విభజించబడి వుంటుంది. అవి-అమృతసర్, బటిండా, ఫరీద్‌కోట్, ఫిరోజ్‌పూర్, గురుదాస్‌పూర్, హోషియార్‌పూర్, జలంధర్, కపుర్తలా, లూధియానా, పాటియాలా, సంగ్రూర్, రూప్‌నగర్.

పంజాబ్‌కు ఒకే సభగల చట్టసభ వుంది. 117 మంది శాసనసభ్యులు వుంటారు. లోక్‌సభలో 13మంది సభ్యులు. రాజ్యసభలో 7గురు పంజాబ్‌కు ప్రాతినిధ్యం వహిస్తారు. పంజాబ్ ప్రజలలో 60 శాతం శిక్కులు, 38 శాతం హిందువులు, మిగతావారు క్రైస్తవులు, ముస్లింలు. రాష్ట్ర జనాభాలో చదవనూ, వ్రాయనూ వచ్చిన వారు 57 శాతం మంది.

పంజాబ్ ప్రధానంగా వ్యవసాయ రాష్ట్రం. 70 శాతం మంది ప్రజలకు వ్యవసాయమే జీవనాధారం. పంజాబ్‌లో వున్న మొత్తం భూమిలో 84 శాతం భూమి సాగులో వుంది. ఈ సందర్భంగా భారత దేశ విస్తీర్ణంలోల 41 శాతం మాత్రమే సాగుబడిలో వున్నదని గుర్తుంచుకుంటే పంజాబ్‌లో భూమిని రైతులు ఏ విధంగా సద్వినియోగం చేస్తున్నారో తెలుస్తుంది. పంజాబ్ రైతులు కష్టజీవులు. అధిక దిగుబడి వంగడాలు, అధిక ఎరువులు ఉపయోగించి ఆధునిక పద్ధతులో వ్యవసాయం చేస్తూ దేశంలో కెల్లా మిన్నగా పంటలు పండిస్తున్నారు. 'హరిత విప్లవం'తో పంజాబ్ రైతులు తమ జీవన ప్రమాణాన్ని కూడా దేశంలో కెల్లా ఉన్నతంగా పెంచుకున్నారు. దేశ విభజన సందర్భంగా

వ్యవసాయంతో సహా అన్ని రంగాలలోనూ అస్తవ్యస్త పరిస్థితిలో కృంగిపోయిన పంజాబ్ అనతికాలంలోనే అగ్రస్థానానికి ఎగబ్రాకింది. ఈ మధ్య ఒకానొక దినపత్రిక జరిపిన సర్వే ప్రకారం పంజాబ్‌లో 15 ఎకరాలు కల్గిన రైతు మొదటి తరగతి ప్రభుత్వోద్యోగితో సమానంగా జీవన ప్రమాణం కల్గివున్నాడని తేలింది. దీన్ని బట్టి పంజాబ్ రైతుల వైభవం ఊహించవచ్చు. పంజాబ్‌లో ప్రతి గ్రామానికి కరెంటు వుంటుంది. పంజాబ్ గ్రామసీమలు కళ కళ లాడే పైరు పచ్చదనాలతో, పుష్కలమైన పంటలతో దేశానికే మార్గదర్శకంగా వుంటాయి

పారిశ్రామికంగా కూడా పంజాబ్ ముందంజలో వుంది. అంత చిన్న రాష్ట్రంలో 40 వేల చిన్న పరిశ్రమలున్నాయంటే వారి పారిశ్రామికాభివృద్ధి ఊహించవచ్చు. ఇక్కడ ప్రధానంగా వస్త్రాలు, కుట్టు మిషన్లు, ఆటవస్తువులు, సైకిళ్ళు, పంచదార, ఎరువులు, శాస్త్ర పరికరాలు తయారవుతాయి. కపుర్తలాలో బ్రహ్మాండమైన రైల్వే కోచ్ ఫ్యాక్టరీ తయారవుతోంది.

పంజాబ్ భాషా చరిత్ర 11వ శతాబ్దం నుంచి మాత్రమే ప్రారంభమవుతుంది. సంస్కృతం, అరబిక్, పర్షియన్ భాషల ప్రభావం పంజాబీపై వుంటుంది. గురునానక్‌కు ముందున్న పంజాబీ సారస్వతం గురించి పెద్దగా చెప్పుకోదగిందేమీ లేదు. గురునానక్ ఆ తర్వాత వచ్చిన శిక్కు గురువులు పంజాబీ సారస్వతాన్ని సుసంపన్నం చేశారు. పంజాబ్ భాషలో గ్రంథసాహిబ్(ఆదిగ్రంథం) ముఖ్యమైనది. శిక్కు గురువుల బోధలన్నింటినీ ఈ గ్రంథంలో పొందుపర్చారు. శిక్కు గురువుల బోధలన్నింటినీ పద్యాలలో వెల్లడించారు. ఈ కాలంలో పంజాబ్ సాహిత్యం ఉచ్ఛదశనందుకుంది గురునానక్(1469) నుంచి గురుగోవింద్‌సింగ్(1708) వరకూ పంజాబ్ సాహిత్యానికి స్వర్ణయుగం అని చెప్పవచ్చును. ఆది గ్రంథంలో పద్యాలన్నీ రాగయుక్తంగా వుండి పాడుకోవటానికి వీలుగా వుంటాయి. 1600 నుంచి 1800 వరకూ వున్న 200 సంవత్సరాల కాలంలో సంస్కృతంలో వున్న ముఖ్య గ్రంథాలన్నీ రామాయణ, భారతాలతో సహా పంజాబీలోకి తర్జుమా చేయబడినాయి.

ఆధునిక యుగానికి వస్తే ముఖ్యంగా చెప్పుకోదగినవారు వీర్‌సింగ్ (1872-1957) ఈయన వ్రాసిన నాటకాలు, పద్యాలు, కల్పిత కథలు, నవలలు అనేకం. అసలు ఇన్ని గ్రంథాలు వ్రాసిన మరో భారతీయ గ్రంథకర్త లేరని కూడా అంటారు. వీర్‌సింగ్ "ఖల్సా సమాచార్" అనే వారపత్రిక కూడా నడిపేవాడు. పురాణ్‌సింగ్, క్రిపాసింగ్ కూడా ప్రసిద్ధి పొందినవారు. గురుముఖ్‌సింగ్ ముసాఫిర్(1899-1976) హరిసింగ్ దర్ద్ (1889-1964)లు గొప్ప రచయితలే గాక జాతీయోద్యమానికి దోహదం చేసినవారు కూడా ప్రస్తుత కాలానికి వస్తే అమృతా ప్రీతమ్ చెప్పుకోదగిన రచయిత. ఈమెకు జ్ఞానపీఠ్ బహుమతి కూడా లభించింది. ఇంకా చెప్పుకోదగినవారు హర్‌భజన్‌సింగ్, హరిచరణ్‌సింగ్,

కె యస్ దుగ్గల్, ప్రసిద్ధ రచయిత, సంపాదకుడు కుష్వంత్‌సింగ్ కూడా పంజాబీవారే.

పంజాబ్‌లో సందర్శించదగిన వాటిలో ముఖ్యమైనది అమృతసర్. 1577కు పూర్వం ప్రస్తుత అమృత్‌సర్ వుండే చోట 'టుంగ్' అనే గ్రామం వుండేది. 1577లో శిక్కుల 4వ గురువైన రామదాస్ ఈ టుంగ్ గ్రామంలో పెద్ద సరస్సు త్రవ్వించి దానికి అమృత్‌సర్ అనే పేరు పెట్టాడు రామదాస్ కుమారుడు 5వ శిక్కు గురువు అర్జున్ ఈ సరస్సు మధ్య ఆలయం నిర్మింపచేశాడు. 1761లో అహ్మద్‌షా ఈ ఆలయాన్ని నేల మట్టం చేస్తే 1764లో దీని పునర్నిర్మాణం జరిగింది. ఆలయం క్రింద భాగం పాలరాతితోనూ, పై భాగం రాగి రేకులతో నిర్మించి పైన బంగారం తాపడం చేశారు.

ఈ బృహత్కార్యానికి మహారాజా రంజిత్ సింగ్ పూనుకున్నాడు. బంగారం తాపడం చేయటానికి 400 కిలోల బంగారం పట్టిందట! బంగారంతో కప్పబడిన ఆలయం కాబట్టి స్వర్ణదేవాలయం అని పిలుస్తారు. ద్వారాలు, తలుపులు వెండి రేకుతో కప్పబడి వుంటాయి. దేవాలయానికి నాలుగు వైపులా ద్వారాలుంటాయి. అంటే దాని అర్థం - అన్ని మతస్తులవారికి దీనిలోకి ప్రవేశం వుంటుందని, సరస్సు మధ్యలో నున్న దేవాలయాన్ని చేరటానికి 204 అడుగుల పొడవుగల వంతెన వుంటుంది. ఈ వంతెన కూడా పాలరాతితో నిర్మించబడిందే. ఈ దేవాలయంలో యాత్రీకులకు, భక్తులకు ఉచిత భోజనం ఏర్పాటు చేస్తారు. ఒక్కో రోజున 20 వేల మంది కూడా ఇక్కడ భోజనాలు చేస్తారు.

స్వర్ణ దేవాలయాన్ని హర్‌మందిర్, దర్బార్ సాహిబ్ అని కూడా పిలుస్తారు. ఈ దేవాలయంలో సిక్కులకు పరమ పవిత్రమైన గ్రంథం గ్రంథ్‌సాహెబ్ అసలు ప్రతి గర్భ గుడిలో సిల్కు వస్త్రంపై వుంటుంది. ఈ గ్రంథ సాహిబ్‌ను పగలనక, రేయనక ఎల్లప్పుడూ చదువుతూ వుంటారు. స్వర్ణ దేవాయలం పడమర ద్వారం ముందు అకల్‌తక్త్ వుంటుంది. తక్త్ అంటే సింహాసనం అని అర్థం. శిక్కుల ప్రధాన సమస్యలు పరిష్కరించవల్సినప్పుడు ప్రధాన పూజారి ఈ సింహాసనం మీద కూర్చొని అంతిమ తీర్పు ఇస్తాడు ఈ తీర్పుకు తిరుగులేదు. ఇక్కడనే పూర్వపు శిక్కు వీరుల రకరకాల ఆయుధాలు, బంగారం ఆభరణాలు భద్రపర్చబడినాయి. స్వర్ణదేవాలయానికి వెళ్ళే వారు కాళ్ళు కడుక్కొని తలకు గుడ్డ చుటుకొని వెళ్ళాలి.

అమృత్‌సర్‌లో చూడదగిన మరొక ముఖ్య విశేషం జలియన్‌వాలాబాగ్. ఇది స్వర్ణ దేవాలయానికి 400 గజాల దూరంలోనే వుంటుంది. చుట్టూ ఎత్తైన ప్రహరీ గోడ, సన్నని ద్వారం గుండా లోపలికి వెళితే పార్కు వుంటుంది. 1919లో ఇక్కడే కిరాతకుడైన జనరల్ డయ్యర్ 2 వేల మందిని నిరపరాధుల్ని కాల్చి చంపింది. శాంతి యుతంగా సభ జరుపుకుంటున్న ప్రజలపై ఎట్టి హెచ్చరిక లేకుండా, నిష్కారణంగా

జనరల్ డయ్యర్ కాల్పులకు ఉత్తర్వు చేసేటప్పటికి, జనం భీతావహులై సన్నని ద్వారం గుండా వెళ్ళే వీలు లేక కాల్పులలో కొన్ని వందల మంది త్రొక్కిసలాటలో ప్రాణాలు కోల్పోయారు ఇంకా కొన్ని వందల మంది కాల్పులలో మరణించారు ఈ దారుణ సంఘటన భారతదేశ స్వతంత్ర పోరాట చరిత్రలో ఒక ఉద్రిక్త ఘట్టం. ఆంగ్లేయుల కిరాతక చర్యకు నిదర్శనంగా ఈ తోటను ఆపళంగానే అట్టి పెట్టారు ఆనాటి తుపాకి తూటాల దెబ్బలు ఇప్పటికీ చూడవచ్చు ఇక్కడ మరణించిన వీరుల చిహ్నంగా జ్యోతి ఎల్లప్పుడూ వెలుగుతూ వుంటుంది

పాత అమృత్‌సర్‌లో దుర్గియానా దేవాలయం చూడదగినది ఇది హిందూ దేవాలయం, లక్ష్మీనారాయణ మందిరం. ఇది కూడా సరిగ్గా స్వర్ణ దేవాలయం నమూనాలోనే సరస్సు మధ్యలో నిర్మించబడి వుంటుంది. ఇక్కడ కూడా నిర్విరామంగా భజనలు చేస్తూ వుంటారు

ఇంకా అమృత్‌సర్‌లో అనేక శిక్కు దేవాలయాలు, హిందూ దేవాలయాలు, మసీదులు కూడా వున్నాయి. ఉలెన్, సిల్కు ఫ్యాక్టరీలు కూడా అమృత్‌సర్‌లో ఉన్నాయి. అమృత్‌సర్ జనాభా 6 లక్షల 50 వేలు. ఈ నగరానికి 30 కిలో మీటర్ల దూరంలో పాక్ సరిహద్దు ఉంటుంది.

భాక్రానంగల్ ప్రాజెక్టు సట్లేజ్ నదిపై 740 అడుగుల ఎత్తు నిర్మించిన బ్రహ్మాండమైన ప్రాజెక్టు. ప్రపంచంలో కెల్లా ఎత్తైన ఆనకట్ట ఇదే! 66 చదరపు మైళ్ళ వైశాల్యం కల్గిన గోవిందసాగర్ రిజర్వాయర్ కల్గి వుంటుంది. భారతదేశానికే గర్వకారణమైన ఈ బృహత్తర ప్రాజెక్టు వలన పంజాబ్‌కే గాక చుట్టుపట్ల రాష్ట్రాలకు కూడా అనేక లక్షల ఎకరాలకు సాగునీరు, విద్యుచ్ఛక్తి లభిస్తోంది ఇక్కడొక పెద్ద ఎరువుల కర్మాగారం కూడా వుంది

సట్లేజ్ నదికి దిగువగా నంగల్ డాంకు 26 కిలోమీటర్ల దూరంలో శిక్కుల పుణ్యక్షేత్రం ఆనంద్‌పూర్ సాహెబ్ వుంటుంది. గురుతేజ్ బహదూర్ ఇక్కడ పాతిక సంవత్సరాలు గడిపారు ఆత్మ రక్షణ కోసం ఆయుధాలు ధరించటం (కల్సా) ఇక్కడే ప్రవేశపెట్టబడింది. ఇంతేగాక అకాలీలు వివాదాస్పదమైన "ఆనందపూర్ సాహెబ్ తీర్మానం" చేసింది కూడా ఇక్కడే.

భటిండా పంజాబ్ రాష్ట్రంలో ప్రాచీన పట్టణం. భారతదేశంలో మొట్టమొదటి పరిపాలకురాలు రజియా సుల్తానా 12వ శతాబ్దంలో ఈ నగరాన్ని పాలించింది. తర్వాత ఇక్కడికోటలోనే ఆమెను బంధించి ఉరి తీశారు. – ఆమె శత్రువులు. ప్రస్తుతం భటిండా ధాన్యం, ప్రత్తి వ్యాపార కేంద్రం

జలంధర్ అమృత్‌సర్‌కు 80 కిలోమీటర్ల దూరంలో వుంటుంది. పతివ్రతా

శిరోమణి సతీతులసి భర్త జలంధరుడుచే నిర్మించబడినదని ఒక కథ జలంధర్ ప్రస్తుతం ఆటవస్తువుల తయారీకి ప్రసిద్ధి.

లూధియానా పంజాబ్‌లో పెద్ద వాణిజ్య పారిశ్రామిక కేంద్రం పెద్ద సైకిల్ కార్మాగారం ఇచ్చట వుంది ఇచ్చట తయారయ్యే ఉన్ని వస్త్రాలు ప్రపంచ ప్రసిద్ధి పొందినాయి

ఢిల్లీ – అమృతసర్ రహదారిలో పాటియాలా వుంటుంది. ఒకప్పుడు ఇది శిక్కు రాష్ట్రానికి ముఖ్య పట్టణం. దేశానికి స్వతంత్రం రాక ముందు పాటియాలాను మహారాజు మిగతా రాజులలో ముఖ్యుడుగా వుండేవాడు. ఇచ్చట 1753లో అలాసింగ్ చే నిర్మింవబడిన పెద్ద కోట వుంది. కిలాముబారక్ అని పిలవబడే కోటలో ఒక సరస్సు ఒడ్డున వుండే "శీష్ మహల్" (అద్దాలమేడ) ప్రత్యేకంగా చూడదగినది. ఈ కోటలోని మోతిబాగ్‌లో ప్రస్తుతం "జాతీయ క్రీడా సంస్థ" ను నెలకొల్పారు.

పంజాబ్ ప్రజలు స్నేహశీలురు. వారిలో అతిధి సత్కారం ఎక్కువ. శిక్కు గ్రామాలన్నింటిలోనూ గ్రామ మధ్యలో గురుద్వారా (గుడి) వుంటుంది. ఈ గురు ద్వారాలన్నింటిలోను యాత్రికులుగా వచ్చినవారికిఉచిత భోజనం, వసతి కల్పిస్తారు. పంజాబ్ ప్రజల వ్యవసాయ రంగంలో ఆరితేరిన వారేగాక వ్యాపారంలో కూడా నిష్ణాతులే! సైన్యంలోనూ, ఇతర ప్రభుత్వద్యోగాలలో పంజాబీలు ముఖ్యంగా శిక్కులు అనేక మంది పనిచేస్తున్నారు. శిక్కులు ధైర్యసాహసాలకు పెట్టింది పేరు. అయితే కొద్దిమందిలో దుడుకు తనం కూడా లేక పోలేదు పంజాబీలు పుష్టికరమైన ఆహారం తీసుకుంటారు. పాలు ఎక్కువగా తీసుకుంటారు. శిక్కులు ఉత్తర హిందూ దేశంలో హిందువులు చేసుకునే పండుగలన్నీ చేసుకుంటారు. ఇవిగాక ఇంకా గురునానక్, గురు గోవింద్‌సింగ్ జన్మదినాలను పండుగలుగా చేసుకుంటారు. ఈ పండుగలప్పుడు వీరు 'గ్రంధసాహెబ్ ను వాహనం మీద వుంచి మేళ తాళాలతో జనం వెంటరాగా ఊరేగింపు చేస్తారు.

శిక్కుల ఆచారం ప్రకారం పుట్టిన బిడ్డకు పేరు పెట్టాలంటే గ్రంధ్ సాహిబ్ పసిపిల్ల ముందుంచి ఆ పసిపిల్ల ఏ పేజీ మీద చేయివేస్తే ఆ పేజీ మొదట అక్షరం ప్రకారం పేరు పెడతారు.

శిక్కు వివాహం హిందూ వివాహ పద్ధతులు దాదాపు ఒకటిగావే వుంటాయి. హిందూ పెళ్ళిళ్ళలో వేద మంత్రాలు చదివితే శిక్కు పెళ్ళిళ్ళలో గ్రంధ సాహిబ్‌లోని మంత్రాలు చదువుతారు. శిక్కుల పెళ్ళిని "ఆనంద్‌కరజ్" అంటారు. హిందూ పెళ్ళిలో లాగానే పెళ్ళికుమారుడు బంధుమిత్రుల వెంటరాగా బాజా భజంత్రీలతో పెళ్ళి కుమార్తె ఇంటికి వెళతాడు. అక్కడ పెళ్ళి కుమార్తె చెల్లెళ్ళు, స్నేహితురాళ్ళు పెళ్ళికుమారుని

కాసేపు తమాషాగా ఆట పట్టిస్తారు విందు భోజనాలు చేస్తారు శిక్కు వివాహాలు సూర్యోదయం ముందే జరుగుతాయి ఎక్కువగా తెల్లవారుజామున జరుగుతాయి గ్రంధ సాహిబ్ సాక్షిగా శిక్కు పౌరోహితుడు పెళ్ళి జరిపిస్తాడు వధూవరులు గ్రంధ సాహిబ్ చుట్టూ 4 సార్లు ప్రదక్షిణం చేస్తారు పెళ్ళికాగానే పెళ్ళి కుమారుడుపెళ్ళి కుమార్తెను తనింటికి తీసుకువెళతాడు

శిక్కు మతాచారం ప్రకారం చనిపోయినప్పుడు దుఖించటం, ఉత్తర హిందూస్తాన్‌లో కొంతమంది చేసినట్లు గుండెలు బాదుకోవటం నిషిద్ధం అలాగాక వారు భౌతిక కాయం చుట్టూ కూర్చొని ప్రార్ధన చేస్తారు శవాన్ని హిందువులలో లాగానే స్నానం చేయించి ఆ శవాన్ని తీసుకు వెళ్ళి దహనం చేస్తారు దగ్గర వారసలు చితికి నిప్పంటించుతారు అస్తికలను నదులలో కలుపుతారు 4 నుంచి 10 రోజుల వరకూ సంతాపదినాలుగా పాటించుతారు సంతాప దినాల్లో ఇంటిలో వున్న ఫర్నిచర్ అంతా బయట పెట్టి కటికి నేల మీద పడుకోవటం, కూర్చోవటం చేస్తారు ఈ సంతాప దినాల్లో బంధుమిత్రులు వచ్చి ఓదార్చుతారు సంతాప దినం ఆఖరి రోజుమళ్ళీ బంధుమిత్రులంతా వచ్చి గ్రంధ సాహిబ్‌పఠనం చేస్తారు చనిపోయిన వారు కుటుంబ పెద్ద అయితే అతని పెద్దకుమారునికి తలపాగా చుట్టి అతడ్ని కుటుంబ పెద్దగా గుర్తిస్తారు వచ్చిన బంధుమిత్రులంతా

శిక్కులందరి పేర్లలోసింగ్ అనేమాట వుంటుంది శిక్కు స్త్రీలకు 'కౌర్' అనే మాట వుంటుంది అయితే సింగ్ పేరున్న వాళ్ళంతా శిక్కులు కాదు శిక్కు ధనికుల్ని "సర్దార్" అని ఆడవారైతే "సర్దార్ని" అని సంభోదిస్తారు రైతులు, కార్మికులు ఐతే "భాయ్ సాహెబ్" అని ఆడవారైతే "బీబీజీ" అని పిలుస్తారు

పంజాబ్ ప్రజలకు "బంగ్రా" నృత్యం అంటే అమిత ఇష్టం పంటలుచేతికి రాగానే ఆనందోత్సాహాలతో, వాయిద్యాల మోతతో గంటల తరబడి ఈ 'బంగ్రా' నృత్యాన్ని చేస్తారు ఈ నృత్యంలో అందరూ పాల్గొంటారు

స్వాతంత్ర సమరంలో ప్రముఖపాత్ర వహించిన శ్రీ లాలాలజపతిరాయ్, శ్రీ భగత్‌సింగ్, శ్రీ ఉదయసింగ్, శ్రీ దయానంద సరస్వతి, శ్రీ స్వామి రామతీర్ధ ప్రభృతులు పంజాబ్ వారే సిక్కు ప్రముఖులనేక మంది భారత దేశ రాజకీయాలలో ప్రముఖ స్థానంలో వున్నారు కేంద్ర ప్రభుత్వంలో లోగడ మంత్రులుగా పనిచేసిన శ్రీమతి రాజకుమారి అమృతకేర్, బలదేవ్‌సింగ్, సర్దార్ స్వర్ణసింగ్, మాజీ రాష్ట్రపతి జైల్‌సింగ్, కాంగ్రెసు నాయకులు బూటాసింగ్ మొదలైనవారు పంజాబ్‌కుచెందినవారే! అకాలీదళ్‌నాయకుడు లోంగోవాల్, ప్రకాశ్‌సింగ్ బాదల్, సుర్జిత్‌సింగ్ బర్నాలా, సిమ్రంజిత్ సింగ్‌మాన్ ప్రసిద్ధులు కేంద్ర మంత్రులుగా పనిచేసిన శ్రీ ఐ కె గుజ్రాల్, శ్రీమతి మేనకా గాంధీ, ( శ్రీమతి ఇందిరా గాంధీ కోడలు) కూడా పంజాబ్‌కు చెందినవారే ప్రసిద్ధ ఆర్థిక శాస్త్రవేత్త, ప్రస్తుత కేంద్ర ఆర్థిక మంత్రి మన్‌మోహన్‌సింగ్ కూడా ఇక్కడి వారే

# 11 రాజస్థాన్

వైశాల్యం - 342239 చదరపు కిలోమీటర్లు రాజధాని- జైపూర్. జనాభా 4 కోట్ల 39 లక్షలు. వాడుక భాషలు హిందీ, రాజస్తానీ

రాజస్తాన్ రాష్ట్రానికి పడమర, వాయువ్యంగా పాకిస్తాన్, ఉత్తరాన పంజాబ్, ఈశాన్యదిశగా హర్యానా, ఉత్తరప్రదేశ్‌లు, దక్షిణాన గుజరాత్, మధ్యప్రదేశ్‌లు వుంటాయి

వైశాల్యం రీత్యా రాజస్తాన్ దేశంలో రెండవ పెద్ద రాష్ట్రం (మొదటిది మధ్యప్రదేశ్) వైశాల్యం రీత్యా మన రాష్ట్రం కన్నా 25 శాతం అధికంగా వుంటుంది. జనాభా రీత్యా మన రాష్ట్రం జనాభా కన్నా దాదాపు 2 కోట్లు తక్కువగా వుంటారు



భౌగోళికంగా రాజస్తాన్‌ను 6 భాగాలుగా విభజించవచ్చు. (1) పశ్చిమ ప్రాంతం అంటే జైసల్మీర్ జిల్లా పూర్తిగా, బార్మర్, జోధపూర్, బికనీర్, నాగూర్, చురు జిల్లాలో పడమర ప్రాంతాలు. ఈ ప్రాంతం అంతా పూర్తిగా ఎడారి. ఇదే ధార్ ఎడారి. ఈ ధార్ ఎడారి ఇంతటితో ఆగక పాకిస్తాన్‌లోకి కూడా వ్యాపించివుంటుంది. రాష్ట్రంలో ఎక్కువ ప్రాంతం ఈ ఎడారే (2) ఆరావళీ పర్వతాలకు పశ్చిమంగా వున్న జలోర్, పాలి, సికార్ జిల్లాలు, జోధపూర్, నాగూర్ మరుజిల్లాలో తూర్పు ప్రాంతం. ఈ ప్రాంతం కొంతభాగం లునీనది నీరు సరఫరా అవుతుంది. మిగతా ప్రాంతానికి నీటిసౌకర్యం లేదు (3) గంగానగర్ జిల్లా పూర్తిగా బికనీర్ జిల్లాలో కొంతప్రాంతానికి రాజస్తాన్ కాలువ (రావి, బియాస్ నదుల నుంచి త్రవ్విన ఇందిరాగాంధీ కాల్వ) నీరు సరఫరా అవుతుంది. (4) ఆరావళి పర్వత ప్రాంతం. దాదాపు ఉదయపూర్ జిల్లా అంతా, పాలి, సిరొహి, డుంగర్‌పూర్ జిల్లాలలో కొంతమేర ఆరావళి పర్వతాలు ఆక్రమించుకొని వుంటాయి. (5) తూర్పు ప్రాంతం. జైపూర్, అజ్మీర్, సవాయ్ మాధవ్‌పూర్, బిల్వారా, బుండి, ఆల్వార్, భరత్‌పూర్ జిల్లాలు. కోటా జిల్లాలో కొంతప్రాంతం, ఈ ప్రదేశం చక్కని నీటిసౌకర్యం కల్గి సాగుకు అనువైన ప్రాంతం. బనాస్‌నది దాని ఉపనదులు ఈ ప్రాంతాన్ని సస్యశ్యామలం చేస్తాయి. ఇచ్చట పరిశ్రమలు ఎక్కువగా వుండటమే గాక జనం కూడా ఎక్కువగా నివసిస్తున్నారు. (6) ఆగ్నేయ ప్రాంత, బన్స్వరా, చిత్తోర్ఘర్, జాలావర్ జిల్లాలు, కోటజిల్లాలోని కొంత ప్రాంతం. ఇదంతా మెరక ప్రాంతం. చంబల్ నది నీరు ఈ ప్రాంతంలో పంటలకు ఉపకరిస్తుంది. చంబల్‌నదికి ఆనుకొని వున్న చంబల్ లోయ మధ్యప్రదేశ్, రాజస్తాన్‌లకు సరిహద్దుగా వుంటుంది.

బహుపరాక్రమవంతులైన రాజపుత్రుల జన్మస్థలం రాజస్తాన్. రాజపుత్రుల జన్మ వృత్తాంతం గురించి రకరకాల అభిప్రాయాలున్నాయి. క్రీ॥ పూ॥ కొన్ని శతాబ్దాల క్రిందట కొన్ని విదేశీ తెగలు తండాలు తండాలుగా వచ్చి ప్రస్తుతం రాజస్తాన్‌లో నివాసం ఏర్పరుచుకున్నారని, అప్పటికే అచట వున్న హిందువులలో కల్సిపోయి సహజంగానే బలపరాక్రమం కల్గిన తెగలగుటచే అంబరు, జోధపూర్, మేవార్ లాంటి చిన్న చిన్న రాజ్యాలు ఏర్పర్చుకున్నారని ఒక వాదన. అలాకాదు వీరే నిఖార్సయిన హిందువలని రామాయణ, భారతాలలో కన్పడే క్షత్రియులు వీరేనని మరొక వాదన వుంది. ఈవాదనలలో నిజానిజాలు ఎలా వున్నా రాజస్తాన్ వంశాలలో శిశోడియా, రాథోడ్ వంశీకులు తాము శ్రీరాముని వంశానికి అంటే సూర్య వంశానికి చెందిన వారమని చెప్పుకుంటారు. భాటియా వంశీకులు చంద్రవంశానికి చెందిన వారమని చెప్పుకుంటారు. సోలంకీలు, పార్మార్లు, చౌహాన్‌లు అగ్నివంశానికి చెందిన వారమని ఇప్పటికీ చెప్పుకుంటారు.

ఏది ఏమైనా ఈ రాజపుత్రవీరులు అద్భుత సాహసవంతులు, ధైర్యశాలులు వీరి

స్త్రీలు కూడా ఇంతటి ధైర్యశాలులే ప్రధమంగా ఈ రాజపుత్రులు 36 గణాలుగా వుండేవారు ఇందులో 'తోమ్రా' గణనాయకుడైన అంగపాలుడు ముఖ్యుడని చరిత్రలో సాక్ష్యాధారాలున్నాయి. రాజపుత్రవీరుల సాహసగాధలు భారతీయ సంస్కృతికి ఎనలేని గౌరవం తెచ్చి పెట్టినాయి హిందూ మత సంరక్షకులుగా నిల్చిన ఈ త్యాగశీలుర ఔన్నత్యం గురించి ఎంతైన చెప్పవచ్చును భారతదేశ చరిత్రలో క్రీ॥ శ॥ 8వ శతాబ్దం నుంచి 12వ శతాబ్దం వరకూ ఈ రాజపుత్ర వీరుల సాహసగాధలే భారతీయ చరిత్ర మహ్మదీయ దండయాత్రలకు ఎదురునిల్చి ముస్లిం మతవ్యాప్తికి అడ్డుకట్ట వేయగల్గింది వీరే. 8వ శతాబ్దానికి పూర్వం ప్రస్తుత రాజస్తాన్ అంతా వివిధ రాజపుత్ర వీరుల పాలనలో వుండేది. 13వ శతాబ్దంలో ఉధృతమయిన మహమ్మదీయ దండయాత్రలను రాజపుత్రవీరులు ఎంతో ధైర్యంగా ఎదుర్కొన్నారు మేవార్ రాజైన సంగ్రామసింగ్ మొగల్ సామ్రాజ్య స్థాపకుడైన బాబార్‌నే ఎదిరించి కొంతకాలం నిలవగలిగాడు. ఖన్వా యుద్ధంలో సంగ్రామ్ సింగ్ ఓటమితో రాజస్తాన్ మొగల్‌పాలనకు తలొగ్గవల్సివచ్చింది. తర్వాత కూడా ముస్లిం, హిందువులను సమదృష్టితో చూసిన అక్బర్ చక్రవర్తి కాలంలో మేవార్ రాజ్య పాలకులు అక్బర్‌ను ఎదిరించారు. కరుడుగట్టిన మతతత్వవాదైన ఔరంగజేబు పాలనలో రాజస్తాన్ అనేక ఇబ్బందుల పాలైంది. దీనికి తోడు మరొక వైపు నుంచి మరాఠా దండయాత్రలు రాజస్తాన్ ప్రజలను నలిబలి చేశాయి. ఈలోగా బ్రిటిష్ వారు రాజస్తాన్‌లో ప్రవేశించి ఈ చిన్న చిన్న రాజ్యాలకు రక్షణ ఇస్తామనే మిషతో మొత్తం ప్రాంతాన్నంతా తమ ఆదీనంలోకి తెచ్చుకున్నారు.

ఆధునికకాలంలో దేశానికి స్వతంత్రం వచ్చిన తర్వాత 1948 మార్చిలో ఆల్వార్, భరత్‌పూర్, దోల్‌పూర్, కారౌలి అనే 4 రాజ్యాలను 'మత్స్య సమాఖ్య' గా ఏర్పరచారు. అదే మాసంలో బన్స్‌వారా, బుండి, దుంగర్ పూర్, జల్‌వార్, కిషన్‌ఘర్, కోట, ప్రతాప్‌ఘర్, షాపుర్, టూంగు అనే 9 రాజ్యాలను కూడా కలిపి రాజస్తాన్‌గా ఏర్పాటు చేశారు. తర్వాత ఉదయపూర్, సిరోహి, ఆజ్మీర్ సంస్థానాలు కూడా రాజస్తాన్‌లో చేరటంతో ప్రస్తుత రాజస్తాన్ ఏర్పడింది.

రాజస్తాన్‌లో 27 జిల్లాలు వుంటాయి. అవి ఆజ్మీర్, ఆల్వార్, బన్స్‌వారా, బార్మర్, భరత్‌పూర్, భిల్‌వారా, బికనీర్, బుంది, చిత్తోర్‌ఘర్, చురుదుంగర్ పూర్, గంగానగర్, జైపూర్, జై సల్మీర్, జలోర్, జాల్వార్, జుంజును, జోధపూర్, కోట, నాగూర్, పాలి, సవాయ్‌మాధవ్‌పూర్, సికార్, సిరోహి, టోంక్, ఉదయపూర్, దోల్పూర్.

రాజస్తాన్‌లో తూర్పు ప్రాంతంలో మాత్రమే సరిపడే వర్షాలు సాలుకు సగటున 72 సెం.మీటర్ల వర్షం పడుతుంది. పశ్చిమ ప్రాంతం అంతా ఎడారి కాబట్టి చాలా తక్కువ వాన పడుతుంది. ఎడారి అభివృద్ధి పథకం క్రింద 2 లక్షల చదరపు కిలోమీటర్ల ఎడారిని

అభివృద్ధిచేసే పథకం ఒకటి అమలులో వుంది ఈ ఎడారి ప్రాంతంలో వున్న ఒక కోటికి పైగా వున్న ప్రజల అభివృద్ధికి కృషి జరుగుతోంది

రాజస్థాన్ ప్రధానంగా వ్యవసాయిక రాష్ట్రం 70 శాతం ప్రజలు గ్రామాల్లోనే ఉంటున్నారు గోధుమ, జొన్న, ప్రధాన పంటలు ఇంకా ప్రత్తి, చెరకు, పొగాకు, నూనె గింజలు కూడా పండుతాయి కొద్దిగా వరి కూడా పండుతుంది స్వతంత్రం రాక ముందు ఈ రాష్ట్రంలో తిండి గింజల కొరత వుండేది ప్రస్తుతం రాష్ట్రంలో సరిపడే ఆహార ధాన్యాలే పండుతున్నాయి

రాజస్థాన్‌లో ఖనిజసంపద బాగా వుంది లిగ్నైట్, సున్నం, రాగి, పుష్కలంగా దొరుకుతాయి దేశం మొత్తం మీద రాగి ఈ ఒక్క రాష్ట్రంలోనే తయారవుతోంది ఉప్పు కూడా ఇక్కడ ఎక్కువగా తయారవుతోంది నూలువస్త్రాలు, ఉన్ని వస్త్రాలు, చెరకు, సిమెంటు, గ్లాస్, ఆక్సిజన్‌కు సంబంధించిన పరిశ్రమలు ఉన్నాయి కేంద్ర ప్రభుత్వం ఆధీనంలో ఉదయపూర్ వద్ద నున్న హిందూస్తాన్ జింక్, కెత్రివద్ద నున్న హిందూస్తాన్ కాపర్, ఆజ్మీర్‌లోని హెచ్ యం టి కార్మాగారాలు చెప్పుకోదగిన పెద్ద పరిశ్రమలు ప్రవేటు రంగంలో 3000 పరిశ్రమలు వున్నాయి

రాజస్థాన్ ప్రజలలో 89 శాతం మంది హిందువులు, 7 శాతం ముస్లింలు, మిగతా వారు క్రైస్తవులు, తదితరులు రాష్ట్ర జనాభాలో చదవనూ, వ్రాయనూ వచ్చిన వారు 39 శాతం మాత్రమే

రాజస్థాన్‌లో ఒకే సభగల చట్టసభవుంది దాంట్లో 200 మంది సభ్యులు వుంటారు లోక్‌సభలో ఈ రాష్ట్రానికి 25 మంది సభ్యులు ప్రాతినిధ్యం వహించగా రాజ్యసభలో 10 మంది సభ్యులు ప్రాతినిధ్యం వహిస్తారు

రాజస్థానీ భాష ఇండో ఆర్యన్‌కు చెందినది రాజస్థాన్ భాషకు మూలం సంస్కృతం రాజస్థాన్ భాషకు దేవ నాగరి లిపి వాడతారు రాజస్థానీ భాషలో అసంఖ్యాకమైన వీరగాధలు జానపదపాటలు కానవస్తాయి రాజస్థాన్ ప్రజల శౌర్య, సాహస, వీర గాధలతో రాజస్థానీ భాష నిండివుంటుంది రాజస్థాన్ సారస్వత చరిత్రను మూడు భాగాలుగా విభజించ వచ్చును క్రీ॥ శ॥ 1050 నుంచి 1450 వరకూ ప్రధమ దశ 1450 నుంచి 1850 వరకు రెండవ దశ ఆ తర్వాత మూడవ దశ ఆధునికి దశ మొదటిదశలో రాజస్థాన్ సాహిత్యం పై ఎక్కువగా జైన మత ప్రభావం కానవస్తుంది రెండవ దశలో రాజస్థానీ ఉచ్ఛదశనందు కుంది ఈ కాలంలో అనేక పద్య, గద్య రచనలు రాజస్థానీ ప్రజల సాహసగాధలు గురించి వివరిస్తాయి ఈ కాలపు రచయితలలో పద్మనాభవిహుసుజో, అలుజ్ అనే వారలు ప్రసిద్ధ రచయితలు ఆధునిక రాజస్థానీ

సాహిత్యంపై ఇంగ్లీషు భాష ప్రభావం విశేషంగా వుంటుంది ఆధునిక రచయితలలో చంద్రసింగ్, యస్.యస్ భట్, ఆర్ డి చరణ్లు ప్రసిద్ధులు రాజస్థానీ భాషలో నాటకాలు, నవలలు తక్కువగా వుంటాయి చిన్న కధలు ఎక్కువగా ప్రాముఖ్యం పొందినాయి. చిన్న కధల రచయితలలో యం డి వ్యాస్ ప్రసిద్ధులు ఈయన రచించిన 'వార్సగంధ్' అనే కధే రాజస్థానీ భాషలో కధానిక సాహిత్యానికి మూలం.

రాజస్థాన్ భారతదేశంలో ఒక విలక్షణమైన రాష్ట్రం రాజపుత్రుల శౌర్య పరాక్రమాలు, ధైర్యస్థైర్యాలు మనదేశ చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించబడినాయి రాజస్థాన్లో ఎక్కడకు వెళ్ళినా అడుగడుగునా రాజస్థాన్ వీరుల అలనాటి సాహస కృత్యాలకు గుర్తుగా మిగిలిన శిధిలావశేషాలు, నేటికీ చెక్కు చెదరకుండా వుండిన కోటలు, రాజభవనాలు కానవస్తాయి. వారి ఉజ్వల చరిత్రను మన మనోనేత్రం ముందు సాక్షాత్కరింప జేస్తాయి. రాజస్థానీ స్త్రీలు కూడా పురుషులకేమీ తీసిపోకుండా ప్రాణం కన్నా ఆత్మాభిమానమే మిన్న అని నిరూపించిన త్యాగధనులు. ఈ సాహసయోధుల రాష్ట్రంలోని కొన్ని ముఖ్య ప్రదేశాలను సందర్శిద్దాం.

రాజధాని జైపూర్(పింక్సిటీ) దేశంలోని అందమైన పట్టణాలలో ఒకటి. జనాభా 10 లక్షలు. 17వ శతాబ్దంలో జయసింహరాజుచే నిర్మించబడింది. ఆయన్ని బట్టే నగరానికి ఆ పేరు వచ్చింది. జయసింహుడు 13వ ఏటనే సింహసనాన్ని అధిష్టించినప్పుడు ముఖ్యపట్టణం అమేర్లో వుండేది. రాజధానిని మైదాన ప్రాంతానికి మార్చితే బాగుంటుందని జయసింహుడు దాన్ని జైపూర్కు మార్చాడు. ఈ పట్టణానికి 1875లో విక్టోరియా రాణి కుమారుడు ప్రిన్స్ ఆల్బర్ట్ సందర్శించటానికి వస్తే పట్టణ ప్రధాన రహదార్లన్నీ గులాబీ రంగుతో ముస్తాబు చేశారు. అప్పటినుంచి ఈ పట్టణంలో నిర్మించబడిన భవనాలన్నింటికి గులాబీ రంగు వేయటంతో ఈ పట్టణానికి గులాబిరంగు నగరం (పింక్సిటీ) గా పేరొచ్చింది. జైపూర్కు దక్షిణ దిశ మినహా మిగతా మూడు వైపులా కొండలే. ఈ కొండలపైన బలిష్టమై కోట. పాతజైపూర్ చుట్టూగోడ నిర్మించబడి వుంటుంది. ఈ గోడకు 8 ప్రవేశ ద్వారాలు వుంటాయి. జైపూర్ ప్రధాన మార్గాలు సువిశాలంగా 110 అడుగుల వెడల్పు వుంటాయి. చిన్నరోడ్లు 55 అడుగులు వుంటాయి. జైపూర్లో ముఖ్యమైన కట్టడం జైపూర్ రాజభవంతి. నగరంలో 7వ వంతు ఈ భవంతే ఆక్రమించుకుంటుంది. ఈ భవనం ఆవరణలో అనేక కట్టడాలు వున్నాయి. వీటిలో ముబారక్మహల్, చలువరాతితో ఎంతో మనోహరంగా నిర్మించబడింది. ఈ భవనంలోనే మహారాజుల అభ్యంతర మందిరాలు, మహారాజు దర్శనానికి వచ్చిన ప్రజల కోసం ఏర్పాటు చేయబడిన మందిరాలు వున్నాయి. ఇంకా ఈ భవంతిలో జైపూర్ మహారాజులు స్వీకరించిన అపురూప వర్ణచిత్రాలు, లిఖిత గ్రంథాలు భద్రపర్చబడినాయి. మొగల్

చక్రవర్తి అక్బర్ స్నేహితుడు అబుల్‌ఫజల్ పర్షియాలోకి అనువదించిన భారతం కూడా ఇక్కడ వుంది దీన్ని రజ్మ్‌నామా అంటారు ఈ ఆవరణలోనే ఏడంతుస్తులలో తెల్లగా శోభిల్లే చంద్రమహల్ వుంది ఈ భవనంపై నుంచి చూస్తే జైపూర్ యావత్తు కనబడుతుంది

హవామహల్ మరొక గొప్ప కట్టడం ఇది 1789లో ప్రతాప్ సింహరాజుచే నిర్మించబడింది ముచ్చటగొల్పే శిల్ప చాతుర్యంతో ఈ మహల్ నిర్మించబడింది విశాలమైన పిరమిడ్ల ఆకారంలో అయిదంతస్తులు కల్గివుంటుంది భవంతి కిటికీలు, ద్వారాలకు గాలి వీచటానికి అనువుగా తేనె పట్టు రంధ్రాలులాగా చిన్న చిన్న రంధ్రాలు ఉంచి నిర్మింపజేశారు అందువలన దీనికి హవామహల్ (చల్లని గాలి భవంతి) అని పేరు వచ్చింది ఈ భవంతిలో రాణీవాసపు స్త్రీలు వుండేవారు

జైపూర్ మరొక ముఖ్య ఆకర్షణ జంతర్‌మంతర్ నక్షత్రశాల ఈఅద్భుతమైన నక్షత్రశాలను ప్రపంచంలో ఎనిమిదవ వింతగా కూడా చెబుతారు ఈ నక్షత్రశాలలో నక్షత్రగతి, గోళాలు పరిశీలించి సూర్య గ్రహణం, చంద్రగ్రహణం గురించి ఖచ్చితంగా చెప్పవచ్చును ఇక్కడ వున్న 'సామ్రాట్ యంత్ర' సహాయంతో కాలాన్ని ఖచ్చితంగా సెకండులతో చెప్పవచ్చు ఈ యంత్రం స్థానిక జైపూర్ టైం- అంటే ఇండియన్ స్టాండర్డ్ టైంకు 11 1/2 నిమిషాల వ్యత్యాసం చూపిస్తుంది

జైపూర్‌లో ఇంకా చూడవల్సినవి రామనివాస్ గార్డెన్ 70 ఎకరాల వైశాల్యంలో జంతువులు పక్షులతో అలరారే పార్కు సెంట్రల్ మ్యూజియం ఈ మ్యూజియంలో రాజస్తాన్ నలుమూలల నుంచి సేకరించబడిన కళాఖండాలు దంతంతో చేయబడిన వస్తువు, ఆభరణాలు మొదలైనవి చూడవచ్చును

లోగడ జైపూర్ మహారాజులు వుండే రాంబాగ్ ప్యాలెస్‌ను ప్రస్తుతం ఒక పెద్ద హొటల్‌గా మార్చారు ఇందులో 105 గదులుంటాయి

జైపూర్‌కు 10 కిలోమీటర్ల దూరంలో అంబర్ వుంటుంది ఇక్కడ 450 అడుగుల ఎత్తు కొండపై రాజామాన్ సింగ్ చే బ్రహ్మాండమైన అబేధ్యమైన కోట నిర్మించబడింది ఈ కోట ఎంత పటిష్టంగా నిర్మించబడిందంటే దాన్ని ఎవరూ జయించటానికి సాహసించలేదట కూడా అందువలనే ఈ కోట ఇప్పటికి చెక్కు చెదరకుండా వుంది

జైపూర్‌కు 11 కిలోమీటర్ల దూరంలో జైపూర్-ఢిల్లీ రహదారిలో అమేర్ వుంటుంది జైపూర్ నిర్మించటానికి పూర్వ ఇది కచ్ఛవరాజుల రాజధానిగా వుండేది ఈ పట్టణానికి అమేర్ అనే పేరు అయోధ్యనేలిన అంబరీషుని బట్టి వచ్చిందంటారు

వర్తులాకారంగా నున్న గులాబీ రంగు కొండల నడుమ రమణీయమైన పరిసరాలలో అమేర్ రాజభవనం నిర్మించబడింది ప్రక్కనే వున్న మావోటా సరస్సులో ఈ భవంతి ప్రతిబింబ దృశ్యం చూసి తీరవల్సిందే.

జైపూర్ - ఢిల్లీ రహదారిలో జైపూర్‌కు 85 కిలోమీటర్ల దూరంలో వైరాట్ నగరం వుంది మహాభారతకాలం నాటి విరాటపురమే ప్రస్తుత వైరాట్ అంటారు ఇచ్చట జరిపిన త్రవ్వకాలలో అశోకుని శిలా శాసనాలు, బౌద్ధ విహారాలు, వెండినాణాలు మొదలైనవి అనేకం బయల్పడినాయి

జైపూర్‌కు 132 కిలోమీటర్ల దూరంలో కొండల నడుమ వుంటుంది ఆజ్మీర్. ఆజ్మీర్ అంటే జయింపరాని పర్వతం అని అర్థం. 7వ శతాబ్దంలో అజయ్‌పాల్ చౌహాన్ దీన్ని నిర్మించాడు ఇక్కడకు దగ్గరలోనే అడాయి - దిన్‌కా జోంపడా (రెండు రోజుల పూట ఆశ్రమం) వుంది దీన్ని మహమ్మద్ ఘోరీ ఆనతి పై రెండురోజుల పూటలో నిర్మించారు. అందుకే ఆ పేరు వచ్చింది. ముస్లింలకు పవిత్రమైన దరగాహ్ ఖ్వాజాసాహిబ్ దీనికి సమీపంలోనే వుంది. ఆజ్మీర్‌కు మధ్యలో అక్బర్ కోట వుంది. మొగల్ చక్రవర్తి అక్బర్ ఇక్కడకు వచ్చినప్పుడు వుండటానికి నిర్మించడింది. అజ్మీర్‌లో చూడదగిన మరొక విశేషం అణాసాగర్. ఇది రెండు కొండల మధ్య గట్టు పోసి ఏర్పరచిన సరస్సు. ఈ సరస్సు చుట్టూ చక్కని ఉద్యానవనం (దౌలత్‌బాగ్) జహంగీర్ ఏర్పాటు చేశాడు. ఆ తర్వాత మరో చక్రవర్తి షాజహాన్ సరస్సు గట్టుకు ప్రహరీ గోడ దానిపై పాలరాతితో ఐదు మండపాలను నిర్మించి ఈ అణాసాగర్‌కు మరింత శోభ తెచ్చాడు.

మేవాడ్‌కు చెందిన సిసోడియా రాజుల రాజధాని చిత్తోడ్‌గడ్. రాజపుత్రులు శౌర్యపరాక్రమాలకు ప్రతీక ఈ చిత్తోడ్‌గడ్. ఈరాజ్యాన్ని ఏలిన రాజులలో మహారాణా కుంభా, మహారాణా సంగ్రాంసింహ, రాణా ప్రతాప్‌ల పేర్లు హిందూ దేశ చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించబడినాయి. వారి దేశభక్తి ధైర్యసాహసాలు, ఆత్మాభిమానం గురించి ఎంతైనా చెప్పవచ్చును. చిత్తోడ్‌గడ్ కోట 500 అడుగుల కొండపై వుంటుంది. ఉత్తర దక్షిణాలు పొడవున 5 1/2 కిలోమీటర్ల వెడల్పు దాదాపు కిలోమీటరు వుంటుంది. కోట వైశాల్యం 690 ఎకరాలు. కోట చుట్టూ వుండే గోడకు శత్రు సైన్యాలపై పేల్చడానికి అనువుగా రంధ్రాలు ఏర్పాటు చేయబడినాయి. 1302లో అల్లా వుద్దీన్ ఖిల్జీ ఈ కోటపై దండెత్తినప్పుడు చిత్తోడ్ సైన్యం ఓడిపోగా శత్రువుకు లొంగటం కన్నా ఆత్మాహుతి మేలని తలంచి రాణి పద్మినితో సహా రాణివాసపు స్త్రీలు ఇచ్చటనే చితిలోకి దూకి వీరమరణం పొందారు. కున్వర్‌భోజరాజ్‌ని వివాహమాడి చిన్నతనంలోనే వైధవ్యం ప్రాప్తించి అప్పటి నుంచి సుప్రసిద్ధ కృష్ణ భక్తురాలైనా మీరాబాయ్ దేవాలయం ఈ కోటలోనే ఉంది. ఇంకా మాల్వాకు చెందిన ఖిల్జీరాజు పై రాణాకుంభా జయించిన గుర్తుగా ఏర్పర్చిన

తొమ్మిదంతస్తుల విజయ స్థంభం కూడా ప్రత్యేకంగా చూడదగినది

ఉదయపూర్ కూడా దేశంలో అందమైన పట్టణాలలో మరొకటి. 1559లో ఉదయ్‌సింగ్ దీన్ని నిర్మించాడు. మహారాజ భవంతి రాజస్తాన్‌లోని రాజభవంతులలో కెల్లా పెద్దది. పిచోలా సరస్సుకు ఎదురుగా కొండలపై నిర్మించబడింది. ఈ కోటలోని జగ్‌నివాస్ భవనం, బడేమహల్, జగదీష్ ఆలయం చూడదగినవి. ప్రస్తుతం ఈ కోటలోని కొన్ని భవంతులలో ఆధునిక హెూటల్స్ నడుపుతున్నారు.

మౌంట్ ఆబూ రాజస్తాన్‌లోని ఏకైక పర్వత విశ్రాంతి కేంద్రం. చక్కటి ఆహ్లాదకరమైన వాతావరణంలో వుండటమే గాక ఇచ్చట వెయ్యి సంవత్సరాల క్రిందట స్వచ్ఛమైన పాలరాతితో నిర్మించబడిన అనేక జైన దేవాలయాలున్నాయి

ఆబూ పర్వతానికి 250 కిలోమీటర్ల దూరంలో జోధ్‌పూర్ వుంటుంది. ఈ పట్టణం జనాభా 5 లక్షలు 400 అడుగుల ఎత్తున వుండే కొండపై నిర్మించబడిన కోట చూడదగినది. జోధ్‌పూర్‌కు 66 కిలోమీటర్ల దూరంలో వుండే ఒసియాలో అనేక జైన దేవాలయాలున్నాయి.

జోధ్‌పూర్‌కు 180 కిలోమీటర్ల దూరంలో రణక్‌పూర్ వుంటుంది. ఇక్కడ బ్రహ్మాండమైన జైన దేవాలయం వుంది. 40 వేల చదరపు అడుగుల వైశాల్యంలో వుండే ఈ దేవాలయంలో 29 మందిరాలు, ఈ మందిరాలకు 420 స్థంభాలు వుంటాయి

రాజస్తాన్‌కు పశ్చిమ మోత్తర సరిహద్దున ధార్‌ఎడారిలో జై సల్మీర్ ఉంటుంది. భాటియా రాజపుత్రులకు ఒకప్పటి రాజధాని 250 అడుగుల ఎత్తు కొండపై బ్రహ్మాండమైన కోట వుంది. ఈ కోటలో అనేక జైన హిందూ దేవాలయాలున్నాయి. తాళపత్రాలతో నిండిన పెద్ద పుస్తక భాండాగారం కూడా వుంది. లోగడ అంటే ఒంటెలపై సరుకులు మధ్య ఆసియాకు ఎగుమతి చేసే రోజుల్లో ఇదొకపెద్ద వ్యాపార కేంద్రంగా వుండేది. ఇప్పుడు ఇది కొద్ది పట్టణం. జనాభా 3 లక్షలు.

థార్ ఎడారిలో మరొక పట్టణం బికనీర్ అలనాడు ఇక్కడ సరస్వతీ నది పునీతం చేసిన రోజుల్లో ఇక్కడ ప్రజాజీవనం మహెూన్నత స్థితిలో వుండేది. సరస్వతీ నది అదృశ్యం కావటంతో ఇక్కడ నాగరికత అదృశ్యం అయింది. 16వ శతాబ్దంలో రాజారాయ్‌సింగ్ చే నిర్మించబడింది. ప్రస్తుత బికనీర్ పట్టణం. పట్టణం చుట్టూ బ్రహ్మాండమైన ప్రహరీగోడలు లోపలికి వెళ్ళటానికి అయిదు గేట్లు వుంటాయి. సింహద్వారం గుండా వెళ్ళటానికి 50 అడుగుల అగడ్త దాటి వెళ్ళాలి. బికనీర్‌లో చాలా జైన దేవాలయాలు కూడా ఉన్నాయి.

జైపూర్‌కు 143 కిలోమీటర్ల దూరంలో ఆల్వార్ వుంటుంది. పూర్వం ఇదొక పెద్ద రాజ్యం. కొండకు దిగువన ఒక సరస్సు. ఆ సరస్సుకు ఈవల కోట. ఈ కోటలో అనేక భవనాలున్నాయి. కోటలో పెద్ద గ్రంథాలయం కూడా వుంది. దీంట్లో అనేక తాళ పత్రగ్రంధాలు వున్నాయి. ఆల్వార్‌కు 36 కిలోమీటర్ల దూరంలో సరిష్కా వుంది. ఇదొక వన్యమృగ సంరక్షణ కేంద్రం. రకరకాల జంతువులను సహజ వాతావరణంలో చూడవచ్చు.

భరత్ పూర్ 18వ శతాబ్దంలో మహారాజా సూరజ్‌మల్‌చే నిర్మించబడింది. బలిష్టమైన రెండు మట్టిగోడలతో నిర్మించబడిన ఇక్కడి కోట చూడదగినది. ఈ కోట చుట్టూ పెద్ద అగడ్త వుంటుంది. యుద్ధ సమయాల్లో ఈ అగడ్తను నీటితో నింపేవారు, భరత్‌పూర్‌కు 5 కిలోమీటర్ల దూరంలో కెలో డిమో పక్షుల కేంద్రంలో అన్ని రకాల పక్షులను చూడవచ్చు.

రాజస్థాన్ ప్రజలు అన్ని హిందూ పండుగలను ఘనంగా చేసుకోవటంతో పాటు అక్టోబరు నెలలో 'పుష్కరమేలా' అని చేసుకుంటారు. ఈ పుష్కర సరస్సు ఆజ్మీర్‌కు 11 కిలోమీటర్ల దూరంలో వుంటుంది. ఇదొక పెద్ద సంత. తిరునాళ్ళు ఈ తిరునాళ్ళు రోజున ఇక్కడి ప్రజలు రంగురంగుల దుస్తులు ధరించి బండ్లను, ఒంటెలను, ఎడ్లను కూడా అందంగా అలంకరింపజేసి కుటుంబ సమేతంగా బండ్ల మీద ఈ తిరునాళ్ళలో పాల్గొంటారు. ఈ సంతలోనే ఒంటెలు, బఱ్ఱు, గుర్రాలు మొదలైనవాటి అమ్మకాలు, కొనుగోళ్ళు విరివిగా జరుగుతాయి. ఆడవాళ్ళు తమకు కావల్సిన గాజులు, బట్టలు, ఇంకా గృహవసరాలకు కావల్సిన సామాగ్రి కొనుక్కుంటారు.

రాజస్థాన్ హస్త కళలకు ప్రసిద్ధి. జైపూర్ ఇత్తడి సామాను, బీల్‌వాడా తగరపు గిన్నెలు, జోధ్‌పూర్ పాదరక్షలకు ప్రసిద్ధి. ఇంకా ఉదయ్‌పూర్ కర్రతో చేయబడిన ఆటవస్తువుకు, బికనీర్, ఆల్వార్, ఆజ్మీర్‌లు దంతం, ఎముకలతో చేయబడిన వస్తువులకు ప్రసిద్ధి.

రాజస్థాన్‌పురుషులు సాధారణంగా ధోవతి, బొత్తాలు లేని పొడుగు చేతుల చొక్కా (బాంది అంగరఖా) పోటియా అనబడే తలపాగా ధరిస్తారు. ఉత్సవాలు పండుగరోజుల్లో 18 గజాలు పొడవు వుండే తలపాగా (పగడి) ధరిస్తారు. స్త్రీలు 40 గజాలు పొడవుండే చీర (ఘాఘరా) ధరిస్తారు. కంచలీ అనే రవిక ధరిస్తారు. పైన 2 1/2 గజాలు పొడవుండే ఓణీ (ఓడనీ) వేసుకుంటారు. సంప్రదాయ సిద్ధంగా రకరకాల నగిషీ చెక్కిన ఆభరణాలు స్త్రీలు ధరిస్తారు. వివాహిత స్త్రీలు తెలుపు లేక ఎరుపు రంగు దంతపు గాజులు వేసుకుంటారు. ఉదయపూర్ ప్రాంతం ప్రజలు స్థానిక ఆచారాలన్ని బట్టి ఇళ్ళలో పెళ్ళి జరుగుతుంటే ప్రహరీగోడ మీద గుర్రం, ఏనుగు బొమ్మలు వేస్తారు.

రాజస్తాన్ ప్రజలకు ఒంటె కు విడదీయరాని సంబంధం వుంది. ఎడారి ప్రాంతం కాబట్టి వారికి ఒంటె అనేక రకాలుగా ఉపయోగపడుతుంది. వ్యవసాయం చేయడానికి, బండిలాగటానికి, సరుకులు చేరవేయటానికి రకరకాలుగా ఉపయోగపడుతుంది. ఒంటె పాలు కూడా ఇక్కడ ప్రజలు వినియోగిస్తారు.

భౌగోళికంగా రాజస్తాన్ కీలక ప్రాంతం. పాకిస్తాన్‌తో సరిహద్దు ప్రాంతం (కచ్) కొంత రాజస్తాన్‌లో ఉండి రాజకీయంగా పెద్దగా సంక్షోభాలకు లోనుగాని రాష్ట్రం రాజస్తాన్. రాష్ట్ర మొదటి ముఖ్యమంత్రి పండిట్ హీరాలాల్ శాస్త్రి. రాష్ట్రం దాదాపుగా కాంగ్రెసు పాలనలోనే ఉంది. ముఖ్యమంత్రులలో వార్తలలోకి బాగా ఎక్కినవారు శ్రీ మోహన్ లాల్ సుఖాడియా వీరు మన రాష్ట్రానికి గవర్నరుగా కూడా పనిచేశారు. 1977లో కేంద్రంలో జనతా ప్రభుత్వం ఏర్పడిన తర్వాత రాజస్తాన్‌లో కూడ శ్రీ భైరాన్‌సింగ్ షెకావత్ ముఖ్యమంత్రిగా జనతా ప్రభుత్వం ఏర్పడి 2, 3 సంవత్సరాలు అధికారంలో ఉంది. అప్పట్లో రాష్ట్రంలో ఆరంభించబడిన 'అంత్యోదయ, పథకం దేశ ప్రజలందరి దృష్టిని ఆకర్షించింది. 1980, 85 ఎన్నికలలో తిరిగి కాంగ్రెసు (ఐ) అఖండ విజయాన్ని సాధించింది. శ్రీమాథుర్, శ్రీ జోషి ప్రభృతులు ముఖ్యమంత్రులుగా పనిచేశారు. మరల మొన్నటి ఎన్నికలలో బి.జె.పి., జనతాదళ్ కూటమి విజయాన్ని సాధించింది. శ్రీ షెకావత్ ముఖ్యమంత్రిగా మిశ్రమ ప్రభుత్వం అధికారంలోకి వచ్చింది. కాశ్మీర్, పంజాబ్‌లలో మంటలను రేపిన పాకిస్తాన్ ఇప్పుడు తన దుర్మార్గాన్ని రాజస్తాన్‌లో కూడ వ్యాపింపచేయగలదని పరిశీలకులు భయపడుతున్నారు.

# 12 జమ్మూ - కాశ్మీర్

వైశాల్యం - 2,22,236 చదరపు కిలోమీటర్లు జనాభా - 77 లక్షల 18వేలు రాజధానులు - శ్రీనగర్(వేసవి రాజధాని) జమ్ము (శీతాకాలం రాజధాని) వాడుకభాషలు - ఉర్దూ, కాశ్మీరీ, డోగ్రి, లడక్(అధికార భాష ఉర్దూ)

జమ్మూ కాశ్మీర్ భారతదేశపు ఉత్తరకొసన వుంటుంది దీనికి ఉత్తరాన చైనా, ఆఫ్ఘనిస్తాన్‌లు, తూర్పున టిబెట్, దక్షిణాన హిమాచల్‌ప్రదేశ్, పంజాబ్‌లు, పడమర పాకిస్తాన్ హద్దులుగా వుంటాయి.

వైశాల్యం రీత్యా జమ్ము కాశ్మీర్ మన రాష్ట్ర వైశాల్యంలో 5వంతులలో 4



వంతులుగా ఉంటుంది అంటే ప్రకాశం, గుంటూరు, విశాఖ, తూర్పు గోదావరి జిల్లాలు మినహాయించి మిగతా ఆంధ్రప్రదేశ్ వైశాల్యం ఎంత ఉంటుందో సుమారుగా అంత వుంటుంది లేక తెలంగాణా జిల్లాల వైశాల్యం కన్నా రమారమి రెట్టింపుగా వుంటుంది జనాభా మాత్రం కృష్ణాజిల్లా జనాభాకు రెట్టింపుగా వుంటుంది.

అయితే పైన పేర్కొన్న 2,23,236 చదరపు కిలోమీటర్ల వైశాల్యం ప్రాంతం ప్రస్తుతం భారతదేశ అధీనంలో లేదు ఇందులో 1 లక్ష 27వేల చదరపు కిలోమీటర్ల ప్రాంతం పాకిస్తాన్, చైనాల దురాక్రమణలో వుంది

జమ్ము కాశ్మీర్ రాష్ట్రాన్ని మూడు ప్రాంతాలుగా విభజించవచ్చు. (1) జమ్ము ప్రాంతం (2) కాశ్మీర్‌లోయ (3) లడక్ ప్రాంతం

తావీనది ప్రవహించే ప్రాంతం జమ్ము డోగ్రి ప్రజలు వుండే ప్రాంతం. జమ్ము ఆరు జిల్లాగా విభజించబడి వుంటుంది

జీలం నది ప్రవహించే ప్రాంతం కాశ్మీర్‌లోయ. కాశ్మీర్‌లోయ 135 కిలోమీటర్ల పొడవు 40 కిలోమీటర్లు వెడల్పు వుంటుంది సముద్ర మట్టానికి 15 వందల మీటర్ల ఎత్తున వుంటుంది కాశ్మీర్ లోయకు ఈశాన్యంగా మిన్నంటే హిమాలయ పర్వత శ్రేణులు వుంటాయి

ఇక రాష్ట్రంలో దాదాపు సగం ప్రాంతం ఆక్రమించుకున్న లడక్ అంతా మంచుమయం

జమ్మూ కాశ్మీర్‌లో సగటున సంవత్సరానికి 105 సెంటిమీటర్ల వర్షం పడుతుంది. వాయువ్య ప్రాంతంలో కొంతమేర అసలు వర్షం పడదు ఇదంతా ఎడారి.

కాశ్మీర్ పేరు కశ్యమహాముని పేరునిబట్టి వచ్చిందని చెబుతారు పూర్వకాలంలో ఇక్కడ జలోద్భవుడనే రాక్షసుడు వుండేవాడని, అతడు ఈ చుట్టుపట్ల ప్రజల్ని భక్షిస్తూ వుంటే, కశ్యపమహాముని ఆ రాక్షసుడ్ని సంహరించి ఈ ప్రాంతాన్ని జనవాసయోగ్యంగా చేశాడని పురాణకథ చెబుతారు

చరిత్రను బట్టి చూస్తే క్రీ॥ పూ॥ 3వ శతాబ్దంలో ఈ ప్రాంతం అశోక సామ్రాజ్యంలో భాగంగా వుండేది ఆనాడు ఇచ్చట బౌద్ధమతం విశేష ప్రచారంలో వుంది. సుప్రసిద్ధ కల్హణుడు తన రాజతరంగిణిలో కాశ్మీర్ పుట్టుకను కాశ్మీర రాజుల చరిత్రను వివరిస్తాడు. క్రీ॥ శ॥ 7వ శతాబ్దంలో ఈ ప్రాంతాన్ని పాలించిన రాజు లలితాదిత్యుడు ప్రముఖంగా చెప్పుకోదగినవాడు ఆ తర్వాత అవంతివర్మ అనే మరో కాశ్మీర్ రాజు అవంతి నగరం నిర్మించి ప్రసిద్ధుడయ్యాడు కాశ్మీర్‌ను పాలించిన ఆఖరి హిందూ రాజు ఉదయనుడు.

ఉదయనుడి మంత్రిగా వుండిన అహమ్మద్‌షా ఉదయనుడ్ని చంపి కాశ్మీర్ స్వాధీనం చేసుకున్నాడు

1586లో మొగల్ చక్రవర్తి అక్బర్ ఈ ప్రాంతాన్ని జయించి తన సామ్రాజ్యంలో విలీనం చేసుకున్నాడు 1757లో ఆఫ్ఘనిస్తాన్ చక్రవర్తి అహమ్మద్‌షా అబ్దాలీ ఈ భూభాగాన్ని జయించాడు. 1819లో కాశ్మీర్‌ను పంజాబ్ మహారాజు రంజిత్‌సింగ్ స్వాధీనం చేసుకున్నాడు. ఆ తర్వాత ఇంగ్లీషు వాళ్ళు సిక్కులను ఓడించి కాశ్మీర్ తమ వశం చేసుకున్నారు. అయితే ఇంగ్లీషు వాళ్ళు కాశ్మీర్‌ను జమ్ము రాజైన గులాబ్‌సింగ్‌కు 75 లక్షల రూపాయాలకు అమ్మేశారు. దాంతో జమ్ము కాశ్మీర్ కల్సి పోయినాయి

భారత్ పాకిస్తాన్‌లు విభజన సమయంలో సంస్థానాల పాలకులకు వారి ఇష్ట ప్రకారం రెండు దేశాలలో దేనిలోనైనా చేరవచ్చనే స్వేచ్ఛ ఇచ్చారు మిగతా రాజ్య పాలకులందరూ ఏదో ఒక దేశంలో చేరి పోవటానికి ఇష్టపడగా కాశ్మీర్ మహారాజు హరిసింగ్ ఎటూ చేరటానికి ఇష్టపడక తటస్థంగా వుండిపోయాడు. ఈ లోగా పాకిస్తాన్ కాశ్మీర్ మాదేనంటూ కొండజాతి ప్రజలను రెచ్చగొట్టి, కాశ్మీర్ పైకి దండయాత్రకు పంపింది. హిందూ రాజైన హరిసింగ్ తటపటాయింపుమాని భారత్‌లో విలీనానికి సమ్మతిస్తూ ప్రకటన చేశాడు. భారత్‌సైన్యం, కాశ్మీర్‌లో ప్రవేశించి, పాకిస్తాన్ దండయాత్రను త్రిప్పికొట్టింది. కాశ్మీర్ ప్రజలు భారత్‌సైన్యానికి అండగా నిల్చారు.

1953 వరకూ షేక్ అబ్దుల్లా జమ్ముకాశ్మీర్ ముఖ్యమంత్రిగా వున్నారు. అయితే షేక్ అబ్దుల్లా అవకాశవాద ఊగిసలాట ధోరణి కారణంగా కేంద్ర ప్రభుత్వం అతడ్ని పదవి నుంచి తొలగించి, జైల్లో పెట్టవల్సిన పరిస్థితి ఏర్పడింది. జమ్ము కాశ్మీర్ ముఖ్యమంత్రిగా బక్షిగులాం మహమ్మద్ వచ్చారు. 1964లో బక్షి మహమ్మద్ స్థానంలో సంషుద్దీన్ అధికారంలోకి వచ్చాడు. కొద్దినెలలు తర్వాత ఇతడి తర్వాత జి.యం.సాదిక్ ముఖ్యమంత్రి అయ్యాడు

1965లో పాకిస్తాన్ మళ్ళీ కాశ్మీర్ పై దండెత్తింది. భారత్ అందుకు తగిన గుణపాఠం చెప్పటంతో 1966లో తాష్కెంట్ ఒప్పందం జరగటం యుద్ధం ఆగిపోవడం జరిగింది. తూర్పు పాకిస్తాన్ (ప్రస్తుత బంగ్లాదేశ్) తన చేయి జారిపోతోందనే ఉక్రోషంతో పాకిస్తాన్ 1971లో తిరిగి కాశ్మీర్‌పై దండయాత్రకు సిద్ధపడింది. మళ్ళీ భారత్‌సైన్యం ఈ దండయాత్రను త్రిప్పికొట్టింది. 1972లో సిమ్లా ఒప్పందం ప్రకారం సంధి జరిగింది.

1975లో జైలునుంచి విడుదల పొందిన షేక్ అబ్దుల్లా తిరిగి రాష్ట్ర నాయకత్వాన్ని చేపట్టారు. 1982లో ఆయన చనిపోగా ఆయన కుమార్డు ఫరూక్ అబ్దుల్లా ముఖ్యమంత్రి

అయ్యాడు 1984లో ఫరూక్ అబ్దుల్లా మంత్రి వర్గం పడిపోయి జి యం షా అధికారంలోకి వచ్చారు ప్రస్తుతం జమ్ముకాశ్మీర్ గవర్నర్ పాలన క్రింద వుంది

జమ్మూ కాశ్మీర్ జనాభాలో 65 శాతం మంది ముస్లింలు, 34 శాతం మంది మాత్రమే హిందువులు ముఖ్యంగా కాశ్మీర్ లోయలో అత్యధిక సంఖ్యాకులు ముస్లింలు ఈ విధంగా కాశ్మీర్‌లో హెచ్చుమంది ముస్లింలు వుండటం మూలంగా ముస్లిం తీవ్రవాద సంస్థలు ముస్లింలలో మతోన్మాదం రెచ్చగొడుతున్నాయి కాశ్మీర్ జాతి ప్రత్యేక జాతి అని భారత్‌తో తెగతెంపులు చేసుకొని విడిపోవాలని, ప్రత్యేక ఇస్లామిక్ రిపబ్లిక్‌గా రూపొందాలని దుర్బోధలు చేస్తున్నాయి వీరి మాయమాటలు నమ్మిన కొంతమంది ముస్లిం యువకులు భారత్‌పై ద్వేషం పెంచుకొని ఉగ్రవాద చర్యలకు అల్లర్లకు పాల్పడుతున్నారు వీరికి అన్నివిధాలా పాకిస్తాన్ సాయపడుతోంది అసలు ఇప్పటికి జమ్ముకాశ్మీర్ రాష్ట్రానికి చెందిన సుమారు 80వేల చదరపు కిలోమీటర్ల ప్రాంతం పాకిస్తాన్ ఆక్రమణ క్రింద వున్నదని మనం గుర్తుంచుకోవాలి

జమ్ము కాశ్మీర్ రాష్ట్రానికి మిగతా రాష్ట్రాలకు ఒక తేడా వుంది రాజ్యాంగం 370 అధికరణ ప్రకారం జమ్ముకాశ్మీర్‌కు ప్రత్యేక ప్రతిపత్తి కల్పించబడింది ఈ అధికరణ ప్రకారం ఇతర రాష్ట్రాలవారు జమ్ము కాశ్మీర్ వెళ్ళి స్థిరపడటానికి గాని, భూములు కొనటానికిగాని, వ్యాపారం చేయటానికి గాని వీల్లేదు

జమ్ము కాశ్మీర్‌లో లెజిస్లేటివ్ అసెంబ్లీయే గాక లెజిస్లేటివ్ కౌన్సిల్ కూడా వుంది అసెంబ్లీలో సభ్యుల సంఖ్య 76 మంది ఈ రాష్ట్రం నుంచి 6 గురు లోక్‌సభలోను, నలుగురు రాజ్యసభలోనూ ప్రాతినిధ్యం వహిస్తారు

జమ్ముకాశ్మీర్ 14 జిల్లాలుగా విభజించబడివుంటుంది జమ్ము ప్రాంతం 6 జిల్లాలుగా కాశ్మీర్ ప్రాంతం 6 జిల్లాలుగా, లడక్ 3 జిల్లాలుగా వుంటుంది 14 జిల్లాలు ఇవి – అనంత్‌నాగ్, బద్గాం, బారాముల్లా, దోడా, జమ్ము, కార్గిల్, కతువా, కుప్‌వారా, లడక్, పుల్‌వామా, పూంచ్, రజారి, శ్రీనగర్, ఉదంపూర్

జమ్ము కాశ్మీర్ ప్రజల ప్రధాన వృత్తి వ్యవసాయం 80 శాతం మంది ప్రజలకు వ్యవసాయమే జీవనాధారం వరి, గోధుమ, మొక్కజొన్న ప్రధాన పంటలు ఇంకా బార్లీ, జొన్నలు కూడా పండుతాయి పండ్లతోటలకు కూడా ప్రసిద్ధి ఈ రాష్ట్రం యాపిల్, రేగు, ద్రాక్ష పళ్ళు బాగా పండుతాయి 3 లక్షల హెక్టార్లలో వరి పండుతుంది 2 లక్షల హెక్టార్లలో గోధుమ పండుతుంది మరో 2 లక్షల హెక్టార్లలో మొక్కజొన్న, జొన్న పండుతుంది లడక్ ప్రాంతంలో కొద్దిగా పప్పు ధాన్యాలు పండుతాయి

జమ్ము కాశ్మీర్‌లో పెద్ద పరిశ్రమలు కొద్దిగా మాత్రమే వున్నాయి చిన్న

పరిశ్రమలు విరివిగా వున్నాయి 22 వేలకు పైగా చిన్న పరిశ్రమలు నెలకొని వున్నాయి వీటల్లో లక్షమందికి పైగా ఉపాధి పొందుతున్నారు

చేతిపనులకు ప్రసిద్ధి జమ్ము కాశ్మీర్ కాశ్మీర్ శాలువలు, తివాచీలు కొయ్యపై నగిష్ పనులు, ప్రపంచవ్యాప్తంగా ప్రసిద్ధి పొందినాయి ఈ చేతి పనుల పరిశ్రమలో 2 లక్షల మంది నిమగ్నమై వున్నారు ఈ హస్తకళా వస్తువుల ఎగుమతి వలన భారతదేశానికి అమూల్యమైన విదేశీ మారకం లభిస్తోంది ప్రతిసంవత్సరం 100 కోట్ల రూపాయల విలువైన చేతి వస్తువులు ఇతర దేశాలకు ఎగుమతి కాబడుతున్నాయి

జమ్ము కాశ్మీర్‌లో అధికార భాష ఉర్దూ అయినా కాశ్మీరీ, డోగ్రి భాషలు కూడా ప్రజలు ఎక్కువగా మాట్లాడతారు. కాశ్మీరీ 10వ శతాబ్దంలో ఉద్భవించిన భాష కాశ్మీరీ భాష పై సంస్కృత ప్రభావం ఎక్కువగా వుంటుంది. కాశ్మీరీ భాషలో శైవ, వైష్ణవ మతాచార్యులు పద్యాలల్లి ప్రజల్ని చైతన్య పర్చి తమ తమ సిద్ధాంతాలవైపు ఆకర్షించారు. కాశ్మీరీ భాషలో ఆది కవి నందఋషి ముస్లిం దండయాత్రల కారణంగా కాశ్మీరీ భాష కొంత ప్రాముఖ్యం కోల్పోయింది. పారశీక భాష కాశ్మీర్‌లో 600 సంవత్సరాలు అధికార భాషగా వుంది. ఉర్దూ ప్రభావం కూడా కాశ్మీరీ పై కన్పించుతుంది. ఆధునిక కాశ్మీరీ భాషలో చెప్పుకోదగిన కవులు మహజూర్(1885-1952) జిందాకౌల్ మాస్టర్జీ (1886-1966). మహజూర్ గజళ్ళు కాశ్మీరీలో బహుళ వ్యాప్తి పొందినాయి. కాశ్మీరీలో పద్యరచనలే ఎక్కువ. వచన రచనలు చాల తక్కువ. కాశ్మీరీ పద్యాలు దైవ చింతన, దేశభక్తి ప్రబోధిస్తాయి. కాశ్మీరీ అక్షరమాల క్లిష్టంగా వుండటం వలన అచ్చువేయటం ప్రయాసతో కూడిన పని. కాశ్మీరీ భాషా వ్యాప్తికి ఇదొక అడ్డంకిగా వుంది.

జమ్ములో ఎక్కువగా మాట్లాడే భాష డోగ్రి పై కూడా సంస్కృత ప్రభావం విరివిగా వుంటుంది. డోగ్రే సారస్వతంలో జానపదకథలు ఎక్కువగా వుంటాయి. దైవస్తుతితో కూడిన పద్యాలు ఎక్కువగా వుంటాయి. ఈ పద్యాలను 'బేటాలు' అంటారు. డోగ్రి భాషలో మొట్టమొదటి అచ్చయిన పుస్తకం బైబిల్ అనువాదం. 1818లో ఈ పుస్తకం వెలువడింది డోగ్రేలో ప్రసిద్ధి పొందిన కవి హరిదత్ శాస్త్రి (1890-1956) ఈయన డోగ్రి భాషలో అనేక రచనలు చేయటమే గాక కాశ్మీర్‌పై పాకిస్తాన్ దురాక్రమణ తర్వాత దేశభక్తి కల్గించే అనేక పద్యాలు రచించి ప్రజల్ని చైతన్య వంతుల్ని చేశాడు. డోగ్రి భాషలో గజళ్ళు కూడా వుంటాయి కన్వర్ వియోగి ఈ గజళ్ళను రచించడంలో ప్రసిద్ధుడు. డోగ్రి భాషలో కొద్దిగా నాటకాలు, నవలలు కూడా వున్నాయి.

ఇంకా లడక్ ప్రాంతంలో లడకి భాష మాట్లాడతారు. లడకీ భాషలో బౌద్ధ జానపద కథలు ఎక్కువగా వుంటాయి

స్వదేశీ, విదేశీ, టూరిస్టులకు 'భూలోక స్వర్గం' కాశ్మీర్ 'సూపర్ స్విట్జర్లాండ్'గా కూడా ప్రసిద్ధి పొందిన కాశ్మీర్‌ను దర్శించటం ఒక మధురానుభూతి. ప్రకృతి అందాలన్నీ ఒక చోట రాసి పోసినట్లుగా వుండే ప్రాంతం కాశ్మీర్ ఫలపుష్పాలతో, జలపాతాలతో, సెలయేళ్ళతో, సరస్సులతో అతి మనోహరమైన ప్రకృతి దృశ్యాలతో అలరారే ప్రాంతం కాశ్మీర్ యాపిల్, జర్దూరు చెర్రీ, రేగు పళ్ళతో నోరూరించే ప్రాంతం కాశ్మీర్. అవసాన దశలో వున్న మొగల్ చక్రవర్తి జహంగీర్‌ను 'నీ ఆఖరి కోరిక ఏమిటంటే – 'కాశ్మీర్ చూడటమే నా ఆఖరి కోర్కె అంతకన్నా నాకేమీ అక్కర్లేదు ' అన్నాడట అంతటి మనోహర ప్రదేశం కాశ్మీర్.

కాశ్మీర్ లోయను దర్శించటానికి మార్చినెల నుంచి జూన్ వరకూ అనువైన సమయం మార్చి నెల రావటంతోనే ఎండవేడిమికి అప్పటి వరకూ మంచుతో నిండిన ప్రాంతమంతా నులివెచ్చగా ఆహ్లాదపరుస్తుంది. మంచుగడ్డలన్నీ కరిగి ఆ నీటితో పచ్చికబయళ్ళు పెరిగి ఆ ప్రాంతమంతా పచ్చటి తివాచీ పర్చినట్లుగా వుంటుంది.

కాశ్మీర్‌లో చూడదగిన ముఖ్యపట్టణం శ్రీనగర్. ఇది రాష్ట్రానికి వేసవి రాజధాని. సముద్రమట్టానికి 1585 మీటర్ల ఎత్తున వుంటుంది. ఈ నగర విస్తీర్ణం 12 చదరపు మైళ్ళు. జనాభా 6 లక్షలు. శంకరాచార్య కొండ, హరి పర్వతం అనే రెండు కొండల మధ్య వుంటుంది. శ్రీ నగర్ ప్రక్కనే జీలం నది ప్రవహిస్తూ వుంటుంది. శ్రీనగర్‌ను 'ప్రాచ్యఖండపు వెనిస్'గా చెబుతారు. ఇక్కడకు వచ్చే టూరిస్టులకు శ్రీనగర్‌లో సకల సౌకర్యాలు అమరి వుంటాయి. సమస్త సౌకర్యాలు కలిగిన గృహ నౌకల సరస్సులలో తేలియాడుతూ టూరిస్టులను ఆహ్వానిస్తూ వుంటాయి.

శ్రీనగర్‌ని క్రీ॥ పూ॥ 200 ప్రాంతంలో అశోకచక్రవర్తి కుమార్డు జలకుడు నిర్మించాడని చెబుతారు. ఆ తర్వాత లలితాదిత్యుడు అనే మరో రాజుచే ఈ నగరం పునర్నిర్మించబడింది. నగరం పొలిమేరలలో డాల్ సరస్సు వుంటుంది. ఈ డాల్ సరస్సు వుంటుంది. ఈ డాల్ సరస్సు మూడు సరస్సుల కలయిక. సరస్సు మధ్యలో నెహ్రూ పార్క్ వుంటుంది. డాల్ సరస్సు 8 కిలోమీటర్ల పొడవు 4 కిలోమీటర్ల వెడల్పు కల్గిన సుందర సరస్సు. డాల్ సరస్సులో పడవ విహారం ఒక మధురానుభూతి. ఈ సరస్సులోని గృహ నౌకలలో యాత్రికులకు సమస్త ఆధునిక సౌకర్యాలు కల్గి వుంటాయి. స్టార్ హోటళ్ళలో లాగా ఈ నౌకలలో, బెడ్‌రూంలు, డైనింగ్ రూంలు, ఎటాచ్డ్ బాత్‌రూమ్‌లు, చన్నీళ్ళు, వేడినీళ్ళ పంపులు లాంటి అన్ని సౌకర్యాలు వుంటాయి. డాల్ సరస్సులో నీరు తీయగా స్వచ్ఛంగా వుంటాయి కలువ పువ్వులతో మనోజ్ఞంగా కానవచ్చే ఈ సరస్సులో తేలియాడే కాయగూరల తోటలు కూడా వుంటాయి శ్రీనగర్‌కు సరఫరా అయ్యే కాయగూరలు ఈ తోటలలోనే పండుతాయి.

డాల్ సరస్సుకు మూడు వైపులా విస్తరించి శ్రీనగర్‌కు 9 కిలోమీటర్ల దూరంలో వుండే మొగల్ గార్డెన్స్ సోయగాలు వర్ణించనలవి కాదు ఈ గార్డెన్స్‌ను మొదట షాజహాన్ చక్రవర్తి అభివృద్ధి చేశాడు ఇందులో చష్మాషాహి (రాజసరోవరం) ప్రసిద్ధి చెందినది చష్మా షాహికి 4 కిలోమీటర్ల దూరంలో నిషాత్(ఆనందవనం) వుంటుంది. దీనికి ఇంకా 3 కిలోమీటర్ల దూరంలో షాలిమార్ (ప్రేమనిలయం) వుంటుంది మొగల్ ఉద్యానవనాలన్నింటిలో ఈ షాలిమార్ గార్డెన్స్ మరీ సుందరంగా వుంటాయి లోగడ జహంగీర్ అతడి భార్య నూర్జహాన్ ఈ ఉద్యానవనంలో గులాబీపూల పాన్పుల మీద విహరించే వారట షాలిమార్‌కు 5 కిలోమీటర్ల దూరంలో నసీమ్ గార్డెన్స్ వుంటాయి ఈ గార్డెన్స్ మొగల్ చక్రవర్తి అక్బర్ వేశాడు

మొగల్ గార్డెన్స్‌కు 3 కిలోమీటర్ల దూరంలో వుండే హార్వాన్ అశోకుని కాలంలో ప్రసిద్ధ బౌద్ధ విహారం. ప్రస్తుతం ఇది చిన్న గ్రామం.

శ్రీనగర్‌కు ఒక వైపున వుండే హరిపర్వతంపై ప్రాచీన హిందూ దేవాలయాలున్నాయి. 18వ శతాబ్దంలో నిర్మించి కోట కూడా వుంది. కొండ చుట్టూ ప్రహరీ గోడ వుంటుంది.

శ్రీనగర్‌కు మరొక వైపున ఉండే శంకరాచార్య పర్వతం 305 మీటర్ల ఎత్తున వుంటుంది. ఈ కొండపై శివాలయం వుంది. శంకరాచార్యుల వారు ఇక్కడ కొంతకాలం తపస్సు చేసిన కారణంగా ఈ కొండకు ఆ పేరు వచ్చింది.

డాల్ సరస్సు ఒడ్డున హజరత్ మసీదు వుంటుంది. ఈ మసీదులో మహమ్మద్ ప్రవక్త కేశవిశేషం భద్రపర్చబడింది ఇంకా శ్రీనగర్‌లో జామి మసీదు కూడా చూడదగినదే. కొయ్యతో నిర్మించబడిన ఈ మసీదు రాష్ట్రంలో పెద్ద మసీదు.

శ్రీనగర్‌కు 55 కిలోమీటర్ల దూరంలో అనంత్‌నాగ్ వుంటుంది. శివుడు, కృష్ణుడు ఆలయాలున్నాయి. ఇచ్చట అనంత్‌నాగ్ అంటే మహావిష్ణువు యొక్క పాన్పు అయిన ఆదిశేషువేనంటారు.

శ్రీనగర్‌కు 96 కిలోమీటర్ల దూరంలో వుండే పహల్గాం సముద్రమట్టానికి 2195 మీటర్ల ఎత్తున వుంటుంది. కాశ్మీర్‌లోయలోని అత్యంత మనోహర ప్రదేశాలలో ఇదొకటి. శేష్‌నాగ్, అమర్నాథ్ గుహ మొదలైన మంచుకొండలను సందర్శించే యాత్రికులకు ఇది ప్రధమ మజిలీగా వుంటుంది. ఈ చిన్న పట్టణం పహల్గాం చుట్టూ అనేక మంచు పర్వతాలుంటాయి పూర్వం ఇది గొర్రెల కాపరుల గ్రామం

శ్రీనగర్‌కు 45 కిలోమీటర్ల దూరంలో గుల్మార్గ్ సముద్ర మట్టానికి 2730 మీటర్ల ఎత్తున వుంటుంది. దేవదారు వృక్షాలతో, పుష్పాలతో ఈ ప్రదేశం అలరారుతూ

ఉంటుంది. 11 కిలోమీటర్ల పొడవుండే రోడ్డు మీదగా వెడితే కాశ్మీరు అద్భుత దృశ్యాలే గాక హిమాలయ పర్వతాలు కూడా ప్రస్ఫుటంగా కానవస్తాయి.

శ్రీనగర్‌కు 80 కిలోమీటర్ల దూరంలో సోనామార్గ్ (బంగారుభూమి) మరో అందమైన ప్రదేశం. పలురకాలైన పుష్పాలతో, పచ్చిక బయళ్ళు, పర్వత శ్రేణులతో, టూరిస్టులను ఆహ్లాదపరుస్తుంది

అమర్‌నాధ్ హిందువులకు పవిత్ర స్థలం. మానవ ప్రయత్న లేకుండా ప్రకృతి సిద్ధంగా ఏర్పడిన ఈ శివాలయం సముద్రమట్టానికి 4వేల మీటర్ల ఎత్తున వుంటుంది. శివాలయం ఎత్తు 150 అడుగులు. ప్రకృతి సిద్ధమైన ఈ దేవాలయానికి తలుపులు దర్వాజాలు వుండవు. పై నుంచి పడిన నీటి బిందువులే మంచుగా ఘనీభవించి శివలింగంగా ఏర్పడతాయి. ఈ విధంగా అనాది కాలం నుంచి జరుగుతున్న అద్భుత విశేషం. ఈ శివలింగం చంద్రకళలను బట్టి అమావస్యకు అదృశ్యమై పౌర్ణమికి పూర్తిలింగంగా తయారవుతుంది.

ఈ అద్భుత అమర్‌నాధ్ గుహ శ్రీనగర్‌కు 153 కిలోమీటర్ల దూరంలో పహల్గాంకు 46 కిలోమీటర్ల దూరంలో వుంటుంది. ఇక్కడకు వెళ్లాలంటే పహల్గాం నుంచి కాలినడక తప్ప మరో సదుపాయం లేదు. పహాల్గాం నుంచి అమర్‌నాధ్ చేరాలంటే మంచుకొండలపై నడిచేవాళ్ళ ఓపికను బట్టి 3 రోజుల నుంచి 5 రోజుల దాకా పడుతుంది. సంవత్సరంలో 11 మాసాలు ఈ అమర్‌నాధ్ గుహ దట్టమైన మంచుతో కప్పబడి వుంటుంది. ఆగస్టు నెలలో మాత్రం మంచుకరుగుతుంది. అప్పుడే దేశం నలుమూలలనుంచి అనేక వేలమంది భక్తులు పహల్గాం వచ్చి అక్కడ నుంచి కాలినడకన అమర్‌నాధ్ చేరుకుంటారు. కాలినడకన అమర్‌నాధ్ చేరటం ఒక దివ్యానుభూతి.

కాశ్మీర్‌లోయకు ముఖద్వారం జమ్ము పట్టణం. జమ్ము జనాభా 2 లక్షలు. రాష్ట్రంలో రెండవ పెద్దపట్టణమైన జమ్ము, తావి నది ఒడ్డున వుంటుంది. క్రీ॥శ॥ 9వ శతాబ్దంలో ఈ ప్రాంతాన్ని పాలించిన జంబులోచన రాజును బట్టి ఈ పట్టణానికి ఈ పేరు వచ్చింది. ప్రస్తుత పట్టణాన్ని తీర్చిదిద్దిన వాడు 19వ శతాబ్దంలో జమ్మూను పాలించిన గులాబ్‌సింగ్ కాశ్మీర్‌లోయలో చలికి సతమతమైన వారికి జమ్ము నులివెచ్చని ఎండ పులకరింప చేస్తుంది. మైదాన ప్రాంతంలో వున్న జమ్ములో అనేక ప్రాచీన ఆలయాలున్నాయి. పట్టణం మధ్యలో వుండే రఘునాధ ఆలయం అన్నింటికన్నా ముఖ్యమైనది ఈ ఆలయ సముదాయంలో రామాలయం మరీ ముఖ్యమైనది. రణబీరేశ్వర ఆలయం కూడా చెప్పుకోదగిన మరో ఆలయం. ఇది శివాలయం.

జమ్ముకు 62 కిలోమీటర్ల దూరంలో వైష్ణవీదేవి ఆలయం సముద్ర మట్టానికి

5300 అడుగుల ఎత్తున వున్న గుహలో వుంటుంది ఈ ఆలయం దర్శించటానికి నిత్యం అనేక వేలమంది వస్తూ వుంటారు ఇంకా జమ్మూకు 88 కిలోమీటర్ల దూరంలో వుండే శివఖోరి కూడా మరో ప్రసిద్ధ శివాలయం

లడక్ ప్రాంతం జమ్ము కాశ్మీర్‌లో దాదాపు సగం ఆక్రమించుకుంటుంది ప్రపంచ పై కప్పుగా పిలవబడే ఈ ప్రాంతానికి వెళ్ళటానికి మొన్న మొన్నటివరకూ ఎవరూ సాహసించేవారు కాదు భయంకరమైన మంచు పర్వతాలతో విపరీతమైన చలిగాలులతో వుండే ఈ ప్రాంత వాతావరణం విచిత్రంగా కూడా వుంటుంది సంవత్సరంలో 320 రోజులు సూర్యుడు ప్రకాశించినా ఆకాశంలో మబ్బులనేవి ఎప్పుడూ కానరావు సంవత్సరం మొత్తం మీద 5, 6 అంగుళాల వర్షం మాత్రమే పడుతుంది మధ్యాన్నం దాకా ఎండలు బాగా వుండి సాయంత్రానికి విపరీతమైన చలిగాలి ప్రారంభమవుతుంది ఇక శీతాకాలంలో ఉష్ణోగ్రత మైనస్ 60 డిగ్రీల ఫారన్‌హీట్‌కు పడిపోతుంది పంటలకు అనువైన ప్రాంతం కాదు. అక్కడక్కడా కొద్ది చోట్ల మాత్రమే పంటపొలాలు కానవస్తాయి. పశువుల మేత తగు మాత్రంగా వుంటుంది. ఇచ్చట ప్రజల ప్రధాన వృత్తి పశుపోషణ ఈ ప్రజలంతా బౌద్దులు కొంతమంది ముస్లింలు. 1979 నుంచి మాత్రమే మిగతా దేశానికి ఈ ప్రాంతానికి రవాణా సౌకర్యం ఏర్పర్చబడింది.

లడక్ ప్రాంతం లడక్ జిల్లా అని కార్గిల్ జిల్లా అని రెండు జిల్లాలుగా విభజించబడి వుంటుంది. లడక్ జిల్లా విస్తీర్ణం రీత్యా దేశంలో కెల్లా పెద్ద జిల్లా 83వేల చదరపు కిలోమీటర్లు (ఇందులో 37555 చదరపు కిలో మీటర్లు చైనా ఆక్రమణలో వుంది) వైశాల్యం వుండే లడక్ జిల్లా దాదాపు పశ్చిమ బెంగాల్ రాష్ట్రం అంత వుంటుంది. కేరళ రాష్ట్రానికి రెట్టింపుగా వుంటుంది జనాభా మాత్రం 70 వేలే. ముఖ్యపట్టణం 'లే' జనాభా 10 వేలు. లడక్ అంతా బౌద్ధారామాలు (గోంపాలు) ఎక్కువగా వుంటాయి. లడక్ ముఖ్యపట్టణం లే పట్టణానికి 40 కిలోమీటర్ల దూరంలో హెమిస్ గోంపా అనే ప్రసిద్ధ బౌద్ధరామం వుంది. లడక్ మొత్తం మీద ఇదే పెద్ద బౌద్ధారామం. ఇచ్చట జూన్, జులై మాసాలలో బౌద్దులు గొప్పగా ఉత్సవాలు చేసుకుంటారు.

లడక్‌లో రెండో పెద్ద పట్టణం కార్గిల్. ఈ పట్టణం కార్గిల్ జిల్లా రాజధాని. సరునది ఒడ్డున వుంటుంది.

ఈ సువిశాల లడక్ ప్రాంతంలో జనాభా తక్కువైనా దేశరక్షణ వ్యూహం రీత్యా కీలక ప్రాంతం. ఇచ్చట అనేక సైనిక కేంద్రాలున్నాయి.

కాశ్మీర్ ప్రజలు పొడుగ్గా, తెల్లగా అందంగా వుంటారు. సహనం, సౌజన్యం వారి లక్షణాలు. కాశ్మీర్ స్త్రీలు సౌందర్యరాసులు అంతేగాక ఈ స్త్రీలు కష్టపడి పనిపాటలు

చేసుకుంటారు. పండుగరోజుల్లో ఇక్కడ స్త్రీలు నీలం, ఆకుపచ్చ రంగు దుస్తులు ధరించి ప్రదర్శించే నృత్యాలు టూరిస్టులను విశేషంగా ఆకట్టుకుంటాయి.

కాశ్మీరీ నూతన సంవత్సరం (నౌరోజ్) మార్చి, ఏప్రిల్ మాసాల్లో వస్తుంది. ఈ పండుగ జమ్మూ కాశ్మీర్ అంతటా ఘనంగా చేసుకుంటారు. ఇంకా ఈ రాష్ట్రంలో ముస్లింలు ముస్లిం పండుగలు, హిందువులు హిందూ పండుగలు చేసుకుంటారు.

# 13 హర్యానా

వైశాల్యం - 44212 చదరపు కిలోమీటర్లు   జనాభా - 1 కోటి 63 లక్షలు.
రాజధాని - చండీఘర్   మాతృభాష - హిందీ

హర్యానాకు తూర్పున ఉత్తరప్రదేశ్, పడమర పంజాబ్, ఉత్తరాన హిమాచలప్రదేశ్, దక్షిణాన రాజస్తాన్ రాష్ట్రాలు వుంటాయి. దేశ రాజధాని, కేంద్రపాలిత ప్రాంతమైన ఢిల్లీ హర్యానాలోకి చొచ్చుకు వచ్చి మూడు వైపులా హర్యానా చేత చుట్టబడి వుంటుంది.

హర్యానా వైశాల్యం రీత్యా ఆంధ్రప్రదేశ్ వైశాల్యంలో 6వ వంతుకన్నా ఇంకా తక్కువే వుంటుంది విశాఖపట్నం జిల్లాకు నాలుగు రెట్లులోపుగా ఉంటుంది జనాభారీత్యా



హర్యానా ఆంధ్రప్రదేశ్ జనాభాలో సుమారుగా నాలుగోవంతు వుంటుంది

హర్యానాను స్థూలంగా రెండు భాగాలుగా విభజించవచ్చు గంగా తీరమైదానం; ఉపహిమాలయ పర్వత శ్రేణులు గంగా తీరమైదానం సారవంతమైన ప్రదేశం రాష్ట్రంలో ఉత్తరాన్నుంచి దక్షిణానికి వ్యాపించి వున్న ఉపహిమాలయ పర్వత శ్రేణులు సముద్ర మట్టానికి 700 అడుగుల నుంచి 900 అడుగల ఎత్తువరకూ వుంటాయి నైరుతి ప్రాంతం ఎడారి ఇసుక ప్రాంతం.

హర్యానాలో జీవనదులు లేవు. ఒకే ఒక్క నది ఘాఘూర్‌నది రాష్ట్రం ఉత్తర ప్రాంతంలో ప్రవహిస్తుంది హర్యానాలో వర్షపాతం కూడా తక్కువగానే వుంటుంది హిస్సార్, మహేంద్రఘర్ జిల్లాలో వర్షం మరీ తక్కువ పడుతుంది. వాతావరణ పరిస్థితి కూడా అతిగానే వుంటుంది. వేసవి కాలంలో ఎండలు విపరీతంగా వుంటాయి. అలాగే శీతాకాలంలో చలి కూడా విపరీతంగా వుంటుంది జూన్ నుంచి సెప్టెంబరు వరకూ వర్షాకాలం డిశంబరు నుంచి ఫిబ్రవరి వరకూ శీతాకాలం, మార్చి నుంచి మే వరకూ వేసవికాలం హర్యానాలో వర్షాకాలంలో వానలకన్నా శీతాకాలంలో పడే వానలు అక్కడి పంటలకు అనువుగా వుంటాయి. అసలు శీతాకాలం వానలే హర్యానా వ్యవసాయ సంపదకు మూలాధారం.

హర్యానాకు యుగయుగాల చరిత్ర వుంది. మహాభారత యుద్ధం జరిగిన కురుక్షేత్రం ఇక్కడే వుంది. శ్రీకృష్ణ పరమాత్ముడు భగవద్గీత బోధించింది ఇక్కడనే! ఇక్కడొక అందమైన కృష్ణమందిరం నిర్మించబడి ఉంది. వేద కాలంలో పురాణకాలంలో ప్రసిద్ధిచెందిన సరస్వతి నది ఇక్కడ ప్రవహించేది. (ప్రస్తుతం ఈ నదిలేదు) మహాభారతంలో పేర్కొన్న కామ్యకవనం, ద్వైతవనం ఈ సరస్వతి నది ఒడ్డున వుండేవి. భరత వంశం పుట్టింది ఇక్కడే. ఈ వంశం పేరును బట్టే మన దేశానికి భారతదేశం అనే పేరు వచ్చింది. హర్యాన పేరు 'మనుస్మృతి' లో ప్రస్తావించబడింది.

మౌర్య సామ్రాజ్య కాలంలో హర్యానాకూడా అందులో భాగంగా వుంది. హర్యానాలోని ధానేశ్వరం (స్థానేశ్వరం) క్రీ॥ శ॥ 16వ శతాబ్దంలో పుష్పభూపతి రాజుల రాజధానిగా వుండేది. ఈ వంశంలోని వాడే ప్రఖ్యాత హర్షవర్ధనుడు ఇతడి కాలంలోనే రాజధాని స్థానేశ్వరంనుంచి కనోజ్‌కు మార్చబడింది. ఈ వంశం పాలన తర్వాత హర్యానాపై హుణుల దండయాత్రలు వచ్చిపడ్డినై. ఆ తర్వాత మహ్మద్ ఘజిని, మహమ్మద్ గోరి దండయాత్రలు హర్యానాను చిన్నభిన్నం చేశాయి. హర్యానా సంపద యావత్తు దోచుకుపోయారు ఈ దండయాత్రల తర్వాత హర్యానా మొగల్ సామ్రాజ్యంలో భాగమైంది.

1857 లో జరిగిన ప్రధమ స్వతంత్ర పోరాటంలో హర్యానా కూడా పాల్గొన్నది ఈః పోరాటం విఫలమైన తదుపరి స్వతంత్ర పోరాటానికి మద్దతునిచ్చారనే నెపంపై జాగిర్, బహదూర్‌ఘర్, బల్లబ్‌ఘర్ నవాబులను, రేవారి రాజు రావ్‌తులరాంను సింహాసనాల నుంచి తొలగించి ఆ ప్రాంతాల్ని బ్రిటిషువారు తమ స్వాధీనం చేసుకున్నారు. మిగతా ప్రాంతాల్ని పంజాబ్‌లో కలిపివేశారు

1966వరకూ హర్యానా పంజాబ్‌లో భాగంగానే వుండేది 1966 నవంబరు 1వ తేదీన పంజాబ్ రాష్ట్రాన్ని విభజించి హిందీ మాట్లాడే ప్రాంతాన్ని హర్యానాగా ఏర్పాటు చేశారు.

హర్యానా 16 జిల్లాలుగా విభజించబడి వుంది అవి - అంబాలా, కురుక్షేత్ర, కర్నాల్, జింద్, సోనేపట్, రోటక్, ఫరీదాబాద్, గుర్గాన్, మహేంద్రఘర్, భివాని, హిస్సార్, సిర్సా, రేవారి, కైతాల్, పనిపాల్, యమునానగర్.

హర్యానాలో ఒకే సభగల విధాన సభ వుంది. ఇందులో 98 మంది శాసన సభ్యులు వుంటారు. లోక్‌సభలో 10 మంది రాజ్యసభలో 5గురు సభ్యులు హర్యానాకు ప్రాతినిధ్యం వహిస్తారు.

హర్యానా జనాభాలో 92 శాతం హిందువులు. మిగతావారు ముస్లింలు, సిక్కులు, క్రైస్తవులు. జనాభాలో 55 శాతం మంది చదవనూ, వ్రాయనూ వచ్చినవారు.

హర్యానా ప్రధానంగా వ్యవసాయిక రాష్ట్రం. స్వతంత్రం వచ్చిన తర్వాత హర్యానా వ్యవసాయంలో బాగాముందంజ వేసింది. వ్యవసాయ విప్లవం ద్వారా హర్యానా రైతులు ఎంతో అభివృద్ధి చెందారు. ఆధునిక పద్ధతులలో సమృద్ధిగా ఎరువుల వాడకం ద్వారా అధిక పంటలు పండించగల్గుతున్నారు. ఆహారధాన్యాలు, చెరకు, ప్రత్తి, నూనె గింజలు విరివిగా పండుతున్నాయి. ఆహార ధాన్యాలలో గోధుమ ప్రధాన పంటకాగా వరి కూడా బాగానే పండుతుంది. హర్యానా రైతులు వ్యవసాయ అవసరాలకు కరెంటు కూడా ఎక్కువగా వాడతారు. ప్రతి గ్రామానికి విద్యుత్ సౌకర్యం వుంది. దేశంలో ఆహార ధాన్యాల సగటు ఉత్పత్తిలో హర్యానా రెండవ స్థానంలో వుంది. చెప్పుకోదగిన నదులు లేని హర్యానాలో 67 శాతం భూమి సాగుబడిలో ఉన్నదంటే హర్యానా రైతుల కృషి ఎంతటిదో తెలుసుకోవచ్చు. పాడి పరిశ్రమాభివృద్ధిలో హర్యానా చెప్పుకోదగిన స్థానంలో వుంది. పంటల బీమా పథకం అమలు పర్చటంలో దేశంలో హర్యానా మొట్టమొదటి రాష్ట్రం.

హర్యానా పారిశ్రామికంగా కూడా అభివృద్ధి చెందిన రాష్ట్రం. ట్రాక్టర్లు, కార్లు, సైకిళ్ళు, చక్కెర, సిమెంటు, బట్టలు, టి.వి. సెట్లు, వనస్పతి, రిఫ్రిజిరేటర్లు తయారుచేసే కర్మాగారాలున్నాయి. పింజోరిలోని హిందూస్తాన్ మెషీన్‌టూల్స్ కర్మాగారం, పానిపట్‌లోని

లైజర్ ఫ్యాక్టరీ, గుర్గాన్‌లోని ఐ డి.పి.యల్., మారుతి కార్లు తయారుచేసే మారుతీ ఉద్యోగ ఫ్యాక్టరీలు ప్రసిద్ధి చెందిన ప్రభుత్వ కర్మాగారాలు. 300కు పైగా భారీ, మధ్యతరహా పరిశ్రమలు నెలకొని వున్నాయి చిన్న పరిశ్రమలు 42వేలకు పైగా వున్నాయి పారిశ్రామికాభివృద్ధి కారణంగా రాష్ట్రంలోని అన్ని గ్రామాలకు మెటల్ రోడ్లు ఏర్పాటు చేయబడినాయి.

హర్యానా రోడ్లు ఎల్లప్పుడూ టూరిస్టులతో సందడిగా ఉంటాయి. పైగా నగరజీవనంతో విసిగిపోయిన ఢిల్లీ వాసులకు హర్యానా విశ్రాంతి కేంద్రంగా కూడ వుంటుంది ఆదివారాల్లో, సెలవుదినాల్లో ఢిల్లీ వాసులు అనేకమంది హర్యానాలోని వివిధ ప్రదేశాలకు వెళ్ళి విశ్రాంతి తీసుకుంటారు. ఇంతేగాక ఢిల్లీ నుంచి జైపూర్, ఆగ్రా, అమృతసర్, సిమ్లా, శ్రీనగర్ వెళ్ళే రహదార్లన్నీ హర్యానాలో గుండానే వెళ్ళుతాయి. అందువలన దేశం నలుమూలల నుంచి విదేశాల నుంచి వచ్చే టూరిస్టులతో హర్యానా కళకళలాడుతూ వుంటుంది.

హర్యానాలో ముఖ్యంగా చూడదగిన ప్రదేశం కురుక్షేత్రం. ఢిల్లీ నుంచి 165 కిలోమీటర్ల దూరంలో వుంటుంది. హిందువుల పుణ్యక్షేత్రాలలో ముఖ్యమైనది. కురుక్షేత్ర సరోవరంలో సూర్యగ్రహణం, కుంభమేళా సందర్భముగా లక్షలాది మంది హిందువులు పుణ్యస్నానాలు చేస్తారు. కురుక్షేత్ర సరోవరం 4500 అడుగుల పొడవు, 2100 అడుగుల వెడల్పు వుంటుంది. చుట్టూ దేవాలయాలు వుంటాయి. కురుక్షేత్ర సరోవరాన్ని బ్రహ్మసరోవర్ అని కూడా పిలుస్తారు కురుక్షేత్రంలో ప్రసిద్ధి దేవాలయం లక్ష్మినారాయణ, సీతాదేవాలయం మొదలైనవి. కురుక్షేత్రంలో మొత్తం 365 దేవాలయాలున్నాయి. ఈ కురుక్షేత్ర వైశాల్యం కొన్ని వందల కిలోమీటర్లు వ్యాపించి వుంటుంది. అలనాడు కురుక్షేత్ర మహాసంగ్రామం, భగవద్గీత బోధ జరిగింది ఇక్కడేనని చెప్పుకున్నాం. ఈ పవిత్ర ప్రదేశంలోనే వశిష్ట, విశ్వామిత్ర మహామునులు బ్రహ్మర్షి పదాన్ని పొంది దివ్యత్వం పొందారు. భీష్ముడు ఉత్తరాయణ పుణ్యకాలం వరకూ అంపశయ్యపై ఉండి నిర్వాణం పొందింది ఇక్కడే నంటారు. పరశురాముడు శత్రు సంహారం తర్వాత పరశువుని క్షాళనం చేసింది కూడా ఇక్కడే మహర్షులు వాల్మీకి, వేదవ్యాసుడు, ఇక్కడే సుప్రసిద్ధ గ్రంథాలు వ్రాశారు. దీనికి కురుక్షేత్రం అనే పేరు పాండవ కౌరవుల మూలపురుషుడైన కురురాజుని బట్టి వచ్చింది.

కురుక్షేత్రానికి దగ్గరలోనే స్థానే స్వరం వుంటుంది. 7వ శతాబ్దంలో ఇది హర్షుని రాజధానిగా వుండేది కాదంబరి వ్రాసిన బాణ భట్టు నివసించింది ఇక్కడే. పూర్వం ఇది గొప్ప నగరంగా వుండేది. ప్రస్తుతం ఇది చిన్న గ్రామం. ఇక్కడే అక్షయ వట వృక్షం వుంది ఈ వటవృక్షం ఆనాటి మహాభారత యుద్ధానికి గీతోపదేశానికి సాక్షిభూతంగా నిల్చిన వృక్షం అని చెబుతారు. ఎంతవరకూ నిజమోగాని ఈవటవృక్షం వయస్సు 5 వేల

సంవత్సరాలని చెబుతారు. ఇక్కడ వున్న గీతా భవన్ లైబ్రరీ ప్రసిద్ధి చెందినది. ప్రపంచంలోని 300 ముఖ్యమైన భాషలలో ప్రచురించబడిన భగవద్గీతా గ్రంథాల్ని ఇక్కడ చూడవచ్చును ఇక్కడ వున్న మందిరాలలో గీతోపదేశ మందిరం, రాధాకృష్ణ మందిరం, సర్వేశ్వర మందిరం చూడదగినవి.

హర్యానాలోని పెద్ద పట్టణాలలో అంబాలా ఒకటి ఢిల్లీకి 197 కిలోమీటర్ల దూరంలో వుంటుంది దేశంలో కెల్లా పెద్ద సైనిక కేంద్రం ఇదే అంబాలా వాణిజ్య కేంద్రంగా కూడా ప్రసిద్ధి పొందినది

ఢిల్లీకి చండీఘర్‌కు మధ్యలో వుంటుంది కర్నాల్. ఢిల్లీకి 120 కిలోమీటర్ల దూరంలో వుంటుంది. మహాభారత వీరుడు కర్ణుడి పేరు మీదగా ఈ పట్టణానికి ఈ పేరు వచ్చింది. కర్నాల్‌లో సిక్కులకు పుణ్యక్షేత్రమైన గురుద్వారా మంజిసాహెబ్ వుంది. లోగడ ఇచ్చటనే 1739లో జరిగిన యుద్ధంలో మొగల్ చక్రవర్తి మహమ్మద్ షా నాదిర్ సా చేతుల్లో ఓడిపోయి నెమలి సింహాసనం, కోహినూర్ వజ్రం కూడా కోల్పోయాడు. గుండ్రంగా వుండే కర్నాల్ సరస్సు చూడ ముచ్చటగా వుంటుంది మధ్యలో ఒక చిన్న దీవి వుటుంది. ఈ సరస్సులో అనేక రకాల పక్షులు, బాతులు, కొంగలు వుంటాయి. యాత్రీకులు ఈ సరస్సు వద్ద కాసేపు ఆగి సేద తీర్చుకుంటారు. కొంతమంది ఈ సరస్సులో బోటు షికారు చేసి ఉల్లాసం పొందుతారు. యాత్రీకులకు ఇచ్చట అనేక సౌకర్యాలు కూడా కల్పించారు. కర్నాల్‌కు ఎదురుగా యమునా నదికి ఆవల 'ఒయాసిస్' అనే మరో విశ్రాంతి కేంద్రం వుంది. ఇక్కడ కూడా యాత్రీకులు ఆగి విశ్రాంతి, ఉల్లాసం పొందుతారు. యాత్రీకుల సౌకర్యార్థం ఇచ్చట చక్కటి కాటేజీలు కూడా ఏర్పాటు చేశారు.

ఢిల్లీకి 75 కిలోమటర్ల దూరంలో వున్న పానిపట్ చరిత్ర ప్రసిద్ధి చెందిన ప్రదేశం. యమునా నదీ తీరంలో వుంటుంది. ఇక్కడ మూడు చరిత్ర ప్రసిద్ధి చెందిన యుద్ధాలు జరిగినవి. 1526లో జరిగిన మొదటి యుద్ధం ఢిల్లీ సుల్తాన్ ఇబ్రహీం లోడికి మొగల్ సామ్రాజ్య స్థాపకుడు బాబర్‌కు జరిగింది. రెండవ యుద్ధం 1556లో అదిల్‌షా సూర్ మంత్రిహిముకు మొగల్ చక్రవర్తి అక్బర్‌కు జరిగింది. ఇందులో అక్బర్ గెలిచాడు. మూడో యుద్ధం 1761లో ఆఫ్ఘన్ పాలకుడు అహ్మద్ అబ్దాలికి మరాఠీ వారికి జరిగింది. ఈ యుద్ధంలో మరాఠా వారు ఓడిపోయి తమ ఆధిక్యత కోల్పోయారు. గెల్చిన అహ్మద్‌షా అబ్దాలి తిరిగి ఆఫ్ఘనిస్తాన్ వెళ్ళిపోగా ఈ లోగా బ్రిటిష్‌వారు వచ్చి ఇచ్చట స్థావరం ఏర్పర్చుకోగలిగారు. పానిపట్‌లో జరిగిన అనేక యుద్ధాలు కారణంగా చారిత్రక అవశేషాలు ఏమీ మిగలలేదు. అయితే బాబర్ తన విజయానికి సూచనగా నిర్మించిన కాబూలీ బాగ్ మసీదు, సాలార్ జంగ్ గేటు మాత్రం మిగిలి వున్నాయి. పానిపట్‌లో

జరిగిన మూడు యుద్ధాలకు గుర్తుగా స్మారక చిహ్నం ఏర్పాటు చేశారు. ప్రస్తుతం పానిపట్ చేనేత పరిశ్రమకు ప్రసిద్ధి చెందింది తివాసీలు, రంగు రంగుల డిజైన్లలో చేనేత బట్టలు ఇక్కడ తయారవుతాయి ఇవి ఇక్కడ చౌకగా కూడా దొరుకుతాయి.

ఢిల్లీ ఆగ్రా రహదారిలో ఢిల్లీకి 17 కిలోమీటర్ల దూరంలో సూరజ్‌కుండు సరస్సు ఉన్నది. సూర్యదేవాలయం శిధిలావస్థలో వుండగా సురజ్‌కుండు సరస్సు మాత్రం యాత్రీకులను విశేషంగా ఆకర్షించుతుంది. ఈ సరస్సు 1 కిలోమీటరు పొడవు అర కిలోమీటరు వెడల్పు వుంటుంది. కురుక్షేత్ర సంగ్రామం తర్వాత ధర్మరాజు పితృ దేవతలకు పిండ ప్రాదానం చేసింది ఇక్కడే నంటారు. పరశురాముడు కూడా ఇక్కడే క్షత్రియ రక్తంతో తన తండ్రికి తర్పణాలు విడిచాడు సూర్య గ్రహణ సమయంలో ఈ సరస్సులో లక్షలాది మంది పవిత్ర స్నానాలు చేస్తారు

ఢిల్లీకి 55 కిలోమీటర్ల దూరంలో ఆల్వార్ ఢిల్లీ రహదారిలో సోహనా వుంటుంది. సోహనా అంటే బంగారం. పూర్వం ఇచ్చట ఇసుక నుంచి బంగారం పోగు చేసుకునేవారంట! ప్రస్తుతం ఇది యాత్రా స్థలమే గాక ఆరోగ్యకేంద్రం కూడా. నిలువుగా ఉన్నకొండలపై నిర్మించబడిన ఇళ్ళు ఈ పట్టణానికి శోభ చేకూర్చుతాయి. ఇచ్చట వేడి నీటి బుగ్గలు వున్నాయి. ఈ వేడినీటిని గొట్టాల ద్వారా యాత్రీకులుండే కాటేజిలకు పంపుతారు. ఈ నీటితో స్నానం చేస్తే అనేక రోగాలు తగ్గుతాయని నమ్ముతారు. సోహనాలో ప్రతి సంవత్సరం ఫిబ్రవరి నెలలో కార్ల పందాలు జరుగుతాయి. ఈ సమయంలో అనేకమంది టూరిస్టులు ఇక్కడకు రావటమేగాక ఆ సమయంలో ఇక్కడ ప్రజలు పనులన్నీ మానేసి ఈ కార్ల పందాలు చూడటానికి ఎగబడతారు.

ఢిల్లీకి 45 కిలోమీటర్ల దూరంలో సుల్తాన్‌పూర్ బర్డ్ శాంక్చురీ వుంది. 400 ఎకరాలులో వుండే ఈ పక్షుల సరోవరంలో రకరకాల పక్షులను చూడవచ్చును. ప్రశాంత వాతావరణంలో పక్షుల కిలకిలారావాలతో ఈ పక్షుల కేంద్రం టూరిస్టులను మై మరిపిస్తుంది.

ఢిల్లీకి 30 కిలోమీటర్ల దూరంలో ఫరీదాబాద్ వుంటుంది. ఫరీదాబాద్ పారిశ్రామిక కేంద్రంగా వృద్ధి పొందుతోంది.

ఢిల్లీకి 35 కిలోమీటర్ల దూరంలో జాతీయ రహదారికి 5 కిలోమీటర్ల లోపల ఆరావళీ పర్వత సానులలో సుందర బాద్‌కల్ సరస్సు వుంది. ఈ సరస్సులో టూరిస్టులు బోట్‌షికారు, గాలంతో చేపలు పట్టడం, చేస్తారు. ఇక్కడకు వచ్చే టూరిస్టులకు అనేక సదుపాయాలు కూడా ఏర్పాటు చేశారు. అద్భుత సౌందర్యంతో ఉట్టి పడే ఈ బాద్‌కల్ సరస్సు వద్ద హిందీ సినిమాల షూటింగ్ కూడా చేస్తుంటారు.

చండీఘర్‌కు 22 కిలోమీటర్ల దూరంలో పింజోర్ (యాదవేంద్ర) ఉద్యానవనం వుంది. దేశంలోనే ప్రాచీనమైన మొగల్ గార్డెన్‌గా చెప్పబడే ఈ ఉద్యానవనం సొగసులు చెప్పనలవి కాదు. 17వ శతాబ్దంలో ఔరంగజేబు సేనాని ఫిదాయిఖాన్ ఈ ఉద్యానవనం ఏర్పాటు చేశాడు. ఎత్తైన సింహద్వారంతో అవరోహణ క్రమంలో ఆరు అంచెలుగా వుండే ఈ ఉద్యానవనంలో గల గల పారే పిల్ల కాల్వలతో, ఉవ్వెత్తున ఎగిరే నీటి ఫౌంటెన్లతో, పచ్చిక మైదానాలతో దాని సౌందర్యం చూడటానికి వేయి కళ్ళు చాలవు. రాత్రి పూట లైట్ల వెలుగులో మరింత శోభాయమానంగా వుంటుంది. పింజోర్ గార్డెన్స్‌లో శేష్‌మహల్, రంగమహల్, జల్‌మహల్ అనే మూడు భవంతులు కూడా వున్నాయి. శేష్‌మహల్ అద్దాలతో నిండి వుంటుంది. రంగమహల్ 17వ శతాబ్దపు మొగల్ చిత్రాలు, పెయింటింగ్స్‌తో అలంకరించబడి వుంటుంది. జల్‌మహల్ నీటి ఫౌంటెన్స్‌తో శోభిల్లుతుంది. చిన్నపిల్లలు చూడటానికి 'జూ' కూడా వుంది. ఈ పింజోర్ గార్డెన్స్ పూర్వం రోజులలో మహారాజులకు రాణులకు విహార కేంద్రంగా వుండేది. ఇక్కడ కొన్ని పురాతన దేవాలయాలు కూడా వున్నాయి. ఇందులో ఒకటి పురాణ కాలంలో పాండవులు కట్టించిందని చెబుతారు. పాండవులు అజ్ఞాతంలో వున్నప్పుడు ఇక్కడ కొన్నాళ్ళు గడిపారని ఇక్కడ వున్న కొలనులో ప్రతిరోజూ పాండవులు ద్రౌపది స్నానం చేసే వారని లోగడ ఈ గ్రామాన్ని పాండవులు పేరు మీదగా 'పంచపుర' అని పిల్చేవారని. ఆ పంచపురి పింజోర్‌గా మారిందని ఒక కథ చెబుతారు.

ఢిల్లీకి 64 కిలోమీటర్ల దూరంలో సోహనాకు దగ్గరగా 'దమ్‌దమా' అనే సహజ సిద్ధమైన సరస్సు వుంది. ప్రశాంత వాతావరణంలో వుండే ఈ సరస్సు కూడా అనేక మంది టూరిస్టులను ఆకర్షించుతుంది. ఇక్కడ గుర్రపు స్వారీవి, కొండలు ఎక్కటంలాంటి క్రీడలు యాత్రీకుల కోసం ఏర్పాటు చేశారు. ప్రతి సంవత్సరం నవంబరులో ఈ సరస్సు వద్ద 'బెలూన్ మేళా' జరుగుతుంది. బెలూన్ క్లబ్ ఆఫ్ ఇండియా వారు నిర్వహించే ఈ మేళాలో వేలాది మంది జనం పాల్గొంటారు.

ఢిల్లీకి 92 కిలోమీటర్ల దూరంలో ఆగ్రా మార్గంలో 'డబ్‌చిక్' అనే ఆహ్లాదకరమైన విశ్రాంతి కేంద్రం వుంది. రకరకాల పూల చెట్లు, వృక్షాలతో అలరారే ఈ విశ్రాంతి కేంద్రం వద్ద ఆగ్రా వెళ్ళే టూరిస్టులు కాసేపు ఆగి సేద తీర్చుకుంటారు.

రోహటక్ హర్యానాలో ఒక ప్రధాన పట్టణం. ఇక్కడ స్వామి దయానంద విశ్వవిద్యాలయం వుంది. ఇక్కడ రోహతస్‌ఘర్ అనే పురాతన కోటను బట్టి ఈ పేరు వచ్చింది. ఇచ్చట హిందూ, ముస్లిం మతాలకు చెందిన అనేక మసీదులు, దేవాలయాలు వున్నాయి. ముస్లింలను ఆకర్షించే దీన ఆదీన మసీదులు, హిందువులను ఆకర్షించే విష్ణు, హనుమాన్ దేవాలయాలు వున్నాయి. జైనుల మఠాలు కూడా వున్నాయి. ఇచ్చట

జోగినుల ఆశ్రమం కూడా వుంది.

ఢిల్లీకి 160 కిలోమీటర్ల దూరంలో హిస్సార్‌లో పెద్ద వ్యవసాయ పరిశోధనా క్షేత్రం వుంది. ఈపరిశోధనా క్షేత్రంలో వ్యవసాయం, పంటలు, పశువుల పెంపకం, బీడు పొలాలలో పంటలు ఎలా పండించాలి మొదలైన విషయాలపై పరిశోధనలు చేస్తారు.

జాట్‌లు, రాజ్‌పుట్లు, అహీర్ల జన్మస్థలం హర్యానా, జాట్‌లు రాజ్‌పుట్లు పరాక్రమ వంతులే గాక వ్యవసాయం చేయటంలో నైపుణ్యం కల్గినవారు.

హర్యానా ప్రజలు హిందువుల చేసుకునే పండుగలన్నీ చేసుకుంటారు. ఇంకా వైశాఖి (పంటలు చేతికి వచ్చినపుడు చేసుకునే పండుగ) కూడా ఏప్రిల్ 13న ఘనంగా చేసుకుంటారు. ఈ వైశాఖి పండుగను ఏప్రిల్ 13 నుంచి 3 రోజుల పాటు చేసుకుంటారు. ఈ మూడు రోజులు పంటలు ఇంటికి వచ్చిన ఆనందంతో జానపద నృత్యాలతో, వినోదాలతో, ఉల్లాసంగా గడుపుతారు.

సూరజ్‌కుండులో ప్రతి సంవత్సరం ఫిబ్రవరి 1 నుంచి 15 వరకూ హస్తకళల మేళా నిర్వహిస్తారు. ఈ మేళాలో హర్యానాలో తయారయ్యే అన్ని రకాల చేతి పనిముట్లు, చేనేత వస్త్రాలు మొదలైన వస్తువులన్నీ ప్రదర్శించబడతాయి. దేశం నలుమూలల నుంచి అనేక మంది హస్తకళా ప్రియులు ఈ మేళాలో పాల్గొంటారు.

# 14 హిమాచల్‌ప్రదేశ్

వైశాల్యం - 55673 చదరపు కిలోమీటర్లు జనాభా - 52 లక్షలు వాడుక భాషలు - హిందీ, పహాడి

హిమాలయ పర్వతాల ఒడిలో ఒదిగివున్న రాష్ట్రం హిమాచల్‌ప్రదేశ్ ఈ రాష్ట్రానికి ఉత్తరాన జమ్ము, కాశ్మీర్, ఆగ్నేయంగా ఉత్తరప్రదేశ్, దక్షిణాన హర్యానా, పడమర పంజాబ్ రాష్ట్రాలు వుంటాయి హిమాచల్ ప్రదేశ్‌కు తూర్పు సరిహద్దున టిబెట్ (చైనా) వుంటుంది

వైశాల్యం రీత్యా పంజాబ్ కన్నా హర్యానా కన్నా పెద్దదయిన హిమాచల్‌ప్రదేశ్ మన



రాష్ట్రంతో పోల్చితే 5వ వంతు మాత్రం వుంటుంది. జనాభా రీత్యా మన రాష్ట్ర జనాభాలో 12వ వంతు మాత్రం వుంటుంది

హిమాచల్‌ప్రదేశ్ రాష్ట్రం అంతా దాదాపు పర్వతాలే. సముద్రమట్టానికి 460 నుంచి 6300 మీటర్ల ఎత్తు వుండే పర్వతాలతో నిండి వుంటుంది. ఈ రాష్ట్రాన్ని భౌతికంగా రెండు భాగాలుగా విభజించవచ్చు. ఉత్తర ప్రాంతం, దక్షిణప్రాంతం దక్షిణప్రాంతం మైదాన ప్రదేశం. కొంత వరకు వేడి ప్రాంతం. ఉత్తర ప్రాంతంలో సంవత్సరంలో ఎక్కువ కాలం చలిగా వుంటుంది. ఇక శీతాకాలంలో విపరీతమైన చలిగాలులు వీస్తూ దట్టంగా మంచు కురుస్తుంది. వేసవి కాలంలో మాత్రం కాస్తంత వెచ్చగా వుంటుంది. రాష్ట్రంలోని 12 జిల్లాలో రెండు జిల్లాలు- సిమ్లా, సిర్మార్ మాత్రమే బాగా సారవంతమైనవి. మిగతా జిల్లాలు కొండలు, గుట్టలు, అడవులతో నిండి వుంటాయి. సాగుకు అంత లాకీ అయిన ప్రాంతం కాదు. హిమాచల్‌ప్రదేశ్‌లో సగటున 182 సెంటీ మీటర్ల వర్షం పడుతుంది. కాంగ్రా జిల్లాలోని ధర్మశాలలో అత్యధిక వర్షం పడుతుంది.

హిమాచల్‌ప్రదేశ్‌లో అనేక పెద్ద నదులు ప్రవహిస్తాయి. చీనాబ్, రావి, బియాస్, సట్లెజ్, యమునా నదులు ముఖ్యమైనవి. ఈ నదులన్నీ మంచు కరిగిన నీటితో ప్రవహించే జీవనదులు. ఎత్తైన కొండల మీద నుంచి ఈ నదులు ప్రవహించటం వలన సహజ సిద్ధమైన రిజర్వాయర్లతో ఈ రాష్ట్రంలో జలవిద్యుత్ పుష్కలంగా చౌకగా లభిస్తోంది. ఇట్టి విద్యుదుత్పత్తికై నేడీ రాష్ట్రంలోని విశేషమైన కృషి ప్రారంభమైంది కూడ.

పురాణ ప్రసిద్ధులైన వ్యాసుడు, భృగు, జమదగ్ని మొదలైన మహామునుల ఆశ్రమాలు హిమాచల్ ప్రదేశ్‌లో పూర్వం వుండేవి. పర్వత రాజపుత్రిక పార్వతి జన్మస్థలం ఇక్కడేనని చెబుతారు. ఇప్పటికీ కులు ప్రాంతంలో పార్వతి పేరు మీదగా ఒక నది కూడా వుంది. అచ్చట వుండే లోయను పార్వతీ లోయ అని కూడా పిలుస్తారు.

ఆర్యులు ఇచ్చటకు రాకపూర్వమే అనేక తెగలవారు ఇచ్చట నివసించేవారు. ఈ తెగల రాజైన శంబర్ ఆర్యుల రాకను నిరోధించటానికి అనేక యుద్ధాలు చేసి ఆర్యుల చేత చంపబడ్డాడు. భారతకాలంలో ఈ ప్రదేశాన్ని త్రిగర్త అనేవారు. విరాట రాజ్యం కూడా ఇదేనని చెబుతారు. పాండవుల అజ్ఞాతవాసంలో విరాటం రాజ్యంలో తలదాచుకున్నారు. పాండవపత్ని ద్రౌపది జన్మస్థలం ద్రుపద రాజ్యం కూడా ఈ రాష్ట్రంలోని భాగమని అంటారు. బహుభర్తృత్వం ఇప్పటికి యిక్కడి కొన్ని తెగలలో ఆచారంగా ఉన్నది.

క్రీ॥ పూ॥ 2వ శతాబ్దంలో ఈ ప్రాంతాన్ని కిన్నార్ అనేవారు. ఇచ్చట ప్రజలను

ఆనాడు కిరాతులు, యక్షులు, నాగులు అనేవారు  క్రీస్తు తర్వాత ఈ ప్రాంతం అనేక చిన్న చిన్న రాజ్యాలుగా చీలి వుండేది  చైనా యాత్రికుడు హ్యూయన్‌సాంగ్ 6వ శతాబ్దంలో ఈ ప్రాంతాన్ని దర్శించి అప్పటి పరిస్థితుల్ని వివరించాడు. అప్పుడు కులు, చంబా, త్రిగర్త, రాజ్యాలుగా పేర్కొన్నాడు  తర్వాత కొన్నాళ్ళు కాంగ్రా, చంబా రాజ్యాలు కాశ్మీర్ రాజుల ఆధీనంలోకి వెళ్ళినాయి  హిమాచల్ ప్రదేశ్ ముస్లిం దండయాత్రలకు కూడా గురైంది. మొగల్ చక్రవర్తుల పాలనలో ఈ ప్రాంతం మొగల్ సామ్రాజ్యంలో భాగంగా వుంది. ఆ తర్వాత స్థానిక రాజులు బ్రిటిష్ ఆధిపత్యానికి లోబడి వుండేవారు. 1857లో జరిగిన ప్రథమ స్వతంత్ర సంగ్రామంలో పాల్గొనలేదుగాని ఆ తర్వాత 1876లో వజీర్ రాంసింగ్ పఠానా నాయకత్వంలో బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా ఒక తిరుగుబాటు లేచింది  కాని ఆ తిరుగుబాటు విఫలమై తిరుగుబాటు నాయకుడు రాంసింగ్ కు జీవితఖైదు విధించబడింది

గాంధీజీ స్వతంత్ర పోరాటం చేపటిన తర్వాత హిమాచల్‌ప్రదేశ్ కూడా ఆ పోరాటంలో చేరింది. పర్వత గాంధీ" గా పేరొందిన కన్షీరాం నాయకత్వంలో హిమాచల్ ప్రదేశ్ ప్రజలు స్వతంత్ర పోరాటం జరిపారు

భారత స్వతంత్రానికి ముందు ఈ హిమాచల్ ప్రదేశ్ 30కి పైగా సంస్థానాలుగా వుండేది. భారత్‌కు స్వతంత్రం వచ్చిన సంవత్సరానికి ఈ సంస్థానాల్నింటినీ విలీనం చేసి కేంద్ర ప్రభుత్వ ఆధీనంలోకి తెచ్చారు. 1951 లో హిమాచల్ ప్రదేశ్ పార్టు. సి రాష్ట్రంగా 36 మంది అసెంబ్లీ సభ్యులతో ఏర్పడింది  ముగ్గురు మంత్రులుండేవారు. 1954లో బిలాస్‌పూర్ అనే మరొక పార్టు. సి. రాష్ట్రాన్ని ఇందులో కలిపి అసెంబ్లీ సభ్యుల సంఖ్యను 41 కి పెంచారు. రాష్ట్రాల పునర్విభజన కమిటీ ఈ రాష్ట్రాన్ని పంజాబ్‌లో కలపాలని సిఫార్సు చేయగా ఈ రాష్ట్ర ప్రజలు అందుకు తీవ్రంగా వ్యతిరేకించటంతో ఆ పని జరగలేదు. 1966 వరకూ హిమాచల్‌ప్రదేశ్ 6 జిల్లాలుగా వుండేది  1966 నవంబరులో పంజాబ్‌ను విభజించటంతో మరికొన్ని కొండ ప్రాంతాలు హిమాచల్ ప్రదేశ్‌లో కలపటంతో ప్రస్తుత హిమాచల్‌ప్రదేశ్ ఏర్పడింది. 1971 నుంచి హిమాచల్ ప్రదేశ్‌కు పూర్తి రాష్ట్ర ప్రతిపత్తి కల్పించబడింది. 1973లో వున్న 10 జిల్లాలను 12 జిల్లాలుగా సర్దుబాటు చేసారు.

హిమాచల్‌ప్రదేశ్ మొదటి ముఖ్యమంత్రి వై.యస్.పార్మార్. ఈయన తర్వాత రాంలాల్ (ఈయన 1984లో ఆంధ్రప్రదేశ్ గవర్నర్‌గా వుండి అర్ధంతరంగా రాజీనామా చేశారు) రెండు సార్లు ముఖ్యమంత్రిగా వున్నారు. రెండుసార్లు వీరభద్రసింగ్ ముఖ్యమంత్రిగా వున్నారు. వీరంతా కాంగ్రెసు పార్టీకి చెందిన శాంతకుమార్ 1977 నుంచి 80 వరకూ హిమాచల్‌ప్రదేశ్ ముఖ్యమంత్రిగా పనిచేశారు. 1990 అసెంబ్లీ ఎన్నికలలో కాంగెసు పార్టీ

ఓడిపోయి బి.జెపి. అధికారంలోకి వచ్చింది. బి జె పి నాయకుడు శాంతకుమార్ ముఖ్యమంత్రి అయ్యారు

హిమాచల్ ప్రదేశ్‌లో 12 జిల్లాలు కలవు. ఇవి : బిలాస్‌పూర్, చంబా, హమీర్‌పూర్, కాంగ్రా, కిన్నోర్, కులు, లాహుల్ మరియు స్పితి, మండి, సిమ్లా, సిర్మార్, సోలన్,ఉనా

హిమాచల్‌ప్రదేశ్‌లో 68 మంది సభ్యులు గల విధాన సభ వుంది. లోక్‌సభలో నలుగురు, రాజ్యసభలో ముగ్గురు సభ్యులు హిమాచల్‌ప్రదేశ్‌కు ప్రాతినిధ్యం వహిస్తారు.

హిమాచల్‌ప్రదేశ్ జనాభాలో 96 శాతం మంది హిందువులు. మిగతావారు ముస్లింలు, క్రైస్తవులు. జనాభాలో 43 శాతం మంది చదవనూ, వ్రాయనూ వచ్చినవారు.

హిమాచల్‌ప్రదేశ్‌లో ప్రజలు మాట్లాడే భాషను పహడి అంటారు. ఈ భాష హిందీకి చాలా దగ్గరగా వుంటుంది అయితే ఈ పహాడి భాష కూడా రాష్ట్ర మంతటా ఒకేరకంగా మాట్లాడరు. వివిధ ప్రాంతాలలో వివిధ రకాలుగా రకరకాల యాసలతో మాట్లాడతారు. మొత్తం మీద ఈ భాషను పహాడి అని పిల్చినా స్థానికంగా సిమ్లాలో మాట్లాడే దాన్ని సిర్మోరి అని, కాంగ్రాలో మాట్లాడేదాన్ని కాంగ్రీ అని, కిన్నోర్‌లో మాట్లాడేదాన్ని కిన్నోరి అని రకరకాలుగా పిలుస్తారు. పహాడి జానపద సాహిత్యంలో వీరగాధలు కోకొల్లలుగా వున్నాయి. అసలు హిమాచల్‌ప్రదేశ్‌లో ముగ్గురు నల్గురు గుమిగూడినప్పుడల్లా ఈ జానపద కథలు చెప్పుకోవటం అలవాటు. చలి విపరీతంగా వుండి బయటకు వెళ్ళనప్పుడు చలి మంట వేసుకుంటూ ఈకథలు చెప్పుకొంటూ వుంటారు.

హిమాచల్‌ప్రదేశ్ ప్రజల ప్రధాన వృత్తి వ్యవసాయం. పండ్ల తోటల పెంపకం. 76 శాతం మంది ప్రజలకు ఇవే జీవనాధారం. రాష్ట్రంలో 26 శాతం మేరకు మాత్రమే నీటి పారుదల సౌకర్యం వుంది. అయితే ఎక్కువ కాలం మంచు కురియటంతో రకరకాల పండ్లు - ముఖ్యంగా యాపిల్ పళ్ళు బంగాళా దుంపలు, అల్లం, కూరగాయలు బాగా పండుతాయి. ఆహార ధాన్యాల ఉత్పత్తిలో కూడా ఈ రాష్ట్రం బాగా అభివృద్ధి చెందింది. 1967లో ఈ రాష్ట్రంలో 7 లక్షల టన్నులు మాత్రమే ఆహార ధాన్యాలు పండగా ప్రస్తుతం 14 లక్షల టన్నులు పండుతున్నాయి. అటవీ సంపదకు కూడ ఈ రాష్ట్రం ప్రఖ్యాతి గాంచింది.

హిమాచల్‌ప్రదేశ్‌లో పుష్కలంగా జలవిద్యుత్ దొరుకుతున్నా పారిశ్రామికంగా రాష్ట్రం వెనుకబడి వుంది చెప్పుకోదగిన పెద్ద పరిశ్రమలు - నహాన్ ఫౌండ్రి (నహాన్) టర్‌పంటైన్ ఫ్యాక్టరీ (బిలాస్‌పూర్) మోహన్ మెకిన్స్ బ్రవరీస్ (సోలన్) యునైటెడ్ డైమండ్స్(పర్‌వాను). ఇవిగాక ఇంకా 8000 చిన్న చిన్న పరిశ్రమలు, కుటీర పరిశ్రమలు వున్నాయి. ఈ రాష్ట్రంలో 97 శాతం గ్రామాలకు విద్యుచ్ఛక్తి సౌకర్యం వుంది.

హిమాచల్‌ప్రదేశ్‌లో చూడదగిన ప్రదేశాలు అనేకం వుండటమే గాక ఈ రాష్ట్రంలో అనేక వేసవి విడిది కేంద్రాలు కూడా వున్నాయి రాష్ట్ర రాజధానికి సిమ్లా పేరు స్థానిక దేవత శ్యామలాదేవి పేరు మీదగా వచ్చింది సముద్రమట్టానికి 7వేల అడుగుల ఎత్తున ఉండే సిమ్లా రాష్ట్ర జనాభానేగాక దేశంలో ప్రసిద్ధి చెందిన వేసవి విడిది కేంద్రం 1819 వరకూ ఈ ప్రదేశంలో ఏమీ వుండేది కాదు. వేసవి కాలంలో ఢిల్లీ వేడికి తట్టుకోలేకపోయిన ఇంగ్లీషు పాలకులకు వేసవికాలంలో కూడా చల్లగా హాయి గొల్పే ఈ ప్రదేశం కంటబడింది వేసవిలో వాళ్ళు ఉండటానికి భవనాలు నిర్మించుకున్నారు క్రమేపి అనేక భవనాలు నిర్మించి బ్రిటిష్ ఇండియా వేసవి రాజధానిగా చేశారు. ప్రస్తుతం సిమ్లా జనాభా 80 వేలు. సిమ్లాలో మార్చి నుంచి జూన్ వరకు యాత్రికులకు అనువైన వాతావరణం వుంటుంది ఆ నాలుగు నెలలు సమశీతోష్ణమైన వాతావరణంలో సిమ్లా దేశం నలుమూలల నుంచి అనేక మంది యాత్రికులను ఆకర్షిస్తుంది జులై, ఆగస్టు, సెప్టెంబర్ నెలల్లో సిమ్లాలో అధికంగా వర్షాలు కురుస్తాయి డిశంబరు నుంచి ఫిబ్రవరి వరకూ విపరీతమైన చలితో మంచు కురుస్తుంది. ఈ సమయంలో ఉష్ణోగ్రత 4 డిగ్రీల సెంటిగ్రేడ్‌కు పడిపోతుంది. స్థానికంగా ఇక్కడ వుండేవారు తప్ప మిగతా వారు ఆ చలికి తట్టుకోలేరు.

సిమ్లాలో వేసవి కాలం విపరీతమైన రద్దీగా వుంటుంది. దేశం నలుమూలల నుంచి ఇంకా ఇతర దేశాలనుంచి అనేక మంది టూరిస్టులు ఇక్కడకు వస్తారు. ఈ కాలంలో హోటళ్ళు, లాడ్జిల రేట్లు చాల హెచ్చుగా వుంటాయి. శీతాకాలం వచ్చే సరికి సిమ్లా నిర్మానుష్యంగా వుంటుంది. స్థానిక ప్రజలు తప్ప మరెవ్వరూ కన్పించరు. హోటళ్ళు, లాడ్జిలు ఖాళీగా వుంటాయి.

సిమ్లాలో ముఖ్యంగా చూడదగినది వైశ్రాయ్ భవనం. కొండపై నిర్మించబడిన ఈ భవంతి రాజ ఠీవి ఉట్టిపడుతూ వుంటుంది. ఈ భవంతిలో లోగడ అనేక చారిత్ర నిర్ణయాలు తీసుకోబడినాయి. దేశ విభజనకు పండిత నెహ్రూను మౌంటు బాటను దంపతులు ఇక్కడనే ఒప్పించారని చెప్తారు భారత్-పాక్ మధ్య జరిగిన సిమ్లా ఒప్పందం నేడు వార్తలలో విశేషంగా వినిపిస్తూనే ఉన్నది గదా! సిమ్లా ప్రధాన రహదారి 'మాల్' లో స్టేట్ మ్యూజియం వుంటుంది రాష్ట్ర నలుమూలల నుంచి సేకరించిన శిల్పాలు, విగ్రహాలు, కాంగ్రా పెయింటింగ్ స్కూల్ చిత్రాలు ఇక్కడ కనుల విందుగా చూడవచ్చు. సిమ్లాలో జక్కు దేవాలయం కూడా చూడదగినది. కొండ మీద వున్న ఈ దేవాలయం ఆంజనేయ స్వామిది. పేరు తగ్గట్లే కోతులు అనేకం ఈ గుడి పరిసరాల్లో వుంటాయి. సిమ్లా గ్రామ దేవత శ్యామలాదేవి ఆలయం కూడా చూడదగినదే. దీన్ని కాళికాలయం అని కూడా అంటారు. ఈ దేవాలయంలో దసరా ఉత్సవాలు కడువైభవంగా జరుగుతాయి.

బ్రిటిష్ వారు నిర్మించిన సాంప్రదాయం ప్రకారం సిమ్లాలో ఇప్పటికి దాదాపు

సగం ఇల్కు కలప ఇళ్ళే పురాతన పద్ధతిలో కట్టిన చర్చిలు కూడా కొన్ని వున్నాయి లోగడ వైస్ రీగల్ లాడ్జిలో ప్రస్తుతం 'ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ అడ్వాన్స్‌డ్ స్టడీస్' కేంద్రంగా వుంది

సిమ్లా చుట్టుపక్ల చూడదగినవి – ప్రాస్పెక్ట్ హిల్, వైల్డ్‌ఫ్లవర్ హాల్, సంకట్‌మోచనల్, సిమ్లాకు 5 కిలోమీటర్ల దూరంలో వున్న ప్రాస్పెక్ట్ హిల్‌పై కామనాదేవి ఆలయం వుంది ప్రాస్పెక్ట్ హిల్ చిన్న గ్రామం వైల్డ్‌ఫ్లవర్ హాల్ లోగడ బ్రిటిష్ ప్రభుత్వ హయాంలో సైనిక దళాల కమాండర్ వుండేవాడు. ప్రస్తుతం దీన్ని టూరిస్టు కేంద్రంగా ఏర్పాటు చేశారు సిమ్లాకు 7 కిలోమీటర్ల దూరంలో సంకట్ మోచన వుంటుంది. ఈ కొండపై హనుమాన్ దేవాలయం వుంది. 1875 మీటర్ల ఎత్తున వుండే ఈ కొండపై నుంచి చూస్తే సిమ్లా పట్టణం యావత్తు కనబడుతుంది. సిమ్లాకు 18 కిలోమీటర్ల దూరంలో 'కుఫ్రి' వుంటుంది. ఇక్కడ జనవరి ఫిబ్రవరి మాసాలలో శీతాకాలం మంచు కుప్పతెప్పలుగా పడుతుంది. ఈ సమయంలో ఇక్కడ మంచు మీద ఆడే క్రీడ "స్కీయింగ్" ఆడతారు. ఈ ప్రదేశం ఈ క్రీడకు ప్రసిద్ధి. సిమ్లాకు 22 కిలోమీటర్ల దూరంలో "ఫాగు" సముద్ర మట్టానికి 2500 మీటర్ల ఎత్తున వుంటుంది. ఇక్కడ బంగాళా దుంపల పరిశోధనా కేంద్ర వుంది. సిమ్లాకు 65 కిలోమీటర్ల దూరంలో 'ఛెయిల్ వుంది. ఇక్కడే ప్రపంచంలో కెల్లా ఎత్తయిన క్రికెట్ క్రీడా స్థలం వుంది.

సిమ్లా, కాల్కా రహదారిలో సోలన్ పట్టణం వుంటుంది. స్థానిక దేవత సోలన్ దేవి పేరుమీదగా నిర్మించబడిన ఈ పట్టణం మద్యపానీయాలు తయారుచేసే పరిశ్రమలకు ప్రసిద్ధి. సోలన్‌లో అనేక పిక్నిక్ కేంద్రాలు కూడా వున్నాయి.

సోలన్‌కు 82 కిలోమీటర్ల దూరంలో సముద్రమట్టానికి 1902 మీటర్ల ఎత్తున ఉండే కసౌలి ప్రసిద్ధ వేసవి విడిది కేంద్రం.

మండి, కులూలోయకు సింహ ద్వారంలాంటిది. బియాస్ నది ఒడ్డున వుంటుంది. మండి అంటే సంత. లడక్ నుండి హోషియారపూర్‌కు ఈ మార్గం ద్వారా సరుకు రవాణా జరిగేదట లోగడ. ఆ రోజుల్లో ఈ ప్రదేశం ఈ సరుకుల రవాణాకు ఒక మజిలీగా వుండేది. అందువలన ఈ ప్రదేశానికి మండి అనే పేరు స్థిరపడిపోయింది. మండికి ప్రాచీన చరిత్ర వుంది పురాతన ఆలయాలు చాలా వున్నాయి. అందులో బుద్ధ నాద్, త్రిలోక్‌నాధ్ ఆలయాలు ప్రసిద్ధి చెందినవి. ఇక్కడ శివరాత్రి ఉత్సవాలు ఘనంగా జరుగుతాయి.

కులూ లోయ ప్రసిద్ధి చెందిన వేసవి విడిది కేంద్రం. కులూ లోయ అందచందాలు, సోయగాలు, సొగసలు వర్ణించనలవి కాదు. సముద్రమట్టానికి 1200

మీటర్ల ఎత్తున బియాస్ నది ఒడ్డున వుంటుంది కులూ పట్టణం జనాభా 6000 మాత్రం రక రకాల వృక్ష జాతులతో నోరూరించే యాపిల్ పండ్ల తోటలతో సెలయేటి గల గలతో పర్వత సానువులు పచ్చిక మైదానాలతో కులూ లోయ యాత్రీకులను పరవసింపజేస్తుంది. మళ్ళీ మళ్ళీ రావాలనేట్లు చేస్తుంది కులూ లోయలో దసరా ఉత్సవాలు వారం రోజుల పాటు గొప్పగా జరుగుతాయి విజయ దశమిని ఇక్కడ ప్రజలు రావణాసురునిపై శ్రీరామచంద్రుడు విజయం పొందిన పండుగగా చేసుకొంటారు ఈ ఉత్సవాలలో చుట్టు పట్ల దేవాలయాల్లో ఉన్న ఉత్సవ విగ్రహాల్ని కూడ తెచ్చి పెద్ద ఊరేగింపు జరుపుతారు

కులూకు 40 కిలోమీటర్ల దూరంలో మనాలి వుంటుంది. దేవదారు, పైన్, యాపిల్ వృక్షాలతో ఆహ్లాదకర వాతావరణం కల్గి వుంటుంది మనాలి. అసలు ఈ మనాలిని "వేసవి విడిది కేంద్రాలకు రాణి" గా పిలుస్తారు. బియాస్ నది ఒడ్డున 1830 మీటర్ల ఎత్తున ఉంటుంది. ఇచ్చట అనేక ప్రాచీన దేవాలయాలున్నాయి కులూ రాజుల ఇష్టదేవత హిడింబదేవి ఆలయం కూడా వుంది మనాలికి 3 కిలోమీటర్ల దూరంలో "వాసిష్ట" వుంటుంది. ఈ వాసిష్ట వేడినీటి బుగ్గలకు ప్రసిద్ది. ఈ నీటిని అనేక రోగాలకు చికిత్సగా కూడా వాడతారు. ఈ నీటిని యాత్రీకుల సౌకర్యార్థం గొట్టాల ద్వారా హోటళ్ళకు కూడా సరఫరా చేస్తారు. మనాలి సందర్శించటానికి ఏప్రిల్ నుంచి జూన్ వరకూ, సెప్టెంబరు, అక్టోబరు నెలలు మాత్రమే అనుకూలంగా వుంటుంది. మిగతా కాలంలో మంచు విపరీతంగా పడుతూ భరించలేని చలిగాలులు వీస్తూ ఉంటాయి

మనాలికి 117 కిలోమీటర్ల దూరంలో లాహుల్ అండ్ స్పితి రాష్ట్ర సరిహద్దు జిల్లా. ఈ జిల్లాకు తూర్పున టిబెట్ (చైనా) వుంటుంది. ఈ జిల్లా సముద్ర మట్టానికి 13వేల అడుగుల ఎత్తున వుంటుంది. ఎముకలు కొరకే చలిగాలి రయ్యిన వీస్తూ వుంటుంది. దాదాపుగా ఈ ప్రాంతంలో ఏ విధమైన జీవరాసులకు వాసయోగ్యం కాదు. ఎక్కడ చూసినా మంచు పర్వతాలు మాత్రమే దర్శనమిస్తాయి ఇచ్చట నుంచి చూస్తే హిమాలయ పర్వతాలు అతి చేరువగా కన్పిస్తాయి. ఇక్కడ మంచు తప్ప వానలు కూడా పడవు. ఎందువలనంటే వర్షాల్నిచ్చే మేఘాలు హిమాలయ పర్వతాల్ని దాటి రాలేవు. వేసవికాలంలో మాత్రం ఈ చలిగాలి ఉధృతం కొంత తగ్గుతుంది. ఇచ్చట ప్రజలు జీవించటానికి అనువైన పరిస్థితులు లేవు. అందువలనే హిమాచల్‌ప్రదేశ్‌లో కెల్లా పెద్ద జిల్లా అయిన ఈ లాహుల్ అండ్ స్పితి (వైశాల్యం 13835 చదరపు కిలోమీటర్లు) జిల్లాలో కేవలం 32వేల మంది మాత్రమే నివసిస్తున్నారు. అంటే చదరపు కిలోమీటర్‌కు ఇద్దరు మాత్రమే నివసిస్తున్నారన్నమాట. ఈ కొద్దిమంది ప్రజలు బౌద్దులు. గొర్రెల్ని మేపుకుంటూ జీవిస్తారు. ఇక్కడ బౌద్ధారామాలు మాత్రం అనేకం వున్నాయి. గురుగంటల్,

టాబో గొంపాలాంటి ప్రసిద్ధి బౌద్ధారామాలు ఇక్కడనే వున్నాయి. సముద్ర మట్టానికి 3050 మీటర్ల ఎత్తున వుండే టాబో అనే ప్రాచీన గ్రామంలో వున్న టాబో గోంపా బౌద్ధ విహారం దేశంలోని ప్రసిద్ధ బౌద్ధారామాలలో ఒకటి.

టిబెట్ సరిహద్దుగా గల మరొక జిల్లా కిన్నౌర్. ఈ జిల్లాలో కూడా సంవత్సరం మొత్తం మీద ఎక్కువ రోజులు చలి విపరీతంగా వుంటుంది. మంచుగుట్టలు గుట్టలుగా పడుతుంది. ఈ జిల్లాలో కూడా అనేక బౌద్ధారామలు వున్నాయి.

బియాస్ నదికి ఇరువైపులా వుంది మనాలి నుంచి పఠాన్‌కోట వరకూ వ్యాపించి వున్నదే కాంగ్రా లోయ కాంగ్రా పట్టణానికి పెద్ద చరిత్ర వుంది. ఇక్కడ వున్న బజరేశ్వరి దేవాలయం బహుప్రసిద్ధిచెందినది. లోగడ ఈ దేవాలయంలో అపారమైన సంపద ఉండేది మహ్మద్‌ఘజనీకి ఈ దేవాలయం సంపదపై కన్నుపడి 1009లో దేవాలయంపై దాడి చేసి బండ్ల కొద్దీ బంగారం, వెండి నగలు దోచుకున్నాడు ఆ తర్వాత మళ్ళీ 1360లో ఫెరోజ్‌తుగ్లక్ మళ్ళీ ఈ దేవాలయంపై దాడి చేసి రెండో సారి దోచుకున్నాడు. ఎంత మంది దాడి చేసినా ఈ దేవాలయం మళ్ళీ మళ్ళీ పునరుజ్జీవం పొందుతూనే వుంది. 1905లో ఈ దేవాలయం భూకంపం వలన ధ్వంసం కాగా తిరిగి నిర్మించబడింది. కాంగ్రా పట్టణం కాంగ్రా పెయింటింగ్స్‌కు ప్రసిద్ధి.

కాంగ్రాకు 34 కిలోమీటర్ల దూరంలో హిందువుల పవిత్ర క్షేత్రం జ్వాలాముఖి వుంది. జ్వాలాముఖి దేవాలయంపై కప్పు బంగారంతో తాపడం చేయబడి వుంటుంది. పురాతన కాలం నుంచి నిరంతరాయంగా ఈ దేవాలయంలో జ్వాల మండుతూనే వుంది. ఈ జ్వాల ఈ విధంగా ఎల్లప్పుడూ మండటానికి కారణం సహజ వాయువు ఇక్కడ వుండటం కారణం అని శాస్త్ర వేత్తల అభిప్రాయం.

జ్వాలాముఖికి 55 కిలోమీటర్ల దూరంలో చంబానదీ తీరంలో ధర్మశాల వుంటుంది. 1800 మీటర్ల ఎత్తున వుండే ఈ ధర్మశాల వేసవి విడిది కేంద్రం కూడా. జనాభా 13 వేలు గల ఈ ధర్మశాల బౌద్ధుల సంస్కృతీ కేంద్రం. బౌద్ధ మత గురువైన దలైలామా టిబెట్ నుంచి పారిపోయి వచ్చి ఇచ్చట స్థిర నివాసం ఏర్పరుచుకున్నాడు. ధర్మశాలలో ఎక్కడకు వెళ్ళినా బౌద్ధ మత నాగరికత, తీరు తెన్నులూ కానవస్తాయి.

సిర్మార్ జిల్లాలోని పాంటాసాహిబ్ కూడా వేసవి విడిది కేంద్రమే. యమునా నది ఒడ్డున వున్న పాంటా సాహిబ్ సిక్కులకు పుణ్య క్షేత్రం కూడా. సిక్కుల 10వ గురువైన గురుగోవింద్ సింగ్ ఇక్కడ కొంతకాలం నివసించాడట. గురుగోవిందసింగ్ ఈ చుట్టుపట్ల వున్న 22 మంది కొండ రాజుల్ని జయించాడు. ఆనాడు ఆయన ఉపయోగించిన ఆయుధాలు ఇక్కడ భద్రపర్చబడినాయి. వైశాఖి రోజున వేలాది

సిక్కులు ఇచ్చటకు వచ్చి వారి గురువులకు నివాళులర్పిస్తారు. ఇచ్చట శ్రీరామ, శ్రీకృష్ణులకు రెండు దేవాలయాలు కూడా వున్నాయి.

సిమ్లాకు 493 కిలోమీటర్ల దూరంలో వున్న డల్హౌసి కూడా ప్రసిద్ధి చెందని వేసవి విడిది కేంద్రం "భారతదేశపు ఆరోగ్య క్షేత్రం" గా పేరొందిన డల్హౌసి 1850లో లార్డ డల్హౌసిచే పునాది వేయబడింది. సుందర ఆహ్లాదకర వాతావరణంలో అయిదు పర్వత సానువుల పై నిర్మించబడిన ఈ డల్హౌసిలో కొన్నాళ్ళు పాటు విశ్రాంతి తీసుకుంటే అనేక రోగాలు తగ్గిపోతాయని అంటారు.

సిమ్లాకు 140 కిలోమీటర్ల దూరంలో వుండే రాంపూర్ రాష్ట్రంలోని పెద్ద పట్టణాలలో ఒకటి. సట్లేజ్‌నది ఒడ్డున వుండే ఈ పట్టణం వాణిజ్య కేంద్రం ఇక్కడ బౌద్ధారామాలు, హిందూ దేవాలయాలు కొన్ని వున్నాయి నవంబరు రెండవ వారంలో 'లవి' అనే పేరుతో ఇచ్చట పెద్ద సంత జరుగుతుంది.

హిమాచల్ ప్రదేశ్ చేతి పనులకు ప్రసిద్ది. వెండిలో నగిషీగా తయారు చేసే టీపాట్, టీ కప్పులు, వెండి నగలు దేశ వ్యాప్తంగా ప్రసిద్ది పొందినాయి. ఈ రాష్ట్ర తివాసీల నేతకు కూడా ప్రసిద్ధి పొందినది. టిబెటన్ డిజైన్లతో తయారయ్యే తివాసీలు యాత్రికులను విశేషంగా ఆకర్షించుతాయి కులూ లోయలో పూర్తిగా ఉన్నితో తయారు చేయబడే దుప్పట్లు, శాలువాలు కూడా ప్రసిద్ధి పొందినాయి.

హిమాచల్‌ప్రదేశ్ దేశ ప్రజలు హిందువులు చేసుకునే పండుగలన్నీ చేసుకుంటారు. ఆచార వ్యవహారాల్లో చూస్తే లోగడ ఇక్కడ 30కి పైగా రాజరికాలు వుండటం వలన వివిధ ప్రాంతాలలో వివిధ రకాల ఆచార వ్యవహారాలు అమలులో వున్నాయి మచ్చుకి కిన్నౌర్‌లో ఒక తెగలో వివాహ పద్ధతి ఈ విధంగా వుంటుంది. పెళ్ళీడు వచ్చిన కుర్రవాడు తనకు నచ్చిన పిల్లను బలవంతంగా తనింటికి తీసుకుపోతాడు అప్పుడు కుర్రవాడి తండ్రి పిల్ల తండ్రి వద్దకుపెద్దల రాయబారం పంపుతాడు. తన కొడుకు చేసిన పని క్షమించమని. అందుకు పిల్ల తండ్రి కాసేపు బెట్టు చేసి తర్వాత వచ్చిన పెద్దలు కొంత పైకం ఆశ చూపగానే అందుకు అంగీకరిస్తాడు. ఈ తతంగం అయింతర్వాత పిల్ల తల్లి దండ్రులు వధూవరులను తమ ఇంటికి సాదరంగా ఆహ్వానించి తమ ఇంట్లో కొన్నాళ్ళు వుంచుకొని నగలు, పైకం కట్నంగా ఇచ్చి కుమార్తెను అల్లుడితో అతడింటికి పంపుతారు.

కిన్నౌర్ జిల్లాలో కొన్ని తెగలలో బహుభర్తృత్వం ఇప్పటికి వుంది. అన్నదమ్ములందరూ ఒకే భార్యను పెళ్ళాడతారు. వారికి పుట్టిన పిల్లలందరికి వారే ఉమ్మడి తండ్రులుగా వుంటారు అన్నదమ్ములు ఆరుగురికన్నా ఎక్కువ వుంటే రెండో భార్యను పెళ్ళాడతారు.

# 15 బీహార్

వైశాల్యం 1,73,877 చదరపు కిలోమీటర్లు, జనాభా 8 కోట్ల 63 లక్షలు. రాజధాని పాట్నా. మాతృభాష – హిందీ.

బీహార్ అనే పేరు 'విహార' అనే పేరును బట్టి వచ్చింది. విహార అనగా బౌద్ధారామం. ఈ రాష్ట్రంలో అనేక బౌద్ధారామాలు వున్నాయి. కాబట్టి ఆ పేరు వచ్చింది.



బీహార్‌కు ఉత్తరదిక్కున నేపాల్ దేశం వుంటుంది దక్షిణాన ఒరిస్సా, తూర్పున పశ్చిమబెంగాల్, పడమర మధ్యప్రదేశ్, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాలు సరిహద్దులుగా వుంటాయి

వైశాల్యం రీత్యా బీహార్ ఆంధ్రప్రదేశ్ కన్నా చిన్నది కోస్తా, రాయలసీమ జిల్లా వైశాల్యం కన్నా కొంచెం హెచ్చుగా వుంటుంది. జనాభా రీత్యా మాత్రం మన రాష్ట్రం కన్నా రెండు కోట్ల జనం ఎక్కువగా వుంటారు దేశంలో ఉత్తరప్రదేశ్ తర్వాత జనాభారీత్యా బీహార్ పెద్ద రాష్ట్రం

బీహార్‌ను భౌగోళికంగా రెండు భాగాలుగా విభజించవచ్చు ఉత్తర ప్రాంతం, దక్షిణ ప్రాంతం ఉత్తర ప్రాంతమంతా సమతలంగా వుంటుంది. దక్షిణ ప్రాంతం అడవులు, పర్వతాలతో నిండి వుంటుంది ఉత్తర బీహార్ అంతా సారవంతమైన ప్రాంతం. ఈ ప్రాంతం సరయు, గండక్, గంగా నదుల నీటిచే సస్యశ్యామలం కాబడుతుంది. దక్షిణ బీహార్ ముఖ్యంగా చోటా, నాగపూర్, సంతాల్ పరగణాలు అడవులు పర్వతాలతో నిండి వుంటుంది.

ఉత్తరాన హిమాలయ పర్వత పాదాల నుంచి, దక్షిణం ఒరిస్సావరకూ వ్యాపించి వుండటం వలన అన్ని రకాల వాతావరణ పరిస్థితులు బీహార్‌లో నెలకొని వుంటాయి. చలి కాలంలో విపరీతంగా చలి, వేసవిలో మండుటెండలు, వర్షాకాలంలో వరదలు కూడా ఎక్కువే.

భారతదేశ చరిత్రలో బీహార్‌కు విశిష్టస్థానం వుంది. పూర్వకాలంలో బీహార్‌ను మగధ అనేవారు. క్రీస్తు పూర్వం 6వ శతాబ్దం నుంచి క్రీస్తు తర్వాత 5వ శతాబ్దం వరకూ వెయ్యి సంవత్సరాలు బీహార్ మహారాజ్యాల చరిత్ర కల్గి వుంది. గొప్ప గొప్ప రాజులు పరిపాలించి సామ్రాజ్యాలు ఏర్పరచారు. రాజగిరి రాజధానిగా ప్రఖ్యాత అజాత శత్రువు పరిపాలించాడు క్రీ.పూ. 4వ శతాబ్దం నుంచి మౌర్య రాజుల పాలన ప్రారంభమయింది. పాటలీపుత్రం(నేటి పాట్నా) మౌర్య రాజుల రాజధానిగా వుండేది. మౌర్య చంద్రగుప్తుడు తన విశాల సామ్రాజ్యాన్ని ఇక్కడ నుంచే పాలించేవాడు. ఆయన మనుమడు అశోక చక్రవర్తి కాలంలో మగధ సామ్రాజ్యపు ఔన్నత్యం ప్రపంచమంతా వ్యాపించింది. అశోక చక్రవర్తి శాంతి, సుహృద్భావ సందేశాలు దేశ దేశాల్లో మార్మోగినై. అశోక చక్రవర్తి కీర్తి దశదిశలు వ్యాపించింది. ప్రఖ్యాత చరిత్రకారుడు హెచ్.జి. వెల్స్ పేర్కొన్నట్లు అశోకుడు ప్రపంచ చరిత్రలో అద్వితీయ స్థానం పొందాడు.

అశోక చక్రవర్తి తర్వాత మగధ సామ్రాజ్యం క్షీణించనారంభించింది. తిరిగి గుప్తుల కాలంలో మగధ సామ్రాజ్యం ప్రాభవం పుంజుకుంది. సుమారు 150 సంవత్సరాలు

(క్రీ శ 321 నుంచి 467 వరకు) సముద్రగుప్తుడు, చంద్రగుప్త విక్రమాదిత్యుడు మొదలైన వారి పాలనలో గుప్త సామ్రాజ్యం కూడా విశాల ప్రాంతంలో విస్తరించి వుండేది. గుప్త సామ్రాజ్యం పతనానంతరం బీహార్ ఢిల్లీ సుల్తానుల చేతుల్లోకి వెళ్ళింది ఆ తర్వాత మొగల్ సామ్రాజ్యంలో భాగంగా వుండేది. షర్షా (ఇతడు స్వతహాగా బీహారీ వాడు) ఢిల్లీ సింహాసనాన్ని ఆక్రమించటంతో బీహార్ మళ్ళీ కొంత కాలం వెలుగులోకి వచ్చింది. షర్షా సమర్థుడైన పాలకుడుగా పేరొందాడు. మొగల్ సామ్రాజ్యం పతనమైన తర్వాత బీహార్ బెంగాల్ నవాబుల పాలనలోకి వెళ్లింది. బక్సర్ యుద్ధం (1764)తో బ్రిటిష్ వారు బెంగాల్ నవాబులను ఓడించి బీహార్‌ను తమ చేతుల్లోకి తీసుకున్నారు బ్రిటిష్ హయాంలో బీహార్ బెంగాల్‌లో భాగంగా వుండేది. 1911లో బీహార్, ఒరిస్సాలను బెంగాల్ నుంచి విడదీశారు

బీహార్ చట్టసభలో అసెంబ్లీ, కౌన్సిల్ కూడా వున్నాయి అసెంబ్లీ సభ్యుల సంఖ్య 324. లోక్‌సభలో బీహార్ సభ్యుల సంఖ్య 54, రాజ్యసభలో 22 మంది వుంటారు.

బీహార్ జనాభాలో 83 శాతం మంది హిందువులు. 14 శాతం మంది ముస్లింలు. మిగతావారు క్రైస్తవులు తదితరులు. రాష్ట్ర జనాభాలో 26 శాతం మంది మాత్రమే అక్షరాస్యులు.

బీహార్ 39 జిల్లాలుగా విభజించబడి ఉంటుంది. అవి పాట్నా, నలందా, నవాడా, గయ, ఔరంగాబాద్, రోహటాస్, బోజ్‌పూర్, రాన్, సవాన్, గోపాల్‌గంజ్, పశ్చిమ చంపారాన్, పూరబ్, చంపారావ్, సీతామర్హి, ముజఫర్‌పూర్, వైశాలి, బేగుసరామ్, సమస్తి పూర్, దర్భంగా, మధుబని, సహర్సా, మాధేపుర్, పుమిమా, కధిహార్, మొంగ్యర్, కాగ్రియ, భగల్పూర్, సంతాల్ పరగణా, డిమోఘర్, గొడ్డ, సాహెబ్‌గంజ్, పలము, రాంచి, గుమియ, లోహర్‌డగ్, సింగ్‌బుం, జహనాబాద్.

బీహార్ ముఖ్యంగా వ్యవసాయక రాష్ట్రం. 77 శాతం మంది ప్రజలకు వ్యవసాయమే జీవనాధారం రాష్ట్రంలో సగటున 130 సెం.మీ వర్షం పడుతుంది. ఏ సంవత్సరం కూడా వర్షాలు పడకపోవటం అంటూ వుండదు. సామాన్యంగా 180 లక్షలు హెక్టర్ల సాగుకు లాకీ అయిన భూమి వుంది. అయితే ప్రస్తుతం 1 కోటి హెక్టర్లు మాత్రమే సాగులో వుంది. ఇచ్చట పండే పంటలలో వరి ప్రధానమైంది. తర్వాత గోధుమ, జొన్న ముఖ్యమైనవి. 50 లక్షల టన్నుల వరి, 27 లక్షల టన్నులు గోధుమ, ఇంకా పప్పు ధాన్యాలు, చెరకు, జనుము, బంగాళాదుంపలు కూడా పండుతాయి. రాష్ట్ర విస్తీర్ణంలో 19 శాతం అడవులు ఈ అడవులలో నాణ్యమైన కలప దొరుకుతుంది.

సాగుకు అనుకూలమైన భూమి వుండి సక్రమంగా వర్షాలు పడే ప్రాంతమైనా బీహారు గ్రామసీమల్లో దారిద్ర్యం మిగతా రాష్ట్రాలకన్నా హెచ్చుగా వుండటం గమనించవలసినది ఇందుకు కారణం రైతులు ఇంకా ఆధునిక వ్యవసాయ పద్ధతులు ఆచరించకపోవటం, వ్యవసాయ సంస్కరణలు సక్రమంగా అమలు జరుగకపోవటంగా చెప్పవచ్చు పంజాబ్ రైతులు హెక్టర్‌కు 160 కిలోలు ఆంధ్రప్రదేశ్ రైతులు హెక్టర్‌కు 90 కిలోలు రసాయనిక ఎరువులు వాడుతూ వుండగా బీహార్ రైతులు హెక్టర్‌కు కేవలం 12 కిలోలు ఎరువులు మాత్రమే వాడుతున్నారంటే ఈ రాష్ట్ర రైతులు ఆధునిక వ్యవసాయ పద్ధతులలో ఎంత వెనుకబడివున్నారో గ్రహించవచ్చును

పారిశ్రామికంగా బీహార్ చెప్పుకోదగిన ముందంజలోనే వుంది దేశంలో కెల్లా ఈ రాష్ట్రంలోనే ఖనిజసంపద ఎక్కువగా వుంది ఇనుము బొగ్గు పుష్కలంగా దొరుకుతుంది. దేశం మొత్తం మీద వున్న ఖనిజ సంపదలో 40 శాతం ఈ ఒక్క రాష్ట్రంలోనే దొరుకుతుంది. ఇనుము, బొగ్గుకు సంబంధించిన అనేక పరిశ్రమలు ఇక్కడ వున్నాయి. ప్రభుత్వ రంగంలోని పెద్ద ఉక్కు కర్మాగారం బొకారో ఇక్కడే వుంది. హెవీ ఇంజనీరింగ్ కార్పొరేషన్ సెంట్రల్ కోల్‌ఫీల్డ్స్, అల్యూమినియా ప్లాంటులు రాంచిలో నెలకొని వున్నాయి. ఇంకా సింద్రీలో ఎరువుల కర్మాగారం, బరౌనిలో ఆయిల్ రిఫైనరీ, ముజఫర్‌పూర్‌లో భారత్ వాగెన్స్, ఐ.డి.పి.యల్. కర్మాగారాలు, ధన్‌బాద్‌లో భారత్ కోకింగ్ కోల్ కర్మాగారాలు ఇచ్చట స్థాపితమైన ప్రసిద్ధ ప్రభుత్వ పరిశ్రమలు. ఇంకా ప్రభుత్వ రంగంలో అనేక పరిశ్రమలు ప్రస్తుతం నిర్మాణంలో వున్నాయి. ప్రవేటు రంగంలో టాటావారి ప్రసిద్ధ టాటా ఉక్కు కర్మాగారం ఇచ్చటనే జంషెడ్‌పూర్‌లో వుంది. ఇంకా 2 వేలు దాకా ప్రవేటు రంగంలో లిమిటెడ్ కంపెనీలు వున్నాయి. ఒక లక్షపైన చిన్న పరిశ్రమలు వున్నాయి.

బీహార్‌లో ప్రసిద్ధ ప్రదేశాలను సందర్శిద్దాం. బీహార్ రాజధాని పాట్నాను పూర్వం పాటలీపుత్రం అనేవారు. గంగా నది తీరంలో వుంటుంది. ప్రపంచంలోని ప్రాచీన పట్టణాలలో ఇదొకటి. క్రీ.పూ. 6వ శతాబ్దంలో గౌతమబుద్ధుడు ఈ నగరాన్ని దర్శించాడు. మౌర్యుల రాజధాని పాటలీపుత్రం. గ్రీక్ రాయబారి మెగస్తనీస్, చైనా యాత్రీకుడు ఫాహియాన్ ఆనాటి పాటలీ పుత్రవైభవాన్ని గొప్పగా వర్ణించాడు. 16వ శతాబ్దంలో షర్షా నేటి పాట్నాకు పునాదులు వేశాడు. పాట్నా జనాభా 12 లక్షలు. పాట్నాలో ముఖ్యంగా చూడదగినది పాట్నా మ్యూజియం. ఈ మ్యూజియం అంతర్జాతీయంగా కూడా ప్రసిద్ధి పొందినది. ఇందులో మౌర్యులు గుప్తుల కాలంనాటి లోహ, రాతిశిల్పాలు, ప్రతిమలు, ఆనాటి నాణాలు, పాత్రలు, ఆభరణాలు అనేకం ఇక్కడ చూడవచ్చును. ఇంతేగాక ఈ మ్యూజియంలో కొన్ని లక్షల సంవత్సరాల నాటి 536 అడుగుల ఫాజిల్ చెట్టు కూడా

ఉంది. ఇంత పెద్ద ఫాజిల్ ప్రపంచంలో మరెక్కడా లేదని చెబుతారు.

పాట్నాలోని హర్ మందిర్ శిక్కుల పుణ్యక్షేత్రం. సిక్కుల పదవ గురువు గురుగోవింద్‌సింగ్ జన్మస్థలం ఇదే. 1660లో గురుగోవింద్‌సింగ్ ఇక్కడ జన్మించాడు. మహారాజరంజిత్‌సింగ్ ఈ మందిరాన్ని నిర్మించాడు. గురుగోవింద్‌సింగ్ ఉపయోగించిన కొన్ని వస్తువులను ఇక్కడ భద్రపరచారు.

పాట్నాలోని పాత సచివాలయం ఎదురుగా ఏడుగురు స్వాతంత్ర్య సమరయోధుల నిలువెత్తు విగ్రహాలు వున్నాయి 1942 ఆగస్టు పోరాటంలో ప్రాణాలు కోల్పోయిన ఈ ఏడుగురు అమర వీరుల జ్ఞాపకార్థంగా ఈ నిలువెత్తు విగ్రహాల్ని ఏర్పాటు చేశారు.

పాట్నాలో చూడదగిన మరొక విశేషం సదాకత ఆశ్రమం. 1921లో ఆశ్రమం ఏర్పర్చబడింది. భారత ప్రథమ రాష్ట్రపతి డా॥ రాజేంద్రప్రసాద్ పదవీ విరమణ తర్వాత ఈ ఆశ్రమంలోనే తమ శేషజీవితాన్ని గడిపారు. ఇక్కడ రాజేంద్రప్రసాద్ ఉపయోగించిన అనేక వస్తువుల్ని చూడవచ్చును.

పాట్నా రైల్వే స్టేషన్‌కు 7 కిలోమీటర్ల దూరంలో కుమ్రార్ గ్రామం వుంది. ఈ గ్రామంలో పురాతత్వ శాస్త్రవేత్తలు జరిపిన త్రవ్వకాలలో ప్రాచీన పాటలీ పురంకు సంబంధించిన అనేక అవశేషాలు బయల్పడినాయి. మౌర్యుల కాలం నాటి అనేక వస్తు విశేషాలు బయట పడినాయి. త్రవ్వకాలలో బయల్పడిన ఆనాటి అవశేషాలన్నీ మ్యూజియంలో చూడవచ్చును.

పాట్నాకు 30 కిలోమీటర్ల దూరంలో మనేర్ వుంటుంది. ఇది ముస్లింలకు పవిత్ర స్థలం. సూఫీ గురువు హజరత్ మక్దూంమనేరి ఇక్కడనే ఖననం చేయబడ్డాడు. అందువలన ప్రతి సంవత్సరం ఇక్కడ ఉర్సు ఉత్సవం గొప్పగా జరుగుతుంది.

పాట్నాకు 55 కి.మీ. దూరంలో వైశాలి వుంటుంది. ప్రపంచంలో మొట్టమొదటగా గణతంత్ర రాజ్యం (రిపబ్లిక్) ఏర్పడింది ఇక్కడే. ఆనాడు అంటే క్రీ.పూ. 6వ శతాబ్దంలో ఈ వైశాలి రిపబ్లిక్ లిచ్ఛవులు ఏర్పాటు చేసుకున్నారు. వైశాలి రాజ్యం అంతులేని భోగభాగ్యాలతో తులతూగేదట! జైనతీర్థంకురుడు మహావీరుడు జన్మించింది కూడా ఇక్కడే. గౌతమబుద్ధుడు తన ఆఖరి సందేశాన్ని ఇక్కడ నుంచే ఇచ్చాడు. అందుకు గుర్తుగా అశోక చక్రవర్తి ఇక్కడొక స్థూపం కూడా నిర్మించాడు. క్రీ.శ. 383లో రెండవ బౌద్ధమత సమావేశం కూడా ఇక్కడే జరిగింది. ఈ సమావేశం గుర్తుగా రెండు స్థూపాలు నిర్మించబడినాయి.

పాట్నాకు 65 కి మీ. దూరంలో సోనేపూర్ వుంటుంది ఇచ్చట అక్టోబరు, నవంబరు మాసాలలో నెల రోజుల పాటు బ్రహ్మాండమైన పశువుల సంత జరుగుతుంది ఆ నెల రోజులు ఇచ్చట లక్షలాది ప్రజలు గుమిగూడతారు. ఏనుగుల దగ్గర నుంచి కోళ్ళదాకా ఇచ్చట బేరసారాలు జరుగుతై. పశువులేగాక రకరకాల గృహోపకరణాలు, చేతి వస్తువులు మొదలైనవి కూడా ఇక్కడ ప్రదర్శింపబడి అమ్మకాలు జరుగుతాయి. సోనేపూర్ సంత దేశంలోకెల్లా పెద్ద సంతగా చెబుతారు.

పాట్నాకు 92 కి.మీ. దూరంలో గయ వుంటుంది. హిందువులకు కాశీ తర్వాత ఇదే పవిత్ర స్థలం. ఫల్గుణీ నది తీరంలో వుంటుంది గయ (జనాభా 3 లక్షలు). ఈ నదిలో వర్షాకాలంలో మాత్రమే నీరు వుంటుంది. ఇచ్చట వున్న గొప్ప దేవాలయం విష్ణుపాదాలయం 1787లో ఇండోర్ మహారాణి అహల్యాబాయ్‌చే కట్టించబడింది. ఈ దేవాలయం దగ్గర పెద్ద మర్రి చెట్టు వుంటుంది లక్షలాది హిందూ భక్తులు ఇచ్చట నదిలో స్నానం ఆచరించి పితృదేవతలకు పిండప్రదానం చేసి ఈ మర్రి చెట్టు క్రింద పితృకర్మలు చేస్తారు.

గయకు 15 కి.మీ. (పాట్నాకు 107 కి మీ) దూరంలో ప్రసిద్ధ బుద్ధగయ వుంటుంది. బౌద్ధులకు పరమ పవిత్రక్షేత్రం ఇది. 2500 సంవత్సరాలకు పూర్వం గౌతమ బుద్ధుడు ఇక్కడవున్న రావి చెట్టు క్రింద కూర్చొని తపస్సు చేసి జ్ఞానం పొందాడు. ఈ వృక్షానికి వేల సంవత్సరాల చరిత్ర వుంది. ఈ బోధివృక్షం యొక్క మొలకను అప్పట్లో అశోకచక్రవర్తి శ్రీలంక పంపాడు. కొంత కాలానికి బుద్ధగయలోని తల్లి చెట్టు కాల గర్భంలో కలిసిపోగా శ్రీలంకకు పంపిన మొలకనుంచి ఒక అంటు తీసుకు వచ్చి తల్లి చెట్టు స్థానంలో నాటారు. ఈ విధంగా ఇప్పటి వృక్షం అసలు వృక్షం యొక్క సంతానంగా చెప్పవచ్చు. ఈ చెట్టు చుట్టూ రాతి పలకం అమర్చబడి వుంటుంది. ఇక్కడే బుద్ధుడు కూర్చొని తపస్సు చేశాడని బౌద్ధుల నమ్మిక. అందువలన బౌద్ధులకు ఇది యాత్రా స్థలం.

ఇచ్చట వున్న మహాబోధి ఆలయం చూడదగిన విశేషం. ఈ ఆలయం 50 మీటర్లు ఎత్తున ఉంటుంది. ఆలయంలో బుద్ధ విగ్రహం వుంటుంది. ఈ ఆలయాన్ని మొదట అశోకచక్రవర్తి కట్టించాడు. ఆలయం గోడల నిండా బుద్ధుని జీవితం గురించి తెలిపే చిత్రాలుంటాయి. ఇక్కడనే టిబెట్, జపాన్, బర్మా, బౌద్ధమతస్థులు నిర్మించిన పలుబౌద్ధారామాలు కూడా వున్నాయి.

పాట్నాకు 90 కి.మీ. దూరంలో నలంద వుంటుంది. 5వ శతాబ్దంలో ఇక్కడ నెలకొన్న నలంద విశ్వవిద్యాలయం ప్రపంచంలో కెల్లా ప్రాచీన విశ్వవిద్యాలయం. ఈ విశ్వవిద్యాలయం ఆనాడు 10వేల మంది విద్యార్థులతో కళకళలాడుతూ వసతి విద్యాలయంగా

కూడా వుండేది చైనా యాత్రికుడు హుయన్‌సాంగ్ విద్యార్థిగా, ఉపాధ్యాయుడుగా 12 సంవత్సరాలు ఇక్కడ వున్నాడు ఈ విశ్వవిద్యాలయం వెయ్యి సంవత్సరాలు వెలుగొందింది ఇండియా అంతటి నుంచేగాక అనేక ఆసియా దేశాల నుంచి కూడా ఇచ్చటకు వచ్చి విద్యార్థులు చదువుకునేవారు. ఆచార్య నాగార్జునుడు ఇచ్చట కొన్ని సంవత్సరాలు ఉపాధ్యాయుడిగా వున్నాడు. వెయ్యి సంవత్సరాలు మహర్దశ అనుభవించిన ఈ విశ్వవిద్యాలయం ముస్లిం దండయాత్రల కారణంగా ధ్వంసమై పోయింది. ప్రస్తుతం ఆనాటి అవశేషాలు మాత్రమే మిగిలివున్నాయి పురాతత్వ శాస్త్రవేత్తలు జరిపిన త్రవ్వకాలలో ఆనాటి క్లాస్‌రూములు. ఉపన్యాస వేదికలు, విద్యార్థుల వసతి గృహాలు విశాల ప్రాంతంలో బయల్పడినాయి.

నలందాకు 15 కి.మీ దూరంలో రాజగిరి వుంటుంది. మహాభారతం, రామాయణాలలో దీన్ని రాజగృహ గిరివరజగా పేర్కొనబడింది. ఈప్రదేశం హిందువులకు, జైనులకు, బౌద్ధులకు కూడా యాత్రాస్థలమే రాజగిరి మగధ రాజులకు అనేక సంవత్సరాలు రాజధానిగా వుండేది. గౌతమబుద్ధుడు ఇక్కడ 12 సంవత్సరాలువున్నాడు. జైన తీర్థంకరుడు మహావీరుడు కూడా ఇక్కడ కొంతకాలం వున్నాడు రాజగిరి చక్కటి ఆరోగ్యకేంద్రం కూడా రాజగిరి చుట్టూ 7 కొండలు వుంటాయి. ఇక్కడ వున్న వేడినీటి బుగ్గలలో నీటిని త్రాగితే అనేక రకాల రోగాలు నయం అవుతాయని నమ్మిక.

పాట్నాకు 80 కి.మీ. దూరంలో పాట్నా రాంచి రహదారిలో పవాపురి వుంటుంది. జైనులకు ఇది పుణ్యక్షేత్రం. జైనమతగురువు వర్ధమానమహావీరుడు ఆఖరిరోజులు ఇక్కడనే గడిపాడు. ఇచ్చటనే నిర్యాణం చెందాడు. అందువలన పవాపురి జైనులకు పవిత్ర ప్రదేశం. వర్ధమాన మహావీరుని స్మారక చిహ్నంగా ఇచ్చటలో టస్ సరస్సు మధ్యలో పాలరాతి మందిరం నిర్మించారు జైనులు. దీన్ని జల్‌మందిర్ అంటారు. ప్రశాంత వాతావరణంలో దైవ ప్రార్థనకు అనువైన ప్రదేశం ఇది. పవాపురిని అపాపురి అని కూడా అంటారు. అపాపురి అంటే "పాపరహిత పట్టణం" అని అర్థం.

పాట్నాకు 338 కి.మీ. దూరంలో రాంచి వుంటుంది ఆహ్లాదకరమైన వాతావరణంతో నిండైన ప్రకృతి సంపదతో అలరారుతూవుంటుంది. ఇక్కడ లోగడ కొండ జాతి ప్రజలు మాత్రమే వుండేవారు. ప్రస్తుతం అన్ని రకాల ప్రజలుండే ఆధునిక నగరంగా రూపొందింది రాంచి వేసవి విశ్రాంతి కేంద్రంగా కూడా ప్రసిద్ధి పొందింది. నగరానికి చుట్టుపట్ల అనేక జలపాతాలు కనువిందుచేస్తాయి. ఇందులో హుద్రుజలపాతం ముఖ్యమైనది. ఇక్కడకు 6 కి.మీ. దూరంలో మొరాబది పర్వతం వుంటుంది. ఈ పర్వతం పరిసర ప్రాంతాలకు పరవశించి పోయిన విశ్వకవి రవీంద్రనాథ్ టాగూర్ ఒక

గేయ సంపుటమే వ్రాశాడు! అప్పటి నుంచి దీన్నిటాగూర్ పర్వతంగా పిలుస్తున్నారు.

రాంచికి 130 కి మీ దూరంలో జంషెడ్‌పూర్ వుంటుంది ఇక్కడే ప్రసిద్ధ టాటా ఉక్కు కర్మాగారం 1907 లో జమ్‌షెడ్జీ టాటాచే ఏర్పర్చబడింది దేశంలో మొట్టమొదటిగా నిర్మించబడిన ఉక్కు కర్మాగారం ఇదే. ప్రణాళికాబద్ధంగా నిర్మించబడిన జంషెడ్‌పూర్ పట్టణం రమణీయంగా కూడా వుంటుంది.

దామోదర్‌వాలీ ప్రాజెక్టు కూడా పెద్ద యాత్రా కేంద్రమే దామోదర్‌నది మీద నిర్మించబడిన ఈ బహుళార్థసాధక ప్రాజెక్టు బీహార్, బెంగాల్ రాష్ట్రాలకు విద్యుచ్ఛక్తి, సాగునీరు సరఫరా చేస్తుంది ఈ ప్రాజెక్టు మూలంగా బీహార్‌లోని చోటానాగపూర్ ప్రాంతం పారిశ్రామికాభివృద్ధి చెందుతోంది.

రాంచికి 107 కి మీ దూరంలో హజీరా బాగ్ వుంటుంది. హాజీరాబాగ్ అంటే వెయ్యి పూతోటలు అని అర్థం పేరుకు తగ్గట్టుగా చక్కటి తోటలు, చిట్టడవులు, కొండలతో శోభిల్లుతూ వుంటుంది ఇది కూడా చక్కటి వేసవి విడిది కేంద్రం హాజీరాబాగ్ నేషనల్ పార్క్‌లో అన్నిరకాల అడవి జంతువులను, పక్షులను చూడవచ్చును.

హాజీరాబాగ్ 120 కి.మీ దూరంలో ఆసియాలో కెల్లా పెద్దదైన సింద్రీ ఎరువుల కర్మాగారం వుంటుంది.

పాట్నాకు 100 కి.మీ దూరంలో ససారాం వుంటుంది. ఇచ్చట వున్న షర్షా సమాధి చూడదగిన కట్టడం. ఈ సమాధి ఒక సరస్సు మధ్యలో 46 మీటర్ల ఎత్తున వుంటుంది చుట్టూ పూతోటలతో శోభాయమానంగా వుంటుంది

బీహార్‌లోని హిందువులు, ముస్లింలు వారి వారి పండుగలు చేసుకుంటారు. ఇవేగాక బీహార్ ప్రజలు నవంబరులో 'చాహేత్' అనే పండుగను గొప్పగా చేసుకుంటారు. సూర్యభగవానుని ఆరాధించే పండుగ ఇది. ఈపండుగ సందర్భంగా భక్తులు ఆరు రోజులు ఉపవాసం చేసి ఆరో రోజున దగ్గరలోని నదిలోనో, చెరువులోనో స్నానం చేసి సూర్యభగవానునికి పూజలు చేస్తారు.

ప్రథమ రాష్ట్రపతి డా॥ రాజేంద్ర ప్రసాద్, లోక్‌నాయక్ జయప్రకాశ్‌నారాయణ్, ప్రముఖ హరిజన నాయకులు కేంద్రంలో అనేక సంవత్సరాలు మంత్రిగా వున్న బాబూ జగజ్జీవన్‌రాంల జన్మస్థలం బీహార్.

# 16 ఉత్తరప్రదేశ్

వైశాల్యం – 2,94,411 చదరపు కిలోమీటర్లు. జనాభా – 13 కోట్ల 87 లక్షలు. రాజధాని లక్నో. మాతృభాష – హిందీ.

ఉత్తరప్రదేశ్‌కు ఉత్తరాన టిబెట్ (చైనా) నేపాల్ దేశాలుంటాయి. వాయువ్యంగా హిమాచల్‌ప్రదేశ్, పడమర హర్యానా, రాజస్తాన్, ఢిల్లీలు దక్షిణాన మధ్యప్రదేశ్ తూర్పున బీహార్ సరిహద్దులుగా వుంటాయి.



జనాభా రీత్యా దేశంలో కెల్లా పెద్ద రాష్ట్రం ఉత్తరప్రదేశ్  వైశాల్యం రీత్యా మధ్యప్రదేశ్, రాజస్తాన్, మహారాష్ట్రల తర్వాత 4వ పెద్ద రాష్ట్రం

వైశాల్యం రీత్యా ఉత్తరప్రదేశ్ ఆంధ్రప్రదేశ్‌కన్నా సుమారుగా 20 వేల వదరపు కిలోమీటర్లు మాత్రమే ఎక్కువ వైశాల్యం రీత్యా ఉత్తరప్రదేశ్ దేశంలో నాలుగో స్థానంలో వుండగా మనరాష్ట్రం అయిదో స్థానంలో వుంటుంది. జనాభారీత్యా మాత్రం ఉత్తరప్రదేశ్ మన రాష్ట్రం జనాభాకు రెట్టింపు పై మాటే!

ఉత్తరప్రదేశ్‌ను భౌగోలికంగా మూడు ప్రాంతాలుగా విభజించవచ్చు. (1) ఉత్తర పర్వత ప్రాంతం (2) దక్షిణ పర్వత ప్రాంతం (3) గంగా మైదాన ప్రాంతం.

హిమాలయ పర్వత పంక్తులలో వుండే ఉత్తరకాశి, చమోలి, పిలోర్‌ఘర్, గర్వాల్, టెహరిగర్వాల్, అల్మోరా జిల్లాలు, నైనిటాల్ జిల్లాలోని కొంతభాగం, డెహరాడూన్ జిల్లాలోని కొంతభాగం - ఇది ఉత్తర పర్వతప్రాంతం  ఈ ప్రాంతం రాష్ట్రంలో ఆరోవంతు ఆక్రమించుకుంటుంది.

దక్షిణ పర్వత ప్రాంతం అనగా ఝాన్సీ, జలావున్, హమీర్‌పూర్, బాందా, మీర్జాపూర్ జిల్లాలు, అలహాబాద్ జిల్లాలోని కొంతభాగం, వారణాసి జిల్లాలోని కొంత భాగం. ఈ ప్రదేశం కూడా అంత సారవంతమైనది కాదు.

ఈ రెండు ప్రాంతాల మధ్య వుండేది గంగామైదాన ప్రాంతం. సారవంతమైన ఒండ్రుమట్టి మైదానం. ప్రపంచంలో కెల్లా ఇదే పెద్ద ఒండ్రుమట్టి మైదానప్రాంతం. పంటలు పుష్కలంగా పండే ప్రాంతం. రాష్ట్ర జనాభాలో ఎక్కువమంది ఈ ప్రాంతంలోనే నివసింస్తున్నారు. ఈ ప్రాంతంలో ఖనిజసంపద మాత్రం తక్కువగా వుంటుంది.

హిమాలయ పర్వత ప్రాంతంలో చలి ఎక్కువ. మిగతా రాష్ట్రంలో వేడివాతావరణం వుంటుంది. పర్వతా ప్రాంతాలలో సాలీనా సగటున 200 సెం.మీ వర్షం పడుతుంది. తూర్పు ప్రాంతంలో 100 సెం.మీ. గంగా మైదాన ప్రాంతంలో 95 సెం.మీ వర్షం పడుతుంది. పెద్దనదులు అనేకం ఉత్తరప్రదేశ్ గుండా ప్రవహిస్తాయి. గంగ, యమున, గోమతి, రామ్‌గంగా, శారద నదులు ముఖ్యమైనవి. ఇవి పెద్ద నదులేగాక జీవనదులు కూడ ఎల్లప్పుడూ ప్రవహిస్తూ వుంటాయి.

ఉత్తరప్రదేశ్‌కు వేల సంవత్సరాల చరిత్ర వుంది. అయితే ఎందువల్లనోగాని ప్రాచీన వేదం ఋగ్వేదంలో ఉత్తరప్రదేశ్ ప్రస్తావన వుండదు. రామాయణం జరిగింది ఈ ప్రాంతంలోనే. శ్రీరామచంద్రుని రాజధాని అయోధ్య ఇక్కడనే వుంది. పురాణ

పురుషులైన కౌరవులు, పాండవులు, శ్రీకృష్ణుడు ఇక్కడివారే. ఆనాడు ఈ ప్రాంతాన్ని-బ్రహ్మఋషి దేశమని మధ్యదేశమని పిల్చేవారు మహాఋషులు వాల్మీకి, విశ్వామిత్ర మొదలైనవారు ఇచ్చటి వారే. మహాగ్రంథాలైన రామాయణం, భారతం ఇచ్చటనే ప్రభవిల్లినై

క్రీ॥ పూ॥ 6వ శతాబ్దంలో జైన, బౌద్ధ మతాలు ఇచ్చటనే పుట్టినాయి జైనమత సృష్టికర్త మహావీరుడు ఇచ్చటనే దూరలో అంతిమశ్వాస వదిలాడు. గౌతమబుద్ధుడు బౌద్ధమత ప్రచారం ఇచ్చటనే వున్న సారానాథ్ నుంచి ప్రారంభించాడు. కనిష్కుడు, పుష్యమిత్రుడు, మహీపాలుడు, హర్షవర్ధనుడు, యశోవర్మను, విహరభోజుడు మొదలైన ప్రముఖ రాజులు ఈ ప్రాంతాన్ని పాలించారు

అశోక సామ్రాజ్యంలో భాగంగా వున్న ఉత్తరప్రదేశ్ మౌర్యసామ్రాజ్య పతనం తర్వాత వివిధ రాజుల పాలన క్రిందకు వెళ్లింది అల్లా ఉద్దీన్ ఖిల్జీ దండయాత్రల (1309)తో ఈ ప్రాంతం ముస్లింల అధీనంలోకి మారింది. 16వ శతాబ్దంలో లోడీ వంశీయుల పాలనలో వుండేది. అప్పుడు ఆగ్రా రాజధానిగా వుండేది. తరువాత ఈ ప్రాంతమంతా అక్బర్ జయించటంతో మొగల్ సామ్రాజ్యంలో అంతర్భాగమయింది ఈ కారణంగానే ఇచ్చట హిందూ ముస్లిం సంస్కృతులు పెనవేసుకొని వుంటాయి.

18వ శతాబ్దం వచ్చేసరికి మొగల్ సామ్రాజ్యం పతనమై ఈ ప్రాంతమంతా బ్రిటిష్ వారి అధీనమైంది బ్రిటిష్‌వారు ఆగ్రా, ఔద్ రాజ్యాన్ని ఏకం చేసి యునైటెడ్ ప్రావిన్సెస్ అని పిల్చేవారు. క్లుప్తంగా యు పి. అనేవారు.

దేశానికి స్వతంత్రం వచ్చిన తర్వాత యునైటెడ్ ప్రావిన్సెస్‌ను ఉత్తరప్రదేశ్‌గా పిలుస్తున్నారు. ఉత్తరప్రదేశ్ మొట్టమొదటి ముఖ్యమంత్రి గోవింద్ వల్లభ్‌పంత్. గోవింద్ వల్లభపంత్ ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రిగా ఆ తర్వాత కేంద్రంలో హెూంమంత్రిగా కూడా సమర్థుడైన పరిపాలకుడిగా పేరు తెచ్చుకున్నారు.

ఉత్తరప్రదేశ్‌లో లెజిస్లేటివ్ అసెంబ్లీ లెజిస్లేటివ్ కౌన్సిల్ వున్నాయి. అసెంబ్లీ సభ్యుల సంఖ్య 425. ఈ రాష్ట్రానికి 85 మంది లోక్‌సభలో, 34 మంది రాజ్యసభలో ప్రాతినిధ్యం వహిస్తారు.

ఉత్తరప్రదేశ్ జనాభాలో 83 శాతం మంది హిందువులు 16 శాతం ముస్లింలు అక్షరాస్యులు 27 శాతం మాత్రమే.

ఉత్తరప్రదేశ్ 63 జిల్లాలుగా విభజించబడివుంటుంది. అవి - ఆగ్రా, ఆలిఘర్,

అలహాబాద్, ఆల్మోరా, అజాంఘర్, బహ్రైచ్, బాలియా, బాండా, బారాబంకి, బరేలి, బస్తీ, బిజ్నోర్, బుదాన్; బులందసహార; ఛమోలి, డెహ్రాడూన్, డియోరియా, ఈటా, ఇటావా, ఫైజాబాద్, ఫరూకాబాద్, ఫతేపూర్, ఘర్వాల్, గాజిపూర్, గాజియాబాద్, గోండా, గోరఖ్పూర్, హమీర్పూర్, హర్డమ్, జలాన్, జాన్పూర్, ఝాన్సి, కాన్పూర్ (రూరల్) కాన్పూర్(అర్బన్) ఖేరి, లలిత్పూర్, లక్నో, మెయిన్పురి, మధుర, మీరట్, మీర్జాపూర్, మొరాదాబాద్, ముజాఫుర్ నగర్, నైనిటాల్, పిలిబిట్, పితోర్ఘర్, ప్రతాప్ఘర్, రాయ్బరేలి, రాంపూర్, సహరాన్పూర్, షాజహాన్ పూర్, సితాపూర్, సుల్తాన్పూర్, టెహరిగర్వాల్ ఉన్నావో, ఉత్తరకాశీ, వారణాసి, ఫిరోజబాద్, సిద్ధార్థనగర్, సోన్భాద్రా, హరిద్వార్, మాంత్భజన్, మహారాజ్గంజ్

ఉత్తరప్రదేశ్ జనాభాలో 75 శాతం మందికి వ్యవసాయమే జీవనాధారం. ఉత్తరప్రదేశ్ విస్తీర్ణం, జనాభాకు తగ్గట్టగానే ఆహార ధాన్యాల ఉత్పత్తిలో కూడ దేశంలో కెల్లా ముందడుగులో వుంది. దేశం లో పండే గోధుమలో 36 శాతం, పప్పుధాన్యాలలో 28 శాతం, బంగాళాదుంపలలో 45 శాతం, చెరకులో 43 శాతం ఈ ఒక్క రాష్ట్రంలో పండుతాయి. అయితే సగటు ఎకరా దిగుబడి మాత్రం మిగతా రాష్ట్రాలలో కంటే తక్కువగా వుంటుంది. ఉత్తరప్రదేశ్ రైతులు ఇంకా అధునాతన వ్యవసాయపద్ధతులు ఉపయోగించక పోవుటమే కారణంగా చెప్పవచ్చును. ఇంకా ఈ రాష్ట్రంలో ప్రత్తి, జనపనార, ఆవాలు, గసగసాలు కూడా పండుతాయి

ఖనిజ సంపద తక్కువ కారణంగా ఈ రాష్ట్రం పారిశ్రామికంగా బాగా అభివృద్ధి చెందకపోయినా కొన్ని పెద్ద పరిశ్రమలు నెలకొని వున్నాయి. దేశంలో కెల్లా పెద్ద థర్మల్ పవర్స్టేషన్(సింగ్రౌలి) ఇక్కడ వుంది. ప్రపంచలో కెల్లా పెద్దదైన డీజిల్ లోకోమోటివ్ ప్లాంట్ వారణాసిలో వుంది. మధురలోని ఆయిల్రిఫైనరీ, హరిద్వార్, ఝాన్సీలలో భారత్హెవీ ఎలక్ట్రికల్ కర్మాగారాలు, గోరక్పూర్లో ఎరువుల కర్మాగారం, కాన్పూర్లోని హెచ్.ఎ యల్ ఋషికేశ్లోని ఐ డి.పి.యల్., రాయ్బెరెలీ లోని టెలిఫోన్ ఇండస్ట్రీస్ ప్రసిద్ధి చెందిన ప్రభుత్వ రంగ కర్మాగారాలు. ఆరువేలకు పైగా ప్రవేటు కర్మాగారాలు కూడా రాష్ట్రంలో నెలకొన్ని వున్నాయి. ఇంకా ఒకలక్షా యాభైవేల చిన్న, మధ్యతరహా పరిశ్రమలు కూడా వున్నాయి. ఈరాష్ట్రంలో చేనేత పరిశ్రమ కూడా అనేక మందికి ఉపాధి కల్పిస్తోంది. ఆలిఘర్లో ఇత్తడి తాళాలు తయారుచేయటం కుటీర పరిశ్రమగా సాగుతోంది. ఈ తాళాలకు దేశ వ్యాప్తంగా గిరాకీ వుంది.

ఉత్తరప్రదేశ్ ప్రజల మాతృభాష హిందీ. 14వ శతాబ్దం ముందున్న హిందీ సారస్వతాన్ని ఆదికాల సారస్వతం అంటారు. ఆరోజుల్లోని హిందీ కవుల్ని సిద్ధులు, జైన

కవులు, నాథపంతి, వీరకవులు అని పిల్చేవారు. దైవస్తుతితో కూడిన పద్యాలు కావ్యాలు వ్రాసేవారు. ఈ కవులు, వీరకవులు మాత్రం వీరపురుషుల చరిత్రను గానం చేసేవారు. 14వ శతాబ్దానికి చెందని కబీర్ హిందూ ముస్లిం సనాతన వాదాలకు ఎదురునిల్చి విశ్వమానవత్వాన్ని ప్రబోధించాడు. హిందీ సార్వస్వత చరిత్రలో తులసీదాస్ (1543-1663) ను మించినవారు లేరు. ఆయన రచించిన 'రామచరితమానస' హిందీభాష వున్నంతకాలం వుంటుంది. రామకథను రామచరిత మానస్‌గా మలచినతీరు అత్యద్భుతం. రాముడ్ని లోకోత్తరమానవుడుగా, ఆదర్శపుత్రుడుగా, భర్తగా, సోదరుడుగా, రాజుగా, ఎంతో గొప్పగా చిత్రించుతాడు తులసీదాస్. అంతేగాక శివుడు, విష్ణువు, ఒకటేనని నిరూపించి హిందువులలో ఐక్యత కూడా సాధించిన మహాపురుషుడు తులసీదాస్.

ఆధునిక హిందీ సాహిత్యంలో చెప్పుకోదగినవారు భారతెండు హరిశ్చంద్ర (1850-1894). వచన, రచన, నాటకాలు వ్రాయటంలో ఈయన ప్రసిద్ధుడు. మైథిలీచరణ్‌గుప్తా (1886-1964) ఆర్.యన్. త్రిపాఠీ (1889-1962) గోపాల్ చరణ్ సిన్హా (1891-1960) కూడా ఆధునిక హిందీ సాహిత్యంలో చెప్పుకోదగిన వారు. ఇంకా జయశంకర్‌ప్రసాద్, సూర్యకాంత త్రిపాఠీ, నిరాల, సుమిత్రనందన్ పంత్‌కూడా పేరున్న కవులే. హిందీనవలా రచయితలలో అగ్రగణ్యుడు ప్రేమ్‌చంద్. ఈయన నవలలు అనేక భాషలలోకి తర్జుమా చేయబడినాయి. ప్రస్తుత రచయితలలో జైనేంద్రకుమార్, ప్రాణేశ్వరనాథ్ రేణు సచ్చిదానంత వాత్సాయన్ పేర్కొనదగినవారు.

ఉత్తరప్రదేశ్‌లో చూడదగిన ప్రదేశాలు అసంఖ్యాకంగా వున్నాయి. వాటిలో ముఖ్యమైన వాటిని మాత్రం చూద్దాం.

రాష్ట్ర రాజధాని లక్నో. జనాభా 16 లక్షలు. ఈ నగరాన్ని పూర్వం లక్ష్మణపురి అనేవారు. పురాణ పురుషుడు లక్ష్మణుడి పేరు మీదగా ఈ పేరు వచ్చిందని చెబుతారు. గోమతినదికి ఉత్తర దక్షిణ దిశలలో వుంటుంది లక్నోలో చూడదగిన వాటిల్లో ముఖ్యమైనది బారాఇమాంబారా. ఈ కట్టడం 1784లో కరువు నివారణ నిమిత్తం నిర్మించబడింది. 162 అడుగుల పొడవు, 53 అడుగుల వెడల్పు 50 అడుగుల ఎత్తు వుండి గిడ్డంగిలాగ వుండే ఈ కట్టడం ఊతస్థంభాలు లేకుండా వుంటుంది. ఈ రకమైన కట్టడం ప్రపంచంలో ఇదొక్కటేనని అంటారు. ఆనాటి భవన నిర్మాణ నైపుణ్యానికి ఇదొక మచ్చుతునక. లక్నోలో మరో విశేషం 221 అడుగుల ఎత్తు వుండే గడియార స్తంభం. 1880లో నిర్మించబడిన ఈ స్తంభం నిర్మాణానికి 7 సంవత్సరాలు పట్టిందట ఆ రోజుల్లోనే దీని ఖర్చు లక్షన్నర రూపాయలు!

మొగల్ శైలిలో నిర్మించబడి మూడు డోములు, రెండు స్థంబాలతో వుండే జామా

మసీదు కూడా చూడదగిన విశేషం లక్నోలో

గోమతీనదీతీరాన వుంటుంది లక్ష్మణ్ తిలా ఈ ప్రదేశాన్ని శ్రీరామచంద్రుడు తమ్ముడు లక్ష్మణుడికి బహుమతిగా ఇచ్చాడట అందువలన ఈ ప్రదేశానికి ఆపేరు రావటమేగాక ఈ నగరానికి లక్ష్మణపురి అని పేరు కూడా వచ్చింది

లక్నోలో రెసిడెన్సీభవనం కూడ చూడదగిన ఆధునిక చారిత్రక విశేషం పూర్వం దీంట్లో బ్రిటీష్ ప్రతినిధి వుండేవాడు ప్రస్తుత శిధిలావస్థలో వుంది భారత ప్రథమ స్వతంత్రపోరాటం (1857) లో భారతసైనికులు ఈ రెసిడెన్సీ భవనాన్ని 86 రోజుల పాటు ముట్టడించారు ఆనాడు బ్రిటిష్ సైనికుల కాల్పులలో మరణించిన వీరుల స్మారకార్థం రెసిడెన్సీ ఎదురుగా గోమతీ తీరాన స్మారక చిహ్నం నెలకొల్పారు

గోమతి నదికి ఎగువగా 70 కి మీ దూరంలో వుండే నిమ్యార్ గ్రామమే పురాణకాలంనాటి నైమిశము సూతుడు శౌనకాది మహర్షులకు పురాణాలు వినిపించిన ప్రదేశం ఇక్కడ చక్రతీర్థం ( శ్రీకృష్ణుడు చక్రాయుధంతో నిర్మించినది) సూత భగవాన్ మందిరం వేదవ్యాస దర్శించదగిన చోట్లు

లక్నోకు 75 కి మీ దూరంలో గంగానది ఒడ్డున వుంటుంది కాన్పూర్ పెద్ద పారిశ్రామిక, వ్యాపార కేంద్రం, పాదరక్షల పరిశ్రమకు ప్రసిద్ధి జనాభా 20 లక్షలు ఇచ్చట నెలకొని వున్న పంచదార పరిశోధనా సంస్థదేశంలో ఒకే ఒక పంచదార పరిశోధనాలయం. ఇంకా ఈనగరంలో పరాగ్‌నారాయణ్ ఆలయం, గురుప్రసాద్ శుక్లాలయం చూడదగినవి

కాన్పూర్ నుంచి ఝాన్సీ వెళ్ళే మార్గంలో కాల్పి పట్టణం వుంటుంది. యమునా నదీ తీరాన ఇచ్చట మహాభారత రచయిత, సకల శాస్త్రవేత్త వ్యాసభగవాను వారి జ్ఞాపకార్థం నిర్మించిన స్థంభం చూడవచ్చు

కాల్పికి 154 కి మీ దూరంలో ఝాన్సీ వుంటుంది వీరనారి ఝాన్సీ లక్ష్మీబాయ్ పాలించిన ప్రదేశం ఇచ్చట ఝాన్సీలక్ష్మీబాయ్‌కోట ముఖ్యంగా చూడదగినది

ఝాన్సీనుండి ఆగ్రా 210 కి మీ ప్రపంచ వింతలలో ఒకటైన తాజ్‌మహల్ వున్న ప్రదేశం తాజ్‌మహల్ యమునానది ఒడ్డున వుంటుంది మొగల్ చక్రవర్తి షాజహాన్ ముంతాజ్‌ల ప్రణయస్మారక చిహ్నం షాజహాన్, ముంతాజ్‌ల వివాహబంధం 17 సంవత్సరాలు ఆనంద డోలికలలో సాగిన తర్వాత ముంతాజ్ అకస్మాత్తుగా మరణిస్తుంది ఆ వియోగం తట్టుకోలేని షాజహాన్ భార్యముంతాజ్ స్మారకార్థం ఈ అద్భుత కట్టడాన్ని నిర్మించాడు. ఈ కట్టడం పని 1632లో ప్రారంభమై పూర్తికావటానికి 20 సంవత్సరాలు

పట్టింది. 20 వేల మంది శిల్పులు దీన్ని నిర్మించారు. పూర్తిగా చలవరాతితో నిర్మించబడిన ఈ అద్భుత కట్టడం అందచందాలు పున్నమి వెన్నెలలో చూడటం ఒక మధురానుభూతి. ఒకానొక విదేశీ యాత్రికుని మాటల్లో తాజ్‌మహల్ గొప్పదనాన్ని ఒక్కమాటలో చెప్పాలంటే ప్రపంచమంతా చూడటం ఒక ఎత్తు తాజ్‌మహల్‌ను చూడటం మరొక ఎత్తు

ఆగ్రాలో ఇంకా చూడవల్సిన ప్రదేశాలు 1565లో మొగల్ చక్రవర్తి అక్బర్ నిర్మించిన బ్రహ్మాండమైన ఆగ్రాకోట షాజహాన్ నిర్మాంచిన మోతీమసీదు. దివాని-ఇ-ఆమ్, దివానిఇ-ఖాస్, శ్రీ కృష్ణమందిరం మొదలైనవి

ఆగ్రాకు ఉత్తరంగా 10 కి మీ దూరంలో రాధాస్వామి తెగవారు రాధాస్వామి సమాధి (దయాల్బాగ్ దేవాలయం) తాజ్‌మహల్‌తో పోటీగా మరొక బ్రహ్మాండమైన కట్టడాన్ని నిర్మిస్తున్నారు ఇది ఇంకా నిర్మాణంలోనే వుంది

ఆగ్రాకు 40 కి.మీ. దూరంలో ఫతేపూర్ సిక్రివుంటుంది. 1573లో అక్బర్ చక్రవర్తి గుజరాత్‌పై విజయం సాధించిన చిహ్నంగా ఫతేపూర్ సిక్రీని నిర్మించాడు. కొన్ని సంవత్సరాలు అక్బర్ ఇక్కడ వున్నాడు అయితే ఈ నగరానికి సరిగా నీటి సరఫరా లేని కారణంగా దీన్ని వదిలేశారు. ఆనాడు నిర్మించిన భవనాలు శిధిలావస్థలో వున్నాయి. ప్రస్తుతం ఇది నిర్జీవనగరం. చూడవచ్చే యాత్రీకులను మాత్రం విశేషంగా ఆకర్షించుతుంది ఫతేపూర్ సిక్రీలోని మసీదు మక్కామసీదు నకలుగా నిర్మించబడిన గొప్ప మసీదు. ఈ మసీదు ప్రధాన ద్వారం (బులందర్వాజ) ఎత్తు 54 మీటర్లు. దేశంలో ఇదే పెద్ద దర్వాజ

ఇంకా ఇక్కడ చూడవల్సినవి జోధ్‌బాయ్ (అక్బర్ హిందూ భార్య) మందిరం, బీర్బల్ మందిరం.

ఆగ్రాకు 55 కి.మీ. దూరంలో వుంటుంది మధుర శ్రీకృష్ణుడు జన్మించిన స్థలం. ఇక్కడ ద్వారకానాధ్ మందిరం కృష్ణాలయం ముఖ్యమైనది. అద్భుత శిల్పకళావైశిష్ట్యంతో ఉట్టిపడుతుంది. మధురకు 6 కి మీ దూరంలో బృందావనం ఉంటుంది. ఈ మధ్యనే దివంగుతులైన దేవర్‌బాబా యిక్కడే ఉండేవారు. ఇచ్చటనే శ్రీకృష్ణుడు రాసలీలలు జరిపినచోటు. ఇంకా ఇక్కడ శ్రీబాంకి బీహార్‌కా మందిరం కూడా చూడదగినదే. చలవరాతితో కట్టిన ఈ మందిరం మనోహరంగా వుంటుంది

వారణాసి (కాశీ) హిందువులకు పరమ పవిత్రక్షేత్రం. గంగాతీరంలో గంగకు ఉపనదులైన వరణ, అసినదుల మధ్యనున్నదే వారణాసి. ఈనగరం అతి ప్రాచీనమైనది. వేలసంవత్సరాల చరిత్ర వుంది. ప్రపంచం లోని అనేక ప్రాచీన నగరాలు కాలగర్భంలో

కల్సిపోగా వారణాసి మాత్రం అలనాటి పురాణకాలంనుంచి ఈనాటి వరకూ కళకళలాడుతూ వుండే నగరం ప్రతి హిందువూ తన జీవితంలో ఒకసారైనా కాశీ సందర్శించాలనే ఆకాంక్షించుతాడు. ఇచ్చట గంగానది ఉత్తరవాహిని అందువలనే ఈ ప్రదేశం ఇంతటి పుణ్యక్షేత్రం అయింది. గంగానది ఒడ్డున అనేక స్నానఘట్టాలున్నాయి వేలాది హిందూవులు ఇచ్చట ప్రతిరోజూ పవిత్రస్నానాలు చేస్తారు పర్వదినాలలో నైతే లక్షలాది హిందువులు ఇచ్చటకు వచ్చి పవిత్రస్నానాలు చేస్తారు. కాశీ జనాభా 11 లక్షలు

కాశీలో ప్రధాన ఆలయం విశ్వేశ్వరాలయం. దేశంలోని శివాలయాల్లో ఈ ఆలయం ముఖ్యమైనది లోగడ ఈ ఆలయం ముస్లిం దండయాత్రలకు గురికాగా 1776లో రాణి అహల్యాబాయి చే పునర్నిర్మించబడింది విశ్వేశ్వరాలయానికి కొద్ది దూరంలో మాతా అన్నపూర్ణ (కాశీవిశాలక్షి) ఆలయం వుంటుంది.

కాశీ విశ్వనాధ ఆలయాన్ని ధ్వంసం చేసి ఆ ఆలయ స్థంబాలతోనే ఔరంగజేబు నిర్మించిన మసీదు కూడా ఆలయ సమీపంలోనే వుంటుంది.

కాశీలో చూడదగిన మరో ముఖ్య విశేషం కాశీ విశ్వవిద్యాలయం. పండిట్ మదన్‌మోహన్ మాలవ్యాచే నిర్మించబడింది. 2000 ఎకరాలలో వుండే ఈ గొప్ప విశ్వవిద్యాలయం ఆసియాలో కెల్లా పెద్ద వసతి విశ్వవిద్యాలయంగా పేరొందింది.

కాశీకి 10 కి.మీ. దూరంలో వురే సారానాధ్ బౌద్ధులకు పవిత్రక్షేత్రం. రెండు వేల మూడువందల సంవత్సరాలకు పూర్వం నిర్మించబడిన ధమేక స్థూపం (143 అడుగుల ఎత్తు) ప్రధానంగా చూడదగినది. బుద్ధుని జీవిత విశేషాలు తెలిపే శిల్పాలు చెక్కబడి వుంటాయి. బుద్ధుడు మొదట ఇచ్చట నుంచే తనమత ప్రచారం ప్రారంభించాడు. వివిధ బౌద్ధదేశాల భక్తులు నిర్మించిన బుద్ధుని మందిరాలు ప్రశాంతతను వెదజల్లే ప్రాంతమిది.

కాశీకి, 130, కి.మీ దూరంలో అలహాబాద్ వుంటుంది. దీన్నే ప్రయాగ, త్రివేణి అని కూడా అంటారు. గంగ, యమున, సరస్వతులు కలసే చోటు సంగమంలో స్నానం చేయటం అదొక అపూర్వమైన అనుభవం. ప్రతి 12 సంవత్సరాలకు ఇక్కడ కుంభమేళాఉత్సవాలు గొప్పగా జరుగుతాయి. లక్షలాది హిందువులు ఆ సందర్భంగా పుణ్యస్నానాలు చేస్తారు. అలహాబాద్‌లో ఇంకా చూడదగినవి ఆనంద్‌భవన్, అక్బర్‌కోట. మన దేశ ప్రధామ ప్రధానమంత్రి జవహర్‌లాల్ నెహ్రూ నివసించిన భవనం ఆనంద్‌భవన్. స్వతంత్రోద్యమ కాలంలో ఈ భవనంలో అనేక ముఖ్యమైన రాజకీయ నిర్ణయాలు తీసుకోబడినాయి. 1575లో అక్బర్ నిర్మించిన కోట కూడా చూడదగినదే.

లక్నో, గోరఖ్‌పూర్ రైలు మార్గంలో ఫైజాబాద్ 8 కి.మీ దూరంలో అయోధ్య

వుంటుంది. శ్రీరామచంద్రుడు పాలించిన కోసల రాజ్య రాజధాని. ఇక్కడే శ్రీరాముడు జన్మించాడు. మాంధాత, సగరుడు, భగీరధుడు, అంభరీషుడు, సత్యహరిశ్చంద్రలాంటి గొప్ప చక్రవర్తుల రాజధాని. సరయూనది ఒడ్డున వుంటుంది. బౌద్ధుల కాలంలో కూడా ఇది ప్రసిద్ధి పొందిన ప్రదేశంగా వుండేది. బౌద్ధుల కాలంలో ఇచ్చట 20 బౌద్ధారామాలు వుండేవట. ప్రస్తుతం ఇవేమీలేవు. అన్నీ కాలగర్భంలో కలిసిపోయినాయి. ఇచ్చట ముఖ్యంగా చెప్పుకోదగినది రామజన్మభూమి. దశరధ మహారాజు ఈప్రదేశంలో సంతానం కోసం పుత్రకామేష్టి యజ్ఞం చేశాడు. పూర్వం ఇక్కడవున్న ఆలయాన్ని మొగల్ చక్రవర్తి బాబర్ ధ్వంసం చేసి ఆస్థంలోనే ముస్లిం మసీదు నిర్మించాడు. దాన్ని బాబ్రీమసీదు అంటారు. ఈ ప్రదేశం గురించి నేడు రకరకాల వివాదాలు చెలరేగుతున్నాయి.

అయోధ్యలో ఇంకా చూడదగినది కనకభవనం. ఇది ఆనాడు శ్రీ రాములవారు నివసించిన ప్రదేశం. అయోధ్యకు 25 కి.మీ. దూరంలో నందిగ్రామం వుంటుంది. భరతుడు రామ పాదుకలతో 14 సంవత్సరాలు రాజ్యాన్ని పాలించినప్పటి ప్రదేశం.

ఇక రాష్ట్రంలోని ఉత్తరప్రాంతంలో చూడదగిన ప్రదేశాలు కూడా అనేకం వున్నాయి. హిమాలయ పర్వత ప్రాంతంలో వుండే నైనిటాల్ సముద్రమట్టానికి 6360 అడుగుల ఎత్తున వుంటుంది. చల్లటి వాతావరణంతో ఆహ్లాదకరమైన ప్రదేశం. నైనీ సరస్సు చుట్టూ వుంటుంది నైనిటాల్. ఇచ్చట నైనదేవి ఆలయం కూడా వుంది. నైనిటాల్ చక్కటి వేసవి విడిది కేంద్రం.

నైనిటాల్‌కు 68 కి మీ. దూరంలో వుండే ఆల్మోరా మరొక పర్వత విశ్రాంతి కేంద్రం.

హిందువులకు పుణ్యక్షేత్రం హరిద్వారం. ఢిల్లీనుంచి 210 కి.మీ. దూరంలో గంగానది ఒడ్డున వుంటుంది. పర్వతాలు, లోయలు గుండా ప్రవహించిన గంగానది హరిద్వార్ దగ్గర మైదాన ప్రాంతంలోకి అడుగిడుతుంది. ఇక్కడ కూడా 12 సంవత్సరాల కొకసారి కుంభమేళా ఉత్సవాలు జరుగుతాయి.

హరిద్వారంకు 25 కి.మీ దూరంలో ఋషికేశ్ హిమాలయ పర్వత పాదాల దగ్గర వుంటుంది. జనాభా 24 వేలు. ఇచ్చట అనేక ఆశ్రమాలు వుంటాయి. సాధువులు విరివిగా కన్పిస్తారు. ఋషీకేశ్, 4 కి.మీ దూరంలో గంగానదిపై లక్ష్మణ ఝూలా వంతెన వుంటుంది. ఈ వంతెనకు క్రింద స్థంభాలు వుండవు. తీగల ఆధారంగా ఏర్పాటు చేసిన ఈ వంతెన పొడవు 80 అడుగులు.

హరిద్వారంకు 290 కి.మీ. దూరంలో బదరీనాధ్ వుంటుంది. ఇది కూడా

హిందువులకు పవిత్రస్థలం బదరీనాద్ సంవత్సరంలో 6 మాసాలు మంచుతో కప్పబడి వుంటుంది. మే నుంచి అక్టోబరువరకే ఈ ప్రదేశాన్ని చూడటానికి అనువైన కాలం. బదరీనాద్ తర్వాత హిమాలయపర్వతాలలో ఉండే మరో హిందూ పవిత్ర పుణ్యక్షేత్రం కేదార్‌నాద్. ఇచ్చట ఆదిశంకరాచార్యుల సమాధి వుంది.

హిమాలయ పర్వత ప్రాంతంలోనే గంగోత్రి (గంగానది పుట్టిన చోటు) యమునోత్రి (యమునా నది పుట్టిన చోటు) వుంటాయి.

ఋషికేశ్‌కు 42 కి మీ దూరంలో డెహ్రాడూన్ వుంటుంది. ఇచ్చటనే భారత కాలంలో ద్రోణాచార్యులవారు పాండవులకు కౌరవులకు విలు విద్య నేర్పాడట. ద్రోణుడ్ని బట్టే ఈ పట్టణానికి ఆ పేరు వచ్చిందని చెబుతారు. ఇక్కడ సైనిక కళాశాల వుంది.

డెహ్రాడూన్‌కు 35 కి.మీ దూరంలో ముస్సౌరి వుంటుది. సముద్రమట్టానికి 6000 అడుగుల ఎత్తునవుండే చక్కటి వేసవి విడిది కేంద్రం. చిన్న చిన్న జలపాతాలతో ఈ ప్రదేశం కడురమ్యంగా వుంటుంది.

శివలిక్ పర్వత ప్రాంతంలో రామగంగా నది ఒడ్డున 525 చ.కి.మీ. వైశాల్యంలో ఏర్పర్చబడ్డ జిమ్‌కార్బట్ నేషనల్‌లో రకరకాల అడవి జంతుల్ని సహజ వాతావరణంలో చూడవచ్చును.

ఉత్తరప్రదేశ్‌లో మీరట్‌కూడా పెద్ద పట్టణం. ఇక్కడ వున్న సూరజ్ సరస్సు చుట్టూ అనేక దేవాలయాలుంటాయి.

మనదేశ ప్రధాన మంత్రులందరూ మురార్జీదేశాయ్ ప్రస్తుత ప్రధాని పి.వి. నరసింహరావు తప్ప ఉత్తరప్రదేశ్‌కు చెందినవారే. పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ లాల్‌బహుదూర్‌శాస్త్రి, ఇందిరాగాంధీ, చరణ్‌సింగ్, రాజీవ్‌గాంధీ, వి.పి.సింగ్ ఉత్తరప్రదేశ్ రాష్ట్రానికి చెందినవారే. శ్రీ మదన్‌మోహన్ మాలవ్యా, ఆచార్య నరేంద్ర దేవ్, ఆచార్య కృపలానీ, డాక్టర్ సంపూర్ణానంద, అశోక్ మెహతా, విజయలక్ష్మి పండిట్, కృష్ణహతీసింగ్, కె.సి.పంత్, అజిత్‌సింగ్, మొదలైనవారు కూడా ఉత్తర ప్రదేశ్‌కు చెందినవారే. దీనదయాళ్ ఉపాధ్యాయ, వాజ్‌పాయ్ వంటి సుప్రసిద్ధ ప్రతిపక్ష నాయకులు కూడ ఇక్కడివారే.

# 17 పశ్చిమ బెంగాల్

వైశాల్యం - 88,752 చదరపుకిలోమీటర్లు జనాభా - 6కోట్ల 80 లక్షలు. రాజధాని - కలకత్తా, మాతృభాష - బెంగాలీ



పశ్చిమ బెంగాల్‌కు తూర్పున అస్సాం రాష్ట్రం, బంగ్లాదేశ్, పడమర ఒరిస్సా, బీహార్ రాష్ట్రాలు, నేపాల్ దేశం, దక్షిణాన బంగాళాఖాతం, ఉత్తరాన సిక్కిం రాష్ట్రం, భూటాన్ దేశం సరిహద్దులుగా వుంటాయి. ఉత్తరాన హిమాలయాల నుంచి దక్షిణాన బంగాళాఖాతం వరకూ వ్యాపించి వుంటుంది పశ్చిమ బెంగాల్

వైశాల్యం రీత్యా పశ్చిమ బెంగాల్ ఆంధ్రప్రదేశ్ వైశాల్యంలో మూడోవంతులోపే వుంటుంది. సుమారుగా కోస్తా జిల్లాల వైశాల్యం కన్నా కొంచెం ఎక్కువగా వుంటుంది. తెలంగాణా జిల్లాల వైశాల్యం కన్నా కొంచెం తక్కువగా వుంటుంది జనాభా మాత్రం మన రాష్ట్ర జనాభా కన్నా 30 లక్షలు హెచ్చుగా వుంటారు

పశ్చిమబెంగాల్‌ను భౌగోళికంగా రెండుగా విభజించవచ్చు. 1. ఉత్తర హిమాలయ ప్రాంతం - అనగా డార్జిలింగ్, జల్పాయ్‌గురి, కూచ్ బీహార్ జిల్లాలు. డార్జిలింగ్ జిల్లా సముద్రమట్టానికి 2160 మీటర్ల ఎత్తున వుంటుంది. జల్పాయ్‌గురి, కూచ్ బీహార్ జిల్లాలు డార్జిలింగ్ జిల్లా కన్నా పల్లపు ప్రాంతం. ఈ జిల్లాలో తీస్త, తోర్స, జల్దక, రంజిత్ నదులు ప్రవహిస్తూ సేద్యానికి నీరు అందిస్తూ వుంటాయి ఇక మిగతా జిల్లాలన్నీ దక్షిణ ప్రాంతం. సారవంతమైన ఒండ్రుమట్టితో కూడిన మైదాన ప్రాంతం. దక్షిణ ప్రాంతం అంతా భగరీద (గంగ) దాని ఉపనదులైన దామోదర్, మయూరాక్షి, రూపనారాయణ్‌ంచే సస్యశ్యామలం కాబడుతున్న ప్రాంతం. భగరీదనే పశ్చిమ బెంగాల్‌లో హుగ్లీ నది అని కూడా అంటారు. ఈ దక్షిణ ప్రాంతం అంతా మైదాన ప్రాంతం. వరి పుష్కలంగా పండే ప్రదేశం. అరటి, కొబ్బరి, మామిడితోటలు ఇచ్చట ఎక్కువగా వుంటాయి

24 పరగణాల జిల్లాలంతా దట్టమైన అడవులతో నిండి వుంటాయి. వీటినే సుందర్‌బన్స్ అని అంటారు. ఈ సుందర్ బన్స్ అడవులు 24 పరగణాలే గాకుండా ఇంకా బంగ్లాదేశ్‌లోనికి కూడా చొచ్చుకుని వుంటాయి. ఈ సుందర్‌బన్స్ ప్రపంచలో కెల్లా పెద్ద డెల్టా అడవిగా కూడా ప్రసిద్ధి చెందినది. వాస్తవానికి ఈ సుందర్‌బన్స్ అడవులు 54 చిన్న చిన్న దీవులు. ఈ అడవుల్లో ప్రవహించే నదులు నీరంతా బంగాళాఖాతంలోకి వెళుతుంది. సుందర్‌బన్స్ వైశాల్యం 4262 చదరపు కిలోమీటర్లు. ఈసుందర్ బన్స్‌కు వెళ్ళటానికి నీటి మార్గం తప్ప రోడ్డు మార్గం లేదు. సుందర్‌బన్స్‌లో శ్రేష్ఠమైన కలప దొరుకుతుంది. ఈ అడవులలో అన్ని రకాల అడవి మృగాలను, పక్షులను సహజ వాతావరణంలో చూడవచ్చును.

పశ్చిమ బెంగాల్ అంతా వర్షాలు ఎక్కువగానే పడతాయి. దక్షిణ ప్రాంతంలో సగటున 1000 మిల్లీ లీటర్లు పడితే పశ్చిమ ప్రాంతంలో 3000 మిల్లీ మీటర్ల దాకా పడుతుంది.

పూర్వం బెంగాల్‌ని వంగదేశం అని గౌడదేశం అని పిల్చేవారు. వంగ దేశ రాజు మహాభారత యుద్ధంలో కౌరవుల పక్షాన యుద్ధం చేసినట్లు భారతంలో వుంది. క్రీ.పూ. 3వ శతాబ్దంలో బెంగాల్ మౌర్య సామ్రాజ్యంలో భాగంగా వుండేది. క్రీ శ. 4వ శతాబ్దం నుండి 6వ శతాబ్దం వరకూ గుప్త సామ్రాజ్యంలో కలిసి వుండేది. 8వ శతాబ్దంలో స్థానిక వంశీకులైన 'పాల' రాజుల అధీనంలో స్వతంత్రంగా వుండేది. శక్తి సంపన్నులైన ఈ పాలరాజులు తమ రాజ్యాన్ని బీహార్, అస్సాం, ఒరిస్సా వరకూ కూడా విస్తరించారు ఈ రాజులు ఉచ్ఛ దశలో వున్న రోజుల్లో ఇండోనీషియా రాజైన శ్రీ విజయతో దౌత్య సంబంధాలు ఏర్పర్చుకున్నారు. 3 శతాబ్దాల పాలరాజుల పాలన తర్వాత 11వ శతాబ్దంలో బెంగాల్ 'సేన' అనే వంశీకుల చేతుల్లోకి మారింది. ఈ సేన రాజుల పాలనలోనే ప్రసిద్ధ 'గీత గోవింద' రచించిన జయదేవుడు వుండేవాడు. కొంతకాలానికి ఢిల్లీ సుల్తాన్ కుతుబుద్దీన్ సేన రాజులను జయించి బెంగాల్‌ను ఆక్రమించుకున్నాడు. ఆ విధంగా బెంగాల్ మొగల్ సామ్రాజ్యంలో కలిసిపోయింది. మొగల్ చక్రవర్తి ఔరంగజేబు తదనంతరం బెంగాల్ ముస్లిం గవర్నర్ల పాలనలో స్వతంత్రం పొందింది. వీరిలో ముఖ్యుడు సిరాజుద్దౌలా. ఈయన బ్రిటిష్ వారిని ఎదిరించిన మహావీరుడు. అయితే సిరాజుద్దౌలా సైన్యాధిపతి మీర్‌కాశింస్వామి ద్రోహం చేసి బ్రిటిష్ వారితో లాలూచీ పడటం వలన 1757లో ప్లాసీలో జరిగిన యుద్ధంలో సిరాజుద్దౌలా ఓడిపోవటం జరిగింది. స్వామి ద్రోహి మీర్‌జాఫర్‌ను బ్రిటిష్‌వారు గద్దె నెక్కించి 7 సంవత్సరాల తిరక్కముందే బక్సర్ యుద్ధం (1764)లో మీర్ జాఫర్‌ను ఓడించి బ్రిటిష్ వారు బెంగాల్‌ను తమ చేతుల్లోకి తీసుకున్నారు.

1905లో బ్రిటిష్‌వారు బెంగాల్‌ను రెండుగా విభజించారు. అస్సాం, తూర్పు బెంగాల్‌ను కలిపి ఢాకా రాజధానిగా ఒక రాష్ట్రం, మిగతా బెంగాల్, బీహార్, ఒరిస్సాలతో ఒక రాష్ట్రంగాను విడదీశాడు. దీన్నే చరిత్రలో బెంగాల్ విభజన అంటారు. దాంతో విభజనకు వ్యతిరేకంగా బెంగాల్‌లో మహోద్యమం బయలుదేరింది. ఈ ఉద్యమానికి మిగతా భారతీయులు కూడా మద్దతు పలికారు. బ్రిటిష్‌వారు ఈ ఉద్యమానికి బెదిరి 1911లో రాష్ట్ర విభజనకు స్వస్తి పలికారు. అయితే అప్పటి వరకూ బ్రిటిష్ ఇండియా రాజధానిగా వున్న కలకత్తాను వదిలేసి రాజధానిని ఢిల్లీకి మార్చారు. అంతే గాక బెంగాల్ నుంచి అస్సాంను, బీహార్‌ను విడదీశారు.

1947లో భారత్‌కు స్వతంత్రం వచ్చినప్పుడు భారత్, పాకిస్తాన్‌లు బెంగాల్‌ను పంచుకున్నారు. పాకిస్తాన్‌కు వెళ్ళిన ప్రాంతాన్ని తూర్పు పాకిస్తాన్(నేటి బంగ్లాదేశ్) అని భారత్‌కు వచ్చిన ప్రాంతాన్ని పశ్చిమ బెంగాల్ అని పేర్లు పెట్టారు. 1950లో కూచ్ బీహార్ సంస్థానాన్ని కూడా పశ్చిమ బెంగాల్‌లో కల్పింది. 1954లో ఫ్రెంచి వలసగా వున్న

చంద్రగోర్‌ను కూడా పశ్చిమ బెంగాల్‌లో కల్పింది. భాషా రాష్ట్రాలు ఏర్పడినప్పుడు బీహార్‌లోని కొన్ని ప్రాంతాలు కూడా బెంగాల్‌లో కలిపారు.

భారత్‌కు స్వతంత్రం వచ్చిన తర్వాత పశ్చిమ బెంగాల్‌కు మొట్టమొదటి ముఖ్యమంత్రిగా పి.సి. ఘోష్ వున్నారు. ఆ తర్వాత బి.సి. రాయ్, అజయ్ ముఖర్జీ, సిద్దార్థ శంకర్‌రాయ్‌లు ముఖ్యమంత్రులయ్యారు. 1977 ఎన్నికలలో కమ్యూనిస్టు నాయకత్వంలోని లెఫ్ట్ ఫ్రంట్ గెల్చింది. కాంగ్రెసు ఓడిపోయింది. జ్యోతిబసు ముఖ్యమంత్రి అయ్యారు. అప్పటినుంచి ఇప్పటివరకూ జ్యోతిబసునే ముఖ్యమంత్రిగా వుంటున్నారు.

సుసంపన్నమైన బెంగాలీ భాషలో వ్రాయటం మొదలయింది. 8వ శతాబ్దం నుంచి మాత్రమేనని భాషావేత్తల అభిప్రాయం. 14వ శతాబ్దంలో బెంగాలీ సాహిత్యంలో కృష్ణ తత్వంపై పద్యాలు విరివిగా వ్యాప్తి పొందినాయి. చండీదాస్ రాధాకృష్ణులపై అనేక వందల పద్యాలు రచించాడు. ఇవి బహుళ వ్యాప్తి పొందాయి. 15వ శతాబ్దంలో సంస్కృత రామాయణాన్ని కృతివాస ఓజా అనే కవి బెంగాలీలోకి అనువదించాడు. ఈ బెంగాలీ రామాయణం బెంగాల్‌లో విశేష ప్రజాదరణ పొందింది. దైవ స్తుతితో కూడిన మంగళ కావ్యాలు కూడా అనేకం 15వ శతాబ్దంలోనే ప్రజల్లో వ్యాపించినాయి.

శ్రీ చైతన్య (1486-1533) బెంగాలీ సాహిత్యానికి వైష్ణవ మత ప్రచారానికి చేసిన కృషి అనన్య సామాన్యం. చైతన్య ప్రభోదనలు ప్రజల్ని విరివిగా ఆకర్షించినాయి. చైతన్య ఆయన శిష్యులు వ్రాసిన రాధాకృష్ణులపై పద్యాలు, పాటలు బెంగాల్ ప్రజల్ని భక్తి మార్గంలోకి మళ్ళించాయి. ముస్లింలు కూడా కొంతమంది చైతన్య ప్రచారానికిలోనై ఆయన శిష్యులుగా చేరారు.

ఆధునిక యుగంలో బెంగాలీపై ఇంగ్లీషు ప్రభావం విరివిగా వుంటుంది. క్రైస్తవ మిషనరీలు ఇంగ్లీషు -బెంగాలీ నిఘంటువును తయారు చేశారు. బెంగాలీ వ్యాకరణం కూడా ప్రచురించారు. బైబిల్‌ను బెంగాలీలోకి అనువదించారు. 19వ శతాబ్దంలో ప్రముఖంగా చెప్పుకోదగిన బెంగాలీ కవి మధుసూదన్‌దత్. ఈయన రచించిన వాటిల్లో మేఘనాద్, బద్ కావ్యం ముఖ్యంగా చెప్పుకోవదగినవి. 1865లో బకించంద్ర చటర్జీ వ్రాసిన దుర్గేశనందిని బెంగాల్ వారిని ఒక్క ఊపు ఊపింది. ఈయన వ్రాసిన ఆనందమఠ్ కూడా బెంగాలీ ప్రజల్ని ఎంతగానో ఉత్తేజపర్చి దేశ భక్తి ప్రబోధించింది. వందేమాతరం గేయం ఈ ఆనందమఠ్‌లోనిదే ! ఇక శరత్‌బాబు రచించిన దేవదాసు, శ్రీకాంత్ లాంటి నవలలు అన్ని భారతీయ భాషల్లోకి తర్జుమా చేయబడి బహుళ వ్యాప్తి పొందినాయి.

రవీంద్రనాథ్ టాగూర్‌తో బెంగాలీ సాహిత్యం మరింత ఉజ్వలంగా భాసించింది.

విశ్వకవి రవీంద్రనాధ్ టాగూర్ అసంఖ్యాకంగా పద్యాలు, నాటకాలు, చిన్న కధలు, నవలలు వ్రాశారు. బెంగాలీలో ఆయన వ్రాసిన 'గీతాంజలి' ని ఆయన స్వయంగా ఇంగ్లీషులోకి అనువాదం చేశారు. దీనికి నోబెల్ బహుమతి కూడా వచ్చింది.

టాగూర్ తర్వాత చెప్పుకోదగిన కవులు తారా శంకర్ బెనర్జీ, నస్రూల్ ఇస్లాం, సురేంద్రనాధ్ దత్తా, ప్రేమేంద్రమైత్రా మొదలైనవారు. తారాశంకర్‌బెనర్జీ వ్రాసిన 'గణదేవత' కు జ్ఞానపీఠ్ బహుమతి లభించింది. శ్రీమతి ఆశాపూర్ణాదేవి తన 69వ ఏట జ్ఞానపీఠ బహుమతి అందుకొన్నారు

పశ్చిమ బెంగాల్ 17 జిల్లాలుగా విభజించబడింది అవి బంకూర, బిర్భుం, బర్ధామన్, కలకత్తా, కూచ్‌బీహార్, డార్జిలింగ్, ముగ్లీ, హవురా, జల్పాయ్‌గురి, మాల్దా, మిడ్నపూర్, ముర్షిదాబాద్, నాడియా, పురులియా, 24 ఉత్తర పరగణాలు, 24 దక్షిణ పరగణాలు, పశ్చిమ డింజపూర్.

పశ్చిమ బెంగాల్‌లో ఒకే సభగల చట్ట సభ వుంటుంది. అందులో సభ్యుల సంఖ్య 294 మంది రాజ్యసభలో 16 మంది, లోక్‌సభలో 42 మంది సభ్యులు పశ్చిమ బెంగాల్‌కు ప్రాతినిధ్యం వహిస్తారు.

పశ్చిమ బెంగాల్ జనాభాలో హిందువులు 77 శాతం మంది, ముస్లింలు 21 శాతం మంది, మిగతా వారు క్రైస్తవులు వగైరా. రాష్ట్ర జనాభాలో అక్షరాస్యులు 58 శాతం మంది.

పశ్చిమ బెంగాల్ ప్రధానంగా వ్యవసాయ రాష్ట్రం. రాష్ట్ర ప్రజలలో 72 శాతం మందికి వ్యవసాయమే జీవనాధారం రాష్ట్రంలో ప్రధాన పంట వరి. వరి ఉత్పత్తిలో ఈ రాష్ట్రం దేశంలో మూడవస్థానంలో వుంటుంది. ఇంకా కొద్దిగా గోధుమ కూడా పండుతుంది. వాణిజ్య పంటలలో జనుము, టీ ప్రధానమైనవి. దేశంలో పండే జనుములో 60 శాతం ఇక్కడే పండుతుంది. దేశంలో ఉత్పత్తి అయ్యే 'టీ' లో 25 శాతం ఇక్కడే పండుతుంది. దేశంలో పండే బంగాళా దుంపలలో 24 శాతం ఇక్కడే పండుతాయి. ఇంకా ఈ రాష్ట్రంలో నూనె గింజలు, అరటి, మామిడి, కొబ్బరి పంటలు కూడా తగు మాత్రంగా పండుతాయి.

పశ్చిమ బెంగాల్ పారిశ్రామికంగా ముందుకు సాగుతోంది. ప్రసిద్ధ ప్రభుత్వ సంస్థలైన దుర్గాపూర్ స్టీల్ కార్మాగారం ఆయిల్ రిఫైనరీ (హాల్దియా), లోకోమోటివ్ వర్క్‌షాపు (చిత్తరంజన్), ఈస్టన్ కోల్డ్ ఫీల్డ్సు, గార్డెన్ రీచ్‌వర్క్ షాపు మొదలైనవి చెప్పుకోదగిన పెద్ద కంపెనీలు. ఇంకా ప్రవేటు రంగంలో 22 వేల చిన్నా, పెద్ద కర్మాగారాలు ఈ రాష్ట్రంలో నెలకొని వున్నాయి. ఇక్కడ తయారయ్యే ప్రధాన

పారిశ్రామిక వస్తువులు కార్లు, బొగ్గు,ఎలక్ట్రికల్స్ సామాగ్రి, రైల్వే, వాగిన్స్, లోకోమోటివ్స్, సిగరెట్లు, జనపనార వస్తువులు, పెట్రోలియం వస్తువులు మొదలైనవి.

పశ్చిమ బెంగాల్ రాజధాని కలకత్తా మహానగరం మనదేశంలో కెల్లా రెండో పెద్ద నగరం. అంతేగాక ప్రపంచంలోని అతి పెద్ద నగరాలలో ఇదొకటి. ప్రస్తుతం కలకత్తా జనాభా కోటి 28 లక్షలు. కిటకిటలాడే జనంతో క్రిక్కిరిసి వుంటుంది కలకత్తా. ఈ జనంలో చాలామందికి ఇళ్ళు కూడా వుండవు ఫుట్‌పాత్‌ల మీద, రైల్వేస్టేషన్‌లలో, బస్సుస్టాండ్‌లలో అసలు ఎక్కడ కాస్త ఖాళీ దొరికితే అక్కడే వంట చేసుకొని పరుంటారు. ఇప్పుడు ఇంత జనసమర్దం కల్గిన కలకత్తాకు పురాతన చరిత్ర ఏమీ లేదు. 300 సంవత్సరాల చరిత్ర మాత్రమే వుంది. 1698 క్రి శ. ప్రస్తుతం కలకత్తా నగరం వున్న చోట కాళాఘాట్, గోవింద్‌పూర్, సుతనాతి అనే మూడు చిన్న గ్రామాలు వుండేవి. ఈ మూడు గ్రామాల్ని సుబర్నరాయ్ చౌదరి అనే జమీందారు పాలనలో వుండేవి 1698లో జాబ్ చర్నోక్ అనే ఆంగ్లేయుడు ఈ మూడు గ్రామాలను 1200 రూపాయలకు జమీందార్ రాయ్ చౌదరి దగ్గరనుంచి కొని ఈస్టు ఇండియా కంపెనీకి ఒప్పగించాడు. 1716 లో ఇంగ్లీషు వారు పోర్టు విలియమ్ కోటను నిర్మించటంతో కలకత్తాకు అంకురార్పణ జరిగింది. క్రమేపి పెరిగి 1735 నాటికి వ్యాపార కేంద్రంగా మారి దాదాపు ఒక లక్ష జనాభా కల్గిన పట్టణంగా రూపొందింది. 1911 వరకూ బ్రిటిష్ ఇండియాకు కలకత్తాయే రాజధానిగా వుండేది. ఈ విధంగా పెరిగి నేటి స్దితికి చేరుకుంది హుగ్లీనది కలకత్తాను హవురాను వేరు చేస్తుంది. రైలులో వచ్చే వారంతా కలకత్తా నగరం చేరాలంటే హవురా బ్రిడ్జి దాటి రావల్సిందే.

కలకత్తాలో ప్రధానంగా చూడవల్సినవి – ఫోర్డు విలియమ్స్, చౌరంగి, విక్టోరియా మెమోరియల్, సెయింట్‌పాల్ కాధడ్రిల్, రైటర్స్ బిల్డింగ్, ఇండియన్ నేషనల్ లైబ్రరీ, శీతల్ నాధ్ జైన దేవాలయం, బొటానికల్ గార్డెన్స్, బేలూర్‌మఠ్, కాళీ దేవాలయం మొదలైనవి

ఫోర్ట్ విలియమ్ కలకత్తా నగరం మధ్యన వుంటుంది. 1696లో దీన్ని సిరాద్దౌలా ఆక్రమించుకోగా 1757లో బ్రిటిష్ వారు తిరిగి స్వాధీనం చేసుకొని ఈ కేంద్రాన్ని శత్రువులను తట్టుకునే విధంగా తిరిగి పటిష్టంగా నిర్మించారు. ఈ కోటను హఠాత్తుగా దాడి చేయటానికి వీళ్ళేకుండా కోట చుట్టూ వున్న చిట్టడవిని నిర్మూలించారు. ఆ రోజుల్లోనే దీని నిర్మాణపు ఖర్చు 3 కోట్లు రూపాయల దాకా అయిందట. 1911 వరకూ బ్రిటిష్ వారి కార్యకలాపాలకు ఇదే కేంద్రంగా వుండేది. దీనికి దగ్గరలోనే చౌరంగి (ప్రస్తుతం దీన్ని జవహర్‌లాల్ నెహ్రూ రోడ్ అంటున్నారు) వుంటుంది. ఇది ప్రసిద్ద

వ్యాపార కూడలి. ఇచ్చటనే భూగర్భ రైలు మార్గం (మెట్రో) ఏర్పాటు చేయబడింది. ఈమెట్రో కలకత్తాకు గొప్ప అలంకారం. ఈ విధమైన భూగర్భ రైలు మార్గం మన దేశంలో మరెక్కడా లేదు. పోర్ట్ విలియమ్స్‌కు సమీపంలో ఈడెన్ గార్డెన్స్ వున్నాయి.

విక్టోరియా మెమోరియల్ కలకత్తాలో కెల్లా అందమైన కట్టడం. విక్టోరియా రాణీ పేరు మీదగా 1921లో నిర్మించబడింది. అచ్చమైన పాలరాతితో నిర్మించబడిన ఈ అద్భుత భవనంలో 25 గాలరీలలో వందలాది అపురూప పురాతన వస్తువుల్ని చూడవచ్చును. కంచు విగ్రహాలు, రాగి ప్రతిమలు, కత్తులు, కవచాలు, ప్రాచీన తాళపత్రాలు, గ్రంథాలు మొదలైన అనేక వస్తువుల్ని ఇక్కడ తిలకించవచ్చు. విక్టోరియా మెమోరియల్ అందంలో తాజ్‌మహల్‌తో సరి సమానంగా వుంటుందని కూడా అంటారు. అసలు కొంత మంది దీన్ని రెండవ తాజ్‌మహల్‌గా కూడా కూడా అని అభివర్ణించుతారు.

సెయింట్‌పాల్‌కాథడ్రిల్ 1874లో నిర్మించబడిన గొప్ప చర్చి. 70 మీటర్ల పొడవు, 24 మీటర్ల వెడల్పు, 60 మీటర్ల ఎత్తున వుండే ఈ చర్చి ఇండియాలోని పెద్ద చర్చిలలో ఒకటి.

రైటర్స్ బిల్డింగ్ 1780లో నిర్మించిన గొప్ప కట్టడం. బ్రిటీష్ వారు దీన్ని ఈస్ట్ ఇండియా కంపెనీ రైటర్స్(గుమస్తాలు) కోసం కట్టారు. అందువలన దీన్ని రైటర్స్ బిల్డింగ్ అని పేరు వచ్చింది. దీన్ని బాగా విస్తరింప చేసి ప్రస్తుతం పశ్చిమ బెంగాల్ సచివాలయంగా ఉపయోగిస్తున్నారు.

ఇండియన్ నేషనల్ లైబ్రరీ దేశంలో కెల్లా పెద్ద లైబ్రరీ. ఇందులో కోటికి పైగా పుస్తకాలు వున్నాయి.

ప్రస్తుతం రవీంద్ర భారతి విశ్వవిద్యాలయం వున్న ప్రదేశంలోనే రవీంద్రనాద్ ఠీగూర్ జన్మించారు. అందువలన ఆయన పేరు మీదగా ఇచ్చట ఇండియన్ డాన్స్, డ్రామా, సంగీతం, చిత్రకళలకు సంబంధించిన రవీంద్ర భారతి విశ్వవిద్యాలయం ఏర్పాటు చేశారు.

శీతల్‌నాధ్ జైన దేవాలయం కలకత్తాలో చూడదగిన మరొక అద్భుతం. ముత్యాలు మాణిక్యాలు పొదిగి నిర్మింపబడిన ఈ జైన దేవాలయం 1867లో నిర్మించబడింది.

కలకత్తా నగర దేవత కాళీమాత ఈ దేవతకు నిర్మించినదే కాళికాలయం. 90 అడుగుల గోపురంతో ఈ కాళికాలయం శోభిల్లుతూ వుంటుంది. కాళీ విగ్రహం బీకరంగా భయం కల్గిస్తుంది. రాక్షస సంహారం కోసం జగన్మాత ఎత్తిన అవతారం. ఈ దేవాలయం

ఎప్పుడూ భక్తులతో రద్దీగా వుంటుంది. దేశం నలుమూలల నుంచి కాళీమాత దర్శనం కోసం జనం వస్తారు. చైత్ర, ఆశ్వయుజమాసాలలో ఇక్కడ నవరాత్రి ఉత్సవాలు గొప్పగా జరుగుతాయి.

దక్షిణేశ్వర ఆలయం పార్క్‌స్ట్రీట్‌కు ఉత్తరంగా వుంటుంది. ఈ దేవాలయంలోనే శ్రీ రామకృష్ణ పరమహంస పూజారిగా కొంతకాలం వున్నారు. ఆనాడు రామకృష్ణ పరమహంస నివశించిన గది ఆయన ఉపయోగించిన వస్తువులు ఇచ్చట చూడవచ్చును.

కలకత్తా శోభ తెచ్చే మరో అద్భుతం బొటానికల్ గార్డెన్స్. హుగ్లీ నదికి పడమరగా వుంటుంది. 270 ఎకరాల విస్తీర్ణంలో ఈ గార్డెన్స్ రకరకాల వృక్షాలతో నిండి వుంటుంది. ఈ గార్డెన్స్‌లో మరీ విశేషంగా చెప్పుకోదగినది 500 సంవత్సరాల నాటి మర్రి చెట్టు. 1200 అడుగుల విస్తీర్ణంలో ఆక్రమించి 88 అడుగుల ఎత్తు వెయ్యి అడుగుల చుట్టుకొలత కల్గిన మహా వృక్షం ఇది. ఈ అద్భుత వృక్షానికి 600 ఊడలు భూమిలోకి దిగి చెట్టుకు రక్షణ కల్పిస్తాయి. ప్రపంచంలో కెల్లా ఇదే పెద్ద మర్రి చెట్టు.

బేలూర్ మఠ్ రామకృష్ణ మిషన్ వారి ప్రధాన కార్యాలయం. ఇది కూడా హుగ్లీ నదికి అవతలే వుంటుంది. స్వామి వివేకానంద చే గురువు రామకృష్ణ పరమహంస పేరు మీదగా ఈ మిషన్ 1897 లో ఏర్పరచబడినది ఈ మిషన్‌కు ఇండియా అంతటే గాక ఇతర దేశాల్లో కూడా కార్యాలయాలున్నాయి. మానవసేవయే ఈ మిషన్‌కు పరమావిధి. ఆధునికంగా నిర్మించబడిన ఈ మఠం ఒకవైపు నుంచి చూస్తే మసీదుగాను, మరొక వైపు నుంచి చూస్తే చర్చిగాను, వేరొకవైపు నుంచి చూస్తే దేవాలయంగాను కనబడుతుంది. సర్వమత సమానతకు తార్కాణంగా ఈ విధంగా నిర్మించబడింది.

హవురా, కలకత్తాలను కలుపుతూ హుగ్లీ నది మీద నిర్మించబడిందే హవురా బ్రిడ్జి. 1943లో నిర్మించబడిన ఈ అద్భుత బ్రిడ్జి నీటిలో స్థంభాలు లేకుండానే నిర్మించబడింది. 2150 అడుగుల పొడవు గల ఈ బ్రిడ్జి 8 వాహనాలు ఒకే సారి వెళ్ళేందుకు వీలైనంత వెడల్పుగా కూడా వుంటుంది. అంతేగాక రెండు ట్రామ్‌వేలు, ఫుట్‌పాత్‌లు కూడా కల్గి కూడా వుంటుంది. ఈ బ్రిడ్జి నిర్మాణం ఒక గొప్ప ఇంజనీరింగ్ ఫీట్‌గా చెప్పుతారు.

కలకత్తా నగరానికి 41 కిలోమీటర్ల దూరంలో హుగ్లీ పట్టణం వుంటుంది. కలకత్తా వృద్ధిగాక ముందు హుగ్లీ పెద్ద వ్యాపార కేంద్రంగా వుండేది. ఈ పట్టణానికి చాలా పూర్వ చరిత్ర కూడా వుంది. పూర్వం ఈ ప్రాంతాన్ని ఏలిన స్థానిక రాజుల రాజధానిగా వుండేది హుగ్లీ బ్రిటిష్‌వారు, పోర్చుగీసు వారు ఇచ్చటనే తమ స్థావరాలను ఏర్పర్చుకున్నారు. హుగ్లీలో ఈనాటికి పూర్వ కాలం నాటి కట్టడాల అవశేషాలు కానవస్తాయి. హుగ్లీలో

ప్రధానంగా చూడదగినది ఇమాంబారా మసీదు. హుగ్లీ జిల్లా ముఖ్య పట్టణం చిన్సురాలో కూడా కొన్ని ప్రాచీన అవశేషాలు కానవస్తాయి.

కలకత్తాకు దక్షిణంగా 60 కిలోమీటర్ల దూరంలో డైమండ్ హార్బర్ వుంటుంది. ఇచ్చట హుగ్లీనది కొంచెం వంపు తిరిగి సముద్రంలోకి ప్రవేశిస్తుంది. ఇచ్చట ప్రకృతి కూడా రమణీయంగా వుంటుంది. దీనికి కొద్ది కిలోమీటర్లలోనే హెూల్దియా రేవు వుంటుంది. డైమండ్ హార్బర్ వెనుక హుగ్లీనది సముద్రంలో చేరే ప్రదేశాన్ని సాగర ద్వీపం అంటారు. జనవరిలో సంక్రాంతి పండుగ రోజున ఇక్కడ గంగాసాగర్ ఉత్సవాలు గొప్పగా జరుగుతాయి. దేశం నలుమూలల నుంచి హిందూ భక్తులు ఆ రోజున ఇచ్చటకు వస్తారు

కలకత్తాకు 201 కిలోమీటర్ల దూరంలో విష్ణుపూర్ వుంటుంది. ఒకప్పుడు ఇది మల్లరాజులకు రాజధానిగా వుండేది. మల్లరాజుల రాజ్యాన్ని మల్లభూమ్ గా పిలవబడేది. ఈ మల్లభూమ్‌లో ప్రస్తుత బంకూర, మిడ్నపూర్, బరద్వాన్ జిల్లాలు భాగంగా వుండేవి. మల్ల రాజులు కళా పోషకులు. ఆనాటి మల్ల రాజులు కట్టించిన అనేక కట్టడాలు శిధిలాలు ఈ నాటికీ కానవస్తాయి విష్ణుపూర్‌లో అనేక దేవాలయాలు కూడా వున్నాయి. విష్ణుపూర్ శిల్క్ పరిశ్రమకు ప్రసిద్ధి.

శాంతినికేతన్ అనగానే విశ్వకవి రవీంద్రనాద్ టాగూర్ గుర్తుకు వస్తారు. శాంతినికేతన్ కలకత్తాకు 163 కిలోమీటర్ల దూరంలో చిర్భుం జిల్లాలో వుంటుంది. ఈ శాంతి నికేతన్‌కు మొదట రవీంద్రనాద్ టాగూర్ తండ్రి దేవేంద్ర నాధ్ టాగూర్ 1863లో అందకురార్పణ చేశాడు. 1901లో రవీంద్రనాద్ టాగూర్ దీన్ని ఆశ్రమ పారశాలగా ప్రారంభించాడు. మొదట్లో ఇందులో 5గురు విద్యార్థులు మాత్రమే వుండేవారు. ప్రస్తుతం ఈ శాంతినికేతన్ విశ్వభారతి విశ్వవిద్యాలయంగా విరాజిల్లుతుంది. ఈ శాంతినికేతన్‌లో అనేకమంది జాతీయ నాయకులు చదువుకున్నారు. గురుకుల పద్దతిలో సాగుతున్న ఈ విశ్వవిద్యాలయం ప్రపంచ ప్రఖ్యాతి గాంచినది. విశ్వభారతి అభివృద్ధి కోసం రవీంద్రనాద్ టాగూర్ తన జీవితాన్నంతా ధారబోశారు. విశ్వభారతిలో వనమహెూత్సవం పుష్ప ఉత్సవం (శాంతినికేతన్ స్థాపించిన రోజు) గొప్పగా జరుగుతాయి.

ముర్షిదాబాద్ ఒకప్పుడు బెంగాల్ రాజధాని. కలకత్తాకు ఉత్తరంగా 219 కిలోమీటర్ల దూరంలో వుంటుంది. ప్రస్తుతం చిన్న పట్టణం. ఇక్కడ మొగల్ పాలకుల వైభవాల్ని చాటే అనేక కట్టడాల అవశేసాలు కానవస్తాయి. ఇక్కడ వున్న వేయి స్థంభాల (హజారాద్వార) భవంతి ముఖ్యంగా చూడదగినది. ముర్షిదాబాద్ దంతంతో చేయబడిన హస్తకళలకు ప్రసిద్ధి. ముర్షిదాబాద్‌కు వెళ్ళే దారిలో ప్లాసీ వుంటుంది. ఇక్కడే సిరాజుద్దౌలా క్లైవు చేతుల్లో ఓడిపోయినాడు.

కలకత్తాకు 354 కిలోమీటర్ల దూరంలో వుండే గౌర్ కూడా చాలా కాలం బెంగాల్ రాజధానిగా వుండేది. బెంగాల్‌ను పాలించిన శశాంక, పాల రాజు రాజధానిగా వున్న గౌర్ 12వ శతాబ్దంలో గొప్ప విజ్ఞాన కేంద్రంగా దేశమంతా ప్రసిద్ధి పొందింది. ప్రస్తుతం ముస్లిం పాలకులు ఆనాడు కట్టించిన కట్టడాల అవశేషాలు మాత్రం కానవస్తాయి.

కలకత్తాకు ఉత్తరంగా 651 కిలోమీటర్ల దూరంలో హిమాలయ పర్వత పాదాల దగ్గర వుంటుంది డార్జిలింగ్. వేసవి విడిదికేంద్రాలకు రాణిగా ప్రసిద్ధి చెందిన డార్జిలింగ్ (జనాభా 55 వేలు) సముద్ర మట్టానికి 2160 మీటర్ల ఎత్తున వుండే డార్జిలింగ్ టీ తోటలతో రకరకాల ఫలవృక్షాలతో శోభాయమానంగా వుంటుంది. ఇక్కడ నుంచి చూస్తే 8597 మీటర్ల ఎత్తున వుండే కాంచన గంగ స్పష్టంగా దర్శనమిస్తుంది. మినీ ట్రయిన్‌లో అడువుల, కొండలు గుండా ప్రయాణిస్తూ హిమాలయ పర్వతాల సోయగాలు చూడటం మర్చిపోలేని అనుభూతి. డార్జిలింగ్ 17వ శతాబ్దంలో సిక్కిం రాజ్యంలో భాగంగా వుండేది. తర్వాత దీన్ని గూర్ఖాలు జయించారు. ఇంగ్లీషు వారు గూర్ఖాలను జయించి, దీన్ని స్వాధీనం చేసుకుని పెద్ద వేసవి విడిది కేంద్రంగా అభివృద్ధి చేశారు. డార్జిలింగ్ మన దేశ రక్షణ రీత్యా కీలక స్థానంలో వుంది. డార్జిలింగ్‌లో భూటియా, లెప్చా, నేపాలీ, టిబెటన్ ప్రజలు రంగు రంగుల దుస్తులలో కానవస్తారు. డార్జిలింగ్ పరిసరాలలో టైగర్ హిల్, చెంచల్ సరస్సు గూమ్ బౌద్ధారామం మొదలైనవి చూడదగినవి. డార్జిలింగ్‌లో పర్వతారోహకులకు శిక్షణ గరిపే "హిమాలయన్ మౌంటెనీరింగ్ ఇన్‌స్టిట్యూట్" కూడా వుంది. డార్జిలింగ్ అంతటా టీతోటలే వుంటాయి. డార్జిలింగ్ టీ ప్రపంచప్రసిద్ధి పొందింది. డార్జిలింగ్ ప్రజలు అధిక సంఖ్యాకులు ఈ టీ తోటలలో పనిచేస్తుంటారు. డార్జిలింగ్‌లో ఆకాశమార్గాన నిర్మించబడిన "రోప్‌వే" కూడా వుంది ఈరోప్‌వే ద్వారా డార్జిలింగ్ నుంచి సింగ్లా బజార్‌కు రంజిత్ నది మీదుగా 5 కిలోమీటర్ల దూరంలో ఆకాశమార్గాన ప్రయాణిస్తూ డార్జిలింగ్ ప్రకృతి శోయగాల్ని వీక్షించటం ఒక వింత అనుభూతి.

డార్జిలింగ్‌లోని గూర్ఖాలు ఈ మధ్య ఒక ఉద్యమం లేవదీశారు భారత్‌లో ఒక రాష్ట్రంగా గూర్ఖాలు వుండే ప్రాంతాన్నంతా గూర్ఖాలాండ్‌గా ఏర్పర్చాలని, భారత్ సైన్యంలో ప్రత్యేక గూర్ఖాదళాన్ని ఏర్పర్చాలని, గూర్ఖా భాషని రాజ్యాంగం 8వ షెడ్యూల్‌లో చేర్చాలని కోరుతూ హింసాయుత ఉద్యమం లేవదీశారు. ఈ హింసాకాండలో అనేక మంది చనిపోయారు. కోట్లాది ఆస్తి నష్టం జరిగింది. 1988 చివరలో ఎట్టకేలకు పశ్చిమబెంగాల్, గూర్ఖాలీగ్, కేంద్ర ప్రభుత్వానికి మధ్య ఒక ఒప్పందం కుదిరింది. ఈ ఒప్పందం ప్రకారం గూర్ఖాలకు ప్రత్యేక రాష్ట్రం బదులు పశ్చిమ బెంగాల్‌లో భాగంగానే డార్జిలింగ్ గూర్ఖా హిల్ కౌన్సిల్ ఏర్పాటు చేయబడింది. ఈ హిల్ కౌన్సిల్‌లో డార్జిలింగ్ జిల్లా, కాలింపాంగ్, కుర్సేంగ్ ప్రాంతాలు సిలిగిరిలో కొంతభాగంతో ఏర్పర్చబడింది. గూర్ఖాల మిగతా కోర్కెలు

తిరస్కరించబడ్డాయి.

డార్జిలింగ్‌కు 50 కిలోమీటర్ల దూరంలో కాలింపాంగ్ హిమాలయ పర్వతాలో ఒదిగి వున్న మరో చిన్న పట్టణం. జనాభా 29 వేలు. ఇది కూడా ఒకప్పుడు సిక్కింలో భాగంగా వుండేది. తర్వాత దీన్ని భూటాన్ ఆక్రమించుకోగా భూటాన్ నుంచి ఇంగ్లీషువారు స్వాధీనం చేసుకున్నారు. అందంగా వుండే ఈ చిన్న పట్టణంలో బూటూనీలు, టిబెటన్ల రంగురంగు దుస్తులతో తాము తయారు చేసిన చేతి వస్తువులు అమ్ముకుంటూ వుంటారు. కాలింపాంగ్‌లో కూడా టీ తోటలు ఎక్కువగా వుంటాయి. ఇచ్చట కాలింపాంగ్ పుష్ప నర్సరీలకు ప్రసిద్ధి చెందినది. అనేక రకాల పూల మొక్కలు ఇక్కడ పెంచి పూలు దేశంలోని వివిధ ప్రాంతాలకు ఎగుమతి చేస్తారు. కాలింపాంగ్ చేతి పనుల తయారీకి కూడా పేరొందినది.

డార్జిలింగ్‌కు 32 కిలోమీటర్ల దూరంలో కుర్సియాంగ్ అనే మరో పర్వత విశ్రాంతి కేంద్రం వుంది. ఇచ్చట పగ్లాజోరా అనే జలపాతం చూడదగిన ముఖ్య విశేషం. కుర్సియాంగ్‌లో పట్టుపురుగుల పరిశ్రమ వుంది.

కలకత్తాకు 187 కిలీమీటర్ల దూరంలో ఒరిస్సా సరిహద్దులో మిడ్నపూర్ జిల్లాలో డిగాబీచ్ వుంటుంది. ఈ డిగాబీచ్ ప్రపంచంలో వెడల్పయిన బీచ్‌లలో ఒకటిగా ప్రసిద్ధి చెందింది. ఇచ్చట వాతావరణం సంవత్సరం పొడవునా ఆహ్లాదకరంగా వుండటంతో అనేకమంది టూరిస్టులు ఇచ్చటకు వస్తూ వుంటారు.

కలకత్తాకు 114 కిలోమీటర్ల దూరంలో మాయాపూర్ వుంటుంది. శ్రీ చైతన్య మహాప్రభువు జన్మించిన స్థలం. కొద్దికాలం ఇది బెంగాల్‌కు రాజధానిగా కూడా వుండేది. శ్రీ చైతన్య మహా ప్రభువు వైష్ణవ మత ప్రచారానికి విశేష కృషి చేసిన మహనీయుడు. ఇచ్చట అనేక శ్రీ కృష్ణ దేవాలయాలున్నాయి

గీత గోవిందం రచించి ప్రసిద్ధిడైన జయదేవుని జన్మస్థలం కెన్‌దురి కూడా చూడ దగిన ప్రదేశం. జయదేవుని సంస్మరణార్థం మాఘమాసంలో ఇక్కడ ఉత్సవాలు జరుగుతాయి.

బెంగాలీ ప్రజలు తెలివిగల వారు. స్నేహపాత్రులు. వీరిలో ఆవేశపాలు కూడా కాస్తంత ఎక్కువగానే వుంటుంది. అతిధి సత్కారంలో బెంగాలీలు పేరెన్నికగలవారు. బెంగాలీ ప్రజలు సంగీత సాహిత్యాల పట్ల ఎక్కువగా మక్కువ చూపిస్తారు.

బెంగాల్లో ఒక వాడుక వుంది. బరోమాసేతురోపర్బన్ అని. అంటే సంవత్సరానికి 12 మాసాలైతే బెంగాలీలు 13 పండుగలు చేసుకుంటారని. నిజంగానే బెంగాలీలు

పండుగలు,ఉత్సవాలంటే అమితంగా ముచ్చటపడతారు. దుర్గాపూజ బెంగాలీలు జరుపుకునే పండుగలలో పెద్దది. రధ జాతర, జాతాన్ జాతర, హోళి, దీపావళి బెంగాలీలు జరుపుకునే పెద్ద పండుగలు, ఉత్సవాలు, శాంతినికేతన్ పౌష్య మేళాఘనంగా జరుపుకుంటారు. గంగా సాగర మేళా కూడా బెంగాల్‌లో జరుపుకునే సంబరాలలో పెద్దదే. నేతాజీ సుభాష్ చంద్రబోస్, రవీంద్రనాద్ టాగూర్ జన్మదినోత్సవాల్ని కూడా బెంగాలీలు జరుపుకొని ఆ మహనీయుల పట్ల తమ భక్తి శ్రద్దలు ప్రకటించుకుంటారు.

పశ్చిమ బెంగాల్ ఎందరెందరో మహనీయులకు పుట్టినిల్లు సతీ సహగమనాన్ని ఎదిరించిన రాజారామ్‌మోహన్ రాయ్, బిపిన్ చంద్రపాల్, స్వామి వివేకానంద, రామకృష్ణ పరమహంజ శారదామాత, అరవిందుడు, నేతాజీ సుభాష్ చంద్రబోస్, చిత్తరంజన్‌దాస్, ప్రఖ్యాత శాస్త్రవేత్త శరచ్చంద్ర బోస్, జగదీష్ చంద్రబోస్, ఈశ్వర చంద్రవిద్యాసాగర్, సరోజినీ నాయుడు, రవీంద్రనాద్ టాగూర్, శర్‌చంద్ర బాబు, బి.సి. రాయ్. యం.యన్.రాయ్, అరుణాన ఫాలీ, హరీంద్రనాద్‌ఛటోపాధ్యాయ, శ్రీమతి కమలాదేవి చటోపాధ్యాయ, ప్రిఫుల్‌చంద్రర్, పిసి. హెూష్, పిసి. సేన్, అబుల్ కలామ్ అజాద్, అజయ్ కుమార్‌ఘోష్, జ్యోతిర్మయి బసు, అశోక్‌సేన్ ఇక్కడ జన్మించారు. సిద్దార్ధ శకరర్, పి.సి. జోషి, ప్రణబ్ ముఖర్జీ, ఘనీఖాన్ చౌదరి, అజయ్ ముఖర్జీ మొదలగు నాయకులు కూడా ఈ రాష్ట్రం వారే. నోబెల్ బహుమతి గ్రహీత, మానవతామూర్తి మధర్‌తెరిసా కార్యస్థానం కలకత్తా. అంతర్జాతీయ ప్రఖ్యాతి గడించిన ఫిలిం డైరెక్టర్ సత్యజిత్‌రే ఇక్కడివారే.

# 18 అస్సాం

వైశాల్యం - 78,438 చదరపు కిలోమీటర్లు. జనాభా - 2 కోట్ల 23 లక్షలు రాజధాని - దిస్‌పూర్, మాతృభాష - అస్సామీస్.

అస్సాంకు ఉత్తరాన భూటాన్ దేశం, అరుణాచల్‌ప్రదేశ్ రాష్ట్రాలు వుంటాయి దక్షిణాన మేఘాలయ, మిజోరాం, మణిపూర్, నాగాలాండ్ రాష్ట్రాలు వుంటాయి తూర్పున కూడా అరుణాచల్ ప్రదేశ్ వుంటుంది. పడమర బంగ్లాదేశ్, పశ్చిమబెంగాల్‌లు హద్దులుగా వుంటాయి.

అస్సాం రాష్ట్రం వైశాల్యం లోగడ అంటే 30 సంవత్సరాలకు పూర్వం 2 లక్షల చదరపు కిలోమీటర్లు పైగా వుండేది. ఈ 30 సంవత్సరాలలో అస్సాంలో భాగంగా వున్న



మేఘాలయ, మిజోరాం, అరుణాచల్ ప్రదేశ్, నాగాలాండ్‌లను విడదీసి వేరు వేరు రాష్ట్రాలుగా చేయటంతో అస్సాం ప్రస్తుత వైశాల్యం 78,438 చ.కి మీ. కు కుదించబడింది. అస్సాం రాష్ట్రం వైశాల్యం రీత్యా చూస్తే ఆంధ్రప్రదేశ్‌లోని కోస్తా జిల్లాల వైశాల్యం కన్నా కొంచెం తక్కువగా వుంటుంది.

అస్సాంను భౌగోళికంగా బ్రహ్మపుత్ర లోయ, బరాక్‌లోయ అని రెండు భాగాలుగా పిలుస్తారు తూర్పునుంచి పడమరకు వ్యాపించి వున్న పర్వత శ్రేణులు ఈ విధంగా రెండు లోయలు ఏర్పడటానికి కారణం అయినాయి అసలు అస్సాంను పర్వతాలు, నదులతో నిండిన ప్రాంతం అని కూడా అంటారు సారవంతమైన లోయలు, దట్టమైన అడవులుతో నిండి వుంటుంది అస్సాం. అస్సాంలో అనేక నదులు కూడా వున్నాయి. ఈ నదులన్నింటి లోకి పెద్ద నది బ్రహ్మపుత్ర. 2900 కిలోమీటర్లు పొడవున్న బ్రహ్మపుత్ర నది 725 కిలోమీటర్లు అస్సాంలో దాదాపు ప్రతి జిల్లా గుండా ప్రవహిస్తుంది. అందువలనే అస్సాంకు బ్రహ్మపుత్ర నదికి విడదీయరాని సంబంధం.

అస్సాంలో అధిక వర్షాలు కురుస్తాయి. సగటున సంవత్సరానికి 178 నుంచి 305 సెంటీ మీటర్ల దాకా వర్షం పడుతుంది. పైగా ఈ వర్షం అంతా కేవలం నాలుగు మాసాల్లో – జూన్ నుంచి సెప్టెంబరు వరకు పడుతుంది. ఈవిధంగా పడటం వలన బ్రహ్మపుత్ర నది పొంగి ప్రతి సంవత్సరం అస్సాంకు వరదలు వస్తాయి. ఆ నాలుగు మాసాల్లో వానలు పడకపోతే ఆ సంవత్సరం అంతా కరువు సంవత్సరంగానే వుండిపోతుంది. మిగతా ఎనిమిది నెలలు అస్సాంకు వేసవి, శీతాకాలం. అయితే వేసవి, శీతాకాలాలు తీవ్రంగా వుండవు.

విభిన్న జాతుల, తెగల కలయిక అస్సాం. అనేక శతాబ్దాలకు పూర్వం అస్ట్రో ఏసియాటిక్స్, నెగ్రిటోస్, ఇండో గొలియన్లు, బర్మాన్, వివిధ ప్రాంతాల నుంచి వచ్చి అస్సాంకు చేరారు. విభిన్న నాగరికతలు, సంస్కృతులు, ఆచార వ్యవహారాలతో చేరిన ఈ ప్రజలే అస్సాం ప్రజలుగా మార్పు చెందారు. అస్సాంను పూర్వం కామరూప అని పిలిచేవారు. శివుడు మూడో నేత్రం తెరిచేటప్పటికి భస్మం అయిన కామదేవుడు ఇక్కడనే పునర్జన్మ పొందిన ఫలితంగా ఈ ప్రాంతాన్ని కామరూప అనేవారు. తరువాత ప్రాగ్జోతిష్ పురం అని కూడా అస్సాంను పిల్చేవారు. ఆ ప్రాగ్జోతిష్ పురాన్ని దానవ రాజు నరకాసురుడి పాలించేవాడని చెబుతారు. నరకాసురుని కుమారుడు భగదత్తుడు కురుక్షేత్ర యుద్ధంలో కౌరవ సేనల తరపున పోరాడినట్లు మహాభారతంలో వుంది.

అస్సాం అనే పేరు తర్వాత వచ్చింది. ఆ ప్రాంతం అంతా కొండలు, లోయలతో అసమానంగా వుంటుంది. కాబట్టి ఆ పేరు వచ్చిందని ఒక వాదన. అలా కాదు 13వ శతాబ్దంలో బర్మా నుంచి దండెత్తి వచ్చిన అహోం తెగ ప్రజలు అప్పటివరకూ అచ్చట

వున్న తెలన్నింటిని జయించి అహోం రాజ్యం ఏర్పాటు చేశారు కాబట్టి అహోం పేరును బట్టి అస్సాం అనే పేరు వచ్చిందని కూడా అంటారు.

7వ శతాబ్దంలో అస్సాంను పాలించిన కుమార భాస్కరవర్మ అస్సాంను పాలించిన రాజుల్లో కెల్లా గొప్పవాడు. ఇతడి హయాంలో అస్సాం అన్ని విధాలా అభివృద్ధి చెందటమేగాక భారత దేశ రాజకీయాల్లో భాస్కర వర్మ ప్రముఖ పాత్ర కూడా వహించాడు. ఇతడి కాలంలోనే చైనా యాత్రీకుడు హుయన్‌సాంగ్ అస్సాంను దర్శించి అచ్చటి ప్రజల గురించి అనేక వివరాలు రాశాడు

13వ శతాబ్దంలో బర్మా నుంచి వచ్చిన అహోం తెగల వారు అస్సాంను జయించి తమ పాలన ఏర్పాటు చేశారు. ఈ అహోంలు అస్సాంను 600 సంవత్సరాలు ఏకధాటిగా పాలించారు. ఈ అహోం రాజులు ఎంత శక్తివంతులంటే మొగల్ సామ్రాజ్యాన్ని కూడా వీరు ధిక్కరించారు. పదమూడు సార్లు మొగల్ చక్రవర్తులు అస్సాంను జయించాలని ప్రయత్నించగా పదమూడు సార్లు వీరు ఎదిరించి నిలబడ్డారు. 19వ శతాబ్దం వరకూ పాలించిన అహోం రాజులు అంతఃకలహాలు మూలంగా క్షీణించి పోయారు. అస్సాం బర్మా వారి చేతుల్లోకి వెళ్ళింది. అహోం పాలకులు ఆంగ్లేయుల సహాయం అర్థించారు. ఆ అవకాశం కోసమే చూస్తున్న బ్రిటిష్ వారు బర్మా వారిని జయించి అస్సాంను తమ గుప్పిట్లోకి తీసుకున్నారు. 1832లో బ్రిటిష్ వారు కచార్ ప్రాంతాన్ని కూడా అస్సాంలో కలిపారు 1835లో జయింటియాహిల్స్‌ను కూడా అస్సాంలో కలిపారు. 1874లో షిల్లాంగ్ రాజధానిగా అస్సాం రాష్ట్రాన్ని ఏర్పరచారు

భారత పాకిస్తాన్ విభజన సమయంలో అస్సాంలోని షిల్లెట్ ప్రాంతం తూర్పు పాకిస్తాన్(బంగ్లాదేశ్) లోకి వెళ్ళింది. 1948లో దేశ భద్రత రీత్యా ప్రస్తుతం అరుణాచల్ ప్రదేశ్‌గా వున్న ప్రాంత్రాన్ని నార్త్ ఈస్టర్న్ ఫ్రాంటియర్ ఏజన్సీ (నేఫా) గా ఏర్పరచారు. 1963లో అస్సాం నుంచి కొంత ప్రాంతాన్ని చీల్చి నాగాలాండ్ రాష్ట్రంగా ఏర్పాటు చేశారు. 1972లో మరికొంత ప్రాంతాన్ని వేరు చేసి మేఘాలయ రాష్ట్రంగా చేశారు. 1972లోనే మిజోరాంను కూడా విడదీసి కేంద్రపాలిత ప్రాంతంగా ఆ తర్వాత ప్రత్యేక రాష్ట్రంగా చేశారు ఈ విధంగా అనేక చీలికల వలన అస్సాంకు లోగడ వున్న 2 లక్షలు చదరపు కిలోమీటర్లపైగా వున్న వైశాల్యం ప్రస్తుతం 78,438 కిలోమీటర్లకు తగ్గిపోయింది.

అస్సాం రాష్ట్ర మొదటి ముఖ్యమంత్రి గోపినాధ్ బార్డొలై, విష్ణురాం మేథీ, బి.వి. చాలిహా, హితేశ్వర్, ప్రఫుల్ల కుమార్, సైక్రియాలు కూడా అస్సాం ముఖ్యులు.

అస్సాంలో 23 జిల్లాలో వున్నాయి. లోగడ 18 జిల్లాలను 1989లో మరో 5

జిల్లాలు ఏర్పాటు చేసి మొత్తం 23 జిల్లాలుగా చేశారు. అవి - బార్ పేట్, కచార్, దరాంగ్, దుబ్రి, దిబ్రుగర్, కోక్రజర్, లకింపూర్, నాగోయన్, ఉత్తర కచార్‌హిల్స్, నల్బరి, ప్రాగ్జ్యోతిష్‌పూర్, శిబసాగర్, సోంతిపూర్, మోరి గాయిన్, దెమాజి, బొంగాయ్‌గాం, హెయిలా కంది, టిన్‌సుకిమా, గోల్పార, జోర్హాట్, కామరూప్, కర్బిఅంగలాగ్, కరీంగంజ్.

అస్సాం అసెంబ్లీలో 136 మంది సభ్యులు వుంటారు. లోక్‌సభలో 14 మంది రాజ్యసభలో 7 గురు సభ్యులకు అస్సాంకు ప్రాతినిధ్యం వహిస్తారు.

అస్సామీ భాష క్రీ.శ. 7వ శతాబ్దంలో ప్రారంభమయినా ప్రాముఖ్యంలోకి వచ్చింది. 13వ శతాబ్దంనుంచి మాత్రమే. 13వ శతాబ్దంలో రుద్రకందలి అనే కవి భారతంలోని ద్రోణ పర్వం అస్సామీ లోకి తర్జుమా చేయటంతో అస్సామీ భాషా వ్యాప్తికి శ్రీకారం చుట్టాడు తర్వాత మాధవకందలి అనే మరో కవి రామాయణాన్ని అస్సామీలోకి అనువాదం చేయటంలో అస్సామీ భాష ఊపందుకుంది. వైష్ణవ మత ప్రచారకులు అస్సామీని మరింత ప్రచారంలోకి తీసుకువచ్చారు. శంకర్‌దేవ్ (149-1568) అను మరో గొప్ప రచయిత అనేక భక్తి గీతాలు, పద్యాలు రాసి అస్సమీని మరింత బలపర్చాడు. 18, 19 వ శతాబ్దాలలో అనేక సంస్కృత కావ్యాలు, పురాణాలు అస్సామీలోకి తర్జుమా చేయబడినాయి.

అస్సామీ వచన రచనకు శ్రీకారం చుట్టిన రచయిత భట్టదేవ్. ఈయన అనేక వచన రచనలు చేసి అస్సామీ సాహిత్యాన్ని జన సామాన్యంలోకి తీసుకు వెళ్ళాడు. ఆంగ్లేయులు బైబిల్‌ను అస్సామీలోకి అనువదించటమేగాక అస్సామీ వ్యాకరణాన్ని, నిఘంటువుల్ని ప్రచురించటంతో అస్సామీ భాషకు వారు కూడా కొంత సేవ చేశారు. 1836 నుంచి 1886 వరకూ బెంగాలీ భాష కూడా అస్సాంలో విరివిగా వ్యాప్తి చెందింది. ఆ అర్ధ శతాబ్దంలో బెంగాలీ భాష అన్ని ప్రభుత్వ ఆఫీసులలో విద్యాలయాలల్లో అస్సామీ కన్నా ఎక్కువ ప్రాధాన్యత పొందింది.

ఆధునిక అస్సామీ సాహిత్యంలో నవలా రచన విశేష ప్రాచుర్యం పొందింది. పద్మనాధ బారువా, రజనీకాంత్ బార్డోలియా లాంటి రచయితలు అనేక నవలలు రాశారు. దేశ స్వాతంత్ర్యానంతరం చెప్పుకోదగిన రచయితలు బిరేంద్రకుమార్ భట్టాచార్య, సయ్యద్ అబ్దుల్ మాలిక్, జోగేష్ దాస్ మొదలైన వారు ప్రసిద్ధులు. బిరేంద్రకుమార్ భట్టాచార్యకు ఆయన వ్రాసిన "మృత్యుంజయ్" కు 1979లో జ్ఞానపీఠ్ బహుమతి లభించింది. అస్సామీ భాషలలో ఎక్కువగా చిన్న కథలు, నవలలు, జీవిత చరిత్రలు వుంటాయి.

అస్సాం 'టీ' తోటలకు ప్రసిద్ధి. దేశంలో పండే తేయాకులో 60 శాతం ఇక్కడే పండుతుంది 750 టీ ఎస్టేట్‌లు వున్నాయి అస్సాం టీ ప్రపంచమంతటా ప్రసిద్ధిపొందింది. అస్సాంలో వరి కూడా ప్రధాన పంటే. గోధుమ కొద్దిగా పండుతుంది చెరుకు కూడా పండుతుంది.

అస్సాంలో ఖనిజ సంపద పుష్కలంగా వుంది ఆయిల్ నిక్షేపాలే బాగా వున్నాయి క్రూడ్ ఆయిల్ విరివిగా దొరుకుతుంది. దేశంలో తయారయ్యే చమురులో 70 శాతం ఇక్కడే ఉత్పత్తి జరుగుతుంది బ్రహ్మాండమైన మూడు ఆయిల్ రిఫైనరీలు ఇచ్చట వున్నాయి నాల్గవది నిర్మాణంలో వుంది. గువాహతి, డిగ్బాయ్, బొంగాయ్ గాంలోని ఆయిల్ రిఫైనరిలు మన దేశానికి పెట్రోలియం ఉత్పత్తులు సరఫరా చేస్తున్నాయి డిగ్బాయ్‌లోని ఆయిల్ బావి ప్రపంచంలోని రెండవ పురాతన బావిగా చెబుతారు ఇవిగాక ఇంకా అస్సాంలో నామరూప్ దగ్గర ఎరువుల కర్మాగారం, నౌగాంగ్‌లో హిందూస్తాన్ పేపర్ కార్పోరేషన్ లాంటి ప్రసిద్ధ పరిశ్రమలు కూడా నెలకొని వున్నాయి. ప్రవేటు రంగంలో పరిశ్రమలు 1400 దాకా వున్నాయి అస్సాంలో ఇంకా బొగ్గు సున్నపు రాయి కూడా దొరుకుతుంది. మినరల్ ఆయిల్ ఉత్పత్తిలో కూడా అస్సాం ప్రత్యే స్థానం లో వుంది. పంచదార, జనపనార మిల్లులు కూడా అస్సాంలో వున్నాయి.

అస్సాంలో చేనేత పరిశ్రమ, కుటీర పరిశ్రమలు కూడా ప్రముఖ స్థానం వహించుతాయి. పేము కర్ర, వెదురుతో రకరకాల వస్తువులు చేస్తారు. ఇత్తడి పాత్రల పరిశ్రమ కూడా చెప్పుకోదగిన కుటీర పరిశ్రమ. పట్టుపరిశ్రమకు కూడా అస్సాం ప్రసిద్ధి. యుగ, పాట్, ఎండి రకాల పట్టు ఇచ్చట తయారవుతుది.

ఇక అస్సాంను సందర్శిద్దాం. లోగడ రాష్ట్ర రాజధానిగా వున్న గువాహతి(గౌహతి) ని పూర్వం ప్రాగ్జోతిష్ పుర అనే వారు బ్రహ్మపుత్ర నది ఒడ్డున వుంటుంది. తూర్పు భారతదేశంలో ఇదొక పెద్ద పట్టణం. ఈ పట్టణాన్ని దానవ రాజు నరకాసురుడు నిర్మించాడని పురాణగాధ. గువాహతి లో ముఖ్యంగా చూడదగినది కామ్యక దేవాలయం. పట్టణానికి 5 కిలోమీటర్ల దూరంలో నీలాచల్ పర్వతంపై వుంటుంది. ఇదో పెద్ద శక్తి పీఠం. మంత్ర, తంత్ర వాదులకు ఇదొక తీర్ధం. దానవ రాజు నరకాసురుడు నిర్మించాడని చెప్పే ఈ దేవాలయం పురాతన అస్సామీ వాస్తు శిల్పాన్ని చాటుతూ వుంటుంది. క్షుద్ర శక్తులను ఆరాధించే వారు ఈ కామ్యక దేవాలయాన్ని దర్శించుతారు

ప్రస్తుతం రాష్ట్ర రాజధాని దిస్పూర్ గువాహతికి 6 కిలోమీటర్లు దూరంలో వుంటుంది.

గువాహతికి 3 కిలోమీటర్ల దూరంలో నవగ్రహ దేవాలయం చిత్రబాల్ కొండపై వుంటుంది పూర్వం ఈ దేవాలయం గ్రహాల ఉనికిని పరిశీలించే గొప్ప కేంద్రంగా వుండేది. అందువలనే ఆ పట్టణానికి పూర్వం ప్రాగ్జ్యోతిష్‌పుర (ఖగోళ జ్యోతిష్ శాస్త్ర నగరం) అనే పేరు వచ్చింది.

బ్రహ్మపుత్ర నది మధ్యలో పీకాక్ దీవి మీద ఉమానంద దేవాలయం వుంది. ఇది శివాలయం. ఈ దేవాలయంపై చెక్కడాలు పూర్వపు అస్సామీ నైపుణ్యాన్ని వెల్లడించుతాయి.

గువాహతికి 12 కిలోమీటర్ల దూరంలో వశిష్ట ఆశ్రమం వుంటుంది. పురాణ కాలంలో వశిష్టముని ఇక్కడే తపమాచరించాడని చెబుతారు. ప్రశాంత ప్రకృతి సోయగాలతో ప్రస్తుతం ఇదొక చక్కని పిక్నిక్ కేంద్రంగా అలరారుతోంది.

గువాహతికి 24 కిలోమీటర్ల దూరంలో వుండే 'హాజో' ముస్లింలకు, బౌద్ధులకు పుణ్యస్థలం బుద్ధుడు ఇక్కడే నిర్యాణం చెందాడని బౌద్ధుల నమ్మిక. ముస్లింలు ఇక్కడ మసీదును పరమ పవిత్రంగా భావిస్తారు. అసలు ఈ మసీదుకు మక్కా మసీదులో నాలుగో వంతు పవిత్రత వుందని వారి నమ్మిక. అందువలనే ఈ మసీదును "పావ్ మక్కా" అని పిలుస్తారు.

గువాహతికి 52 కిలోమీటర్ల దూరంలో మదన కామదేవ వుంటుంది. ఖజురాహోతో సాటి రాగల కామక్రీడలకు సంబంధించిన శిల్పాలు ఇచ్చట వున్నాయి. ఇచ్చట వున్న కొండపై వీటి శిథిలావశేషాల్ని చూడవచ్చును. పురాతన శాస్త్రవేత్తల అంచనా ప్రకారం ఇవి 10, 12 శతాబ్దాల్లో నిర్మించబడిన శివాలయంపై శిల్పాలని చెబుతారు. శివుడు మూడో నేత్రం తెరవటంతో కామదేవుడు భస్మం కావటం, తిరిగి పునర్జన్మ పొందటం ఇక్కడే జరిగిందని అందువలనే కామదేవుని పేరు మీదగా ఈ విధంగా ఇక్కడ శిల్పాలు చెక్కారని చెబుతారు శిథిలావస్తలోనున్న ఈ శిల్పాలలో స్త్రీ పురుషుల శృంగార జీవితానికి సంబంధించిన రకరకాల భంగిమలు వుంటాయి.

గువాహతికి 145 కిలోమీటర్ల దూరంలో బార్‌పేటలో గొప్ప వైష్ణవ దేవాలయం వుంది బార్‌పేటలో హోళీ అత్యంతవైభవంగా జరుగుతుంది.

గువాహతికి 80 కిలోమీటర్ల దూరంలో దరాంగ్ వుంటుంది. ఇక్కడ నవంబరునుంచి మార్చి వరకూ బూటానీ సంతలు జరుగుతాయి. అనేకరకాల చేతి వస్తువులు ఈ సంతలలో అమ్ముతారు.

గువాహతికి 190 కిలోమీటర్ల దూరంలో తేజ్‌పూర్ వుంటుంది. లోగడ దీన్ని

సొంతిపూర్ అనేవారు పురాణ కాలంలో దీన్ని రాక్షస రాజు బాణాసురుడు పాలించాడని అతడి కుమార్తె ఉష కృష్ణుడి మనుమడు అనిరుద్ధుని ప్రేమించటం వగైరా ఇక్కడే జరిగిందని చెబుతారు ఇచ్చట అనేక హిందూ దేవాలయాలున్నాయి.

గువాహతికి 180 కిలోమీటర్ల దూరంలో భూటాన్ సరిహద్దున మనాస్ టైగర్ ప్రాజెక్ట్ వుంటుంది 360 చదరపు కిలోమీటర్ల వైశాల్యంలో వుండే ఈ పెద్ద పులుల సంరక్షణ కేంద్రంలో ఇంకా అనేక వన్యమృగాల్ని సహజ వాతావరణంలో చూడవచ్చును. ఈ పెద్ద పులుల సంరక్షణ కేంద్రం మనాస్ నది ఒడ్డున వుంటుంది

గువాహతికి 217 కిలోమీటర్ల (జోర్హాట్‌కు 95 కిలోమీటర్లు) లో వుండే కాజీ రంగ నేషనల్ పార్క్ దేశంలో గొప్ప వన్య మృగ క్షేత్రం. బ్రహ్మ పుత్రనది మైకిర్ పర్వతాల మధ్య 430 చదరపు కిలోమీటర్ల వైశాల్యంలో వున్న ఈ నేషనల్ పార్క్‌లో అన్నిరకాల అడవి మృగాలను చూడవచ్చును ఖడ్గమృగాన్ని ఇక్కడ మాత్రమే వుంది ఒకప్పుడు ఈ ఖడ్గమృగాలు అంతరించి పోయే పరిస్థితి వస్తే మళ్ళీ క్రమేపీ వాటిని పెంచారు. ప్రస్తుతం ఈ ఖడ్గమృగాలు 400 దాకా వున్నాయి. ఏనుగు మీద ఎక్కి ఈ వన్య మృగ క్షేత్రాన్ని చూడటం యాత్రీకులకు సరదాగా వుంటుంది.

జోర్హట్‌ని టీ టౌన్ అంటారు. జోర్హట్ చుట్టూ టీ తోటలు వుంటాయి. ఈశాన్య అస్సాం ప్రాంతానికి ఇది సింహద్వారం. ఇచ్చట అస్సాం వ్యవసాయ విశ్వవిద్యాలయం వుంటుంది. ఇచ్చట అనేక వైష్ణవ దేవాలయాలున్నాయి.

జోర్హట్‌కు 55 కిలోమీటర్ల దూరంలో శివసాగర్ చారిత్రక పట్టణం వుంటుంది. 129 ఎకరాల వైశాల్యం కల్గిన శివసాగర్ సరస్సు చుట్టూ ఈ పట్టణం వ్యాపించి వుంటుంది. పూర్వం ఈ పట్టణం అహోంరాజుల రాజధానిగా వుండేది. సరస్సులో నీరు పట్టణం మట్టానికి కన్నా ఎత్తుగా వుండటం ఒక విశేషం. ఈ సరస్సు చుట్టూ శివడాల్, విష్ణుడాల్, దేవిడాల్ అనే మూడు పెద్ద దేవాలయాలు వున్నాయి. వీటిని 1734లో అప్పటి అహోం రాజు శివ సింహ భార్య మదాంబిక కట్టించింది. ఇచ్చట శివడాల్ దేశంలో కెల్లా ఎత్తైన శివాలయంగా చెబుతారు 104 అడుగులు ఎత్తు, 195 అడుగుల చుట్టుకొలత కల్గి వుంటుంది. శివసాగర్‌కు 28 కిలోమీటర్ల దూరంలో బొరైదేవ్‌లో అహోరాజుల శ్మశాన వాటిక వుంది. ఇచ్చట అహోం రాజుల సమాధులు (మైదామ్) అనేకం వున్నాయి. అసలు అహోం రాజుల మొదట ఇక్కడనే రాజధాని నిర్మించి తరువాత శివసాగర్‌కు మార్చారు

బర్మా లోయలో ప్రకృతి ఒడిలో ఒదిగి వున్న పట్టణం సిల్చార్. ఇచ్చట నుంచి

మిజోరం, త్రిపురలకు వెళ్ళవచ్చు. సిల్చార్‌లో వెదురు, పేము కర్రలతో రకరకాల వస్తువులు వేస్తారు

హఫ్లాంగ్ (ఉత్తరకచార్ జిల్లా ముఖ్య పట్టణం) అస్సాంలో వున్న ఒకే ఒక పర్వత విశ్రాంతి కేంద్రం ఈ పట్టణం సముద్రమట్టానికి 30006 అడుగుల ఎత్తున ఉంటుంది. హఫ్లాంగ్ కొండ శిఖరాన్ని జతింగ్ అంటారు ఇచ్చట సెప్టెంబరు, అక్టోబరు మాసాల్లో ఒకగొప్ప విశేషం జరుగుతుంది. ఈ రెండు మాసాల్లో కొన్ని రకాల పక్షులు ఈజతింగ్ శిఖరం చుట్టూ ప్రదక్షిణ చేసి ఈకలు రాల్చుకుంటూ క్రిందలోయలో పడి ఆత్మహత్య చేసుకోవటం ఒక వింత ఈ వింత చూడటానికి అనేక మంది ఆ రోజుల్లో ఇచ్చటకు వచ్చి జతింగ వాచ్ టవర్‌లో నుంచి ఈ విషాద దృశ్యాల్ని తిలకించుతారు.

విభిన్న తెగలు, జాతులు, రకరాల సంస్కృతి, ఆచార వ్యవహారాల సమ్మేళనం అస్సాం ఈ రాష్ట్ర ప్రజల్లో అధిక రకరకాల ఆచార వ్యవహారాలతో కానవస్తారు. ఈ తెగల భాష కూడా వేరుగా వుంటుంది. అస్సాంలో అన్ని మతాలు, తెగల వారు చేసుకునే పండుగ రంగోలిబిహు పంటలు చేతికి వచ్చినప్పుడు ఏప్రిల్‌లో వస్తుంది ఈ పండుగ. ఈ పండుగను యావన్మంది ఆనందోత్సాహాలతో చేసుకుంటారు. తప్పెట్లు తాళాలు మోగిస్తూ యువతీ యువకులు నృత్యం చేస్తారు.

అస్సాంలోని కొన్ని ప్రధాన తెగల ఆచార వ్యవహారాలను పరిశీలిద్దాం. మికిర్స్ తెగ ప్రజలు రెండు లక్షలు దాకా వుంటారు. వీరు శివసాగర్, నౌగాంగ్, కామరూప్, ఉత్తర కచార్ హిల్స్ జిల్లాలో వుంటారు. మికిర్స్ కష్టజీవులు. ఎంత బరువైనా వీపు మీద వేసుకొని మోస్తారు. శాంత స్వభావులు. మిగతా తెగలలో లాగా వీరిలో వీరు కలహించుకోవటం వుండదు. మైదాన ప్రాంతానికి దూరంగా దట్టమైన అడవులలో వుంటారు. విద్యా విషయంగా వీరు చాలా వెనుకబడి వుంటారు. క్రైస్తవ మిషనరీలు ఈప్రాంతంలో మిగతా తెగల ప్రజలకు విద్య నేర్పగలిగారు గాని ఈ మికిర్స్ మారుమూల అడవుల్లో వుండటంతో వీరి జోలికి పోలేదు

మికిర్స్ ప్రధాన ఆహారం వరి. వ్యవసాయం చేస్తారు. పట్టుపురుగులు అమిత ఇష్టంగా తింటారు మికిర్స్. వీరిలో బాల్య వివాహాలు కానరావు. వివాహాలు ఆడపిల్ల ఇష్టం ప్రకారం మాత్రమే జరుగుతాయి. పెద్ద వాళ్ళ జోక్యం ఉండదు. వీరిలో బహుభార్యాత్వం కూడా లేదు. విడాకులు అరుదుగా తీసుకుంటారు. విధవా వివాహాలు అనుమతించబడతాయి. వీరిలో స్త్రీలకు ఆస్తి హక్కు లేదు. పుత్ర సంతానం లేకపోతే ఆస్తి మొగ వారసులకు పోతుంది. వీరిలో విగ్రహారాధన లేదు. గుళ్ళు గోపురాలు వుండవు. అర్నంకతే అనే దేవుడికి పందులను బలి ఇస్తారు. అర్నంకతే అంటే వారి భాషలో గొప్పదేవుడని అర్థం.

మికిర్స్‌లో శవదహనం ఆ తర్వాత ఉత్తర క్రియలు పెళ్ళికన్నా పెద్ద తతంగంతో వుంటాయి

దిమ్సాకవారీలు ఒక లక్షమంది దాకా వుంటారు వీరంతా ఉత్తరక చార్ జిల్లాలో వుంటారు. దిమ్సాకవారీలుకు పెద్ద చరిత్ర కూడా వుంది. బ్రిటిష్ వారు రాకముందు కచార్‌జిల్లా వీరి పాలనలో వుండేది అసలు వీరి స్వస్థలం చైనా అని అచ్చటనుంచి కొన్ని వేల సంవత్సరాల క్రితం ఇచ్చటకు వచ్చి స్థిరపడ్డారని చెబుతారు. వీరు తాము ప్రసిద్ధ బోడో తెగకు చెందిన వారమని గర్వంగా చెప్పుకుంటారు అహెూంరాజు రాజుల పాలనకు ముందు వీరి పాలన ప్రస్తుత శివసాగర్ నౌగాంగ్ ప్రాంతాలకు వ్యాపించి వుండేది ఆ రోజుల్లో వీరు మంచి నాగరికత, సంస్కృతి కల్గి వున్నట్లు దిమాపూర్‌లోని అవశేషాలు చెబుతాయి భారతంలోని హిడింబి, ఘటోత్కజుడు ఈ తెగకు చెందినవారే! 18వ శతాబ్దంలో ఈ తెగకు చెందిన వీరుడు తుల్‌రాం సేనాపతి ఆంగ్లేయుల్ని ధిక్కరించి కచార్ జిల్లాల 2000 చ॥ మై॥ ప్రాంతాన్ని 1850 దాకా పాలించారు బ్రిటిష్ వారు కూడా ఇతడితో రాజీ పడటమే గాకుండా ఇతడి అధికారాన్ని ఒప్పుకోక తప్పలేదు.

దింసాకవారీలు శాంతిప్రియులు. అయితే ఏ మాత్రం వీరికి కష్టం కల్గించినా రెచ్చిపోయి ఏ విధంగానైనా కక్ష తీర్చుకునే ధోరణిలో వుంటారు. దింసా ప్రజల్లో హెచ్చు మంది హిందువులు. వీరిలో పిల్లలు పుట్టని వారిని చాలా చులకనగా చూస్తారు. పిల్లలు లేని స్త్రీని సగ్రిమా(గొడ్రాలు) అని, పిల్లలు మొగవాడిని సగ్రిఫా(గొడ్డుమోతువాడు) అని బహిరంగంగానే హేళనగా పిలుస్తారు.

కుకే, జమీనాగా తెగల వారు రెండు లక్షలు వుంటారు. వీరు కూడా ఉత్తరకచార్ జిల్లాలోనే వుంటారు. ఈ తెగలపై క్రైస్తవ మత ప్రభావం హెచ్చుగా వుంటుంది. వీరిలో అత్యధికులు క్రైస్తవులైనా ఆచార వ్యవహారాలలో ప్రత్యేకంగా వుంటారు. జమీనాగాలలో ఒక వింత ఆచారం వుంది. ఈప్రజలలో 6, 7 సంవత్సరాలు దాటిన పిల్లలు ఆడపిల్లలైనా, మొగపిల్లలైనా - ఇంట్లో తల్లిదండ్రుల వద్ద పడుకోవటం నిషిద్ధం ఈ పిల్లలు పగలు పనిచేయటం, రాత్రి పూట పడుకోవటం కూడా గ్రామ సమిష్టి చావిడి (మోరంగ్) లో మాత్రమే భోజనానికి మాత్రమే ఇళ్ళకు వెళ్ళతారు ఈ మోరంగ్‌లో వీరికి పనులు నేర్పటానికి, కుస్తీలు పట్టటం, నృత్యం నేర్పటానికి ఉపాధ్యాయులు వుంటారు అదువలన ఈ తెగ పిల్లలు ఎంతో క్రమశిక్షణగా వుంటారు. పెద్దవారిని ధిక్కరించే ప్రసక్తే లేదు ఈ తెగలో వ్యభిచారం పెద్ద నేరం. అంతే గాక పెళ్ళి అయిన స్త్రీ పై ఎవరైనా అత్యాచారం చేస్తే ఆ స్త్రీ తరుపు బంధువులు అత్యాచారం చేసిన వాడ్ని బహిరంగంగానే బల్లెంతో పొడిచి చంపుతారు.

అస్సాంలో 1977 నుంచి 1985 వరకు ఒక మహోద్యమం జరిగింది. అస్సాం రాష్ట్రంలోకి ఇతరులు ముఖ్యంగా బెంగాలీలు, ముస్లింలు అక్రమ ప్రవేశం వలన తమ రాష్ట్రంలో తాము (అస్సామీలు) మూనారిటీలో పడిపోతున్నామని తమకు దక్కవల్సిన హక్కులు, సౌకర్యాలన్నీ ఇతరులు కాజేస్తున్నారని అస్సాం విద్యార్థులు బ్రహ్మాండమైన ఉద్యమం లేవదీశారు (అస్సాం జనాభాలో బెంగాలీలు ముస్లింలు 40 శాతంగా వుంటారు) ఈ ఉద్యమం నడిచిన 8 సంవత్సరాలు అస్సాంలో ప్రభుత్వం స్థంభించి పోయింది. ఈ ఉద్యమం కారణంగా 1981లో అస్సాంలో జనాభా లెక్కలు వేయటం కూడా జరగలేదంటే ఆ ఉద్యమం ఎంతఉధృతంగా జరిగిందో ఊహించవచ్చు. ఎట్టకేలకు 1985లో కేంద్ర ప్రభుత్వం అస్సాం విద్యార్థుల కోర్కెలను మన్నించి ఒక ఒప్పదం చేసుకున్నారు. ఆ తరువాత జరిగిన ఎన్నికలలో కాంగ్రెసు పార్టీ ఓడిపోయి అస్సాం విద్యార్థులు మద్దతు నిచ్చిన అస్సాంగణ సంగ్రామ్ పరిషత్ పార్టీ ఎన్నికలలో నెగ్గి ప్రఫుల్‌కుమార్ మహంత అస్సాం ముఖ్యమంత్రి అయ్యారు

అస్సాం అనేక తెగల, జాతుల కలయిక కావటంతో రాష్ట్ర సమైక్యతకు ప్రమాదంగా వుంది. ఇప్పటికే అనేక రాష్ట్రాలుగా చీలిన అస్సాంను మరిన్ని రాష్ట్రాలుగా వేయాలనే ఆందోళనలు బయలుదేరుతున్నాయి. అస్సాంలో ఉత్తర ప్రాంతంలో వున్న గిరిజనులుండే ప్రాంతాన్ని బోడోలాండ్‌గా ఏర్పరచాలని అఖిలబోడో విద్యార్థి సంఘం డిమాండ్ చేస్తోంది. ఇందుకోసం వీరు హింసాయుత పోరాటం జరుపుతున్నారు. కర్బి అంగలాగ్ జిల్లాలోని కర్బి గిరిజనులు ప్రత్యేక ప్రతిపత్తి కోరుతున్నారు. సిల్చార్ జిల్లా ఇంకా చుట్టుపట్ల వున్న బెంగాలీ భాష మాట్లాడే వారు తమకు ప్రత్యేక రాష్ట్రం కావాలని ఆందోళన చేస్తున్నారు. ఇవన్నీ ఇలా వుండగా అస్సాం సమైక్య విమోచన సంఘటన (U.L.F.A) సాయుధ పోరాటం చేపట్టి అస్సాం అస్సమీల దేనంటూ బ్రహ్మపుత్రలోయలో ఉద్యమం నడుపుతున్నారు.

బోడా నాయకుడు ఉపేంద్రనాథ్ బ్రహ్మ. కేంద్ర మాజీ న్యాయ శాఖామాత్యులు దినేష్ గోస్వామి మొదలగు వారు అస్సామీలే.

#  సిక్కిం

వైశాల్యం 7096 చదరపు కిలోమీటర్లు జనాభా - 4 లక్షల 3 వేలు రాజధాని - గాంగ్‌టోక్. వాడుక భాషలు - నేపాలీ, బూటియా, లెప్చా, హిందీ, లింబు (నేపాలీ, బూటియా, లెప్చా భాషలను సిక్కింలో అధికార బాషలుగా గుర్తించారు అయితే ప్రభుత్వ వ్యవహారాలన్నీ ఇంగ్లీషులోనే జరుగుతాయి)

తూర్పు హిమాలయాల్లో వుండే ఈ పర్వత రాష్ట్రం సిక్కింకు పడమర నేపాల్, ఉత్తరాన టిబెట్ (చైనా) తూర్పున భూటాన్, దక్షిణాన పశ్చిమ బెంగాల్ హద్దులుగా వుంటాయి.

చిన్న రాష్ట్రమైన సిక్కిం వైశాల్యం రీత్యా ఆంధ్రప్రదేశ్ వైశాల్యంలో 2.6 శాతం మాత్రంగానే వుంటుంది. అంటే సుమారుగా రంగారెడ్డి జిల్లా కన్నా ఇంకా తక్కువగా వుంటుంది. 4 లక్షల 3వేలు జనాభా మాత్రమే కల్గిన సిక్కిం మన రాష్ట్రాలన్నింటిలోకి అతి తక్కువ జనాభా కల్గిన రాష్ట్రం. సిక్కిం పొడవు 113 కిలోమీటర్లు కాగా వెడల్పు 64 కిలోమీటర్లు మాత్రమే. అయితే ఈ రాష్ట్రం దేశరక్షణ రీత్యా అతి కీలక ప్రాంతం ఇండియాకు టిబెట్‌కు ఈ రాష్ట్రం గుండా మాత్రమే దగ్గర మార్గం వుంది






సిక్కిం రాష్ట్రం అంతా పర్వతమయమే రాష్ట్ర వైశాల్యంలో మూడోవంతు అడవులు ఆక్రమించుకొని వుంటాయి. సిక్కింలోని పర్వతాలు సముద్ర మట్టానికి 8000 మీటర్ల ఎత్తున కూడా వుంటాయి. ప్రసిద్ధ కాంచన గంగ (ఎత్తు 8579 మీటర్లు) ఇక్కడ నుంచే ప్రారంభమవుతుంది. ప్రపంచంలోని ఎత్తైన పర్వత శిఖరాలలో కాంచన గంగది మూడో స్థానం. దట్టమైన అడవులతో కూడా నిండి వుండే సిక్కింలో నాణ్యమైన కలప దొరుకుతుంది సిక్కిం అడవులు ఎంత దట్టంగా వుంటాయంటే అసలు ఇప్పటికీ ఈ అడవుల లోపలికి వెళ్ళి

అటవీ సంపద ఎంతవుందో గుర్తించటం కూడా సాధ్యపడలేదు.

సిక్కిం అంటే లింబూ భాషలో "నూతన ప్రదేశం" అని అర్థం. టిబెట్ ప్రజలు సిక్కింను డెన్‌జాంగ్ (వరి పండే ప్రదేశం) అని పిలుస్తారు. సిక్కింను మొదట ఆక్రమించిన లెప్చాలు సిక్కింను నైమాఎల్ (స్వర్గం) అని పిలుస్తారు. మొట్టమొదటగా 9, 10 శతాబ్దాలలో అస్సాం నుంచి లెప్చా ప్రజలు సిక్కింకు వచ్చి స్థిరపడ్డారు. నూతన ప్రదేశానికి వచ్చారు కాబట్టి వారే ప్రదేశానికి సిక్కిం (నూతన ప్రదేశం) అని పేరు పెట్టారు. 16వ శతాబ్దంలో టిబెట్ నుంచి కొంతమంది లామాలు (మతాచార్యులు) ఇచ్చటకు వచ్చి బౌద్ధమత వ్యాప్తికై చాల కృషి చేశారు. 1642లో సిక్కింలో బౌద్ధమత వ్యాప్తి కోసం వచ్చిన ముగ్గురు లామాలు"యుక్సుం" అనే ప్రదేశంలో సమావేశమై సిక్కింకు ఒక రాజును ఏర్పాటు చేస్తే బాగుంటుందని తల పోసి రాజుకాగల వ్యక్తి కోసం దేశం అంతా గాలించారు చివరకు ఫుట్‌సాగ్ నంగ్యాల్ అనే బాలుడ్ని ఎంచుకున్నారు. ఈ కుర్రవాడే సిక్కింకు రాజుగా వుండటానికి తగిన వాడని భావించి అతడి చేత బౌద్ధమతం స్వీకరింపజేసి రాజుగా పట్టాభిషేకం చేయించారు. ఈ విధంగా చేస్తే సిక్కింలో బౌద్ధమత వ్యాప్తి చురుకుగా సాగుతుందని వారి ఆశయం. ఈ విధంగా రాజైన ఫుట్‌సాగ్ నంగ్సాల్ ఆ తరువాత అతడి వంశీకులే 1975 వరకూ సిక్కింకు రాజులుగా వుండేవారు. సిక్కింరాజును 'చోగ్యాల్' అంటారు.

1706లో మూడో నంగ్యాల్ పాలించే రోజుల్లో భూటాన్ సిక్కింను ఆక్రమించుకోగా టిబెట్ సిక్కింకు అండగా వచ్చి భూటాన్ సైన్యాల్ని తరిమివేసింది. తరువాత కూడా రెండుసార్లు భూటాన్ సిక్కింను ఆక్రమించి కొంత ప్రాంతం తన వశం చేసుకుంది. 18, 19 శతాబ్దాలలో నేపాల్ వారు అనేక మంది ఇచ్చటకు వచ్చి స్థిరపడ్డారు. ప్రస్తుతం ఈ నేపాలీ వారే సిక్కింలో అధిక సంఖ్యాకులు.

1975 వరకూ నంగ్యాల్ ఆధీనంలో రాజరికంగా వున్న సిక్కిం రక్షణ బాధ్యత భారత్‌పై వుండేది. సిక్కిం ప్రధానమంత్రిని నియమించే బాధ్యత కూడా ఇండియాకే వుండేది. 1975లో సిక్కింలో జరిపిన జనవాక్య సేకరణ ప్రకారం సిక్కిం భారతదేశంలో ఒక రాష్ట్రంగా చేరిపోయింది. చోగ్యాల్ వ్యవస్థ రద్దు చేయబడింది. భారత రాజ్యాంగ 38వ సవరణ ప్రకారం సిక్కిం భారత్‌లో 22వ రాష్ట్రంగా అవతరించింది.

సిక్కిం జనాభాలో నేపాలీలు 74 శాతం మంది. లెప్చా ప్రజలు 18 శాతం. మిగతా వారు భూటాన్ వారు నేపాలీ వారంతా హిందువులు. మిగతా వారు బౌద్ధులు.

సిక్కింలో వర్షం సంవత్సరానికి 127 సెం..మీ నుంచి 600 సెం.మీ. వరకూ

ఆయా ప్రదేశాలలో పడుతుంది. మే నుంచి సెప్టెంబరు వరకూ వర్షాకాలం. తీస్త, రంజిత్ వాటి ఉపనదులు సిక్కింలో ప్రవహిస్తాయి. తీస్త నది జీవనది. ఈ నది వర్షాధారంగానే కాకుండా మంచు కరిగికూడా ప్రవహిస్తూ వుండటం వలన ఎల్లప్పుడూ పుష్కలంగా నీరు వుంటుంది.

సిక్కింలో శీతోష్ణస్థితి కూడా ఒక రకంగా వుండదు మైదానం, లోయ ప్రాంతాలలో వేడి హెచ్చుగా వుంటుంది పర్వత ప్రాంతాలలో చలి ఎక్కువగా వుంటుంది కొన్ని పర్వత ప్రాంతాలలో సంవత్సరంలో ఎక్కువ రోజులు మంచు పడుతూనే వుంటుంది.

సిక్కిం నాలుగు జిల్లాలుగా విభజించబడి వుంటుంది అవి తూర్పు జిల్లా (ముఖ్య పట్టణం గాంగ్‌టాక్) ఉత్తరజిల్లా (ముఖ్యపట్టణం మన్‌గాన్) దక్షిణ జిల్లా ( ముఖ్యపట్టణం నామేచి) పశ్చిమ జిల్లా (ముఖ్యపట్టణం గ్యాల్‌షింగ్)

సిక్కిం అసెంబ్లీ నేపాలీ, లెప్చా, బూటియా భాషలను అధికార భాషలుగా గుర్తించింది. అయితే ఈ మూడు భాషల్లో నేపాలీ భాష నే ఎక్కువ మంది మాట్లాడతారు. నేపాలీ భాష ఇండో ఆర్యన్ కుటుంబానికి చెందిన భాష. నేపాలీ భాషలో జానపద సాహిత్యం విరివిగా వుంటుంది. 18వ శతాబ్దంలో నేపాలీలో పద్యరచనలు ప్రారంభమయినాయి. ప్రాచీన నేపాలీ భాషలో చెప్పుకోదగిన సుభానందదాస్. 18వ శతాబ్దంలో సంస్కృతం నుంచి అనేక కావ్యాలు నేపాలీలోకి తర్జుమా చేయబడినాయి. గోపికాస్తుతి, శ్రీమద్‌భాగవత్ నేపాలీలో అనువదించబడిన రచనలు. ఆ తర్వాత బసంత శర్మ అనే కవి కృష్ణ చరితను ఖండకావ్యంగా వ్రాశాడు. భానుభక్త్ అనే మరో నేపాలీ కవి ఆధ్యాత్మ రామాయణాన్ని నేపాలీలోకి తర్జుమా చేశాడు. ఆధునిక నేపాలీ సాహిత్యంలో నాటకాలు, నవలలు, చిన్నకథలు కూడా విరివిగానే వస్తున్నాయి. బాలకృష్ణశర్మ, రుద్రరాజాపాండే, శివకుమార్ పాండేలు ఆధునిక నేపాలీ రచయితలలో ప్రసిద్ధులు.

సిక్కిం భారత్‌లో రాష్ట్రంగా చేరక ముందు సిక్కింలో కాలేజి విద్య చదువుకోవటానికి సౌకర్యమే లేదు. ప్రాధమిక, మాధ్యమిక విద్య గరిపే కొద్ది స్కూళ్ళు మాత్రమే వుండేవి. 1976 తర్వాత అనేక స్కూళ్ళు ప్రారంభించబడినాయి. స్కూళ్ళకు వెళ్ళే విద్యార్థుల సంఖ్య 4 రెట్లు పెరిగింది. 1977లో ఒక కాలేజి కూడా స్థాపించబడింది. ఈ కాలేజి ఉత్తర బెంగాల్ విశ్వవిద్యాలయానికి అనుబంధంగా వుంటుంది. ప్రజల్లో అక్షరాస్యత వ్యాపింపచేయటానికి కేంద్ర ప్రభుత్వ సహాయంతో అనియత విద్యా ప్రణాళిక అమలు పర్చబడుతోంది. సిక్కిం ప్రజల్లో అక్షరాస్యులు 44 శాతం మంది

సిక్కిం ప్రజల ప్రధాన వృత్తి వ్యవసాయం. రాష్ట్ర జనాభాలో 90 శాతం మంది కి వ్యవసాయమే జీవనాధారం జొన్న, వరి, గోధుమ, బార్లీ పండుతాయి. నారింజ, యాలక వాణిజ్య పంటలు. దేశంలో కెల్లా ఎక్కువ విస్తీర్ణంలో యాలకులు ఇచ్చట నే పండించుతున్నారు. ఆపిల్, బంగాళా దుంపలు కూడా తగు మాత్రంగా పండుతాయి. సిక్కింలో సాగులో వున్న భూమి 2 1/2 లక్షల హెక్టార్లు. సిక్కిం అంతా కొండలు, లోయలు కావటంతో వ్యవసాయం అంతా పర్వత సానువులలో సాగుతుంది. ఆహార ధాన్యాల అధికోత్పత్తికి రాష్ట్ర ప్రభుత్వం అనేక పథకాలు చేబట్టింది. రైతులకు అనేక ప్రోత్సాహకాలు కల్పిస్తున్నారు. అయినా ఈ రాష్ట్రంలో తిండి గింజలకు కొరతగానే వుండటం వలన ఇతర రాష్ట్రాలనుంచి ఆహార ధాన్యాలు దిగుమతి చేసుకుంటారు.

సిక్కింలో టెమి, కెవ్‌జింగ్ అనే రెండు ప్రదేశాలలో 200 హెక్టార్లలో టీ తోటలు పెంచుతున్నారు. శ్రేష్టమైన ఈ టీని ఇతర దేశాలకు ఎగుమతి చేస్తారు. కాఫీతోటల పెంపకానికి కూడా ప్రయత్నాలు జరుగుతున్నాయి. దట్టమైన సిక్కిం అడవులలో అనేక రకాల కలప దొరుకుతుంది. ఉత్తర జిల్లా అంతా భీకర అరణ్యమే. ఈ అరణ్యంలో 4వేల రకాల వృక్షాలు వున్నాయి. వీటిలో కొన్ని అరుదైన రకాలు కూడా వున్నాయి. సిక్కిం అడవులలో దొరికే వెదురు ఇచ్చట ప్రజలకు అనేక విధాల ఉపయోగపడుతుంది. ప్రధానంగా ఇళ్ళు కట్టుకోవటానికే గాక చాపలు అల్లటానికి కూడా ఉపయోగిస్తారు. సిక్కిం ప్రజలు ఉపయోగించే వాయిద్యాలు కూడా వెదురుతోనే తయారు చేసుకుంటారు. సిక్కిం ప్రజలు వెదురు చిగుళ్ళతో ఆహార పదార్థాలు కూడా తయారు చేసుకుంటారు. ఇక్కడ దొరికే వెదురులో 20 రకాలు వుంటాయి.

సిక్కిం పారిశ్రామికంగా వెనుకబడిన ప్రాంతంగా గుర్తించబడింది. సిక్కింటానరీస్, సిక్కిం ఫ్లోర్‌మిల్స్, సిక్కిం టైం కార్పొరేషన్, ఫుడ్ ప్రిజర్వేషన్ ఫ్యాక్టరీ, హెచ్.యం.టి. అసెంబ్లీ యూనిట్‌లు చెప్పుకోదగిన పరిశ్రమలు. ఇంకా కొద్దిగా చిన్న పరిశ్రమలు కూడా వున్నాయి.

సిక్కింలో 400 గ్రామాలు దాకా వుంటాయి. రాజధాని గాంగ్‌టోక్ తప్ప చెప్పుకోదగిన పట్టణాలు ఏమీ లేవు. రాష్ట్ర జనాభాలో 95 శాతం మంది గ్రామాల్లోనే నివసిస్తున్నారు. 70 శాతం గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా వుంది. సగటున ప్రతి మూడు గ్రామాలకు ఒక పోస్టాఫీసు వుంది.

సిక్కిం చిన్న రాష్ట్రమైన చూడదగిన ప్రదేశాలు కొన్ని వున్నాయి. రాష్ట్ర రాజధాని గాంగ్‌టోక్ (జనాభా 20 వేలు) ముందు చూద్దాం. గాంగ్‌టాక్ సముద్ర

మట్టానికి 1600 మీటర్ల ఎత్తులో ప్రసిద్ధ కాంచనగంగ శిఖరాల నేపధ్యంలో చూడచక్కని సుందర పట్టణం గాంగ్‌టాక్ అంటే కొండపైన పట్టణం అని అర్థం ఈ పట్టణానికి 200 సంవత్సరాలలోపు చరిత్ర వుంది అయినా త్వరగా అభివృద్ధి చెందిన పట్టణం. పట్టణంలో ఎక్కడ చూసినా బౌద్ధమత జెండాలు రెపరెపలాడుతూ వుంటాయి రోడ్డుకు ఇరువైపులా కూడా ఈ జెండాలే కానవస్తాయి మిట్టపల్లాలున్న లోయలతో, పూతోటలు, వృక్షాలతో నిండి, ఆహ్లాదకర వాతావరణంలో పగోడాల ఆకారంలో కానవచ్చే ఇళ్ళతో గాంగ్‌టాక్ సినిమా తీయటానికి వేసిన సెట్టింగ్‌లాగా వుంటుంది. గాంగ్‌టాక్‌లో ముఖ్యంగా చూడదగినది "రీసెర్చి ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టిబెటాలజీ" టిబెట్ భాష, నాగరికత, సంస్కృతి, చరిత్రకు సంబంధించిన ఈ కేంద్రంలో అనేక సంస్కృత, టిబెటన్, లెప్చా గ్రంధాలు వున్నాయి. అనేక ప్రాచీన వస్తువులు, అరుదైన నాణాలు, బౌద్ధమత పూజా విధానానికి సంబంధించిన అపురూప వస్తువులు, బౌద్ధమతకళాఖండాలు అనేకం ఇక్కడ చూడవచ్చు 1958లో ఈ కేంద్రాన్ని భారత ప్రధమ ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ ప్రారంభించారు. బౌద్ధమతంపై పరిశోధన చేసే పండితులకు ఇదొక విజ్ఞాన ఖని. టిబెట్‌కు సంబంధించిన ఇటువంటి కేంద్రం మన దేశంలో మరెక్కడా లేదు.

గాంగ్‌టాక్ పట్టణానికి చివర మాజీరాజు నంగ్యాల్ నివసించే భవంతి వుంటుంది. రాజభవనం వెనకాల తుస్కాల కాంగ్ అనే ప్రసిద్ధ బౌద్ధ దేవాలయం వుంది. బ్రహ్మాండమైన శిల్పకళానైపుణ్యంతో నిర్మించబడిన ఈ బౌద్ధాలయం లోగడ సిక్కిం రాజుల ప్రార్ధనా మందిరంగా వుండేది. రాజుల పట్టాభిషేకం, రాజ కుటుంబంలోని వివాహాలు ఇక్కడే జరిగేవి. ఇక్కడ వివిధ భంగిమలలో వున్న బుద్దదేవుని విగ్రహాలు చూడదగినవి. రాజభవంతి దగ్గరలోనే అసెంబ్లీ హాలు కూడా వుంటుంది. 100 సంవత్సరా లక్రితం నిర్మించిన "ఎంచో" బౌద్ధారామం గాంగ్‌టాక్‌లో చూడదగిన మరొక ముఖ్య విశేషం. ఎంచో అనగా ఉన్నత ప్రశాంత ప్రదేశం అని అర్థం పేరుకు తగ్గట్టుగానే పట్టణానికి 3 కిలోమీటర్ల దూరంలో పర్వతంపై నిర్మించబడిన ఈ బౌద్ధారామం ప్రశాంత వాతావరణంలో అలరారుతూ వుంటుంది. ఇందులో పెద్ద లైబ్రరీ వుంది. ఈ బౌద్ధారామంలో ముసుగు నృత్యం (మాస్క్‌డాన్స్) లో ఉపయోగించే మాస్కులు ఉంచబడతాయి గాంగ్‌టాక్‌లో ఇంకా డీర్‌పార్క్, ప్రభుత్వ కుటీర పరిశ్రమల కేంద్రం చూడదగిన ప్రదేశాలు. ఈ కుటీర పరిశ్రమల కేంద్రంలో సిక్కిం ప్రజల తయారు చేసే చేతి వస్తువులన్నీ చూడవచ్చు ఖరీదు కూడా చేయవచ్చు. తివాచీల దగ్గర నుంచి కొయ్య, వెదురులతో చేసిన రకరకాల వస్తువులన్నీ ఇక్కడ దొరుకుతాయి.

గాంగ్‌టాక్‌కు 24 కిలోమీటర్ల దూరంలో రుంటెక్ వుంటుంది. ఇక్కడ 18వ శతాబ్దంలో నిర్మించబడిన గొప్ప బౌద్ధారామం వుంది. దీన్ని రుంటెక్ ధర్మ చక్ర కేంద్రం

అంటారు రః బౌద్ధారామాన్ని టిబెట్‌లోని కగ్యూ బౌద్ధారామం నమూనాలో నిర్మించారు. కగ్యూప తెగ బౌద్ధ గురువు ఆశ్రమంగా దీన్ని నిర్మించారు. ఈ తెగ బౌద్ధ గురువుని 'గైల్వాకర్మప' అంటారు. 18వ శతాబ్దంలో టిబెట్‌ను చైనా ఆక్రమించుకోగా గైల్వాకర్మప ఇక్కడ ఆశ్రయం పొంది ఈ బౌద్ధారామాన్ని నిర్మించాడు దీన్ని 150 మంది లామాలు వుండటానికి వీలుగా ప్రశాంత వాతావరణంలో నిర్మించబడింది ఈ బౌద్ధాలయంలో అనేక అరుదైన బౌద్ధమత విశేషాలు, వస్తువులు భద్రపర్చబడినాయి.

గాంగ్‌టాకుకు పశ్చిమంగా సముద్రమట్టానికి 2085 మీటర్ల ఎత్తులో 'పెమయాంగ్సే' బౌద్ధారామం వుంటుంది. ఈరాష్ట్రంలోని పెద్ద బౌద్ధా రామాల్లో ఇది రెండోది. సిక్కిం మొదటి నంగ్యాల్‌చే కట్టించబడింది. ఇక్కడ నుంచి చూస్తే కాంచన గంగ అతి మనోహరంగా సాక్షాత్కరిస్తుంది. ఈ బౌద్ధారామం అనేకసార్లు భూకంపాల కారణంగా విధ్వంసం కాగా మళ్ళీ మళ్ళీ పునర్నిర్మించారు.

పెమయాంగ్సే బౌద్ధాలయానికి కొద్ది కిలోమీటర్ల దూరంలో వుండే తాషిడింగ్ గ్రామంలో ఒక కొండపై తాషిడింగ్ బౌద్ధారామం వుంది. తాషిడింగ్ గ్రామం నుంచి కొండపై బౌద్ధారామం చేరటానికి కాలినడకన ఒక రోజు పడుతుంది. ఈ తాషిడింగ్ బౌద్ధాలయం సిక్కింలో వున్న అన్ని బౌద్ధాలయాల్లోకి పవిత్రమైనదిగా భావిస్తారు. వసంత రుతువులో ఇక్కడ జరిగే ఉత్సవాలలో పాల్గొనటానికి వేలాది బౌద్ధులు ఇక్కడకు వస్తారు

పర్వతారోహకులకు సిక్కిం అన్ని విధాలా అనుకూల ప్రదేశం. హిమాలయ పర్వతారోహకులు అనేక మంది జట్లుజట్లుగా ఫిబ్రవరి, మార్చి, ఏప్రిల్, మే మాసాల్లోనూ, అక్టోబరు, నవంబరు, డిశంబరు మాసాల్లోనూ ఇక్కడకు వస్తారు. యక్సుం, జొంగ్రి ప్రాంతాలనుంచి ఈ పర్వతారోహకుల బృందాలు బయలు దేరి వెళతారు. యక్సుం, పర్వతారోహకులు బయలు దేరే ప్రదేశమేగాక 17వ శతాబ్దంలో టిబెట్ నుంచి వచ్చిన ముగ్గురు లామాలు సమావేశమై సిక్కిం రాజు ఎంచుకున్న ప్రదేశంగా కూడా ప్రసిద్ధి చెందింది. యక్సుంకు కొద్ది కిలోమీటర్ల దూరంలోనే జొంగ్రి వుంటుంది. ఈ రెండు ప్రదేశాలు పశ్చిమ జిల్లాలో వుంటాయి. జొంగ్రి నుంచి చూస్తే కాంచన గంగ అల్లంత దూరంలో అయిదు శిఖరాలతో తళతళా మెరుస్తూ కనువిందు చేస్తుంది.

సిక్కిం ప్రజలు – నేపాలీలు, లెప్చాలు, బూటియా వారు, వీరంతా కొన్ని శతాబ్దాల క్రిందట యితర చోట్ల నుంచి ఇక్కడకు వచ్చి స్థిరపడిన వారే. మొట్టమొదటగా వచ్చిన వారు లెప్చాలు. తరువాత బూటియాలు నేపాలీలు వచ్చారు. లెప్చాలు అస్సాంలోని కొండ ప్రాంత ప్రజలను పోలివుంటారు. శాంత స్వభావం కల్గిన వారు మారుమూల

ప్రాంతాలలో వుండటానికి ఇష్టపడతారు ఎక్కువగా అడవుల్లో వుంటారు. వన్యమృగాలన్నా, పశుపక్ష్యాదులన్నా అభిమానం చూపిస్తారు లెప్చాలలో అధిక సంఖ్యాకులు బౌద్ధులు బూటియాలు కూడా దాదాపు లెప్చాలు లాగానే వుంటారు బూటియాలకు లెప్చాలకు సత్సంబంధాలు కూడా వుంటాయి. బూటియాలు వ్యవసాయదార్లు, గొర్రెలకాపర్లు వీరిలో కొంతమంది వ్యాపారులు కూడా వుంటారు. టిబెట్ నుంచి వచ్చిన ఈ బూటియాలు నింగ్ మాపా అనే బౌద్ధ తెగకు చెందిన వారు. టిబెట్‌లో దలైలామా వ్యవస్థ ఏర్పడక ముందు ఈ నింగ్ మాపా తెగవారే టిబెట్‌లో అధికారం చెలాయిస్తూ వుండేవారు బూటియాలలో మతాభిమానం హెచ్చుగా వుంటుంది. నిత్యకృత్యాలలో మతాచారాలను ఖచ్చితంగా పాటిస్తారు వీరంతా బౌద్ధులే ఈమధ్యన నేపాల్ నుంచి వచ్చిన నేపాలీలలో అత్యధికులు హిందువుల. వీరంతా కూడా కష్టజీవులు వ్యవసాయదారులు. హిందూమత విశ్వాసాలకు కట్టుబడి వుంటారు

వీరుగాక మగార్లు. లింబు లేక సాంగ్లు అనేక జాతి ప్రజలు కూడా సిక్కింలో వున్నారు. లెప్చాలు, బూటియాలు, నేపాలీలు ఇక్కడకు రాకముందు నుంచి ఈ మగార్లు, సాంగ్లు ప్రజలు ఇచ్చట వున్నారు. వీరిని సిక్కిం స్థానిక ప్రజలని కూడా చెప్పవచ్చు కొన్ని వందల సంవత్సరాల క్రిందట లింబు ప్రజలు 'లింబు వానా' అనే రాజ్యం కూడా ఏర్పర్చినట్లు చారిత్రక ఆధారాలున్నాయి ఈ లింబు వానా ప్రాంతం ప్రస్తుతం కొంతభాగం నేపాల్‌లో వుంది.

ప్రస్తుతం సిక్కింలో హిందువులు అధిక సంఖ్యాకులైన అనేక శతాబ్దాలుగా ఈ ప్రదేశంలో బౌద్ధ మతం ప్రబలంగా వుండటం వలన సిక్కింలో ఎక్కడ చూసినా బౌద్ధమత ఛాయలే కన్పిస్తాయి. సిక్కిం అంతటా 70 దాకా బౌద్ధారామాలు వున్నాయి. ఇంకా చిన్నా పెద్దా 150 దాకా ఆలయాలు కూడా వున్నాయి. చోగ్యాల్ రోజుల్లో సిక్కింలో మహయాన బౌద్ధమతం అధికారమతం గా వుండేది 18వ శతాబ్దంలో మహాగురు పద్మ సంభవ అనే బౌద్ధ గురువు ఈ మత వ్యాప్తికి విశేషంగా కృషి చేశాడు. ఈయన భారతదేశం నుంచి వెళ్ళి అక్కడ స్థిరపడినవాడే. సిక్కిం ప్రజలు ఇతడ్ని రెండవ బుద్ధుడిగా భావించేవారు. ఇప్పటికే సిక్కిం బౌద్ధ మహాగురు పద్మసంభవుడ్ని బుద్ధుని అవతారంగానే భావించి పూజించుతారు. సిక్కిం దేవాలయాల్లో ప్రత్యేకంగా చెప్పుకోదగిన విశేషం ఏమంటే ఆలయ పూజారులలో స్త్రీలు కూడా వుంటారు. ఆలయ పూజారులంటే సిక్కిం ప్రజలు పరమ భక్తి శ్రద్ధలతో వుంటారు.

సిక్కిం చేతి పనులకు ప్రసిద్ధి. దుప్పట్లు, రగ్గులు, శాలువాలు, చర్మ వస్తువులు, వెదురు, కొయ్యతో చేసిన రకరకాల చేతి వస్తువులు ఇచ్చట దొరుకుతాయి. సిక్కిం

ఆర్థిక వ్యవస్థలో చేతి పనుల పరిశ్రమ ప్రధాన స్థానం వహిస్తుంది.

సిక్కిం ప్రజలు అనేక రకాల పండుగలు చేసుకుంటారు. అసలు సంవత్సరం పొడవునా ఎప్పుడూ ఏదో ఒక పండుగ, ఉత్సవం, జాతర సాగుతూనే వుంటాయి. వీరు జరుపుకునే పండుగలన్నింటిలోకి 11 పంగలాబ్సాల్ ముఖ్యమైనది. ఆగస్టు, సెప్టెంబరు మాసాల్లో జరుపుకునే ఈ పండుగ సిక్కిం ప్రజలు తమ ఆరాధ్య దేవతగా భావించే కాంచనగంగను ప్రార్థించే పండుగ కాంచనగంగ నీడల్లో బ్రతుకు సాగించే సిక్కిం ప్రజలు కాంచన గంగే తమను రక్షించే దేవతా మూర్తిగా భావిస్తారు. తమ సిరి సంపదలు, ఆయురారోగ్యాలు కాపాడే దేవతగా కాంచన గంగను కొలుచుకుంటారు. ఈ పండుగ ప్రారంభమయ్యే 15 రోజుల ముందునుంచి పండుగ సన్నాహాలు ప్రారంభించుతారు. పండుగ రోజున నృత్యం చేసే లామాలు 15 రోజుల ముందునుంచి అన్ని విషయాల్లోను పరమ నిష్ఠగా గడుపుతారు. పండుగ వారం రోజుల ముందునుంచి పెమయాంగ్ట్సే బౌద్ధారామంలో ప్రత్యేక ప్రార్థనలు చేస్తారు ఇక పండుగ రోజు లామాలు రకరాల ముసుగులు (మాస్క్) ధరించి యుద్ధ నృత్యాలు చేస్తారు. కత్తులు, బల్లేలు, ధరించి గాలిలో ఊపుతూ యుద్ధం చేస్తున్నట్లు అభినయిస్తారు. దీని అర్థం ఏమంటే కాంచన గంగ దేవత ఈ రూపాల్లో అవతారమెత్తి చెడుని జయించి ధర్మ రక్ష చేస్తుందని భావం.

డిసెంబరులో జరుపుకునే కగ్యత్ నృత్యం కూడా చెడుపై మంచి గెలవాలనే ఉద్దేశ్యంతో జరుపుకునే పండుగ. ఈ పండుగ రోజున పిండి, కొయ్య, కాగితంతో పెద్ద పెద్ద దిష్టిబొమ్మలు తయారుచేసి తగుల బెడతారు. దుర్మార్గాన్ని అణిచివేయటంగా దీన్ని భావిస్తారు. ఈ విధంగా దిష్టిబొమ్మలు తగుల బెట్టిన తర్వాత హాస్యగాళ్లు విచిత్ర వేషాలుతో నృత్యం చేస్తూ జనాన్ని ఆనందపరుస్తారు. ఈ కగ్యత్ నృత్యం పండుగ తర్వాత సిక్కిం ప్రజల నూతన సంవత్సరం వస్తుంది. వ్యవసాయ దారులకు కొత్త పంటలు ఈ రోజుల్లోనే చేతికి వస్తాయి. ఇళ్ళలో పిండి వంటలు చేసుకొని అతిధులకు భోజనాలు పెడతారు. యువకులు విలువిద్య ప్రదర్శించటం ద్వారా నూతన సంవత్సరం సంబరంగా చేసుకుంటారు.

సిక్కింలోని హిందువులు చేసుకునే పెద్ద పండుగ దసైన్. దుర్గాష్టమినే సిక్కిం ప్రజల దసైన్ అని పిలుస్తారు. దసైన్ రోజున మేకలను గొర్రెలను బలియిస్తారు. కుటుంబ పెద్దలు పిన్నలకు తిలకం (దీన్ని వారు 'తికా' అంటారు) దిద్దుతారు. బంధుమిత్రుల ఇళ్ళకు వెళ్లి తిలకం పెట్టి శుభాకాంక్షలు తెలియజేస్తారు. సిక్కిం హిందువులు దీపావళిని కూడా ఘనంగా చేసుకుంటారు. ఈ పండుగ రోజున పిల్లలు, పెద్దలు వృద్ధులు కూడా పాటలు పాడుతూ ఇంటింటికి తిరిగి కానుకలు వసూలు చేస్తారు. దీన్ని వారు "భాయిలో" అంటారు.

సిక్కిం ప్రజలు కష్ట జీవులు శాంతస్వభావులేగాక చీకూచింతా లేకుండా నిరంతరంఉల్లాసంగా వుండే స్వభావం కలవారు కూడా రాష్ట్రంలో ప్రధాన తెగలైన లెప్చా, బూటియా, నేపాలీ ప్రజలు ఎంతో అన్యోన్యంగా కలిసి మెలిసి వుంటారు నేపాలీ హిందువులు చేసుకునే పండుగలలో లెప్చాలు, బూటియాలు పాల్గొనడం, అలాగే లెప్చా, బూటియా బౌద్ధమత ఉత్సవాలలో నేపాలీలు పాల్గొనటం సర్వసాధారణంగా కానవస్తుంది

అసంఖ్యాకమైన పర్వత శిఖరాలు, లోయలు కీకారణ్యాలతో సిక్కిం టూరిస్టులకు విచిత్రానుభూతి కల్గిస్తుంది. అసలు ఒక్క చదరపు కిలోమీటరు నేల కూడా చదునుగా వుండదు. అంతా మిట్టపల్లాలు, లోయలు, కొండలే! ఈ కొండలు సముద్ర మట్టానికి 244 మీటర్ల నుంచి 8000 మీటర్ల ఎత్తు వరకూ వుంటాయి. ఈపర్వత సానువులలోనే వ్యవసాయ పొలాలు వుంటూ యాత్రికులకు ఆహ్లాదం కల్గిస్తాయి. ఇక్కడ వాతావరణం కూడా విచిత్రంగా వుంటుంది. కొంచెం చదునుగా వుండే ప్రాంతాలలో వేడి హెచ్చుగా వుంటుంది ఎత్తయిన పర్వత ప్రాంతాలకు వెళ్ళే కొద్దీ శీతలం హెచ్చుగా వుంటుంది. ఇంకా కొంచెం పైకి వెళ్ళితే నిరంతరం మంచు ప్రాంతమే !

సిక్కిం రాజకీయ ప్రముఖులలో చెప్పుకోదగినవారు సిక్కింకు చాలా కాలం ముఖ్యమంత్రిగా వున్న కాజీలెండుప్‌దోర్జీ. ఈయన కొంతకాలం రంటెక్ బౌద్ధారామం ప్రధాన లామాగా కూడా వున్నారు.

# 20 అరుణాచల్ ప్రదేశ్

వైశాల్యం - 88743 చదరపు కిలోమీటర్లు. జనాభా - 8 లక్షల 58 వేలు. రాజధాని - ఈటా నగర్. మాట్లాడే భాషలు - మొంపా, అకా, నిషి, మిజి వగైరా

అరుణాచల్ ప్రదేశ్‌కు పడమర భూటాన్, ఉత్తరాన చైనా, తూర్పున బర్మా దేశాలు దక్షిణాన అస్సాం, నాగాలాండ్ రాష్ట్రాలు సరిహద్దులుగా వుంటాయి. ఈ విధంగా మూడు వైపులా చైనా, భూటాన్, బర్మాలతో అంతర్జాతీయ సరిహద్దులు కల్గిన అరుణాచల్ ప్రదేశ్ మన దేశ రక్షణ రీత్యా కీలక ప్రదేశంలో వుంటుంది.

అరుణాచల్ ప్రదేశ్‌లో జనాభా తక్కువైనా వైశాల్యం మాత్రం ఎక్కువగానే వుంటుంది. దాదాపు పశ్చిమ బెంగాల్ వైశాల్యం అంత వుంటుంది. అస్సాం నుంచి విడిపోయిన ఈ రాష్ట్రం అస్సాం వైశాల్యం కన్నా పెచ్చుగా వుంటుంది. మన రాష్ట్రంతో పోల్చితే మన రాయలసీమ జిల్లాల కన్నా ఇంకా కొంచెం హెచ్చుగా వుంటుంది.



అరుణాచల్ ప్రదేశ్ అనగా ఉదయిస్తున్న సూర్యుని ప్రదేశం భారత్‌కు పూర్తిగా తూర్పు దిక్కున వున్న ఈ రాష్ట్రంలో సూర్యుడు ప్రప్రథమంగా ఉదయిస్తాడు

హిమాలయ పర్వతాలకు దిగువన వుండే అరుణాచల ప్రదేశ్ అంతా కొండ ప్రాంతమే. కొద్ది ప్రాంతం మాత్రమే చదునుగా వుంటుంది. రాష్ట్ర వైశాల్యంలో 64 శాతం కొండలు అడవులే వుంటాయి అస్సాం వైపున వుండే ప్రాంతం మాత్రమే చదునుగా వుంటుంది

హిమాలయ పర్వతాలవైపు నుంచి మంచుకరిగి కొండలపై నుంచి విపరీతమైన వేగంతో జలపాతాలుగా పడుతూ వుంటాయి అందువలన ఈ రాష్ట్రంలో జల విద్యుచ్ఛక్తి ఉత్పత్తికి ఎక్కువ అవకాశాలు వున్నాయి. బ్రహ్మపుత్ర నది ఈ రాష్ట్రం గుండా ప్రవహిస్తుంది.

అరుణాచల్‌ప్రదేశ్ మన దేశం స్వతంత్రం అయినప్పుడు అస్సాంలో భాగంగా వుండేది. దేశ రక్షణ రీత్యా 1948లో ఈ ప్రాంతాన్ని అస్సాం నుంచి వేరు చేసి నార్త్ ఈస్ట్ ఫ్రాంటియర్ ఏజన్సీ పేరుతో కేంద్ర ప్రభుత్వ ఆధీనంలో వుంచబడింది. 1972లో దీన్ని అరుణాచల్‌ప్రదేశ్ పేరుతో కేంద్రపాలిత ప్రాంతంగా చేశారు. 1987లో అరుణాచల్ ప్రదేశ్‌ను భారత్‌లో 24వ రాష్ట్రంగా పూర్తి ప్రతి పత్తి గల రాష్ట్రంగా ఏర్పరిచారు.

అరుణాచల్ ప్రదేశ్ 10 జిల్లాలుగా విభజించబడి వుంటుంది. (1) తూర్పు కామెంగ్ (2) పశ్చిమ కామెంగ్ (3) దిగువ సుబాన్‌సిరి (4) ఎగువ సుబాన్‌సిరి (5) పశ్చిమ జియాంగ్ (6) తూర్పు జియాంగ్ (7) దిబాన్ వాలీ (8) లోహిత్ (9) తిరాప్ (10) తవాంగ్.

అరుణాచల్‌ప్రదేశ్ రాజధాని ఈటానగర్‌లో అరుణాచల్ ప్రదేశ్ విశ్వవిద్యాలయం వుంది

అరుణాచల్ ప్రదేశ్‌లో షెడ్యూల్ తెగలవారు అత్యధికంగా వుంటారు. రాష్ట్ర జనాభాలో 80 శాతం మంది షెడ్యూల్ తెగల వారే! రాష్ట్ర ప్రజల్లో 68 శాతం మంది హిందువులు. బౌద్ధులు 12 శాతం మంది. మిగతావారు క్రైస్తవులు, ముస్లింలు రాష్ట్ర జనాభాలో అక్షరాస్యతా శాతం 32 మాత్రం

అరుణాచల్ ప్రదేశ్ అసెంబ్లీలో 60 మంది సభ్యులు వుంటారు. ఈ రాష్ట్రానికి లోక్‌సభలో రెండు సీట్లు రాజ్యసభలో ఒక సీటు ఉంటుంది.

అరుణాచల్ ప్రదేశ్ పూర్తిగా వ్యవసాయిక రాష్ట్రం. 85 శాతం మంది ప్రజలకు

వ్యవసాయమే జీవనాధారం రాష్ట్రంలో లక్షన్నర హెక్టర్లభూమి సాగులో వుండగా ఇందులో నాలుగో వంతు పొలాలకు మాత్రమే సాగు నీటి సౌకర్యం వుంది. మిగతాది వర్షాధారంగా మాత్రమే పంటలు పండుతాయి మిగతా ఈశాన్య రాష్ట్రాల రైతులు చేసినట్లే ఇక్కడ రైతులు కూడా "జమింగ్" పద్ధతి వ్యవసాయం చేస్తారు. ఈ విధమైన వ్యవసాయం వలన అడవులు తరిగిపోవటమే గాక పంట దిగుబడి కూడా తక్కువగా వుంటుంది ఇప్పుడిప్పుడే ఇచ్చట రైతులు ఆధునిక వ్యవసాయానికి అలవాటుపడుతున్నారు. ఇచ్చట పండే ప్రధాన పంటలు వరి, జొన్న, గోధుమలు, ఆవాలు.

రాష్ట్రంలో అడవులు 60 వేల చదరపు కిలోమీటర్ల వైశాల్యంలో వుంటాయి. అటవీ సంపదపై ఈ రాష్ట్రానికి అధిక ఆదాయం వస్తుంది. ఈ అడవులలో శ్రేష్టమైన కలప దొరకటమేగాక అనేక రకాల ఇతర వస్తువులు కూడా దొరుకుతాయి. అరుణాచల్ ప్రదేశ్ అడవుల్లో అన్ని రకాల జంతువులు కానవస్తాయి. హిమాలయ నల్ల ఎలుగుబంటి, ఎర్రపాండా, కస్తూరి లేళ్ళను కూడా ఇక్కడ చూడవచ్చు. దేశం మొత్తం మీద కానవచ్చే 1000 కి పైగా పుష్ప జాతులలో 550 దాకా ఈ అడవుల్లో వుంటాయి. ఇందులో ప్రమాదభరితమైన పుష్పాలు కూడా వుంటాయి. వీటి వాసన చూస్తే స్పృహ తప్పిపడిపోతారు.

అరుణాచల్ ప్రదేశ్‌లో కలపకు సంబంధించిన మధ్య తరహా పరిశ్రమలు కొన్ని వున్నాయి బియ్యం మిల్లులు పండ్లను నిల్వ చేసే పరిశ్రమలు కూడా కొద్దిగా వున్నాయి. సిమెంటు, పేపర్ మిల్లులు నెలకొల్పటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి ఆయిల్ నిక్షేపాలు కనుగొనే ప్రయత్నాలు కూడా జరుగుతున్నాయి.

రాష్ట్ర రాజధాని ఈటానగర్‌లో ఈటాకోట చరిత్ర ప్రసిద్ధి చెందినది. ప్రస్తుతం ఇది శిధిలావశేషంగా వుంది ప్రస్తుతం ఈటానగర్ వున్న చోట పూర్వం (అంటే 11వ శతాబ్దంలో) ఈ ప్రాంతాన్ని పాలించిన జితారి వంశానికి చెందినరామచంద్రరాజు రాజధాని మాయాపూర్ వుండేది. ఆయన నిర్మించనదే ఈటానగర్ కోట.

లోహిత్ జిల్లాలోని పరశురాం సరస్సు పురాణ ప్రసిద్ధి చెందినది. ఈసరస్సును హిందువులు పవిత్రమైనదిగా భావిస్తారు మకర సంక్రాంతి రోజున వేలాది హిందువులు ఇచ్చట పుణ్యస్నానాలు చేస్తారు.

లోహిత్ జిల్లాలోనే మిస్మి కొండలకు దిగువన బిష్మక్‌నగర్‌లో ఒక పురాతన కోట శిధిలావస్థలో వుంది. ఈ కోట భారతకాలం నాటిదని చెబుతారు. ఇచ్చట ఒక శివాలయం కూడా వుంది

పశ్చిమ కామెంగ్ ముఖ్యపట్టణం బోండిలా. ఈ పట్టణం సముద్రమట్టానికి

2300 మీటర్ల ఎత్తున వుంటుంది ఈ బోండిలా పట్టణం చూడ చక్కని ప్రకృతి దృశ్యాలలో రమణీయంగా వుంటుంది ఇచ్చట ఒక బౌద్ధారామం వుంది జానపద, హస్తకళలకు చెందిన మ్యూజియం కూడా వుంది చైనా భారత్‌పై దండయాత్ర సమయంలో ఈ బోండిలా పట్టణం పేరు పేపర్లలో తరచుగా వినబడేది బోండిలాకు వెళ్ళేదారిలో తేజ్‌పూర్‌కు 65 కి మీ. దూరంలో టిపి దగ్గర పండ్లు, పూల పరిశోధనా కేంద్రం వుంది

కామెంగ్ జిల్లాలో ప్రసిద్ది తవాంగ్ బౌద్ధారామం వుంది. ఇది మహాయాన బౌద్ధులకు పవిత్ర క్షేత్రం. 17వ శతాబ్దంలో నిర్మించబడిన ఈ బౌద్ధారామంలో 500 మంది లామాలు వుండటానికి వసతి వుంది కొండల మధ్య గంభీరంగా కానవచ్చే ఈ బౌద్ధారామం ప్రధాన ఆలయం చుట్టూ 65 వసతి గృహాలు వుంటాయి ఈ బౌద్ధారామంలో బ్రహ్మాండమైన బుద్ధ విగ్రహం వుంది అనేక ప్రాచీన గ్రంధాలు ఇచ్చట గ్రంధాలయంలో వున్నాయి. ఇందులో సంస్కృతంలో రచించిన ప్రాచీన గ్రంధాలు కూడా వున్నాయి.

అరుణాచల్ ప్రదేశ్‌లో 3300 దాకా గ్రామాలు వుంటాయి ఒక్కో గ్రామం కొన్ని మైళ్ళ దూరంలో ఎడం ఎడంగా వుంటాయి. చిన్న గ్రామంలో 50, 60 ఇళ్ళు వుంటే పెద్ద గ్రామంల్లో 150 నుంచి 200 దాకా ఇళ్ళు వుంటాయి. ఈ రాష్ట్రంలో జనసాంద్రత చాల తక్కువ. మన ఆంధ్రప్రదేశ్ చదరపు కిలోమీటర్‌కు 195 మంది నివసిస్తు వుండగా ఈ రాష్ట్రంలో చదరపు కిలోమీటర్‌కు 8 మంది మాత్రమే ఉంటారు.

అరుణాచల్‌ప్రదేశ్ ప్రజలు 20 తెగలుగా వుంటారు. ఈ తెగల్లో ఇంకా అనేక ఉప తెగలు వున్నా ప్రధానంగా చెప్పుకోదగినవి 20 మాత్రమే. మోంపా, అకా, నిషి, తగిన్, మిస్మి మొదలైనవి ఈ తెగల పేర్లు. ఒక్కో తెగ ఆచార వ్యవహారాలు ఒక్కోరకంగా వుంటాయి. ఎవరి భాష వారిదే! మొంపాలు తవాంగ్, పశ్చిమ కామెంగ్ జిల్లాలో వుంటారు. వీరు బౌద్ధులు, లోహిత్, తిరాప్, సిమాంగ్ జిల్లాలలో కూడా బౌద్ధులు వున్నారు. నిష, ఆది, తెగల వారు సూర్యుడ్ని, చంద్రుడ్ని పూజిస్తారు. మిగతా తెగలలో ఎక్కువ మంది హిందువులు.

అరుణాచల్ ప్రదేశ్ తెగలలో పితృసామ్య వ్యవస్థ అమలులో వుంది హిందువుల ఆచారాలకు వీరి ఆచారాలకు పెద్దగా తేడా వుండదు. లోగడ ఈ తెగలలో బహుభార్యత్వం వుండేది. ప్రస్తుతం ఈ పద్ధతి క్రమేపీ తగ్గిపోతుంది బౌద్ధులు కాని మిగతా తెగలన్నింటి పైన హిందుమత ప్రభావం విశేషంగా వుంటుంది.

అరుణాచల్ ప్రదేశ్ ప్రజలకు నృత్యం చేయటం ఒక జీవన విధానంగా వుంటుంది. ఈ తెగలన్నీ నృత్యం అంటే అమిత ఇష్టపడతారు. కాస్తంత తీరిక దొరికనప్పుడల్లా నృత్యం చేస్తూ వుంటారు ఈ నృత్యాలలో వారు తమ గత చరిత్ర వారి తెగ వీరుల పౌరుష పరాక్రమాలు గురించి పాడుకుంటూ వుంటారు.

అరుణాచల్ ప్రదేశ్ హస్తకళలకు కూడా ప్రసిద్ధి బౌద్ధమతానికి సంబంధించిన బొమ్మలతో అల్లబడిన తివాచీలు, వెండి ఆభరణాలు, వెదురు బుట్టలు, కొయ్యతో చేసిన బొమ్మలకు ఈ రాష్ట్రం ప్రసిద్ధి.

# 21 మేఘాలయ

వైశాల్యం - 22429 చదరపు కిలోమీటర్లు జనాభా - 17 లక్షల 60 వేలు రాజధాని - షిల్లాంగ్ వాడుక భాషలు - ఖాసీ, గారో, ఇంగ్లీషు.

మేఘాలయకు ఉత్తరాన, తూర్పున అస్సాం, దక్షిణాన పడమర బంగ్లాదేశ్‌లు హద్దులుగా వుంటాయి.

వైశాల్యం రీత్యా మేఘాలయ విశాఖపట్నం, తూర్పుగోదావరి జిల్లా వైశాల్యం కన్నా ఇంకా కొంచెం మాత్రమే పెచ్చుగా వుంటుంది

మేఘాలయ అనగా "మేఘాల నిలయం" అని అర్థం. మేఘాలయలో ఆకాశం సంవత్సరంలో సగం రోజులు - ఏప్రిల్ నుంచి సెప్టెంబరు వరకూ - మబ్బులతో నిండి వుంటుంది. పైగా పర్వత ప్రాంతం కావటంతో కొండలపై దట్టమైన మేఘాలు చేతికి అందుతున్నట్లు తారాడుతూ కన్పించుతాయి. అందువల్ల ఈ రాష్ట్రానికి మేఘాలయ



అనే పేరు వచ్చింది. ఖాసీ, జయింటియా, గారో అనబడే మూడు కొండ తెగల ప్రజల కోసం ఈ మేఘాలయను 1972లో ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పర్చారు. మేఘాలయ అంతా కొండ ప్రాంతమే! ఖాసీ, జయింటియా కొండలు గారో కొండల కన్నా ఎత్తుగా వుంటాయి. కాసీ కొండలలో కెల్లా ఎత్తైన కొండ షిల్లాంగ్ శిఖరం (ఎత్తు 1967 మీటర్లు). మిగతా అనేక పర్వతాలు కూడా 1800 మీటర్లు ఎత్తు పైగా వుంటాయి. జయింటియా పర్వతాలలో ఎత్తైన శిఖరం మోర్సన్‌షి (ఎత్తు 1631 మీటర్లు) గారో పర్వతాలు ఖాసీ, జియంటియా కొండల కన్నా తక్కువ ఎత్తులో వుంటాయి. గారో కొండలను తురా కొండలని కూడా అంటారు. ఈ కొండలలో ఎత్తైన శిఖరం నాక్‌రెక్ (ఎత్తు 1457 మీటర్లు)

ఖాసీ కొండలలోనే ప్రపంచంలో కెల్లా అత్యధిక వర్షం పడే చిరపుంజి వుంటుంది. సంవత్సరానికి సగటున చిరపుంజిలో 12000 మిల్లీమీటర్ల వర్షం పడుతుంది. మన ఆంధ్రప్రదేశ్‌లో సగటు వర్షపాతం 1200 మిల్లీమీటర్లు. అంటే మన కన్నా చిరపుంజిలో పదిరెట్లు ఎక్కువ వర్షం పడుతుందన్న మాట! 1861 సంవత్సరంలో చిరపుంజిలో 22610 మిల్లీమీటర్ల వర్షం పడినట్లు చరిత్రలో నమోదైంది. అంతేగాక 1876వ సంవత్సరంలో ఆగష్టులో ఒకే రోజున ఏకధారగా 1150 మిల్లీమీటర్ల వర్షం పడినట్లు కూడా నమోదు కాబడింది. వీటన్నింటినీ మించి 1974 సంవత్సరంలో 25000 మిల్లీమీటర్ల వర్షం కురిసింది! అందువల్ల వాతావరణ శాస్త్రజ్ఞులు చిరపుంజిలో వర్షపాతాన్ని మిల్లీమీటర్లు, అంగుళాలు కన్నా అడుగులు, మీటర్లలో కొలవాల్సి వుంటుందని అంటారు. మేఘాలయలో అనేక నదులు ప్రవహిస్తూ వుంటాయి. మండా, ఉమియం, డామ్‌రింగ్, కిన్‌షి, కోపిలి మొదలైనవి. అయితే ఇవన్నీ చిన్న చిన్న నదులే. ఇందులో ఉమియం నదే కాస్తంత పెద్దది. విపరీతంగా వర్షాలు పడటమే గాక కొండలపై నుంచి కూడ ప్రవహిస్తూ ఉంటై కాబట్టి ఈ నదులు విపరీతమైన వేగంతో ప్రవహిస్తూ వుంటాయి. కొండలపై నుంచి దూకే ఈ నదులు ఒక్కొక్క చోట జలపాతాలుగా కూడా వుంటాయి. ఇటువంటిదే చిరపుంజిలో దగ్గరలో వుండే మాస్మాయ్ గ్రామం వద్ద నున్న నాషింగ్ తియాంగ్ జలపాతం. ఈ జలపాతం అత్యం మనోహరంగా వుండటమేగాక ప్రపంచంలో కెల్లా నాలుగవ ఎత్తైన జలపాతంగా కూడా ప్రసిద్ధి చెందింది.

మేఘాలయలోని ఖాసీ, గారో, జయింటియా ప్రజలకు సుదీర్ఘ చరిత్రే వుంది. కాని అది గ్రంధస్తం కాలేదు. ఈ తెగల ప్రజలు పూర్వం అహోం, కచారి రాజ్యాలలో భాగంగా వుండే వారని మాత్రమే తెలుస్తుంది. బ్రిటిష్ వారు ఇచ్చటకు వచ్చే నాటికి ఖాసీ ప్రజలు 25 తెగలుగా వుండేవారు. ఈ 25 తెగల ప్రజలు వారి వారి తెగ నాయకుల పాలన క్రింద వుండే వారు. ఈ తెగనాయకులు కొంతమంది వంశపారంపర్యంగానూ

మరికొంతమంది ఆయా తెగలలోని పురుషుల చేత ప్రత్యక్షంగా ఎన్నుకోబడేవారు. ఈవిధంగా ఇక్కడ ప్రజాస్వామ్యం.ఓట్లు పద్ధతి కూడా పూర్వం నుంచి వుందని చెప్పవచ్చును

జయంటియా ప్రజలు బ్రిటిష్ వారు రాక ముందు ఒకే రాజ్యం క్రింద వుండే వారు ఈరాజ్య ప్రజలు బ్రిటిష్ వారు వచ్చిన క్రొత్తలో బ్రిటిష్ సైనికులు కాళీ దేవాలయాన్ని ధ్వంసం చేస్తే వారిపై తిరగబడ్డారు అలాగే బ్రిటిష్ వారు జయింటియా ప్రాంతాన్ని స్వాధీనం చేసుకొని అంతకు పూర్వం ఈ ప్రజలు కనీవినీ ఎరుగని ఇంటిపన్ను విధిస్తే అందుకు ఎదిరించి సాయుధ పోరాటం లేవదీయటమే గాక జవాయ్ పోలీసు స్టేషన్(జయింటియా హిల్స్ జిల్లా ముఖ్య పట్టణం జవాయ్) ను దగ్ధం చేశారు విల్లంబులు, బాణాలు మాత్రయే ఆయుధాలుగా కల్గిన జయింటియా ప్రజల్ని బ్రిటిష్ సైనికులు తుపాకులు, ఫిరంగులతో తేలిగ్గా అణిచివేశారు. తిరుగుబాటు నాయకుడు వుకియాంగ్ నాంగ్ వాలను బ్రిటిష్ వారు ఖైదీగా చేశారు ఈ యోధుడు జైల్లోనే చనిపోయాడు.

గారో ప్రజలు కూడా కొంతకాలం బ్రిటిష్ వారి ఆధిపత్యానికి ఎదురు పోరాడారు. అయితే ఈ గారో ప్రజల్లో కొంతమంది బ్రిటిష్ వారి పంచన చేరటం వలన బ్రిటిష్ వారు ఈప్రాంతాన్ని సునాయాసంగానే ఆక్రమించుకొన్నారు.

దేశానికి స్వతంత్రం వచ్చిన తర్వాత మేఘాలయ ప్రాంతం అస్సాంలో భాగంగా వుండేది. అయితే ఈ కొండ జాతి ప్రజలు తమ సంస్కృతి, నాగరికత, ఆచార వ్యవహారాలు కాపాడుకోవాలంటే తమ ప్రాంతాన్ని ప్రత్యేక ప్రాంతంగా గుర్తించాలని ఆందోళన ప్రారంభించారు. ఆల్‌పార్టీ హిల్ లీడర్స్ కాన్ఫరెన్స్ ఈ ఉద్యమానికి నాయకత్వం వహించింది. 1968లో కేంద్ర ప్రభుత్వం ఈ ప్రాంతాన్ని అస్సాం రాష్ట్రంలో స్వతంత్ర ప్రతిపత్తిగల ప్రాంతంగా ఏర్పాటు చేశారు. అయితే ఈ ఏర్పాటుతో సంతృప్తిచెందని ప్రజలు ఉద్యమం కొనసాగించారు. చివరకు కేంద్ర ప్రభుత్వం ఈ ఉద్యమానికి తలొగ్గి 1972లో మేఘాలయను ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పాటు చేశారు.

మేఘాలయ 5 జిల్లాలుగా విభజించబడింది. తూర్పు ఖాసీ హిల్స్,(ముఖ్య పట్టణం షిల్లాంగ్), పశ్చిమ ఖాసి హిల్స్ (ముఖ్య పట్టణం నాంగ్‌స్టన్), తూర్పుగారో హిల్స్ (ముఖ్యపట్టణం విలియం నగర్), పశ్చిమగారో హిల్స్(ముఖ్యపట్టణం తుర), జయింటియా హిల్స్ (ముఖ్య పట్టణం జొవాయ్).

మేఘాలయ అసెంబ్లీ లో 60 మంది సభ్యులు వుంటారు. ఇందులో 29 మంది ఖాసీ హిల్స్ నుంచి 24 మంది గారో హిల్స్ నుంచి, 7గురు జయింటియా హిల్స్ నుంచి ఎన్నుకోబడతారు. ఖాసీ హిల్స్ జనాభా 8 లక్షలు. గారో హిల్స్ జనాభా 6 లక్షలు. జయింటియా హిల్స్ జనాభా 2 లక్షల 50వేలుగా వుంటారు. మేఘాలయ రాజధాని షిల్లాంగ్‌లో నార్త్ ఈస్టన్ హిల్ యూనివర్సిటీ వుంది.

మేఘాలయ జనాభాలో క్రైస్తవులు 52 శాతం, హిందువులు 18 శాతం, ముస్లింలు 3 శాతం, మిగతా వారు ఏ మతానికి కట్టుబడని వారు. ఈరాష్ట్ర ప్రజలలో 45 శాతం మంది అక్షరాస్యులు. మేఘాలయలో ఖాసీ, గారో, జయింటియా ప్రజలే గాక ఇతరులు ముఖ్యంగా బెంగాలీ వారు, నేపాలీ వారు కూడా వున్నారు. ఇంకా మార్వాడీలు, పంజాబీలు కూడా కొద్దిగా కానవస్తారు. వీరంతా ప్రభుత్వోద్యోగులుగాను, వ్యాపారులు గానూ వుంటారు. దాదాపు వీరంతా రాష్ట్ర రాజధాని షిల్లాంగ్‌లో మిగతా పట్టణాలైన తుర, జొవాయ్‌లలో వుంటారు. రాజధాని షిల్లాంగ్ (జనాభా 1 లక్ష 10 వేలు) గాక ఇంకా చెప్పుకోదగిన పట్టణాలు తురా (జనాభా 20 వేలు) జోవాయ్ (జనాభా 10 వేలు) మాత్రము మిగతావన్నీ పల్లెటూళ్ళే

మేఘాలయలో 4500 గ్రామాలు వుంటాయి. ఇవన్నీ చిన్న చిన్న గ్రామాలే. అసలు కొన్ని గ్రామాల్లో 50 కుటుంబాలు లోపే వుంటాయి. ఈ ప్రాంతం అంతా కొండలు, గుట్టలు కావటం వలన సేద్యం చేసే భూమి కూడా తక్కువగా వుండటం వలన ఈ రాష్ట్రంలో జన సాంద్రత చాలా తక్కువ. చదరపు కిలోమీటరుకు 45 మంది మాత్రమే వుంటారు. (ఈ సందర్భంలో కేరళలో జన సాంద్రత చదరపు కిలోమీటరుకు 650 మంది ఆంధ్రప్రదేశ్‌లో జనసాంద్రత 240 మంది అని గుర్తుంచుకుంటే మేఘాలయలో జనం ఎంత పల్చగా వుంటారో ఊహించవచ్చు)

మేఘాలయ జనాభాలో 79 శాతం మందికి వ్యవసాయమే జీవనాధారం. వరి ముఖ్యమైన పంట. ఇక్కడ పండే వరి స్థానిక అవసరాలకు అంతంత మాత్రంగానే సరిపోతుంది. బంగాళాదుంపలు, జొన్నలు కూడా పండుతాయి. ఇంకా గుమ్మడి కాయలు, అల్లం, పుచ్చకాయలు కూడా కొద్ది కొద్దిగా పండుతాయి. ఈ రాష్ట్రంలో వ్యవసాయం కొన్ని చిక్కులతో కూడకున్నది. భూసారం తక్కువ. నేల చదునుగా వుండదు. అంతా కొండలు, మిట్టపల్లాలు. రాష్ట్ర వైశాల్యంలో 35 శాతం అడవులు. ఈ పరిస్థితులకు తోడు ఇచ్చట ప్రజలు వ్యవసాయం చేయటంలో ఒక వింత పద్ధతి అవలంబిస్తారు. దీన్ని వారు "జుమ్మింగ్" అంటారు. ఈపద్ధతిలో వారు ఆ సంవత్సరం సాగు చేయదల్చుకున్న ప్రాంతంలో వున్న చెట్లను దుబ్బులను నరికి అవి ఎండిన

తర్వాత నిప్పు పెడతారు వర్షం రాగానే కాలిన బూడిద భూమిలోకి ఇంకి భూమి సారవంత మవుతుందని వారు ఉద్దేశ్యం ఇంతే తప్ప పొలాలకు ఎరువులు వేయరు ఈ పద్ధతి వలన అడవులు తరిగి పోవటమే గాక పంట దిగుబడి కూడా బాగా వుండదు అయినా ఈ ప్రజలు తరతరాలుగా చేస్తున్న ఈ జుమ్మింగ్ పద్ధతికే అలవాటు పడ్డారు అయితే ఇప్పుడిప్పుడే రాష్ట్ర ప్రభుత్వం వ్యవసాయ దారుకు సబ్సిడిపై ఎరువులు, విత్తనాలు సరఫరా వేసి ఆధునిక వ్యవసాయం వైపు రైతులను మళ్లించుతున్నది. కోళ్ళు, పందుల పరిశ్రమ కూడా ఇచ్చట వ్యాప్తిలో వుంది.

మేఘాలయలో బొగ్గు, సున్నపు రాయి బాగా దొరుకుతుంది సిలిమినేట్ అనే ఖనిజం కూడా ఇక్కడ పుష్కలంగా దొరుకుతుంది. కోరండమ్‌తో కలిసి వుండే ఈ సిలిమినేట్ ఇతర దేశాలకు ఎగుమతి చేయటం వలన విదేశీ మారక ద్రవ్యం లభిస్తుంది. దేశంలో దొరికే సిలిమినేట్‌లో 75 శాతం ఈ ఒక్క రాష్ట్రంలోనే దొరుకుతుంది ఈ సిలిమినేట్ బ్లాస్ట్ ఫర్నేస్‌లలో ఉపయోగిస్తారు.

మేఘాలయ పారిశ్రామికంగా అభివృద్ధి చెందుతోంది చిరపుంజి దగ్గర ప్రభుత్వ ఆధ్వర్యంలో పెద్ద సిమెంట్ ఫ్యాక్టరీ వుంది ప్లైవుడ్, మత్తు పానీయాలు, నూనె గింజలకు సంబంధించిన పెద్ద ఫ్యాక్టరీలు కూడా వున్నాయి.

మేఘాలయలో క్రైస్తవ మిషనరీల కృషి మూలంగా ప్రజల్లో అక్షరాస్యత కూడా బాగానే వుంది. 15 లక్షల జనాభా మాత్రమే కల్గిన ఈ చిన్న రాష్ట్రంలో ఒక యూనివర్సిటీ, 10 కాలేజిలు, 300 హైస్కూళ్ళు, 300 దాకా ప్రాధమిక పాఠశాలల వున్నాయంటే ప్రజల్లో విద్యావ్యాప్తికి జరుగుతున్న కృషి అర్థం చేసుకోవచ్చును

చక్కటి ప్రకృతి దృశ్యాలు అందాలొలికే జలపాతాలు, చిన్న చిన్న నదులు, సెలయేళ్ళు, సరస్సులతో చేతికి అందుతున్నట్టుంటే మేఘాలతో మేఘాలయ చూడ చక్కని సుందరప్రదేశమే గాక ప్రకృతి సౌందర్యానికి భారత దేశపు స్కాట్‌లెండ్‌గా కూడా ప్రసిద్ధి పొందింది మేఘాలయలో వాతావరణంలో కూడా సంవత్సరం పొడవునా ఆహ్లాదకరంగానే వుంటుంది. చల్లగా, నులివెచ్చని ఎండతో పులకరింపజేస్తుంది. వర్షాకాలంలో కుండ పోతగా వర్షం పడి వెనువెంటనే సూర్యుడు కానవచ్చి వేడి వేడిగా వుంటుంది. ఇక శీతాకాలంలో వసంత ఋతువులాగానే వుంటుంది.

రాష్ట్ర రాజధాని షిల్లాంగ్ (జనాభా 1 లక్ష 10 వేలు) ఈశాన్య భారతదేశంలో ప్రసిద్ధిచెందిన పర్వత విశ్రాంతి కేంద్రం షిల్లాంగ్ సముద్రమట్టానికి 1496 మీటర్ల ఎత్తున వుంటుంది. ఈ పట్టణానికి ఈ పేరు స్థానిక షైలాంగ్ దేవతను బట్టి వచ్చింది. షిల్లాంగ్

శిఖరంపై ఈ దేవత నివాసం పైన్ వృక్షాలు, పూలతోటల మధ్య, కొండలపై నుంచి జారిపడుతున్న జలపాతాల నేపధ్యంలో షిల్లాంగ్ శోభిల్లుతూ ఉంటుంది. షిల్లాంగ్‌లో సెయింట్ పాల్ కాథడ్రిల్ చెప్పుకోదగిన కట్టడం. ఈప్రాంతంలో అతి పురాతనమైన చర్చి ఇదే షిల్లాంగ్ లో హిస్టరీ మ్యూజియం కూడా చూడదగిన విశేషమే. షిల్లాంగ్‌లోని గోల్ఫ్ మైదానం దేశంలో కెల్లా అందమైన మైదానంగా చెబుతారు.

షిల్లాంగ్‌కు 56 కిలోమీటర్ల దూరంలో చిరపుంజి వుంటుంది. ఇక్కడే ప్రపంచంలో కెల్లా ఎక్కువ వర్షం పడుతుంది. ఇచ్చట వున్నమాస్మయ్ జలపాతం, నాకలికాయ్ జలపాతం (ఇది ప్రపంచంలో నాలుగో ఎత్తైన జలపాతం) యాత్రీకులకు కనువిందు చేస్తాయి. ఈ ప్రాంతం నారింజ తోటలకు ప్రసిద్ధి. ఇక్కడా రామకృష్ణా మిషన్ వారి సేవా కేంద్రం కూడా వుంది.

షిల్లాంగ్‌కు 55 కిలోమీటర్ల దూరంలో మాస్యన్‌రాం వుంటుంది. ఇచ్చట కూడా చిరపుంజిలాగానే అధిక వర్షాలు పడతాయి. ఇచ్చట శివలింగాకారంలో ఒక పెద్ద గుహ వుంది. ఈ గుహ ఎల్లప్పుడూ పై నుంచి పడే నీటి తో అభిషేకించబడుతుంది. ఈ గుహ హిందు భక్తులకు దర్శనీయం.

షిల్లాంగ్‌కు 6 కిలోమీటర్ల దూరంలో వుండే ఉనియం సరస్సు కడురమ్యంగా వుంటుంది. ఈ సరస్సులో ఈత, పడవల పోటీ లాంటి జల క్రీడలు ఏర్పాటు చేయటానికి ఒక పెద్ద స్పోర్ట్స్ కాంప్లెక్స్ వుంది.

జయింటియా హిల్స్ ప్రాంతంలో షిల్లాంగ్‌కు 65 కిలోమీటర్ల దూరంలో నార్టియంగ్‌లో అద్భుత ఏక శిలా విగ్రహాలను చూడవచ్చును. ఈ ఏక శిలా విగ్రహాలను 500 సంవత్సరాలకు పూర్వం నార్టియంగ్ గ్రామస్తులు ఏర్పాటు చేసినట్లు చెబుతారు. ఈ ఏక శిలా విగ్రహాలలో అతి పెద్దది 27 6 అడుగుల ఎత్తు 2 1/2 అడుగుల మందం వుంటుంది.

గారోహిల్స్‌లో చూడదగినది చాల్ పక్రంలోయ. ఈ లోయలో అనేక రకాల జంతువుల్ని చూడవచ్చును సిమ్‌సాంగ్ లోయలోని శిజుగుహలు కూడా చూడదగినవే.

ఖాసీ ప్రజల ముఖ్య పండుగ నార్జిక్రెమ్. నవంబరులో ఈ పండుగ వస్తుంది. పంట చేతికి వచ్చే ఆ రోజుల్లో ఈ పండుగను అయిదు రోజుల పాటు అట్టహాసంగా చేసు కుంటారు. ఖాసీ తెగల నాయకులు.మత పెద్దలు ఆ రోజుల్లో కొన్ని మత సంబంధమైన క్రతువులు చేయించుతారు. యువతీ యువకులు రంగురంగుల దుస్తులు, ఆభరణాలు, ధరించి నృత్యం చేస్తారు. పండుగ ఆఖరి రోజున మేకల్ని బలి ఇస్తారు.

జయింటియా ప్రజల ముఖ్య పండుగ బెదియన్‌కలం. ఈ పండుగ జూలై నెలలో వస్తుంది. రైతులు అప్పుడే విత్తనాలు జల్లుతారు. ఈ విత్తులు సక్రమంగా మొలకలెత్తి చక్కటి పంటలు పండాలని, దుష్టశక్తులు ఈ పంటల జోలికి రాకూడదని భగవంతుని ప్రార్థించే పండుగ ఇది. ఈ పండుగ నాలుగు రోజులు వానలో తడుస్తూ (జూలై నెలలో ఎప్పుడూ వాన పడుతుంది కాబట్టి) నృత్యం చేస్తారు.

గారో ప్రజల ముఖ్య పండుగ వాంగలా. ఈపండుగ నవంబరు, డిసెంబర్లలో వస్తుంది. అప్పుడే రైతలకు పంటలు చేతికి వస్తాయి. ఇది కూడా నాలుగు రోజుల పండుగే. ఈ నాలుగు రోజులు రేయింబవళ్ళు వాయిద్యాల మోతహోరులో గారో ప్రజలు నృత్యం చేస్తారు.

గారో ప్రజలు పూర్వంకాలంలో ఎప్పుడో టిబెట్ నుంచి ఇచ్చటకు వచ్చి స్థిర పడ్డవారు. గారో ప్రజలు మాట్లాడే భాష టిబెటన్ భాషకు దగ్గరగా వుంటుంది. గారో ప్రజలు తాము బోడో జాతికి చెందిన వారమని చెప్పుకుంటారు. గారోలు మొగవారైతే ఆరు లేక ఏడు అడుగుల పొడవు ఆరు అంగుళాల వెడల్పు కల్గిన గుడ్డ మొలకు చుట్టుకుంటారు. మొలపై భాగం పై ఏమీ వేసుకోరు. చలి కాలం మాత్రం దుప్పటి కప్పుకుంటారు. తలపాగా మాత్రం చుడతారు. ఆడవాళ్ళు నాలుగు లేక అయిదు అడుగుల పొడవు ఒక అడుగు వెడల్పు గల బట్ట మొలచుట్టూ వేస్తుంటారు. ఆడవాళ్ళు కూడా తలపాగా చుడతారు. ఆడమొగ తేడా లేకుండా చెవులకు రింగులు ధరిస్తారు. వరి అన్నం వీరి ప్రధాన ఆహారం. పందులు, కుక్కలు, పిల్లి, పాము, గబ్బిలం, నక్క వగైరా అన్ని జంతువుల మాంసం తింటారు. ఏనుగు మాంసం మరింత ఇష్టంగా తింటారు.

గారోలలో అనేక తెగలున్నా మూడు మాత్రం ప్రధానమైన తెగలు. ఎక్కువ జనాభా ఈ మూడు తెగలకు చెందిన వారై వుంటారు. వీరిలో వివాహాలు పూర్తిగా ఆడపిల్ల పూర్తి ఇష్టం మీదనే జరుగుతాయి. పెళ్ళి కాగానే అల్లుడు ఇల్లరికం వస్తాడు. మామ గనుక చనిపోతే అత్తను కూడా పెళ్లి చేసుకొని తల్లికి, కూతురికి కూడా భర్తగా వుంటాడు. ఈ ఇల్లరికపు అల్లుడు! ఈ విధంగా తల్లిని కూతుర్ని పెళ్ళాడటం గారో ప్రజల్లో తప్ప ప్రపంచలో మరెక్కడ కానరాదు! గారో ప్రజల్లో కట్నకానుకలు ఏమీ వుండవు. విడాకులు కూడా సులభంగానే తీసుకొంటూ వుంటారు. గారో ప్రజల్లో ముఖ్యంగా చెప్పుకోదగిన విశేషం ఆస్తి వారసత్వం. ఈ ప్రజల్లో ఆస్తి వారసత్వం ఆడపిల్లలకు మాత్రమే చెందుతుంది. మొగ సంతానానికి ఎట్టి హక్కులూ వుండవు. అసలు ఈ ప్రజల్లో కుటుంబ పెత్తనం తల్లి చేతుల్లో వుంటుంది. మాతృసామ్య వ్యవస్థకు గారో ప్రజల్ని ఉదాహరణగా చెప్పవచ్చును

ఈ ప్రజల్లో ఎవరిపైనైనా దొంగతనంగాని, మరేదైనా నేరం ఆరోపించబడితే తన నిర్దోషిత్వాన్ని నిరూపించుకోవటానికి గ్రామప్రజలందరి ఎదుట ఎర్రగా కాల్చిన ఇనుపకడ్డీని పట్టుకోవటంగాని, సలసల కాగుతున్న నీళ్ళలో వుంచిన కోడి గుడ్డును చేతికి గాయం కాకుండా తీయటం గాని చేయాలి. అలా చేస్తే అతడు నిర్దోషి క్రింద లెక్క.

క్రైస్తవ మిషనరీల కృషి కారణంగా గారో ప్రజలలో సగం మందికి పైగా క్రైస్తవ మతంలోకి మారిపోయారు. కొద్దిమంది మాత్రమే హిందువులగా మిగిలిపోయారు మతం ఏదైనా వీరు అనేక దేవతల్ని పూజించుతారు.

ఖాసీ ప్రజలు గారో ప్రజలకు కొద్ది తేడాలుంటాయి. ఖాసీ ప్రజలు ఇండోచైనీస్ జాతికి చెందిన వారు. క్రైస్తవ మత ప్రభావం కారణంగా ఖాసీ ప్రజలు పూర్వపు వేషధారణలన్నీ మానేసి పాశ్చాత్య వేషధారణకు అలవాటు పడ్డారు. కొద్ది మంది మాత్రం లోగడలాగా తలపాగాలు చుడతారు. ఖాసీ ప్రజలు పూర్వం నుంచి ప్రజాస్వామ్యపద్ధతిలో ఎన్నికయిన తెగ నాయకుల పాలన క్రింద వుండేవారు. ఈ తెగ నాయకులు 15 మంది వుంటారు. వీరిని ఖాసీ రాజులు అని కూడా అంటారు. ఇప్పటికీ ఈ తెగనాయకుల మాట ఆ ప్రజల్లో వేదవాక్కుగా చలామణి అవుతుంది.

ఖాసీ ప్రజలు అన్ని రకాల జంతువుల మాంసం తింటారు. ఆవు మాంసం మాత్రం నిషిద్ధం హిందూమత ప్రభావం వలన ఇది నిషిద్ధం అయివుంటుంది. వీరు పాలు, పెరుగు, మజ్జిగ ముట్టరు. మద్యపానీయాలు ఎక్కువగా త్రాగుతారు. అసలు చాలా కుటుంబాల ఇళ్ళలోనే మద్యం తయారు చేసే బట్టీలు వుంటాయి.

గారో ప్రజల్లో లాగానే ఖాసీ ప్రజల్లో కూడా ఆస్తిహక్కు ఆడవారికే గాని మగవారికి ఉండదు. కుటుంబ పెద్ద తల్లి మాత్రమే. అయితే ఒక్క తేడా వుంది. ఖాసీ ప్రజల్లో ఆస్తి హక్కు చిన్న కుమార్తెకు మాత్రమే చెందుతుంది. మిగతా కుమార్తెలకు గాని కుమారులకు గాని ఎట్టి హక్కులు వుండవు. పెళ్ళిళ్ళు ఆడ పిల్లల ఇష్టం మీదనే జరుగుతాయి. ఈ ప్రజల్లో కూడా పెళ్ళి కాగానే అల్లుడు ఇల్లరికం రావల్సిందే. విడాకులు తీసుకోవటం సులభంగానే వుంటుంది.

ఖాసీ ప్రజలు కోడిపుంజును అమిత ప్రేమగా చూసుకుంటారు. వారి నమ్మకం ప్రకారం కోడి పుంజు మానవ జాతికి గొప్ప సేవ చేసిందని భావిస్తారు. పూర్వకాలంలో మానవులంతా చెడ్డ పనులు చేస్తూ పాప కూపంలో మునిగ వుండగా ఈ పాపాత్ములు ముఖం చూడటానికి కూడా ఇష్టపడక సూర్య భగవానుడు ఉదయించటం మానివేశాడట. అప్పుడు మానవులంతా కారు చీకట్లోలో దిక్కుతోచక అలమటిస్తూవుండగా కోడి

పుంజు ధైర్యం చేసి సూర్య భగవానుడ్ని తన కూత ద్వారా ప్రార్థించిందట సూర్య భగవానుడు దయ తల్చి ఉదయించాలడట అందువలన కోడి పుంజు అంటే అంత ప్రేమ

జయింటియా ప్రజల ఆచార వ్యవహారాలు, పద్ధతులు ఖాసీ గారో ప్రజల వాటి మాదిరిగానే వుంటాయి అయితే ఒక్క ఇల్లరికపు అల్లుడి పద్ధతిలో మాత్రం తేడా వుంది జయింటియా ప్రజల్లో అల్లుడు అత్తవారింటికి ఇల్లరికం వెళ్ళడు సూర్యాస్తమానం తర్వాత అత్తవారింటికి వెళ్లి రాత్రిళ్లు మాత్రం అక్కడ వుండి ఉదయమే లేచి తల్లిదండ్రుల ఇంటికి వెళ్ళతాడు పగటి పూట అల్లుడు అత్తవారింట్లో వుండటం నిషిద్ధం జయింటియా ప్రజల్లో కూడా ఎక్కువ మంది క్రైస్తవ మతంలోకి మారి పోయారు లోగడ పద్ధతులన్నీ మానేసి పాశ్చాత్య పద్ధతులు అలవర్చుకొంటున్నారు

# 22 త్రిపుర

వైశాల్యం - 10486 చదరపు కిలోమీటర్లు. జనాభా - 27 లక్షల 44 వేలు. రాజధాని - అగర్తలా మాట్లాడే భాషలు - బెంగాలీ, మణిపురి, కక్‌బార్క్ వగైరా

త్రిపురకు దక్షిణాన, పడమర, ఉత్తరాన కూడా బంగ్లాదేశ్ వుంటుంది. తూర్పున కూడా కొంత భాగంలో బంగ్లాదేశ్ వుంటుంది మిగతా తూర్పు భాగాన మిజోరాం, అస్సాం రాష్ట్రాలు వుంటాయి త్రిపురకు 832 కిలోమీటర్ల మేర బంగ్లాదేశ్ సరిహద్దుగా వుంటుంది. అంటే తూర్పున కొంత భాగం మినహా మిగతా అన్ని వైపులా బంగ్లాదేశ్‌చే చుట్టబడి వుంటుంది

జనాభారీత్యా భారతదేశంలో కెల్లా రెండవ చిన్న రాష్ట్రం త్రిపుర. (మొదటి చిన్న రాష్ట్రం సిక్కిం) వైశాల్యం రీత్యా త్రిపుర రాష్ట్రం తూర్పు గోదావరి జిల్లా కన్నా ఇంకా తక్కువే వుంటుంది. ఈ రాష్ట్రం 183 కిలోమీటర్ల పొడవు 112 కిలోమీటర్ల వెడల్పు మాత్రం వుంటుంది.




పురాణాల్లో పేర్కొన్న కిరాట దేశం త్రిపుర. త్రిపుర అనే పేరు ఆ తర్వాత త్రిపుర అనే రాజుని బట్టి వచ్చింది కిరాట దేశం రాజులు తాము పురాణ పురుషుడు యయాతి మనుమడైన ధృవ వంశానికి చెందిన వారమని చెప్పు -కుంటారు. మహాభారతంలో ధర్మరాజు చేసిన రాజసూయ యాగానికి కిరాట దేశరాజు త్రిలోచనుడు హాజరైనట్లు వుంది ఈ త్రిలోచనుడు ధృవ వంశానికి చెందిన వాడే.

ఈ ధృవ వంశ రాజులే కిరాట దేశాన్ని అనేక వందల సంవత్సరాలు

పాలించారు అసలు మొన్న మొన్నటి వరకూ - అంటే త్రిపుర భారత్‌లో విలీనం అయ్యేవరకూ - త్రిపురను పాలించిన వారు ధృవ వంశం రాజులే! ఈ రాజుల చరిత్ర "రాజ్‌మలా" లనే బెంగాలీ గ్రంథంలో ఉల్లేఖించబడింది ఈ ధృవ వంశంలో వాడే త్రిపుర రాజుకూడా అయితే ఈ త్రిపుర రాజు అధికార మదోన్మత్తుడై ప్రజల్ని నానా బాధలు పెడితే ఇతడ్ని చంపి ఇతడి కుమారుడ్ని సింహాసనం మీద కూర్చుండ బెట్టారు ప్రజలు

త్రిపుర రాజులు 'రాజులం' అని పిలిపించుకునే వారుకాదు 'ఫా' అని పిలిపించుకునేవారు ఫా అనగా తండ్రి అని అర్థం తమకు, ప్రజలకు తండ్రీ బిడ్డల సంబంధం వుండాలనే ఉద్దేశ్యంతో ఈ విధంగా పిలిపించుకునేవారు ఒక్క త్రిపుర రాజు తప్ప మిగతా రాజులంతా ప్రజల్ని కన్న బిడ్డల్లాగా చూసుకున్నవారు

క్రీ శ 13వ శతాబ్దంలో త్రిపురను పాలించిన రత్న ఫా తన రాజ్యంలో కొన్ని చిక్కులు కారణంగా బెంగాల్‌లోని గౌర్ రాజ్యంలో ఈయన తల దాచుకున్నాడు - కొన్నాళ్ళు గౌర్ రాజు రత్న ఫా అద్భుత బుద్ధికుశలతకు ముచ్చటపడి "మాణిక్య" అనే బిరుదు ప్రదానం చేశాడు అప్పటి నుంచి త్రిపుర రాజులకు మాణిక్య అనే బిరుదు వచ్చింది.

14వ శతాబ్దంలో త్రిపురను పాలించిన ధర్మ మాణిక్య గొప్పరాజు ఇతడు సాహిత్యం, కళలను అమితంగా అభిమానించాడు ప్రజల్ని చల్లగా పాలించాడు. ఇతడే పూర్వరాజుల చరిత్రను "రాజ్‌మలా"గా రచింప జేశాడు. అక్బర్ చక్రవర్తి సమకాలికుడు బిజయ్ మానిక్య రాజు. అసలు 15, 16 శతాబ్దాలలో త్రిపుర రాజ్యం ఉచ్ఛదశలో వుంది చుట్టుపట్ల ముస్లిం రాజుల దండయాత్రలను నిరోధించటమే గాక రాజ్యం విస్తరించబడింది.

బిర్ చంద్ర మాణిక్య బహదూర్( 1862-1896)తో త్రిపుర ఆధునిక యుగంలో ప్రవేశిస్తుంది. ఇతడు బ్రిటిష్ పద్ధతిలో రాజ్యాన్ని ఆధునికం చేశాడు ఇతడి కుమారుడు రాధాకిశోర్ మాణిక్య. విశ్వకవి రవీంద్రనాధ్ టాగూర్ సన్నిహిత మిత్రుడు ఇతడు టాగూర్‌కు ఆర్థికంగా కూడా చాలా సహాయం చేశాడు త్రిపురను ఏలిన చివరి రాజు విక్రమ్ కిశోర్ మాణిక్య బహదూర్. త్రిపురను బారత్‌లో విలీనం చేశాడు. ఇతడు 1967 ఎన్నికలలో పార్లమెంటుకు గొప్ప మెజారిటీతో ఎన్నుకోబడ్డాడు.

ఇన్ని వందల సంవత్సరాలు త్రిపురను పాలించిన రాజులంతా హిందువులే త్రిపుర రాజులు శైవ మతాన్ని ఆదరించారు

1949 లో భారత్‌లో కలిసి పోయిన త్రిపుర 1957 లో కేంద్ర పాలిత ప్రాంతంగా ఏర్పడి 1972లో పూర్తి ప్రతిపత్తి గల రాష్ట్రంగా అవతరించింది.

త్రిపురలో 8 నదులు ప్రవహిస్తూ వుంటాయి అందులో గోమతి, జురి, మహరి ప్రధానమైనవి త్రిపుర వాతావరణ పరిస్థితులు మితంగానే వుంటాయి మే నుంచి ఆగస్టు వరకూ వర్షాలు కురుస్తాయి సగటున సంవత్సరానికి 210 సెంటీ మీటర్ల వర్షం పడుతుంది నవంబరు నుంచి జనవరి వరకూ చలి కాలం మిగతా నెలలు ఎండా కాలం

త్రిపుర అసెంబ్లీలో సభ్యుల సంఖ్య 60 లోక్‌సభలో ఇద్దరు రాజ్యసభలో ఒకరు త్రిపురకు ప్రాతినిధ్యం వహిస్తారు గౌహతి (అస్సాం) లోని హైకోర్టు త్రిపురకు కూడా హైకోర్టుగా వుంటుంది అగర్తలాలో ఒక హైకోర్టు బెంచి వుంటుంది

త్రిపుర జనాభాలో 93 శాతం ప్రజలు హిందువులు వీరిలో 6 శాతం షెడ్యూల్ తెగలవారు మిగతా 7 శాతం ముస్లింలు త్రిపురలో అక్షరాస్యత శాతం 52 ప్రజల్లో ఎక్కువ మంది బెంగాలీ మాట్లాడతారు రాష్ట్ర ప్రభుత్వ భాష కూడా బెంగాలీయే

త్రిపురలోని హిందువుల్లో అత్యధికులు బెంగాలీ వారే ఆ తర్వాత మణిపురివారు వీరంతా మైదాన ప్రాంతంలో వుంటారు షెడ్యూల్ తెగల వారు అడవుల్లో వుంటారు

త్రిపుర మూడు జిల్లాలుగా వుంటుంది 1 ఉత్తర త్రిపుర 2 పశ్చిమ త్రిపుర 3 దక్షిణ త్రిపుర 5 వేల దాకా గ్రామాలున్నాయి 6 మాత్రమే పట్టణాలు ఇందులో మరీ పెద్ద పట్టణం అగర్తలా (జనాభా 70 వేలు) మిగతా 5 పట్టణాలు పేరుకు పట్టణాలే కాని నిజానికి అవి పెద్ద గ్రామాలు మాత్రమే

త్రిపుర కొండ ప్రాంతం కావటం వలన సారవంతమైన భూమి తక్కువ రాష్ట్ర వైశాల్యంలో 60 శాతం అడవులు కొండలు మిగతా 40 శాతం చదునుగా వుంటుంది ఈ చదునైన భూమిలో కూడా కొంత భాగం వట్టి చవిటినేల ఈ నేలలో రసాయనిక ఎరువులు ఎంతగా వాడినా ఉపయోగం వుండదు మిగిలిన ప్రాంతం మాత్రం మిక్కిలి సారవంతమైన నేల ఇందులో సాలుకు మూడు పంటలు కూడా పండుతాయి ఏమైనా ఈ రాష్ట్ర జనాభాలో 75 శాతం మందికి వ్యవసాయమే జీవనాధారం 2 1/2 లక్షల హెక్టార్ల భూమి సాగులో వుంది వరి ప్రధాన పంట త్రిపుర భారత్‌లో విలీనం కాక ముందు ఈ రాష్ట్రం ధాన్యం ఉత్పత్తిలో స్వయం సమృద్ధిగా వుండేది అయితే ఆ తర్వాత తూర్పు పాకిస్తాన్ (బంగ్లాదేశ్) నుంచి అనేక మంది శరణార్థులు ఇచ్చటకు వచ్చి స్థిరపడటంతో త్రిపుర జనాభా అమాంతంగా పెరగటం వలన తిండి గింజల లోటు ఏర్పడింది (1951లో ఈ రాష్ట్ర జనాభా 6 లక్షలు మాత్రమే) త్రిపుర ఇంకా మిగతా పంటలు జనపనార, బంగాళాదుంపలు, చెరకు వగైరా

త్రిపుర టీ తోటలకు ప్రసిద్ధి ఆరు లక్షల హెక్టార్ల విస్తీర్ణంలో 50 టీ తోటలు

వున్నాయి ఏటా 50 లక్షలు కిలోల టీ ఉత్పత్తి అవుతుంది. పట్టు పరిశ్రమ కూడా త్రిపురలో బాగా సాగుతుంది.

చేనేత పరిశ్రమ త్రిపురలో వ్యవసాయం తర్వాత ఎక్కువమందికి ఉపాధి కల్పిస్తుంది చేనేత వారికి ప్రభుత్వం కూడా అనేక విధాల సహాయం చేస్తోంది

త్రిపుర పారిశ్రామికంగా వెనుకబడిన రాష్ట్రం. రాష్ట్రంలోని ఖనిజ సంపదను వెలికి తీసే ప్రయత్నాలు పెద్దగా జరగలేదు త్రిపురలో నూనె సహజవాయువు, సున్నం నిక్షేపాలు వున్నాయి పశ్చిమ త్రిపురలోని బారాముర‌లో ఆయిల్ నిక్షేపాలు వున్నాయి. బారామురాలో నూనె సహజ వాయువుల కమీషన్ ఆయిల్ నిక్షేపాలను వెలికితీస్తోంది

ప్రభుత్వ రంగంలో అగర్తలాలో ఒక జనపనార మిల్లు వుంది ఇంకా అల్యూమినియం రంపపు మిల్లులు, బ్యాటరీలు, మందులకు సంబంధించిన మధ్యతరహా పరిశ్రమలు వున్నాయి.

త్రిపుర హస్తకళలకు కూడా ప్రసిద్ధి. వెదురు, వెదురు వేళ్ళు, పేము కర్రతో రకరకాల వస్తువులు తయారు చేస్తారు.

త్రిపుర కొండ ప్రాంతం కావటంతో రవాణా సౌకర్యాలు తక్కువగా వుంటాయి చెప్పుకోదగిన రైలు మార్గం కూడా లేదు.

త్రిపురలో కొద్దిగా చూడదగిన ప్రదేశాలు వున్నాయి. రాజధాని అగర్తలాలో వైజయంత ప్యాలెస్ చూడదగిన అద్భుత కట్టడం. అర్ధ చదరపు కిలోమీటరు వైశాల్యంలో వుండే ఈ భవంతిలో లోగడ త్రిపుర రాజులు వుండేవారు ప్రస్తుతం త్రిపుర అసెంబ్లీ భవనంగా వుంటోంది. భవంతి ముందు రెండు తటాకాలు, పూతోటలతో శోభాయమానంగా వుంటుంది. ఈ భవంతి ఇండోరోమన్ వాస్తుకళకు నిదర్శనంగా వుంటుంది.

అగర్తలాకు 8 కిలోమీటర్ల దూరంలో పాత అగర్తలా వుంటుంది. ఇక్కడ 14 దేవతల ( చౌదా దేవత) ఆలయం వుంది. త్రిలోచన రాజు ఈ 14 దేవతల విగ్రహాల్ని పూర్వ త్రిపుర రాజధాని ఉదయ్‌పూర్ నుంచి తెచ్చి ఇచ్చట ప్రతిష్ఠించాడట. జులైలో ఇక్కడ 'కర్చిపూజ' గొప్పగా జరుగుతుంది కొండతెగల ప్రజలతో సహా అనేక వేల మంది హిందువులు కూడా ఈ ఉత్సవంలో పాల్గొంటారు ఈ 14 దేవతా విగ్రహాలు ఇత్తడితో చేయబడి వుంటాయి. హిందూ, కొండ ప్రజల విశ్వాసాలకు సమ్మేళనంగా ఈ దేవతగా విగ్రహాలు వుంటాయి. ఈ దేవాలయంలో అర్చకులుగా కొండజాతి పూజారులుంటారు

ఉదయ్‌పూర్ (ప్రస్తుతం దీన్ని రాధాకిషోర్ పూర్ అంటున్నారు) అగర్తలాకు 55 కిలోమీటర్ల దూరంలో వుంటుంది. పూర్వం ఈ ఉదయ్‌పూర్ త్రిపుర్ రాజులకు రాజధానిగా వుండేది. ఇచ్చట ఒక కొండ పై కాళికాలయం వుంటుంది. దేశంలోని 51 శక్తిపీఠాలలో ఇదొకటిగా తంత్రవాదులు భావిస్తారు. దీపావళి పండుగనాడు ఇచ్చట జరిగే ఉత్సవంలో వేలాది మంది జనం పాల్గొంటారు. ఈ దేవాలయం 15వ శతాబ్దంలో నిర్మించబడింది.

ఉదయ్‌పూర్‌లో జగన్నాథ ఆలయం చూడదగినది. 15వ శతాబ్దంలో ఇది నిర్మించబడింది. ఈ ఆలయంలోని విగ్రహాలు మొగల్ దండయాత్రల సందర్భంగా ధ్వంసం కాగా తిరిగి ఈ ఆలయాన్ని పునర్నిర్మించి పూరీ నుంచి జగన్నాథ సుభద్ర, బలరాం విగ్రహాలను తెచ్చి ఇక్కడ ప్రతిష్టించారు.

ఉదయ్‌పూర్‌లో ఇంకా అనేక దేవాలయాలు, ఈ తటాకాలు కూడ వున్నాయి. ఆ తటాకాల్లో చెప్పుకోదగిన తటాకం దనిసాగర్. ఈ దనిసాగర్ విశేషం ఏమంటే - ఇందులోని తాబేళ్ళు తాము చనిపోయే ముందు ప్రక్కనే వున్న కాళికాలయంలోకి వెళ్ళి విగ్రహం చుట్టూ ప్రదక్షిణ చేసి ఆఖరి శ్వాస విడుస్తాయట!

అగర్తలాకు 100 కిలోమీటర్ల దూరంలో దుంబర్ జలపాతం వుంది. గోమతినది జన్మస్థలం ఇక్కడే. ఈ దుంబర్ జలపాతం విపరీతమైన శబ్దంతో పడుతూ వుండటం వలన "గర్జించే దుంబర్ జలపాతం" గా ప్రసిద్ధి చెందింది. విశ్వకవి రవీంద్రనాద్ టాగూర్ రచించిన ఒక నాటకంలో ఈ దుంబర్ జలపాతం ప్రస్తావన వుంటుంది. ఇచ్చటనే తీర్థముఖ్ అనే హిందూ పుణ్యక్షేత్రం కూడా వుంది. సంక్రాంతి రోజున ఇచ్చట వేలాది మంది హిందూ భక్తులు పుణ్యస్నానాలు చేస్తారు.

అగర్తలాకు 160 కిలోమీటర్ల దూరంలో ఉనాకుటి వుంటుంది. ఇచ్చట కొండలపై అసంఖ్యాక హిందూ దేవుళ్ళు, దేవతల శిల్పాలు చెక్కబడి వుంటాయి. పురాతన హిందూ శిల్పకళకు ఇవి సంకేతంగా వుంటాయి. ఇచ్చట శివరాత్రి పర్వదినాన వేలాది హిందువులు ఇచ్చట వున్న బ్రహ్మకుండ్ సరస్సులో పుణ్యస్నానాలు చేసి ఈ దేవతా విగ్రహాల్ని పూజిస్తారు.

త్రిపురలోని హిందువులలో అత్యధికులు శైవులు మతాన్ని ఆదరించిన కారణంగా శైవమతం వ్యాప్తి పొందింది. అందువల్లనే త్రిపురలో ఏ ప్రాంతానికి వెళ్ళినా శివాలయాలే కన్పిస్తాయి. పూర్వరాజుల కాలంలో ముద్రించిన నాణాలన్నింటి పైన శివుని ఆయుధం త్రిశూలం బొమ్మ వేసి వుంటుంది. పురాణాల్లో కన్పించే కపిలమహర్షి ఇచ్చట వున్న

మనునది ఒడ్డున తపమాచరించి శివపార్వతులను ప్రసన్నం చేసుకున్నాడని చెబుతారు. త్రిపురలోని హిందువులు హిందూ పడుగలన్నీ భక్తిశ్రద్ధలతో జరుపుకుంటారు

త్రిపుర కొండజాతి ప్రజలు ప్రధానంగా 19 తెగలుగా వుంటారు లుసాయ్, మోగ్, కుకీ, చక్మా, గారో, రెయాంగ్, ఖాసీ, త్రిపురి, బిల్ మొదలైనవి ఈ తెగల పేర్లు. వీరు అడువుల్లో వుండటానికే ఇష్టపడతారు. వీరు ఇళ్ళు భూమిపై ఆరుఅడుగుల ఎత్తు మంచెపై కట్టుకుంటారు. కొండలు, గుట్టలపై ఇళ్ళు కట్టుకుంటారు. వెదురు బొంగులతో ఇళ్ళు కట్టుకొని పై కప్పుకు వరిగడ్డి వేస్తారు. లోగడ వీరు ఒక్క చోట కుదురుగా వుండక దేశ దిమ్మరులుగా వుండేవారు ప్రస్తుతం మాత్రం ఒక్క చోటే నిలకడగా వుంటున్నారు. వీరంతా వ్యవసాయదారులు.

ఇక వీరి ఆచార వ్యవహారాలను కొద్దిగా తెలుసుకుందాం. - వివాహం, వారసత్వం విషయాల్లో ఈ తెగల్లో తేడాలు వుంటాయి. కొన్ని తెగల్లో కాబోయే అల్లుడు అత్తవారింటికి వచ్చి కనీసం మూడు సంవత్సరాలు తనకు పనిపాట్లు బాగా వచ్చునని నిరూపించుకోవాలి. అలా నిరూపించుకొని అత్తమామలను సంతృప్తి పరిస్తేనే తమ కుమార్తెనిచ్చి పెళ్ళి చేస్తారు. ఒక వేళ సరిగా పనిపాటలు చేయకుండా అర్ధాంతరంగా వెళ్ళిపోతే అతడి తల్లిదండ్రుల నుంచి నష్టపరిహారం కూడా పొందుతారు. వరకట్నం అన్ని తెగల్లోనూ వుంటుంది. కట్నం డబ్బుగా గాని గొర్రెలు, మేకలు రూపేణా గాని వుండవచ్చును. హిందూ అలవాట్లు ఈతెగల్లో అనేకం కానవస్తాయి. హిందూమత ప్రభావం వీరిపై హెచ్చుగా వుంటుంది. ఈతెగల్లో ఒక పిల్లాడుగాని పిల్లగాని పుట్టినా లేక ఎవరైన చచ్చిపోయినా పెద్దతంతు జరిపించటమే గాక దేవతలను సంతృప్తిపర్చటానికి అనేక పదార్థాలు నైవేద్యంగా పెట్టి మద్యం కూడా సమర్పించుకుంటారు. తెగలో యావన్మంది మస్తుగా త్రాగి నృత్యం చేస్తారు. అసలు ఈ తెగల్లో మద్యం త్రాగటం ఈ సందర్భాలకే పరిమితంగాక ఎల్లప్పుడూ త్రాగుతూనే వుంటారు.

ఈ తెగల్లో చెప్పుకోదగిన విశేషమేమంటే - తెగ పెద్దలు ప్రజాస్వామ్య బద్ధంగా ఎన్నుకోవడటం. పెద్దలుగా ఎన్నుకోవడటానికి నీతి, నిజాయితీలే ప్రాముఖ్యం వహించుతాయి. ఆర్థిక విషయాలు లెక్కలోకి రావు ఈ పెద్దల మాటను తెగలోని వారంతా శిరసావహించుతారు. తెగ పెద్దలను "రే" అని "చౌదరి" అని పిలుస్తారు. ఈ తెగల్లో పిన్నలు పెద్దల మాటలను అమితంగా గౌరవిస్తారు. ఈ తెగలు గంగా పూజ, గరియా పూజ, కర్చిపూజ అనే పండుగలు చేసుకుంటారు. ఈ పూజల్లో మేకల్ని, గొర్రెల్ని, కోళ్ళను దేవతలకు బలి ఇస్తారు. ఈతెగల స్త్రీలు, ఇత్తడి, వెండితో చేసిన గాజులు, ముక్కు పుడకలు, చెవిలోలకులు, నెక్లెసులు ధరిస్తారు.

# 25 మణిపూర్

వైశాల్యం - 22327 చదరపు కిలోమీటర్లు రాజధాని - ఇంఫాల్ జనాభా - 18 లక్షల 26 వేలు మాట్లాడే భాషలు - మణిపూరి ఇంగ్లీషు



మణిపూర్‌కు తూర్పున బర్మాదేశం ఉత్తరాన నాగాలాండ్, దక్షిణాన మిజోరం, బర్మాదేశం పడమర అస్సాంలు సరిహద్దులుగా వుంటాయి

వైశాల్యం రీత్యా మణిపూర్ సుమారుగా గుంటూరు, తూర్పుగోదావరి జిల్లాల వైశాల్యం అంత వుంటుంది

మణిపూర్‌కు సుదీర్ఘ చరిత్ర వుంది మణిపూర్ గురించి మహాభారతం లో కూడా ప్రస్తావించబడింది అర్జునుడు మణిపూర్ రాకుమారి చిత్రాంగదను పెళ్ళి చేసుకున్నాడు వీరిద్దరికి పుట్టినవాడే బభ్రువాహనుడు క్రీ॥ శ॥ 1వ శతాబ్దంలో మణిపూర్ 7 రాజ్యాలుగా వుండేది ఇందులో ఒక రాజ్యం రాజుపేరు పకంగ్.బార్. అద్భుత సాహసపరాక్రమాలు కల్గిన ఈ పకంగ్.బార్ క్రమేపీ మిగతా ఆరు రాజ్యాలను స్వాధీనం చేసుకొని మొత్తం మణిపూర్‌ను తన ఆధీనంలోకి తెచ్చుకున్నాడు ఆ తర్వాత ఈ పకంగ్ బార్ సంతతియులే మణిపూర్‌ను మొన్న మొన్నటి వరకూ పరిపాలించారు 1891 నుంచి మణిపూర్ బ్రిటిష్ వారి అజ్మాయిషీ క్రింద పకంగ్ బార్ రాజు పాలన లో వుండేది.

1949లో మణిపూర్ భారత్‌లో పార్ట్ సి రాష్ట్రంగా చేరింది. 1957లో మణిపూర్‌ను కేంద్ర పాలిత ప్రాంతంగా చేశారు 1972లో మణిపూర్ భారత్‌లో 20వ రాష్ట్రంగా అవతరించింది.

మణిపూర్ 8 జిల్లాలుగా వుంటుంది 1. ఇంఫాల్ 2 విష్ణుపూర్ 3 తౌబాల్ 4 ఉక్రల్ 5 సేనాపతి 6 తమెంగ్‌లాంగ్ 7 చురాచందపూర్ 8 చందేల్

మణిపూర్ అసెంబ్లీలో 60 మంది సభ్యులు వుంటారు. లోక్‌సభలో ఇద్దరు, రాజ్య సభలో ఒకరు మణిపూర్‌కు ప్రాతినిధ్యం వహిస్తారు.

మణిపూర్ జనాభాలో 60 శాతం మంది హిందువులు, క్రైస్తవులు 30 శాతం, ముస్లింలు 7 శాతం హిందువులంతా మైదాన ప్రాంతంలో వుంటారు కొండలలో వుండే వారంతా విభిన్న కొండ తెగల వారు. వీరంతా క్రైస్తవులు ఈ రాష్ట్రంలో 60 శాతం మంది అక్షరాస్యులు మిగతా ఈశాన్య రాష్ట్రాలలాగానే క్రైస్తవ మిషనరీల కృషి మూలంగా ఈ రాష్ట్రంలో కూడా ప్రజల్లో అక్షరాస్యత హెచ్చుగా వుంది

మణిపూర్ వైశాల్యంలో 60 శాతం అడవులు, 30 శాతం కొండలు, 10 శాతం మాత్రమే సాగుకు వీలైన భూమి వుంది ఈ రాష్ట్రంలో ప్రధాన నదులు ఇంఫాల్, ఇరిల్, ఇరాంగ్, బరాక్ ఇక్కడ సగటున సంవత్సరానికి 195 సెం మీ వర్షం పడుతుంది.

మణిపూర్ వ్యవసాయిక రాష్ట్రం 78 శాతం ప్రజలకు జీవనాధారం వ్యవసాయమే వరి ముఖ్య పంట ఇంకా జొన్న కూడా పండుతుంది రాష్ట్రం అంతా కొండలు, లోయలు కావటం వలన సాగుభూమి చాలా తక్కువగా వుంటుంది 2 లక్షల హెక్టార్ల భూమి వరి సాగు క్రింద వుంది ఇందులో సగం భూమి కొండవాలులో సాగు అయ్యే భూమి గోధుమ, చెరకు, బంగాళాదుంపలు కూడా కొద్దిగా పండుతాయి మిగతా ఈశాన్య రాష్ట్రాల రైతులు లాగా గాకుండా ఈ రాష్ట్ర రైతులు వ్యవసాయాన్ని ఆధునిక పద్ధతులలో చేస్తున్నారు అధిక దిగుబడి వరి వంగడాలు వేసి రసాయినిక ఎరువులు ఎక్కువగా వాడి అధిక పంటలు పండిస్తున్నారు

వ్యవసాయం తర్వాత మణిపూర్‌లో ఎక్కువ మందికి ఉపాధి కల్పించేది చేనేత పరిశ్రమ 3 లక్షల మంది చేనేత మీద జీవిస్తున్నారు పట్టుపరిశ్రమ కూడా ఇక్కడ చెప్పుకోదగిన స్థాయిలో జరుగుతోంది కొండ ప్రజలు ఈ పరిశ్రమను చేపట్టారు సాలీనా ఇక్కడ 5 లక్షల కిలోల ముడిపట్టు తయారవుతోంది

పారిశ్రామికంగా మణిపూర్ వెనుకబడి లేదు స్పిన్నింగ్ మిల్లులు, పంచదార మిల్లులు వున్నాయి టి వి అసెంబ్లీ సైకిల్ అసెంబ్లీ ఫ్యాక్టరీలుకూడా వున్నాయి ఇంకా కొన్ని చిన్న చిన్న పరిశ్రమలు వున్నాయి 25వేల మంది కార్మికులు ఈ పరిశ్రమలలో పనిచేస్తున్నారు

మణిపూరి టిబెట్ బర్మీస్‌కు చెందిన బాష 7 తెగలు మాట్లాడే భాషల మిశ్రమమే మణిపురి ఈ బాషకు స్వంత లిపి కూడా వుంది మణిపురి సారస్వతం అంతా జానపద సాహిత్యంతో నిండివుంటుంది జానపదులు పాడుకునే పాటల్లో వీరగాధలు ఎక్కువగా వుంటాయి మణిపురిలో ప్రసిద్ధిచెందిన గ్రంధం "కుంభ" ఈ గ్రంధంలో క్రీ॥ శ॥ 33 నుంచి మణిపూర్‌ను ఏలిన రాజుల చరిత్ర వుంటుంది ప్రాచీన మణిపురి సాహిత్యం అలంకారాలతో క్లిష్టమైన శబ్దాలతో వుంటుంది మణిపురిలో భారతీయ గ్రంధాల ఆధారంగా రచింపబడినవి కూడా కొన్ని వుంటాయి 18వ శతాబ్దంలో రచించబడిన 'రామనంగబ" (రామ నిర్యాణం) రామాయణం ఆధారంగా రచింపబడినది ఆధునిక మణిపురి సాహిత్యంలో గేయాలు, నవలలు, నాటకాల ఎక్కువగా వుంటాయి

మణిపూర్ అనగానే మణిపురి డాన్స్ గుర్తుకు వస్తుంది ప్రపంచ ప్రసిద్ధి చెందిన మణిపురి డాన్స్‌కు పుట్టినిల్లు మణిపూర్ 15-18 శతాబ్దాలమధ్యలో మణిపూర్‌లో వైష్ణవ మతం, సాంప్రదాయాలు వ్యాపించినాయి మణిపూరి నృత్యం వైష్ణవ మత ప్రచారంలో ఒకభాగంగా రూపొందినదే! మణిపురి నృత్యరీతులలో ప్రధానమైనవి రెండు-లాయ్ హరోబా. రాసలీల లాయ్‌రోబా ప్రపంచం పుట్టుక గురించి చెబుతుంది ఇక రాసలీల అంటే కృష్ణలీలలే!

ఇండియా గవర్నర్ జనరల్‌గా పనిచేసిన లార్డ్ ఇర్విన్ మణిపూర్‌ని "భారత స్విట్జర్లాండ్" గా అభివర్ణించాడు. పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ మణిపూర్‌ని "భారత దేశపు ఆభరణం" గా వర్ణించారు. కొండలు, కోనలు, లోయలు, సరస్సులు, పచ్చని మైదానాలతో ప్రశాంతంగా వుండే మణిపూర్ చూడచక్కని సుందర ప్రదేశం.

రాష్ట్ర రాజధాని ఇంఫాల్ చారిత్రక ప్రాధాన్యం కల్గిన ప్రదేశం. 1944లో భారత ప్రజలు ప్రియతమ నేత సుభాష్ చంద్రబోస్ ఇండియన్ నేషనల్ ఆర్మీ (ఐ యన్ ఎ) తో బర్మా వైపు నుంచి బ్రిటిష్ ఇండియాపై దండెత్తటంతో ఈ ప్రాంతానికి విశేష ప్రాధాన్యం కల్గింది. ఇండియన్ నేషనల్ ఆర్మీ దళాలు ఇంఫాల్‌కు మూడు కిలోమీటర్ల వరకూ చొచ్చుకు వచ్చి ఈ ప్రాంతాన్ని స్వాధీనం చేసుకున్నాయి. అంతేగాక కోహిమా వరకు కూడా బ్రిటిష్ వారి నుంచి విముక్తి కల్గించాయి. నేతాజీ నాయకత్వంలో జరిగిన ఈ వీరోచిత పోరాటం భారతదేశ చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించబడుతుంది. అయితే నేషనల్ ఆర్మీ విజయాలు ఎంతో కాలం నిలవలేదు. బ్రిటిష్ వైస్రాయ్ లార్డ్ మవుంట్‌బాటెన్ ఇంఫాల్ నేషనల్ ఆర్మీ వశం కాకుండా ఎలాగైన ప్రయత్నించండని బ్రిటిష్ ఇండియా సైన్యాలకు గట్టి ఆదేశాలివ్వటం, పైగా వర్షాకాలం ముంచుకువచ్చి నేషనల్ ఆర్మీకి ఆహారపదార్థాలు సరిగా అందక పోవటం, ఇండియన్ నేషనల్ ఆర్మీకి వైమానిక దళకవచం లేకపోవటంతో వెనక్కి తగ్గాల్సి వచ్చింది.

ఇంఫాల్ వాణిజ్య పరంగా ప్రసిద్ధి చెందిన నగరమే గాక సాంస్కృతికంగా కూడా ప్రసిద్ధి చెందిన నగరం. ఇచ్చట వున్న గోవిందా జి స్వర్ణ ఆలయంలో నిత్యం మణిపురి నృత్యాలు జరుగుతాయి. ఇంఫాల్ గుండా రెండు నదులు ఇంఫాల్, నంబల్ ప్రవహిస్తూ వుంటాయి. ఇంఫాల్‌లో వున్న అనేక దేవాలయాల్లో హనుమాన్ మందిర్ ప్రసిద్ధి చెందినది. ఈ మందిరాన్ని 17వ శతాబ్దంలో నిర్మించబడింది. మణిపూర్‌లో ఇదే అతి ప్రాచీన ఆలయం.

ఇంఫాల్‌లో రెండవ ప్రపంచ యుద్ధ జ్ఞాపికలు కూడా దర్శించదగినవే. ఈ యుద్ధ జ్ఞాపికలు హిందూ, క్రైస్తవ అమరవీర జవాన్లకు వేరువేరుగా వుంటాయి. ఈ జ్ఞాపికలు 'కామన్‌వెల్త్ వార్ గ్రేవ్స్ కమిషన్ పర్యవేక్షణలో వుంటాయి.

ఇంఫాల్‌లో ప్రధానంగా చూడదగినది క్వయిరంబండ్ బజార్. రాష్ట్రం అంతటికీ ఈ బజారే ముఖ్య వ్యాపార కూడలి. ఈ మార్కెట్ విశేషం ఏమంటే దాదాపు అన్ని షాపులు స్త్రీలే నిర్వహిస్తారు. చేనేత బట్టల దగ్గర నుంచి చేపల దాకా సైకిళ్ళ దగ్గర నుంచి గుండు సూదుల వరకూ ఇచ్చట అమ్ముతారు.

ఇంఫాల్‌కు 37 కి.మీ దూరంలో కాంజయ్‌లో కూడా రెండవ ప్రపంచ యుద్ధ జ్ఞాపిక వుంటుంది కాంజయ్‌కి దగ్గరలోనే మోరాంగ్ వుంటుంది. ఇచ్చటనే నేతాజీ సుభాష్ చంద్రబోస్ ఇండియన్ నేషనల్ ఆర్మీ పతాకం మొట్టమొదటిగా ఎగురవేసింది.

ఇంఫాల్‌కు 83 కి.మీ. దూరంలో ఉక్రల్, 106 కి.మీ దూరంలో మావో అనే చక్కని వేసవి విడిది పర్వతాలు వుంటాయి ఉక్రల్‌లో క్రిష్టమస్ ఉత్సవాలు గొప్పగా జరుగుతాయి. ఉక్రల్‌కు 60 కి.మీ. దూరంలో న్యూచారు చందపూర్ వుంటుంది. ఇచ్చట కొండ ప్రజలు చేతితో తయారు చేసిన రకరకాల వస్తువులు అమ్మకం చేస్తారు.

మణిపూర్‌లో ఇప్పటికి సమిష్టి కుటుంబ వ్యవస్థ కొనసాగుతోంది. కుటుంబం అంతా కలిసి వుంటారు ప్రతి ఇంట్లోను తప్పని సరిగా కూరగాయలు పండించుతారు. ప్రతి ఇంట్లోను చేపలకు ఒక చిన్న సరస్సు ఉంటుంది. ఇంటికి అవసరమైన కలప కోసం ప్రతి ఇంటి ఆవరణలోను వెదురు గుమ్మ పెంచుకుంటారు.

మణిపూర్ ప్రజలు రంగురంగుల దుస్తులు ధరిస్తారు. చేనేత వస్త్రాలపై వివిధ రకాల డిజైన్లు, రంగులు వేసి వాటిని ధరిస్తారు. మణిపూర్ ప్రజలు సంగీతనృత్యాలను అమితంగా అభిమానిస్తారు. తీరిక వేళల్లో పాటలు పాడుకుంటూ నృత్యం చేస్తూ ఉంటారు.

# 24 మిజోరాం

వైశాల్యం - 21081 చదరపు కిలోమీటర్లు రాజధాని - ఐజ్వాల్ జనాభా - లక్షల 86 వేలు మాట్లాడే భాషలు - ఇంగ్లీషు, మిజో

మిజోరాంకు ఉత్తరాన అస్సాం, మణిపూర్ రాష్ట్రాలు, తూర్పున దక్షిణాన బర్మా దే పడమర త్రిపుర రాష్ట్రం, బంగ్లాదేశ్‌లు హద్దులుగా వుంటాయి

వైశాల్యం రీత్యా మిజోరాం సుమారుగా తూర్పుగోదావరి జిల్లా కన్నా రెట్టిం వుంటుంది

మిజోరాం అనగా మిజోలు వుండే ప్రదేశం అని అర్థం మిజో అంటే కొండ మీద వుండే ప్రజలని అర్థం. మిజోరాం అంతా కొండ ప్రదేశమే ఈ కొండలు ఉత్తరాన్నుంచి దక్షిణానికి వ్యాపించి వుంటాయి ఈ కొండల సగటు ఎత్తు 900 మీటర్లు ఈ పర్వతాలన్నింటిలో ఎత్తైన పర్వతం బ్లూ మౌంటెన్ దీని ఎత్తు 2165 మీటర్లు




మిజోరాం 1954కి పూర్వం లుషాయ్ కొండల జిల్లాగా అస్సాంలో భాగంగా వుండేది. మిజో ప్రజలను లుషాయ్ ప్రజలని కూడా అంటారు అందువలన ఈ జిల్లాకు ఆ పేరు వచ్చింది.




మిజో ప్రజలు మంగోలియన్ జాతికి చెందిన వారు పూర్వం వీరు బర్మాలో వుండేవారు అక్కడ నుంచి తరలి వచ్చి లుషాయ్ కొండలను ఆక్రమించుకున్నారు బ్రిటిష్ వారు ఇండియాను ఆక్రమించుకున్నప్పుడు మిజోలు తిరుగుబాటు చేసి ఎదిరించారు. కాని ఆధునిక ఆయుధాలతో వున్న బ్రిటిష్ సైన్యం వీరిని త్వరలోనే అణిచివేశారు 1891లో ఈ ప్రాంతాన్ని బ్రిటిష్ వారు హస్తగతం చేసుకున్నారు. 1898లో ఈ ప్రాంతాన్ని లుషాయ్ జిల్లాగా అస్సాంలో భాగంగా చేశారు. బ్రిటిష్ వారు ఈ ప్రాంతాన్ని ఆక్రమించుకున్నా మిజోల రోజువారీ

పరిపాలనలో జోక్యం కలుగ జేసుకోలేదు మిజోల ఆచార వ్యవహారాలు కట్టుబాట్ల ప్రకారం మిజో ప్రాంతం మిజో తెగ నాయకుల పరిపాలన క్రిందే వుండేవి.

భారత్ స్వతంత్రం కావటంతో మిజోరాం ప్రజలకు అస్సాంలో లుషాయ్ జిల్లాగా వుండిపోవటం ఇష్టం లేకపోయింది తమ ఆచార వ్యవహారాలు/ సాంప్రదాయాలు పరిరక్షించుకోవటానికి ప్రత్యేక రాష్ట్రం కావాలని హింసాయుత ఆందోళన ప్రారంభించారు. మిజోనేషనల్ ఫ్రంట్ పార్టీ ఈ ఆందోళనకు నాయకత్వం వహించింది. ఈ పార్టీ నాయకుడు లాల్ డెంగా. ఈ పోరాట ఫలితంగా 1972లో కేంద్ర ప్రభుత్వం లుసాయ్ జిల్లాను వేరు చేసి మిజోరాం అని పేరు పెట్టి కేంద్రపాలిత ప్రాంతంగా ఏర్పాటు చేసింది మిజోలు అంతటితో తృప్తిపడక ప్రత్యేక రాష్ట్రం కోసం పోరాటం కొనసాగించారు. ఎట్టకేలకు 1986లో మిజోరాం భారత్‌లో 23వ రాష్ట్రంగా ఏర్పడింది. 30 సంవత్సరాల మిజోల పోరాటం ఫలితంగా మిజోరాం పూర్తి ప్రతిపత్తిగల రాష్ట్రంగా అవతరించింది.

లాల్‌డెంగా మిజోరం ప్రధమ ముఖ్యమంత్రి అయ్యారు.

మిజోరాం వైశాల్యంలో 60 శాతం మేర దట్టమైన అడవులు, కొండలే ఆక్రమించి వుంటాయి రాష్ట్రంలో అనేక చిన్న చిన్న నదులు వర్షాధారంగా ప్రవహిస్తూ వుంటాయి వీటిలో ముఖ్యమైనవి ట్లంగ్, సోనై, కలోడైన్, కర్నపురి, మిజోరాంలో లోయల ప్రాంతం మైదాన ప్రాంతం ఆరోగ్యరీత్యా మంచిది కాదు. ముఖ్యంగా ఈ ప్రాంతాలలో వర్షాకాలంలో మలేరియా ఎక్కువగా వుంటుంది కొండ ప్రాంతాలు మాత్రం ఆరోగ్యంగా ఆహ్లాదకరంగా వుంటాయి మిజోరాంలో వేసవి కాలంలో పెద్దగా వేడిగా వుండదు. మే నుంచి సెప్టెంబరు వరకూ వర్షాలు పడతాయి. సగటున సంవత్సరానికి 200 సెంటిమీటర్ల వర్షం పడుతుంది చలికాలంలో కూడా ఒక మాదిరి చలి మాత్రమే వుంటుంది.

మిజోరాం మూడు జిల్లాలుగా విభజించబడి వుంటుంది. 1. ఐజ్వాల్ 2. లంగ్లేయి 3 చిమ్‌టుపు. ఈ మూడు జిల్లాలోను పెద్ద జిల్లా ఐజ్వాల్ వైశాల్యంలోనూ జనాభాలో కూడా రాష్ట్ర జనాభా 6 లక్షలపై చిలుకులో ఈ ఒక్క జిల్లాలోనే 4 లక్షలు వుంటారు.

షిల్లాంగ్ (మేఘాలయ) లోని నార్త్ ఈస్ట్రన్ హిల్ యూనివర్సిటీ (NEHU) యే మిజోరాంకు కూడా యూనివర్సిటీగా వుంటుంది ఈ యూనివర్సిటీ విభాగం రాష్ట్ర రాజధాని ఐజ్వాల్‌లో వుంటుంది.

మిజోరాంలో శాసనసభ్యులు సంఖ్య 40 మంది. లోక్‌సభలో ఒక సభ్యుడు, రాజ్యసభలో ఒక సభ్యుడు ఈ రాష్ట్రానికి ప్రాతినిధ్యం వహింమతారు.

మిజోరాం జనాభాలో 89 శాతం క్రైస్తవులు, 8 శాతం మంది హిందువులు. సరిహద్దులలో వుండే వక్మా తెగవారు బౌద్ధులు.

మిజోరాం జనాభాలో అక్షరాస్యత శాతం చాలా పెచ్చుగా వుంటుంది. క్రైస్తవ మిషనరీల కృషి ఫలితంగా రాష్ట్ర జనాభాలో 75 శాతం మంది అక్షరాస్యులే! కేరళ తర్వాత ఈ రాష్ట్రమే ఎక్కువమంది చదువుకున్న వారున్న రాష్ట్రం. మిజో భాషకు స్వంత లిపి లేదు. క్రైస్తవ మిషనరీలు రోమన్ లిపినే మిజో భాషా లిపిగా ఏర్పాటు చేయటంతో మిజోలు తమ మాతృభాష మిజో భాషతో పాటు ఇంగ్లీషు కూడా నేర్చుకోవటం సులభమయింది. ఈ ప్రజల్లో అత్యధికులు మిజో, ఇంగ్లీషు కూడా మాట్లాడతారు.

మిజోలు ప్రధానంగా వ్యవసాయదారులు. వరి ప్రధాన పంట. పర్వత సానువుల్లో పంటలు పండిస్తారు. అయితే మిగతా ఈశాన్య రాష్ట్రాలలో కొండ ప్రజల్లాగానే ఇక్కడ కూడా లోగడ 'జూమ్మింగ్' పద్ధతి వ్యవసాయం చేయటం వలన అడవులు తరిగిపోవటమే గాక పంటల దిగుబడి కూడా పెద్దగా వుండేది కాదు. (జూమ్మింగ్ పద్ధతి వ్యవసాయం అంటే ఒకే చోట నివసిస్తే ఒకే భూమిలో పంటలు పండించకుండా సంవత్సరానికి ఒక చోట కావాల్సిన మేర అడవుల్ని నరికి ఎండగానే కర్రకు నిప్పు పెట్టి ఆ ప్రాంతంలో సాగు చేయటం. ఈ పద్ధతిలో చేలకు ఎరువులు వేయరు) అయితే ఇప్పుడిప్పుడే ఈ పద్ధతి మానేసి ఆధునిక వ్యవసాయం చేబడుతున్నారు. జొన్న కూడా ఇక్కడ పండుతుంది. 3 వేల హెక్టార్ల భూమి మాత్రమే సాగులో వుంది. పొలాలన్నీ కొండ వాలులో వుండటం వలన నీటి పారుదల సౌకర్యం వుండదు. వర్షాధారంగా మాత్రమే పంటలు పండాలి. ఆహార ధాన్యాల్లో ఈ రాష్ట్రం లోటు రాష్ట్రంగానే వుంది. వాణిజ్య పంటల్లో ముఖ్యంగా చెప్పుకోదగిన పంటలు అల్లం, ఆవాలు, నువ్వులు, బంగాళాదుంపలు, నారింజ. ఇచ్చట అల్లం బాగా పండుతుంది. రబ్బర్, కాఫీ, టీ తోటల పెంపకానికి కూడా కృషి జరుగుతోంది. పట్టుపరిశ్రమ కూడా ఇచ్చట చెప్పుకోదగిన పరిశ్రమ. మల్బరీ, ఇరి, జార్, ముగ అనే రకాల పట్టు ఇచ్చట తయారవుతుంది.

ఈ రాష్ట్రంలో చెప్పుకోదగిన పెద్ద పరిశ్రమలంటూ లేవు. అల్లం, వంటనూనెలు, పళ్ళకు సంబంధించిన మధ్యతరహా పరిశ్రమలు మాత్రం వున్నాయి.

మిజోరాంలో చేనేత పరిశ్రమ అనేక మందికి ఉపాధి కల్పిస్తోంది. ఎంబ్రాయిడరీ, హస్తకళలకు కూడా ఈ రాష్ట్రం ప్రసిద్ధి పొందింది.

మిజోరాంలో ప్రత్యేకంగా చూడవల్సిన ప్రదేశాలేమీ లేవుగాని మిజోరాంలో సంవత్సరం పొడవునా ఆహ్లాదకరమైన వాతావరణం, కొండలు, కోనలు, సెలయేళ్ళు,

కొండలపై నుంచి జారిపడుతూ విపరీతమైన వేగంతో ప్రవహించే చిన్న చిన్న వాగులు, నదులు, కొండవాలుల్లో కొనసాగే వ్యవసాయం, నారింజతోటలు మిజోరాం చూడటానికి వెళ్ళేవారిని పరవశింపజేస్తాయి. రకరాల వాతావరణ కాలుష్యాలతో విసిగిపోయిన పట్టణ వాసులకు అన్ని కాలుష్యాలకు దూరంగా ప్రశాంతమైన ప్రకృతి ఒడిలో ఒదిగివున్న ఈ రాష్ట్రాన్ని సందర్శించటం హాయి గొల్పుతుంది. ముఖ్యంగా అతిధుల పట్ల మిజోరాం ప్రజలు చూపే ఆదరాభిమానాలు చిరస్మరణీయంగా వుంటాయి.

మిజోరాం ప్రజల్లో అత్యధిక సంఖ్యాకులు క్రైస్తవులు కావటం వలన పాశ్చాత్య పద్ధతులు, నాగరికతా ధోరణులు ఈ ప్రజల్లో కానవస్తాయి. అయితే వీరు ఎంత పాశ్చాత్య పద్ధతులకు అలవడినా వారి సనాతన ఆచారాలు, పద్ధతులు ఇప్పటికీ కొనసాగుతున్నాయి.

మిజోరాం ప్రజలు అనేక తెగలుగా వుంటాయి. లుషాయ్, పలిస్‌పాంగ్, కుకీ, మరాస్ మొదలైనవి ఈ తెగల పేర్లు. అయితే ఈ తెగలన్నింటిలోకి పెద్దది లుషాయ్ తెగ. అత్యధిక సంఖ్యాకులు వీరే. అందువల్లనే వీరుండే ప్రాంతాన్ని లుషాయ్ కొండలు అనేవారు లోగడ.

మిజోలు ఇళ్ళు కొండల పై కట్టుకుంటారు. చిన్న గ్రామం అయితే 50 ఇళ్ళు పెద్ద గ్రామం అయితే 500 ఇళ్ళు వుంటాయి. ఒక్కొక్క గ్రామం మధ్య కొన్ని మైళ్ళ దూరం వుంటుంది. గ్రామం మధ్యలో తెగ నాయకుని ఇల్లు వుంటుంది. బ్రహ్మచారి యువకులు వుండే ఇల్లు (జాల్‌బక్) కూడా గ్రామం మధ్యలోనే వుంటుంది. పెళ్లికాని యువకులు ఈ జాల్‌బక్‌లో వుంటారు. భోజనానికి మాత్రమే తల్లిదండ్రుల ఇళ్ళకు వెళ్ళతారు. గ్రామం అంతా ఒక కట్టడిగా వుంటారు. పెద్దల మాట శిరసావహిస్తారు. లోగడ తెగ నాయకుని మాట వేదాక్షరంగా చలామణి అయ్యేది. ప్రస్తుతం ఈ విధానంలో కొంత మార్పు వస్తోంది. లోగడ వ్యవసాయం కూడా సమిష్టిగా చేసి ఫలసాయం పంచుకునే వారు. శిశువు జన్మించినా, పెళ్ళి జరిగినా, ఎవ్వరైన చనిపోయినా గ్రామం అంతా సందడే!

మిజో స్త్రీలు కేశాలంకరణకు అధిక ప్రాధాన్యం ఇస్తారు. జుట్టు బాగా వత్తుగా పెరగటానికి పంది కొవ్వు రాసుకుంటారు. ఈ ప్రజలు స్త్రీ, పురుష బేధం లేకుండా చుట్టలు కాలుస్తారు. వీరు కుక్కల్ని, ఎలుకల్ని తింటారు. అయితే పిల్లుల్ని, పాముల్ని, గబ్బిలాల్ని తినరు. నాటు సారా విచ్చల విడిగా త్రాగుతారు.

వివాహ సంబంధాలు వధూవరుల ఇష్ట ప్రకారం జరుగుతాయి. కన్యాశుల్కం అమలులో వుంది. వీరిలో విడాకులు తీసుకోవటం అతి సులువుగా వుంటుంది. దంపతులలో మనస్పర్ధలు వస్తే ఇరువురిలో ఏ ఒక్కరైనా "నేను నీకు విడాకులు ఇస్తున్నాను" అంటే చాలు. విడాకులు జరిగిపోతుంది. అయితే విడాకులు ఎవరు కోరితే

వారు పెళ్ళి ఖర్చులు రెండో వారికి ఇచ్చుకోవాలి

మిజో తెగల్లో ఆస్తి హక్కు చిన్న కుమారునికి మాత్రమే వుంటుంది అయితే తెగ నాయకత్వం వారసత్వం మాత్రం పెద్ద కుమారునికి దక్కుతుంది

ఈ తెగల్లో అతిథి మర్యాదలు గొప్పగా వుంటాయి అతిథిని అన్ని విధాలా సంతృప్తి పర్చటం వారి కర్తవ్యంగా బావిస్తారు వచ్చిన అతిథికి ఏదైన జబ్బు చేస్తే ఆ జబ్బు తగ్గేదాకా తమ వద్ద వుంచుకొని ఆ తర్వాతే అతడ్ని పంపటం వీరి రివాజు. జబ్బు పడ్డ అతిథిని ఎన్నో మైళ్ళ దూరంలో వుండే వైద్యుని వద్దకు గ్రామ యువకులు స్ట్రెచర్ మీద మోసుకుపోతారు (ఈ కొండల్లో రవాణా సౌకర్యాలు లేక పోవటం వలన ఈ విధంగా మోసుకు పోతారు) ఇందు కోసం వారు పనులన్నీ మానుకుంటారు పైగా ఈ విధంగా సేవ చేసినందుకు ఏదైనా బహుమతి పుచ్చుకోవటం అవమానంగా బావిస్తారు విందు భోజనాలప్పుడు తక్కువగా తినటం వీరి ఆచారాల్లో మరొక విశేషం ఈ ఆచారం ఎందుకంటే ఎవరికివారు ఎక్కువగా తింటే ఆఖరికి వచ్చిన వారికి పదార్థాలు చాలక ఇబ్బంది పడతారని వారి ఉద్దేశ్యం గ్రామంలో ఎవరి ఇళ్ళయినా కాలిపోయినా, పడిపోయినా గ్రామస్థులంతా వచ్చి ఆ ఇంటిని బాగుచేస్తారు పెద్దవాళ్ళు ఏదైనా బరువు మోసుకు వస్తూ ఎదురైతే యువకులు ఆ బరువుని తామే ఎత్తుకొని పెద్దలను గౌరవించటం మరో విశేషం

మిజోలు చేసుకునే పండుగలన్నీ వ్యవసాయ సంబంధమైన పండుగలే ఆగస్టు, సెప్టెంబరు మాసాల్లో "మిమ్‌కట్" అనే పండుగును జొన్న పంట చేతికి వచ్చిన తర్వాత చేసుకుంటారు అలాగే 'చాప్‌చర్‌కుట్' అనే పండుగను మార్చిలోను, పాల్‌కుట్ అనే పండుగను జనవరిలోను పంటలు చేతికి వచ్చినప్పుడు చేసుకుంటారు. ఈ పండుగ రోజుల్లో సారా మస్తుగా త్రాగి ఆడుతూ పాడుతూ వుంటారు మిజోలు 'చెరాకి అల్లం' అనే సాంప్రదాయ నృత్యం చేస్తారు అతిథులు గ్రామానికి వస్తే వారి గౌరవార్థం ఈ నృత్యం చేస్తారు.



# నాగాలాండ్

వైశాల్యం - 16579 చదరపు కిలోమీటర్లు రాజధాని - కోహిమా. జనాభా - 12 లక్షల 15వేలు మాట్లాడే భాషలు - ఇంగ్లీషు, ఆవో, కొన్యాక్, అంగామి, సీమ వగైరా.

నాగాలాండ్‌కు తూర్పున బర్మా వుంటుంది పడమర ఉత్తరాన అస్సాం, దక్షిణాన మణిపూర్ రాష్ట్రాలు వుంటాయి బ్రహ్మపుత్ర లోయకు బర్మాకు మధ్యన వుంటుంది నాగాలాండ్.

వైశాల్యం రీత్యా నాగాలాండ్ సుమారుగా అదిలాబాద్ జిల్లా అంత వుంటుంది.

నాగాలాండ్ అనే పేరు అక్కడ వుండే నాగజాతి ప్రజల్ని బట్టి వచ్చింది. నాగాలాండ్ అనే పేరు 'నాగ' అనే సంస్కృత పదం నుంచి వచ్చిందని సంస్కృతంలో నాగ అంటే 'కొండ ప్రజల' ని ఒక అర్థం వుంటుందని కూడా ఒక వాదన వుంది ఇచ్చట అనేక తెగల వారున్నా వీరందర్నీ స్థూలంగా నాగాలనే పిలుస్తారు. అత్యధిక నాగాలు ఈ రాష్ట్రంలోనే వున్నా ఇంకా కొద్దిమంది చుట్టుప్రక్కల రాష్ట్రాలైన అస్సాం, అరుణాచల్‌ప్రదేశ్, మణిపూర్‌లలో కూడా వుంటారు.




నాగాలాండ్ అంతా కొండ ప్రాంతమే. కొద్ది ప్రాంతం మాత్రం చదునుగా వుంటుంది. ఈ రాష్ట్రంలో కెల్లా పెద్ద పర్వతం సారామతి (ఎత్తు 3841 మీటర్లు)

నాగాలాండ్‌లో ప్రధాన నదులు ధన్‌సిరి, దోయాంగ్, జాంజి, సంవత్సరానికి సగటున 200 సెంటీమీటర్ల వర్షం పడుతుంది. కొండలు, కోనలు, లోయలు వాగులు, వంకలతో అలరారే

నాగాలాండ్‌లో వాతావరణం సమశీతోష్ణంగానే వుంటుంది. ఇచ్చట వాతావరణం ఆరోగ్య రీత్యా కూడా బాగా వుంటుంది

1957కి పూర్వం అస్సాంలో భాగంగా వుండేది నాగాలాండ్ ఇదే సంవత్సరంలో అస్సాంలోని నాగాహిల్ జిల్లాను, నార్త్ ఈస్ట్ ఫ్రాంటియర్ ఏజన్సీలోని తుయన్‌సాంగ్ మండలాన్ని విడదీసి కేంద్ర ప్రభుత్వ అజ్మాయిషీలోకి తీసుకున్నారు. రాష్ట్రపతి తరపున అస్సాం గవర్నర్ ఈ ప్రాంతాన్ని పాలించేవాడు. ఇదిలా వుండగా నాగా ప్రజలు తమ సాంప్రదాయాల్ని, సంస్కృతి రక్షించుకోవాలంటే వేరే రాష్ట్రంగా ఏర్పాటు చేయాలని ఆందోళన ప్రారంభించారు. ఎ జడ్ ఫిజో నాయకత్వంలో ఈ ఉద్యమం హింసాయుతంగా ప్రజ్వరిల్లి ప్రత్యేక దేశంగా విడిపోతామనే దాకా వెళ్లింది. కేంద్ర ప్రభుత్వం నాగా ప్రజల కోర్కెలను మన్నించి 1961లో ఈ ప్రాంతాన్ని ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పాటు చేయటానికి సూత్రప్రాయంగా అంగీకరించింది. 1963 డిశంబరు 1న నాగాలాండ్ పేరుతో ఈ ప్రాంతం పూర్తి ప్రతిపత్తిగల రాష్ట్రంగా అవతరించింది.

నాగాలాండ్ ప్రధమ ముఖ్యమంత్రి ఎ.జడ్.ఫిజో కూడా కొంతకాలం ముఖ్యమంత్రిగా వున్నారు.

నాగాలాండ్ రాష్ట్రంగా ఏర్పడిన కొత్తలో మూడు జిల్లాలుగానే వుండేది. 1973లో ఈ జిల్లాల్ని పునర్విభజించి 7 జిల్లాలుగా చేశారు. 1. కోహిమా 2. పెక్. 3. మోకోక్‌మంగ్ 4. జున్ హెబోటో 5. వాకా 6. తుయన్ సాంగ్ 7. మాన్.

నాగాలాండ్ అసెంబ్లీలో 60 మంది సభ్యులు వుంటారు. లోక్‌సభలో ఒకరు, రాజ్యసభలో ఒకరు నాగాలాండ్‌కు ప్రాతినిధ్యం వహించుతారు.

నాగాలాండ్ జనాభాలో 82 శాతం మంది క్రైస్తవులు, హిందువులు 15 శాతం, మిగతా వారు ముస్లింలు. క్రైస్తవ మిషనరీలు నాగా ప్రజల్లోకి చొచ్చుకు పోవటం వలన ఈ ప్రజలంతా క్రైస్తవ మతంలోకి మారటమే గాక వీరంతా మిషనరీల పలుకుబడి క్రింద వుంటారు. మిషనరీల కారణంగా ఈ ప్రజల్లో అక్షరాస్యత శాతం కూడా ఎక్కువే ప్రజల్లో 55 శాతం మంది అక్షరాస్యులే. వీరందరూ ఇంగ్లీషు మాట్లాడతారు. ప్రభుత్వ వ్యవహారాలన్నీ ఇంగ్లీషులోనే కొనసాగుతాయి

నాగాలాండ్‌లో సెంట్రల్ యూనివర్శిటీ వుంది. నార్త్ ఈస్టర్న్ హిల్ యూనివర్సిటీ (NEHU) విభాగం కూడా కోహిమాలో వుంది. నాగాలాండ్‌లో వున్న దాదాపు వెయ్యి గ్రామాల్లో ప్రతి ఊళ్ళోను ప్రాధమిక పాఠశాల వుంటుంది. వందకు పైగా హైస్కూళ్ళు కూడా వున్నాయి.

నాగాలాండ్ ప్రధానంగా వ్యవసాయ రాష్ట్రం. 90 శాతం మంది ప్రజలకు జీవనాధారం వ్యవసాయమే వరి ప్రధాన పంట. చదునైన నేల తక్కువగా వుండటం వలన కొండవాలులలో పంటలు పండిస్తారు. నీటి పారుదల సౌకర్యం తక్కువగా వుండటం వలన పంటలు వర్షాధారంగా పండిస్తారు. మిగతా ఈశాన్య రాష్ట్రాలలో లాగానే ఇక్కడ ప్రజలు కూడా 'జుమ్మింగ్' పద్ధతి వ్యవసాయం చేయటం వలన పొల్లాల్లో అధిక దిగుబడి రాదు. ఇచ్చట రైతులు ఇప్పుడిప్పుడే ఆధునిక వ్యవసాయ పద్ధతులకు అలవాటు పడుతున్నారు. ఇచ్చట చెరకు కూడా కొద్దిగా పండుతుంది.

నాగాలాండ్‌లో అటవీ సంపద పుష్కలంగా వుంది. నాణ్యమైన కలప దొరుకుతుంది. ఇంకా అనేక వస్తువులు కూడా ఈ అడవుల్లో దొరుకుతాయి. రాష్ట్ర ప్రభుత్వానికి ఎక్కువ ఆదాయం ఈ అటవీ సంపద ద్వారానే వస్తుంది. అటవీ సంపద ఆధారంగా పేపర్ మిల్లు ఒకటి, ప్లైవుడ్ ఫ్యాక్టరీ ఒకటి నడుస్తున్నాయి. రంపపు మిల్లులు కూడా ఎక్కువగా వున్నాయి. రబ్బరు చెప్పులు తయారుచేసే కర్మాగారం, పాలిథీన్ సంచులు తయారు చేసే ఫ్యాక్టరీలు మధ్య తరహా పరిశ్రమలుగా వున్నాయి. పంచదార ఫ్యాక్టరీ కూడా ఒకటి వుంది చిన్న, మధ్య తరహా పరిశ్రమలు అనేకం ఇచ్చట నెలకొల్పటం వలన నాగాలాండ్ పారిశ్రామికంగా కూడా ముందంజ వేస్తోంది.

నాగాలాండ్ రాజధాని కోహిమా సముద్ర మట్టానికి 1495 మీటర్ల ఎత్తున వుంటుంది. కోహిమాకు రైలు మార్గంగాని విమాన మార్గం గాని లేదు. కోహిమా చేరాలంటే 74 కి.మీ. దూరంలో మాపూర్‌కు రైల్లో గాని విమానంలో గాని వెళ్ళి అచ్చట నుంచి కారులో వెళ్ళాల్సిందే. కోహిమాలో చూడాల్సిన ఏకైక ప్రదేశం. రెండవ ప్రపంచ యుద్ధ జ్ఞాపిక. రెండో ప్రపంచ యుద్ధంలో కోహిమా విశేష ప్రాధాన్యం వహించింది. జపాన్ సైన్యానికి ఇండియా సైన్యానికి ఇచ్చట ఘోర సంగ్రామం జరిగింది. 1200 మంది భారత సైనికులు ఇచ్చట వీరమరణం పొందారు. ఈపన్నెండు వందల మంది జ్ఞాపకార్థం 1200 ఇత్తడి జ్ఞాపికలను అనేక వరుసలలో పేర్చారు. ప్రధాన ఇత్తడి ఫలకం పై సందర్శకులనుద్దేశిస్తూ అమరవీరుల త్యాగాన్ని కీర్తిస్తూ ఈ విధంగా రాసి వుంటుంది. మీరు ఇంటికి వెళ్ళగానే మా గురించి చెప్పండి మీ స్నేహితులకు. మీ భవిష్యత్ కోసం మేము ప్రాణాలర్పించామని చెప్పండి దగ్గరలోనే ఉన్న చెర్రీ చెట్టు మీద ఈ విధంగా రాసి వుంటుంది - ఇక్కడే. ఈ టెన్నిస్ కోర్టు పరిసరాల్లోనే భారత వీరజవాన్లు జపాన్ పరాక్రమణను అడ్డుకోవటానికి ప్రాణాలర్పించారు.

కోహిమాకు 2 కిలోమీటర్ల దూరంలో ఆసియాలో కెల్లా పెద్ద గ్రామంగా చెప్పుకునే బారా బస్తీ వుంటుంది. లోగడ ఈ గ్రామంలో 7 సరస్సులు వుండేవట.

గ్రామంలో ప్రవేశించటానికి 7 ద్వారాలు వుండేవట. ఈ ద్వారంపై అంగామినాగా ప్రజల వీరత్వానికి చిహ్నంగా ఎద్దుకొమ్ములు వేలాడుతూ వుంటాయి.

నాగాలాండ్‌లో జనసాంద్రత చాలా తక్కువ కావటం వలన రాష్ట్రంలో వున్న దాదాపు వెయ్యి గ్రామాలు అక్కడొకటి అక్కడొకటి ఎడం ఎడంగా వుంటాయి. చెప్పుకోదగిన పట్టణాలు ఏమీ లేవు.

నాగాలాండ్ ప్రజలు 16 తెగలుగా వుంటారు. ఒకో తెగ ఒకో భాష మాట్లాడతారు. ఆచార వ్యవహారాలు పద్ధతులు కూడా వేరు వేరుగా వుంటాయి. అయితే వీరందరిలోను సాధారణంగా కానవచ్చే ఏకైక విషయం - ఈ తెగలన్నీ సంగీతం నృత్యం అంటే అమితంగా ఇష్టపడతారు. ఈ తెగలన్నీ మంగోలియన్ జాతికి చెందినవే! విభిన్న తెగలుగా వున్న వీరందరూ తాము నాగాల మనే చెప్పుకుంటారు.

నాగా ప్రజలు ఇళ్ళు చెక్కలతో కట్టుకుంటారు. ప్రతి గ్రామం చుట్టూ కంచె వుంటుంది. గ్రామంలో ప్రవేశించటానికి ఒకే ద్వారం వుంటుంది. శత్రువులు ఎవరైనా తమ గ్రామం మీద దాడి చేయకుండా ఈ విధంగా జాగ్రత్త పడతారు. లోగడ ఈ తెగలు తరుచుగా పోట్లాడుకోవటం జరుగుతూ వుండేది. వీరిలో పోట్లాడుకోవటం అంటే మాటలతో కాదు. కక్ష కట్టి ఎదుటి తెగ గ్రామాలపై పడి తలలు కత్తిరించుకు రావటమే! దీన్ని వారు "శిరసేకరణ దాడి" అనే వారు. ఇంటింటికు వచ్చిన తలలను కర్రలకు గుచ్చి గ్రామం ముందు నిలబెట్టి విజయోత్సాహం సంబరంగా చేసుకునేవారు. అయితే ఇప్పుడు ఈ పద్ధతి లేదు.

సాధారణంగా నాగా ప్రజలు శాంత స్వభావులే. నీతి నిజాయితీలు వీరి సొత్తు. కొత్తగా ఎవరైనా తమ గ్రామానికి వస్తే వారిని అంత తేలిగ్గా నమ్మరు. అనుమానంగా చూస్తారు. అయితే వారి విశ్వాసం పొందితే మాత్రం తమ ప్రాణాలు ఇవ్వటానికైనా సిద్ధపడతారు. నాగాలంతా మాంసాహారులే. అన్ని రకాల జంతువుల్ని - కుక్కల్నీ, పిల్లుల్నీ కూడా తింటారు. మద్యం ఎక్కువగా త్రాగుతారు.

నాగాలు అతిధి సత్కారం బాగా చేస్తారు. అయితే ఈ సత్కారం కొంచెం మోతాదు మించి కూడా వుంటుంది. వచ్చిన అతిధులకు తాము పెట్టిన మాంసం గాని మరేదైనా గాని ఇష్టం లేక వదిలేస్తే అది వారిని అవమానించటంగా భావించుతారు. ఈ విధంగా తిరస్కరించి నందుకు తగాదా కూడా పెట్టుకుంటారు.

నాగా ప్రజల్లో దొంగతనం, హత్యలు, వ్యభిచారం చాలా తక్కువగా వుంటాయి. తప్పు చేస్తే తక్షణం గ్రామ పెద్దలు అతడికి తగు శిక్ష విధించుతారు. శిక్షలు జరిమానా

రూపేణా గాని, గ్రామ బహిష్కరణ రూపేణా గాని వుంటాయి. అసలు నాగా ప్రజలు చేసిన తప్పును వెంటనే ఒప్పేసుకుంటారు. అబద్ధం ఆడటం మహాపాపంగా భావిస్తారు.

నాగాలలో వివాహాలు కూడా వధూవరుల ఇష్ట ప్రకారం మాత్రమే జరుగుతాయి తల్లిదండ్రుల ప్రమేయం వుండదు. కట్నాలు వుండవు. విందు, నృత్య కార్యక్రమంతో వివాహ తంతు ముగుస్తుంది. విడాకులు పుచ్చుకోవటం కూడా తేలిగ్గానే వుంటుంది. భార్యాభర్తలకు అభిప్రాయ బేధాలు వస్తే గ్రామ పెద్దల సమక్షంలో విడాకులు పుచ్చుకొని వారి కున్న ఆస్తిని చెరి సగం పంచుకుంటారు.

నాగా స్త్రీలు రంగు రంగుల దుస్తులు ధరిస్తారు. పూసలతో చేసిన ఆభరణాలు ధరిస్తారు పురుషులు మొలచుట్టూ అంగవస్త్రం మాత్రమే ధరిస్తారు.

నాగా ప్రజలు సంగీతం అన్నా నృత్యం అన్నా అమితంగా ఇష్టపడతారు. విందులు, ఉత్సవాలు తరుచుగా చేసుకుంటారు. సుష్టుగా తిని మద్యం త్రాగుతూ జానపద గీతాలు పాడుకుంటూ నృత్యం చేస్తారు. ఏ మాత్రం వారికి తీరిక చిక్కినా సంగీతం నృత్యాలతో కాలక్షేపం చేస్తారు.

నాగా ప్రజలకు హస్త కళలో కూడా మంచి నైపుణ్యం వుంది. కొయ్యతో అనేక రకాల బొమ్మలు చేస్తారు. వెదురుతో బుట్టలు అల్లి వాటికి రకరకాల రంగు వేసి అమ్ముతారు. నాగాలాండ్ నాణ్యమైన తేనెకు కూడా ప్రసిద్ధి.

లోగడ నుంచి ఇచ్చట పనిచేస్తున్న క్రైస్తవ మిషనరీలు ఈ ప్రజల్ని తమ మతం వైపుకు త్రిప్పుకున్నాయి. ఈ ప్రజలు కూడా తమ ఆచార వ్యవహారాలను, పద్ధతులను క్రమేపి మర్చిపోయి క్రైస్తవ మతాచారాలకు అలవాటు పడుతున్నారు.

## మన కేంద్రపాలిత ప్రాంతాలు

# 26 లక్షద్వీప్

వైశాల్యం - 32 చదరపు కిలోమీటర్లు జనాభా - 52 వేలు రాజధాని - కవర్తి మాట్లాడే భాష - మళయాళం

లక్షద్వీప్ అరేబియా సముద్రంతో కేరళ రాష్ట్రంలోని తీరపట్టణం కొచ్చిన్‌కు 220 నుంచి 440 కిలోమీటర్ల దూరంలో వుండే 36 దీవుల సముదాయం ఈ 36 దీవుల మొత్తం వైశాల్యం 32 చదరపు కిలోమీటర్లు మాత్రమే! కేంద్ర పాలిత ప్రాంతాలలో కెల్లా లక్షద్వీప్ అతి చిన్న ప్రాంతం ఈ 36 దీవులలో 10 దీవులు మాత్రమే నివాస



యోగ్యమైన ప్రజలుంటారు. మిగతా 26 దీవులలో మంచి నీరు దొరకవు కాబట్టి అచ్చట ప్రజలుండరు నివాసయోగ్యమైన 10 దీవులు వాటి వైశాల్యం జనాభా ఈ విధంగా వుంటుంది

1 మినికాయ్ (వైశాల్యం 4 1/2 చ॥ కి.మీ జనాభా 9 వేలు)
2 కల్పేని 2 1/2 చ॥ కి మీ., జనాభా 5 వేలు)
3 ఎండ్రాట్ 5 చ॥ కి మీ. జనాభా 8 వేలు
4 కవర్తి 31/2 చ॥ కి మీ., జనాభా 8 వేలు,
5 అగత్తి 2 1/2 చ॥ కి మీ జనాభా 5,500
6. ఆమెని 2 /2 చ॥ కి.మీ., జనాభా 6,000
7 కదమత్ 3 చ॥ కి.మీ. జనాభా 4,000
8. కిల్టాన్ 1 1/2 చ॥ కి.మీ జనాభా 3,000
9 చెట్లాట్ 1 చ॥ కి.మీ. జనాభా 2,000
10 బిత్రా చదరపు కిలోమీటర్లో పదోవంతు మాత్రం! జనాభా - రెండు వందలలోపు ఈ పదింటిలోకి బిత్రామరీ చిన్న దీవి.

లక్షద్వీప్‌కి కొచ్చిన్ నుంచి ఓడపై గాని విమానంపైగాని వెళ్ళవచ్చును. కొచ్చిన్ నుంచి లక్షద్వీప్‌కు ఓడ ప్రయాణం 20 గంటలు పడుతుంది.

లక్షద్వీప్‌లో వాతావరణం వేడిగా వుంటుంది. వేసవి కాలంలో మరీ వేడి హెచ్చుగా వుంటుంది మే 15 నుంచి సెప్టెంబరు ఆఖరు వరకూ వర్షాకాలం.

ఈ దీవుల ప్రాచీన చరిత్ర తెలియదు. అయితే క్రీ॥ శ॥ 7వ శతాబ్దానికి పూర్వం ఈ దీవులలో వుండే ప్రజలు అంతా హిందువులు. 7వ శతాబ్దంలో హజరత్ ఉబాయ్‌దుల్లా అనే ముస్లిం మత గురువు మక్కా నుంచి ఇచ్చటకు వచ్చి హిందువులందర్నీ ముస్లింలుగా మార్చి వేశాడు. పోర్చుగీసు వారు ఈ దీవులను స్వాధీనం చేసుకొని ఇచ్చట సంపదను దోచుకోవాలని చూశారు గాని స్థానిక ప్రజలు పోర్చుగీసు వారికి విషం ఇచ్చి చంపటంతో పోర్చుగీసు వారి ఆటలు సాగలేదు. ఇచ్చట ప్రజలందరూ ముస్లింలైనా చాలా కాలం పాటు ఈ దీవులు కేరళ హిందూ రాజుల ఆధీనంలో వుండేవి. ఆ తర్వాత కొన్నాళ్ళకు ఈ దీవులు కన్ననూర్ ముస్లిం పాలకుల చేతుల్లోకి వెళ్ళాయి. అమిని దీవి కొన్నాళ్ళు టిప్పుసుల్తాన్ ఆధీనంలో కూడా వుంది. టిప్పుసుల్తాన్ శ్రీరంగ పట్టణం యుద్ధంలో ఓడిపోవటంతో ఈ దీవులు బ్రిటిష్ ఈస్ట్ ఇండియా కంపెనీ చేతుల్లోకి వెళ్ళాయి.

మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన కొత్తలో లక్షద్వీప్ మద్రాస్ రాష్ట్రంలో భాగంగా వుండేవి. 1956 నుంచి ఇవి కేంద్ర పాలిత ప్రాంతంగా వుంటున్నాయి.

మొదట్లో ఈ లక్షద్వీప్‌ను లక్క దీవ్, మినికాయ్, అమీన్ దీవుల సముదాయం అని పిల్చేవారు. 1973లో వీటి పేరును లక్షద్వీప్‌గా మార్చారు.

ఈ దీవుల పరిపాలన కేంద్ర ప్రభుత్వం నియమించే 'పరిపాలకు'ని ఆధీనంలో వుంటుంది. దీవులన్నీ ఒకే జిల్లాగా 4 తాలూకాలుగా వుంటాయి. పార్లమెంటులో ఒక లోక్‌సభ సభ్యుడు ఈ దీవులకు ప్రాతినిధ్యం వహించుతాడు.

లక్షద్వీప్ అంతా కొబ్బరి తోటలే కానవస్తాయి. ఈ దీవులలో వున్న 2800 హెక్టార్ల భూమిలో మూడు వంతులుపైగా కొబ్బరి చెట్లే వుంటాయి. ఇచ్చట కొబ్బరి చెట్లు సగటున సంవత్సరానికి 60 కాయలు కాస్తాయి. కొబ్బరి పండించే అనేక దేశాల ఫల సాయంతో పోల్చితే ఇచ్చట సగటు దిగుబడి ఎక్కువే! ఇంకా ఇక్కడ అరటి, బొప్పాయి, జామ, సపోటా, ములక్కాయలు కూడా తగు మాత్రంగా పండుతాయి. ఆహార ధాన్యాలు మాత్రం ఈ దీవులలో పండవు. ఇతర రాష్ట్రాల నుంచి ఆహార ధాన్యాలు దిగుమతి చేసుకుంటారు. ఇచ్చట ప్రజలు పశుపోషణ, కోళ్ళ పెంపకం కూడా చేస్తారు.

లక్షద్వీప్‌లో చెప్పుకోదగిన పరిశ్రమలు కొబ్బరి, కొబ్బరి పీచు, ప్రతి సంవత్సరం ఇచ్చట నుంచి 3వేల టన్నుల ఎండు కొబ్బరి ఎగుమతి అవుతుంది. కొబ్బరి పీచు, కొబ్బరి టెంకలతో అనేక రకాల వస్తువులు తయారవుతాయి. చేపల వేట కూడా ఇచ్చట ప్రజల వృత్తి. చేపలు నిల్వ చేసే కర్మాగారం మినికాయ్ దీవిలో వుంది. మర పడవలు నిర్మించే కర్మాగారాలు కూడా ఈ దీవులలో వున్నాయి.

లక్షద్వీప్ ప్రజలు కేరళ ప్రజలను పోలి వుంటారు. వీరు కూడా మళయాళమే మాట్లాడతారు. ఒక్క మినికాయ్ దీవిలో మాత్రం "మహల్" అనే భాష మాట్లాడతారు. మహల్ భాషను కుడి నుంచి ఎడమకు వ్రాస్తారు. ఈ దీవులలో ప్రజలంతా సున్నీ ముస్లింలు. వీరిని మోప్లాలు అని కూడా అంటారు. ఈ దీవులలోని ప్రజల్లో 95 శాతం మంది ముస్లింలు, 4 శాతం మాత్రం హిందువులు.

ఒక్క బంగారం (ఈ దీవిలో అసలు జనం వుండరు. టూరిస్టు కేంద్రంగా వుంది) దీవిలో తప్ప మిగతా అన్ని దీవులలో మసీదులు వున్నాయి. రాజధాని కవర్తి దీవి బాగా అభివృద్ధి చెందింది. ఈ దీవిలో వున్న ప్రజలలో హెచ్చు మంది స్థానికులుగాక బయట నుంచి వచ్చినవారే. ఈ దీవిలో 52 మసీదులు వున్నాయి. ఇందులో కెల్లా అతి పెద్దది సుందరమైనది ఉజ్రా మసీదు. ఈ మసీదు ఆవరణలో ఒక బావి వుంది. ఈ బావిలో నీరు త్రాగితే కొన్ని జబ్బులు నయమవుతాయని ఇచ్చట ప్రజల నమ్మిక.

మినికాయ్‌లో నూరు సంవత్సరాల క్రితం బ్రిటిష్ వారు నిర్మించిన లైట్ హవుస్ చూడదగినది. మినికాయ్ 9 గ్రామాల సముదాయం. ఇచ్చట ప్రజలు పండుగ

సందర్భాల్లో చేసే లావా నృత్యం చూడ ముచ్చటగా వుంటుంది. ఈ దీవి ప్రజల్లో మాల్దీవ్ ప్రజల లక్షణాలు కానవస్తాయి.

లక్షద్వీప్ ప్రజలు చాలా నిజాయితీపరులు, వినయ సంపన్నులు, అతిథి మర్యాద తెలిసినవారు దొంగతనం, దోపిడీలు, మానభంగాలు ఇచ్చట కానరావు. ఇచ్చట స్త్రీలు బంగారు ఆభరణాలు ఎక్కువగా ధరిస్తారు. ఈ ప్రజల ఇంటి పేర్లు ఆడవారి పేరుమీదగా వుంటాయి. ఆస్తి స్త్రీ సంతతికి ఎక్కువ దక్కుతుంది.

ఎక్కడ చూసినా కొబ్బరిచెట్లు, సముద్ర కయ్యలు, చెరువులతో ప్రశాంత వాతావరణంలో అన్ని రకాల కాలుష్యాలకు సుదూరంగా వుండే ఈ దీవులను దర్శించటం ఎంతో మానసిక ప్రశాంతత కలుగజేస్తుంది. లోగడ ఈ దీవులకు వెళ్ళటానికి కొన్ని అడ్డంకులుండేవి. ప్రస్తుతం అవేవీ లేవు. పైగా యాత్రీకుల కోసం అనేక టూరిస్టు లాడ్జీలు కట్టించి సకల సదుపాయాలు కల్పించుతున్నారు. విదేశీయుల కొక చక్కటి యాత్రా కేంద్రంగా దీనిని అభివృద్ధి చేయవచ్చు.

# 27 అండమాన్, నికోబార్ దీవులు

వైశాల్యం - 8249 చదరపు కిలోమీటర్లు జనాభా - 2 లక్షల 78 వేలు రాజధాని పోర్ట్‌బ్లెయిర్, మాట్లాడే భాషలు - బెంగాలీ, హిందీ, తెలుగు, తమిళం, నికోబారీస్



అండమాన్, నికోబార్ దీవులు బంగాళాఖాతంలో 725 కిలోమీటర్ల పొడవున విస్తరించి మూడు వందలకు పైగా వున్న దీవులు. ఈ మూడు వందలు పైగా వున్న దీవులలో 265 దీవులు నివాసయోగ్యం కావు ఎందువలనంటే వీటిలో మంచి నీళ్లు దొరక్కపోవటమే గాక అసలు ఇవి మరీ చిన్న చిన్న దీవులు.

అండమాన్ దీవులలో ముఖ్యంగా చెప్పుకోదగినవి 5 దీవులు - వీటినే నార్త్ అండమాన్, మిడిల్ అండమాన్, సౌత్ అండమాన్, బరటాంగ్, రట్‌లాండ్ దీవి అంటారు. వీటిని గ్రేట్ అండమాన్స్ అని కూడా అంటారు. రాజధాని పోర్ట్‌బ్లెయిర్ సౌత్ అండమాన్ దీవిలో వుంటుంది. పోర్ట్‌బ్లెయిర్‌కు 100 కిలోమీటర్ల దూరంలో లిటిల్ అండమాన్ దీని వుంటుంది ఇవిగాక ఇంకా అండమాన్ దీవులలో అనేక చిన్న చిన్న దీవులుంటాయి. రాజధాని పోర్ట్ బ్లెయిర్ కలకత్తాకు 1255 కిలోమీటర్ల దూరంలోనూ, మద్రాసుకు 1191 కిలోమీటర్ల దూరంలోను వుంటుంది

అండమాన్ దీవులకు దక్షిణంగా నికోబార్ దీవులుంటాయి. అండమాన్, నికోబార్ దీవులను 10 డిగ్రీల ఛానల్ వేరు చేస్తుంది నికోబార్ దీవులలో ప్రధాన మైనవి - గ్రేట్ నికోబార్, కార్‌నికోబార్, చౌరా, తెరేసా.

అండమాన్ నికోబార్ దీవుల మొత్తం వైశాల్యంలో అండమాన్ దీవులు వైశాల్యం 76 శాతం, నికోబార్ దీవుల వైశాల్యం 24 శాతం.

అండమాన్, నికోబార్ దీవులలో వేడి వాతావరణం వుటుంది. అయితే సముద్రం మీద నుంచి వచ్చే చల్లని గాలులు వలన పెద్దగా వేడి వున్నట్లు అనిపించదు.

అండమాన్, నికోబార్ దీవులను లోగడ బే ఐలండ్స్ అని కూడా అనే వారు. అండమాన్ దీవుల పేరు పురాణ పురుషుడు హనుమంతుని పేరు మీదుగా వచ్చింది. హనుమాన్ పేరే అండమాన్స్‌గా మారింది. లంక (ప్రస్తుత శ్రీ లంక) వెళ్ళేటప్పుడు హనుమంతుడు ఇక్కడ కొద్ది సేపు ఆగినట్లు అందువలన అతడి పేరు మీదగానే అండమాన్ పేరు వచ్చినట్లు చెబుతారు. 7వ శతాబ్దంలో బౌద్ధ మత గురువులు వీటిని 'అండబాన్స్' గా పేర్కొన్నారు. మార్కోపోలో కూడా వీటిని ప్రస్తావించాడు. 15వ శతాబ్దంలో ఇటలీ యాత్రీకుడు నికోలా కంట్రి ఈ దీవులను 'స్వర్ణదీవులు' గా పేర్కొన్నాడు.

1789లో ఈ దీవులు బ్రిటిష్ వారి చేతుల్లోకి వచ్చినాయి. 1857లో జరిగిన ప్రథమ స్వాతంత్ర్యపోరాటంలో పాల్గొన్న విప్లవ వీరులను ఖైదు చేయటానికి బ్రిటిష్ వారికి ఈ దీవులు బాగా ఉపయోగించాయి. అప్పట్లో ఇచ్చట 4 వేల మంది విప్లవ వీరులను ఖైదు చేశారు. అందులో చాల మంది ఇచ్చట జైలు పరిస్థితులు దుర్భరంగా వుండటం వలన ఇచ్చట వాతావరణం సరిపడక జైలులోనే మరణించారు. వీరే గాక ఇంకా

అనేక మంది జాతీయ నాయకులు ఇచ్చట వున్న సెల్యులర్ జైలులో నిర్బంధించబడ్డారు. 1942లో జపాన్ వారు ఆక్రమించుకున్నారు. ఆ తర్వాత నేతాజీ సుబాస్ చంద్రబోస్ ఆధ్వర్యంలోని అజాద్ హింద్ సైన్యం ఆధీనంలోకి వచ్చినాయి ఈ దీవులు.

1956లో ఈ దీవులను కేంద్రపాలిత ప్రాంతంగా ఏర్పరచారు ఈ మొత్తం దీవులు 4 భాగాలుగా విభజించారు. 1 మాయాబందర్ 2. సౌత్ అండమాన్. 3 కార్ నికోబార్ 4 నన్‌కౌరి. రాజధాని పోర్ట్‌బ్లెయిర్ సౌత్ అండమాన్ డివిజన్‌లో వుంటుంది. ఈ దీవులకు విశాఖపట్నం, మద్రాసు, కలకత్తాల నుంచి ఓడలు తిరుగుతూ వుంటాయి విమాన సర్వీసు కూడా వుంది

అండమాన్ నికోబార్ దీవుల ప్రజల్లో ఎక్కువ మంది హిందువులు ఇచ్చట వున్న జనాభాలో ఆదిమ తెగల వారు తప్ప మిగతా వారంతా భారతదేశం నుంచి వెళ్ళి స్థిరపడిన వారే ఇచ్చట ప్రజల్లో 60 శాతం మంది అక్షరాస్యులు.

ఈ దీవులకు ఒక లోక్‌సభ సభ్యుడు పార్లమెంటులో ప్రాతినిధ్యం వహించుతాడు. పరిపాలన కేంద్ర ప్రభుత్వం నియమించిన లెఫ్ట్ నెంట్ గవర్నర్ ఆధీనంలో వుంటుంది.

అండమాన్, నికోబార్ దీవులు మొత్తం వైశాల్యం 8249 చదరపు కిలోమీటర్లలో 7 వేల చదరపు కిలోమీటర్లలో దట్టమైన అడవులే ఉంటాయి. ఈ అడవులలో నాణ్యమైన కలప దొరుకుతుంది. కలపకు సంబంధించిన పరిశ్రమలు ఇచట నెలకొని వున్నాయి. మంచి కలపే గాక, ప్లయ్‌వుడ్, అగ్గిపుల్లలకు పనికి వచ్చే కొయ్య కూడా ఇచ్చట బాగా దొరుకుతుంది. అగ్గిపెట్టెలు తయారు చేసే ప్రసిద్ధ కంపెనీ 'విమ్‌కో' కంపెనీ ఇచ్చట వుంది. ఫర్నిచర్ తయారు చేసే వర్క్ షాపులున్నాయి. రబ్బరుతోటలు ఇప్పుడిప్పుడే పెంచుతున్నారు. ఇంకా ఇచ్చట వరి, చెరకు, పప్పుధాన్యాలు, కొబ్బరి కాయలు, వక్కలు తగు మాత్రంగా పండుతాయి.

అండమాన్ దీవులకు రాజధాని పోర్ట్‌బ్లెయిర్ సింహ ద్వారం వంటిది. సముద్ర మార్గం గుండా వచ్చే ఓడలు, వాయు మార్గాన వచ్చే విమానాలు కూడా ఇచ్చటికే వస్తాయి. పోర్ట్ బ్లెయిర్ అభివృద్ధి చెందిన చిన్న పట్టణం. పోర్ట్‌బ్లెయిర్‌లో ముఖ్యంగా చూడదగినది సెల్యులర్ జైలు. ఈ జైలును 1896లో ఖైదీల చేతనే బ్రిటిష్ వారు కట్టించారు. ప్రస్తుతం ఈ జైలును స్వాతంత్ర్య సమర యోధుల స్మారక చిహ్నంగా మార్చారు. ఈ జైలు 698 గదులతో మూడు అంతస్తులలో వుంటుంది. ఈ గదులలో ఆనాడు ఖైదీల పరిస్థితి భయానకంగా వుండేది. ఇరుకుగా వుండే ఈ గదులలో ఒక్కొగదిలో అనేక మందిని కుక్కేవారు. కాళ్ళు చాచుకొని పడుకోవటానికి వీలు పడేది కాదు. ఈ గదుల్లో గాలి, వెలుతురు అసలే లేదు. ఒక్కో గదిలో 3 మీటర్ల ఎత్తున ఖైదీలకు

అందకుండా ఒకే వెంటిలేటర్ వుండేది అనేక మంది ఖైదీలు మళ్ళీ భారతదేశం తిరిగి రాకుండానే ఈ దుర్భర పరిస్థితులకు తట్టుకోలేక చనిపోయేవారు వీరసావర్కార్ నుంచి మన విప్లవ వీరుడు అల్లూరి సీతారామరాజు అనుచరులైన అగ్గిదొర, పడాలు దొర ఇచ్చటనే ఖైదీలుగా వున్నారు ఇచ్చట నిర్బంధించబడిన స్వాతంత్ర్య సమర యోధుల పేర్లు ఇచ్చట రికార్డు చేయబడినాయి వీర సావర్కార్ విగ్రహం సెల్యులర్ జైలు ముందు వుంటుంది ఇచ్చట ఏర్పరచిన మ్యూజియంలో ఈ జైలులో ఖైదీలుగా వున్న ప్రముఖుల ఫోటోలు వారు ఉపయోగించిన వస్తు సామాగ్రి కూడా భద్రపరిచారు

అండమాన్ దీవులలో చూడదగిన మరొక విశేషం చతాయ్ రంపపు మిల్లు ఈ మిల్లు ఆసియాలో కెల్లా పురాతనమైనదే గాక అతి పెద్ద రంపపు మిల్లుగా ప్రసిద్ధి చెందినది

నికోబార్ దీవులు అండమాన్ దీవుల కంటే సారవంతమైనవి చదునుగా కూడా వుంటాయి ఇచ్చట ఎక్కువగా కొబ్బరి తోటలు కానవస్తాయి నికోబార్ దీవులలో ఇళ్ళు నేల మీద గాక ఎత్తైన గుంజలపై నిర్మించుతారు ఈ ఇంటిలోకి వెళ్ళటానికి నేల మీద నుండి నిచ్చెనలు వుంటాయి

అండమాన్, నికోబార్ దీవులు చక్కటి బీచ్‌లుతో సహజ సుందరమైన ప్రకృతితో టూరిస్టులకు ఆనందాన్ని మానసికోల్లాసాన్ని కలుగు జేస్తాయి ఈ దీవులలో టూరిస్టు పరిశ్రమను పెంచటానికి కేంద్ర ప్రభుత్వం అనేక హోటళ్ళు, టూరిస్టు లాడ్జిలు నిర్మించింది

భారతదేశపు దక్షిణ కొస కన్యాకుమారి అని మనం చెప్పుకుంటాం కాని అది వాస్తవం కాదు భారతదేశపు దక్షిణ కొస ఈ అండమాన్, నికోబార్ దీవులలోని గ్రేట్ నికోబార్ దీవిలో వున్న చిట్టచివరి కొన ఇందిరా పాయింట్ లోగడ దీన్ని పార్‌సన్స్ పాయింట్ అనేవారు మన దేశంలో ఉదయించే తొలి సూర్య కిరణాలు ఈ అండమాన్ దీవులపై పడతాయి

అండమాన్, నికోబార్ దీవులలో అనాది నుంచి వుంటున్న ఆటవిక తెగలు వున్నాయి. వీరు – అండమానీస్, ఓంగీలు, జార్వాలు, సెంటినల్స్, నికోబారీలు, షోంపెన్స్ అండమాన్ తెగవారు 30కి లోపే వుంటారు వీరు దక్షిణ అండమాన్ దీవుల సమీపంలోని స్ట్రయిట్ ఐలెండ్ (ఈ దీవి వైశాల్యం 6 చదరపు కిలోమీటర్లు) లో బయట ప్రపంచానికి సంబంధం లేకుండా వుంటారు ఈతెగ అభివృద్ధికి ప్రభుత్వం అనేక చర్యలు తీసుకున్నా వివిధ వ్యాధులతో ఈ తెగవారు క్రమేపీ అంతరించి పోతున్నారు. ఓంగీలు లిటిల్ అండమాన్‌లో వుంటారు వీరి సంఖ్య 102 మాత్రం వీరి వృత్తి వేట పూర్వకాలంలో ఎటు వంటి సనాతన ఆచారాలు, పద్ధతులు వుండేవో వాటినే నేటికి వీరు

కొనసాగిస్తున్నారు జార్వాలు మిడిల్ అండమాన్ దీవులలో వుంటారు. వీరి సంఖ్య 200 మాత్రం అన్ని తెగలల్లోకి వీరు ప్రమాదకరమైన తెగ. పరాయి వాళ్లు కనబడితే చంపే ప్రయత్నం చేస్తారు. ఆధునిక నాగరికత అంటే ఏమిటో ఏ మాత్రం తెలియని ప్రజలు వీరు అయితే ఈ తెగ వారిని ఇప్పుడిప్పుడే మచ్చిక చేసుకొని బయట ప్రపంచంతో సంబంధాలు ఏర్పరచే ప్రయత్నాలు జరుగుతున్నాయి. సెంటినల్స్ ఉత్తర సెంటినల్ దీవిలో వుంటారు. వీరి జనాభా 100 మాత్రం ఈ దీవిలో వీరు తప్ప మరెవరూ వుండరు వీరు కూడా బయట వారితో సంబంధాలు పెట్టుకోవటానికి ఇష్టపడరు షాంపెన్స్ గ్రేట్ నికోబార్ దీవులలో వుంటారు. వీరి సంఖ్య 214 మాత్రం. తేనె సేకరణ వీరి వృత్తి. వీరికి బయట ప్రపంచంతో కొంత సంబంధాలు వుంటాయి వీరికి ప్రత్యేక భాష వున్నప్పటికీ హిందీ కూడ నేర్చుకుంటున్నారు నికోబారీలు నికోబార్ దీవులలో వుంటారు. వీరి జనాభా 24 వేలు అబివృద్ధి చెందిన తెగగా వీరిని చెప్పుకోవచ్చును ఆర్థిక, విద్యారంగాలలో వీరు చెప్పుకోదగిన స్థితిలో వున్నారు. పందుల పెంపకం వీరి ప్రధాన వృత్తి.

పూర్వం అంటే భారత్‌కు స్వాతంత్ర్యం రాకముందు భారతదేశం నుంచి దురాశా పరులైన కొంతమంది వ్యాపారస్తులు అండమాన్ నికోబార్ దీవులకు వెళ్ళి అమాయకులైన స్థానిక ప్రజల్ని మోసం చేసి వారిని దోచుకునే వారు. దాంతో స్థానిక ప్రజలకు భారతీయ వ్యాపారులంటే దగాకోర్లు అనే భావం ఏర్పడింది అంతేగాక రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో జపాన్‌వారు ఈ దీవులను ఆక్రమించినప్పుడు స్థానిక ప్రజలు ఈ వ్యాపారస్థులలో కొంతమందిని చంపివేశారు కూడా. దాంతో మిగతా వ్యాపారులు ఈ దీవుల నుంచి పారిపోయారు. ఈ అనుభవం దృష్ట్యా కేంద్ర ప్రభుత్వం ఆ దీవులకు వెళ్ళే వారికి కొన్ని ఆంక్షలు పెట్టింది. మాజీ సైనికులు, కాందిశీకులు మాత్రమే ఈ దీవులకు వెళ్ళి వ్యాపారం గాని పరిశ్రమలు గాని పెట్టుకోవటానికి వీలుంటుంది.

# 28 ఢిల్లీ

వైశాల్యం – 1483 చదరపు కిలోమీటర్లు. రాజధాని – ఢిల్లీ. జనాభా – 93 లక్షల 70 వేలు మాట్లాడే భాషలు – హిందీ, పంజాబీ, ఉర్దూ, ఇంగ్లీషు.

కేంద్రపాలిత ప్రాంతం ఢిల్లీ హర్యానా రాష్ట్రంలోకి చొచ్చుకుపోయి వుంటుంది. ఢిల్లీకి దక్షిణం, పడమర, ఉత్తరం హర్యానాయే వుంటుంది. తూర్పున మాత్రం ఉత్తర ప్రదేశ్ ఉంటుంది.

వైశాల్యం రీత్యా ఢిల్లీ కృష్ణా జిల్లా వైశాల్యంలో సుమారుగా ఆరో వంతు మాత్రమే వుంటుంది

ఢిల్లీ మూడు విభాగాలుగా వుంటుంది. 1. ఢిల్లీ, 2. న్యూఢిల్లీ, 3. ఢిల్లీ కంటోన్మెంట్. ఈ మూడు ప్రాంతాలకు మూడు స్థానిక స్వపరిపాలనా యంత్రాంగాలున్నాయి. ఢిల్లీకి ఢిల్లీ మున్సిపల్ కార్పోరేషన్, న్యూఢిల్లీకి న్యూఢిల్లీ మున్సిపల్ కమిటీ, ఢిల్లీ కంటోన్మెంట్‌కి ఢిల్లీ కంటోన్మెంట్ కమిటీల స్వపరిపాలనలో వుంటాయి. ఢిల్లీ మున్సిపల్ కార్పోరేషన్ పరిధిలో 214 గ్రామాలు కూడా వుంటాయి.



1956లో ఢిల్లీని కేంద్ర పాలిత ప్రాంతంగా చేయటంతో ఢిల్లీ, న్యూ ఢిల్లీ, ఢిల్లీ కంటోన్మెంట్‌ల పాలనను ఢిల్లీ మెట్రోపాలిటన్ కౌన్సిల్‌కు ఒప్పగించారు ఈ కౌన్సిల్‌లో 61 మంది సభ్యులు వుంటారు ఇందులో ఐదుగుర్ని రాష్ట్రపతి నామినేట్ చేస్తారు. మిగతావారు ప్రజలచే ఎన్నుకోబడతారు. లెఫ్టినెంట్ గవర్నర్ కేంద్ర ప్రభుత్వం తరపున ప్రధాన పరిపాలకుడు ఇతడు కేంద్ర ప్రభుత్వంచే నియమించబడతాడు ఇతడికి సలహాల్వీటానికి నలుగురు ఎగ్జిక్యూటివ్ కౌన్సిలర్లు వుంటారు ఇందులో ఒకరు ప్రధాన ఎగ్జిక్యూటివ్ కౌన్సిలర్ వీరిని కేంద్ర ప్రభుత్వం సలహా మీద రాష్ట్రపతి నియమించుతారు ఢిల్లీ మెట్రోపాలిటన్ కౌన్సిల్ స్థానే పాండిచేరి పద్ధతిలో ఢిల్లీకి శాసన సభ ఏర్పాటు చేయాలని కేంద్ర ప్రభుత్వం ఒక నిర్ణయానికి వచ్చినట్లు ఈ మధ్యనే పార్లమెంటులో ఒక ప్రకటన వెలువడింది శాసన సభ ఏర్పడినా ఢిల్లీ కేంద్రపాలిత ప్రాంతంగానే వుంటుంది.

పార్లమెంటు భవనం, రాష్ట్రపతి భవనం, ఇండియాగేటు, చాణక్యపురి, ఆలిండియా ఇనిస్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్, రామమనోహర్ లోహియా ఆసుపత్రి, కన్నాట్‌ప్లేస్ వగైరాలున్న ప్రాంతాన్ని న్యూఢిల్లీ అంటారు ఢిల్లీ విమానాశ్రయం (పాలం విమానాశ్రయం) పేరేడ్ గ్రౌండ్స్, పాలం రైల్వే స్టేషన్, గుర్గాంరోడ్ వగైరాలుండే ప్రదేశాన్ని ఢిల్లీ కంటోన్మెంట్ అంటారు. ఇచ్చట ఎక్కువగా సైనిక స్థావరాలుంటాయి. మిగతా ప్రాంతాన్ని ఢిల్లీ అంటారు. పాత ఢిల్లీ అని కూడా అంటారు. ఈ మూడు ప్రాంతాలకు స్థానిక స్వపరిపాలన విషయంలో వేరు వేరు పాలనా యంత్రాంగాలున్నా మొత్తం పరిపాలన మాత్రం కేంద్రం ప్రభుత్వం తరపున లెఫ్టినెంట్ గవర్నర్, ఎగ్జిక్యూటివ్ కౌన్సిలర్ల చేతుల్లో వుంటుంది.

న్యూఢిల్లీ జనాభా 7 లక్షలు. ఢిల్లీ కంటోన్మెంట్ జనాభా 2 లక్షలు. ఢిల్లీ జనాభా 65 లక్షలు. ఈ 65 లక్షలలో ఢిల్లీ పరిధిలో వుండే 214 గ్రామాల జనాభా 9 లక్షలు.

ఢిల్లీ వాతావరణంపై రాజస్థాన్ ఎడారులు, గంగా మైదాన ప్రాంతం వాతావరణాల ప్రభావం వుంటుంది. వేసవి కాలంలో ఎండలు హెచ్చుగా వుంటాయి. శీతాకాలంలో చలి ఎక్కువ. వేసవిలో 35 డిగ్రీల సెల్సియయస్ నుంచి 47 డిగ్రీల సెల్సియస్ వేడి దాకా వుండగా శీతాకాలంలో విపరీతమైన చలి వుంటుంది ఈ చలికాలంలో ఉష్ణోగ్రత 3 డిగ్రీల సెల్సియస్‌కు కూడా పడిపోతుంది. వర్షాకాలంలో వానలు కూడా బాగానే పడతాయి. ఢిల్లీలో నవంబరు నుంచి మార్చి వరకూ శీతాకాలం, అక్కడి నుంచి జూన్ వరకూ వేసవి కాలం, జులై నుంచి సెప్టెంబరు వరకూ వర్షాకాలం.

ఢిల్లీ గుండా ప్రవహించే యమునా నది అల్హాబాద్ దాకా ప్రవహించి గంగా నదిలో కలుస్తుంది. యమునా నది ఢిల్లీకి ప్రాణదాత

భారతదేశ రాజధాని ఢిల్లీ. ప్రపంచంలో కెల్లా పెద్ద ప్రజాస్వామ్య దేశం భారత్‌కు రాజధాని ఢిల్లీ. ఢిల్లీకి కొన్ని వేల సంవత్సరాల చరిత్ర వుంది. ప్రపంచంలోని అతి ప్రాచీన నగరాలలో ఢిల్లీ ఒకటి. అయితే అన్ని వేల సంవత్సరాల నాడు నిర్మించిన నగరమే నేటి ఢిల్లీ కాదు. ఢిల్లీ వివిధ శతాబ్దాలలో 8 సార్లు నిర్మించబడింది. అయితే ఈ నిర్మించటంలో ఒక విశేషం వుంది. ఒక నగరం శిధిలాలపై మరొక నగరం నిర్మించ కుండా శిథిల నగరం ప్రక్కనే నగరం నిర్మించబడింది. మహాభారత కాలంలో ఢిల్లీని ఇంద్రప్రస్థ అనే వారు. కురుక్షేత్ర సంగ్రామంలో విజేతలైన పాండవులు క్రీ॥ పూ॥ 1500 సంవత్సరాల క్రిందట ఇంద్రప్రస్థను రాజధానిగా చేసుకుని పాలించారని చరిత్రకారుల అభిప్రాయం.

తర్వాత ఇంద్రప్రస్థం అంగపాల్ అనే రాజు రాజధానిగా వుంది. ఇతడే నేటి కుతుబ్ మీనార్ దగ్గరలో లాల్ కోట నిర్మించాడు. ఈ కోట శిథిలావశేషాలు నేటికీ కానవస్తాయి. అంగపాల్ వంశం వారి నుంచి ఢిల్లీ చౌహాన్ వంశీయుల చేతుల్లోకి వెళ్ళింది. చరిత్ర ప్రసిద్ధి చెందిన పృధ్వీరాజ్ ఈ చౌహాన్ వంశీయుడే! ఆ రోజుల్లో ఢిల్లీ, కనూజ్ రాజ్యాలు ఉత్తర హిందూ దేశంలో ప్రసిద్ధి చెందినవి. కనూజ్ రాజు జయచంద్రుడి కుమార్తె సంయుక్త పృధ్వీరాజ్‌ను ప్రేమించటం, ఈ ప్రేమ వ్యవహారం జయచంద్రుడికి ఇష్టం లేక సంయుక్తకు స్వయంవరం ప్రకటించి పృధ్వీరాజ్‌ను ఆహ్వానించక పోవటం, పృధ్వీరాజ్ స్వయంవరం సమయానికి హఠాత్తుగా వచ్చి సంయుక్తను ఎత్తుకు పోవటం అందరికి తెలిసిన కథే.

ఇదిలా వుండగా ఢిల్లీ రాజ్య సంపదపై కన్ను పడిన మహమ్మద్ ఘోరి ఢిల్లీపై దండెత్తాడు. అసమాన పరాక్రమశాలి పృధ్వీరాజ్ చేతుల్లో చిత్తుగా ఓడిపోవటమే గాక బందీగా కూడా చిక్కుతాడు. మహమ్మద్ ఘోరి అయినా పృధ్వీరాజ్ దయ తలిచి ఘోరిని వదిలేస్తాడు. ఈ అవమానం భరించలేని ఘోరీ తన కుమార్తెను ఎత్తుకు పోయాడనే కక్షతో వున్న జయచంద్రుడితో లాలూచీ పడి మళ్ళీ దండెత్తి వచ్చి పృధ్వీరాజ్‌ను చంపేస్తాడు. రాణి సంయుక్త భర్త పోవటంతో సతీసహగమనం చేస్తుంది. ఈ ఉదంతం జరిగింది 1192లో, ఇంతా సహాయం చేసిన జయచంద్రుడికి మహమ్మద్ ఘోరీ చేతుల్లో పరాభవం పొందటమే ప్రతిఫలంగా దక్కింది, అంతేగాక ఆ మరుసటి సంవత్సరమే ఘోరీ చేతుల్లో జయచంద్రుడు చావటం కనూజ్ రాజ్యం ఘోరీ చేతుల్లోకి వెళ్ళటం కూడా జరిగింది.

ఘోరీ తర్వాత అతని క్రింద బానిసగా పనిచేసిన కుతుబుద్దీన్ ఢిల్లీ రాజ్యం చేపట్టాడు. 1206 నుంచి 1290 వరకూ సాగిన ఇతడి వంశీయుల పాలననే బానిస వంశం పాలన అంటారు. ఈ వంశానికి చెందినదే ప్రసిద్ధ రజియా. నాలుగు సంవత్సరాలు ఢిల్లీని పాలించిన రజియా అసాధారణ మహిళగా పేరు గాంచింది. స్త్రీ రాజ్యం పాలించటమేమిటని ప్రభువులు తిరబడి ఈమెను చంపివేశారు. బానిస పాలన తర్వాత 1290 నుంచి 1320

ఖిల్జీ రాజుల పాలన సాగింది. తైమూర్ (తామర్లేన్) దండ యాత్రలతో ఖిల్జీ పాలన ముగిసింది నరరూప రాక్షసుడైన తైమూర్ వేలాది ప్రజల్ని చంపటమే గాక ఢిల్లీ రాజ్యాన్ని నిలువు దోపిడీ చేశాడు

తైమూర్ వంశీకుడైన బాబర్‌తో మొగల్ యుగం ప్రారంభమవుతుంది హుమాయున్, అక్బర్, జహంగీర్, షాజహాన్, ఔరంగజేబ్‌లు ప్రసిద్ధ మొగల్ చక్రవర్తులు వీరి కాలంలో మొగల్ సామ్రాజ్యం క్రమేపీ భారతదేశం అంతా విస్తరించింది ఔరంగజేబ్ కాలంలో దాదాపు భారత ఉప ఖండం అంతా మొగల్ సామ్రాజ్యంలో భాగంగా వుండేది

1738లో నాదిర్‌షా దండయాత్రతో మొగల్ సామ్రాజ్యం చిన్నా భిన్నమయింది. నాదిర్‌షా అనేక వేల మందిని చంపటమే గాక వెయ్యి ఏనుగుల్ని, 10వేల గుర్రాల్ని, 10వేల ఒంటెల్ని తోలుకు పోవటమే గాక టన్నుల కొద్దీ బంగారం, వెండిని కూడా దోచుకుపోయాడు అంతేగాక ప్రసిద్ధ కోహినూర్ వజ్రం కూడా ఎత్తుకు పోయాడు.

మొగల్ పాలకులలో చివరి వాడు బహదూర్‌షా. అప్పటికే మొగల్ సామ్రాజ్యం నామమాత్రంగా మిగిలిపోవటం బ్రిటిష్ వారి ఆధిపత్యం పెరగటం ప్రారంభించింది. 1857 ప్రథమ స్వతంత్ర పోరాటంకు బహదూర్‌షా మద్దతు తెలిపాడనే నెపంతో బ్రిటిష్ వారు అతడ్ని రంగూన్‌కి ప్రవాసం పంపారు. బహదూర్‌షా అక్కడే 1862లో మరణించాడు. అతడి వారసులందర్నీ క్రూరంగా చంపివేశారు ఈ దురాగతం పాత కోట వద్ద జరిగింది అందువలనే పాతకోటకు వెళ్ళే ద్వారాన్ని (లోగడ ఇది పాత ఢిల్లీకి వెళ్లే ద్వారం) ఖూనీ దర్వాజా అని పిలుస్తారు. దాంతో మొగల్ సామ్రాజ్యం పూర్తిగా అంతరించింది.

1911లో బ్రిటిష్ ఇండియా రాజధానిని కలకత్తా నుంచి ఢిల్లీకి మార్చటంతో ఢిల్లీకి మళ్లీ పూర్వ వైభవం వచ్చింది. బ్రిటిష్ వారు పాత ఢిల్లీ ప్రక్కనే కొత్త ఢిల్లీ నిర్మించారు.

కేంద్రపాలిత ప్రాంతమైన ఢిల్లీకి ప్రాతినిధ్యం వహించటానికి 7గురు లోక్‌సభ సభ్యులు, ముగ్గురు రాజ్య సభ సభ్యులు వుంటారు.

ఢిల్లీలో 73 శాతం మంది ప్రజలు అక్షరాస్యులు. కేరళ, చండీఘర్ తర్వాత ఢిల్లీలోనే హెచ్చు మంది అక్షరాస్యులు వుంటారు. ఢిల్లీ జనాభాలో 84 శాతం మంది హిందువులు. 8 శాతం మంది ముస్లింలు. మిగతావారు సిక్కులు వగైరా. ఢిల్లీ జనాభాలో 35 శాతం మంది కార్మికులు వ్యవసాయదారులు కొద్దిమంది మాత్రమే ఆ కొద్దిమంది కూడా ఢిల్లీ మున్సిపల్ పరిధిలోని 214 గ్రామాల్లోనే వుంటారు. మిగతా వారంతా ఉద్యోగులు, వ్యాపారులు, స్వయం వృత్తులు వారు వగైరా.

ఢిల్లీలో వున్న 11/2 లక్షల హెక్టార్ల భూమిలో 92వేల హెక్టార్లు సాగులో వుంది. 2వేల హెక్టార్ల అడవులు ఇచ్చట ప్రధాన పంట గోధుమ చెరకు, జొన్న కూడా పండుతుంది.

ఢిల్లీలో చిన్న, మధ్య తరహా పరిశ్రమలు 70 వేల దాకా వుంటాయి. ఢిల్లీ ఆటోమొబైల్ స్పేర్ పార్టులు, బ్లేడ్లు, ప్లాస్టిక్ వస్తువులు, రేడియోలు, టి.వి. లు సైకిళ్ళు, పాదరక్షలు లాంటి వస్తువులు విరివిగా తయారవుతాయి. చేతితో తయారయ్యే దంతపు బొమ్మలు, వెండి, బంగారం ఆభరణాల తయారీకి ఢిల్లీకి పెద్ద పేరుంది. చేనేత పరిశ్రమ కూడా ఇక్కడ చెప్పుకోదగిన పరిశ్రమ.

వేల సంవత్సరాల చరిత్ర కల్గి అనేక రాజ వంశాలకు రాజధానిగా వుండి, అనేక సామ్రాజ్యాల ఉన్నతికి పతనాలకు సాక్షీభూతంగా నిల్చిన ఢిల్లీలో చూడదగిన ప్రదేశాలు, కట్టడాలు, శిథాలావశేషాలు అనేకం వున్నాయి. వీటిలో ముఖ్యమైన వాటిని తిలకించుదాం. ముందుగా కొత్త ఢిల్లీలో రాష్ట్రపతి భవన్‌తో పర్యటన ప్రారంభించుదాం. రాష్ట్రపతి భవన్ భారత రాష్ట్రపతి నివాస భవంతి. 330 ఎకరాలలో బ్రిటిష్ వారు దీన్ని వైస్రాయ్ నివాసభవనంగా నిర్మించారు. బ్రహ్మాండమైన ఈ భవంతిలో 340 గదులు వున్నాయి. ఇంకా ఇందులో విదేశీ ప్రముఖుల్ని స్వీకరించటానికి తగిన విశాలమైన హాల్సు వున్నాయి. ఇందులో పెద్ద లైబ్రరీ, మొగల్ పద్ధతిలో తీర్చి దిద్దిన పెద్ద ఉద్యాన వనం కూడా వున్నాయి.

మనదేశ పార్లమెంటు సభ్యులు సమావేశ మయ్యే భవనం పార్లమెంటు భవంతి. సన్‌సద్‌భవన్ అని హిందీలో అంటారు. పార్లమెంట్ వీధి (సన్ సద్ మార్గ్) చివర వుంటుంది ఈ భవంతి, న్యూఢిల్లీ, రాష్ట్రపతి భవన్; సెక్రటేరియట్‌లు డిజైన్ చేసిన సర్ ఎడ్విన్‌లు టైన్స్ పార్లమెంటు భవంతిని కూడా రూపకల్పన చేశాడు. ఈ భవంతి నిర్మాణం 1921లో ప్రారంభించబడి 1927లో పూర్తి చేయబడింది. ఆ రోజుల్లోనే దీని నిర్మాణ ఖర్చు 83 లక్షలు అయిందట. ఈ భవంతి చుట్టు కొలత దాదాపు అరమైలు వుంటుంది. నడుం కొలత 506 అడుగులు. ఆరు ఎకరాలలో నిర్మించబడిన ఈ భవంతి సమానతకు ప్రతీకగా గుండ్రంగా వుంటుంది. ఈ భవంతి నిర్మాణానికి ఉపయోగించిన పాలరాయి బెలూచిస్తాన్(అప్పుడు బెలూచిస్తాన్ ఇండియాలో భాగంగా వుండేది) నుంచి, తలుపులు దర్వాజాలకు కావల్సిన కొయ్య దక్షిణాది నుంచి, కలప అస్సాం నుంచి తెచ్చారు. ఒక్కొక్కటి 27 అడుగుల ఎత్తుగల 142 స్థంభాలతో ఈ భవంతి ప్రపంచంలో కెల్లా పెద్ద ప్రజాస్వామ్య దేశం భారత్ హుందాకు తగ్గట్టుగా వుంటుంది.

దగ్గరలోనే వుండే భారత దేశ అత్యున్నత స్థానం సుప్రీంకోర్టు భవంతి కూడా చూడదగినదే.

1911లో ఎర్రరాతితో నిర్మించబడిన సెక్రటేరియట్‌లో 1000 గదులుంటాయి. ఈ భవంతికి 207 అడుగుల ఎత్తు డోం వుంటుంది. ఈ భవంతి మొత్తం ఎయిర్‌కండిషన్ వేయబడి వుంటుంది.

నేషనల్ స్టేడియం దగ్గరలో "ఇండియా గేట్" ప్రథమ ప్రపంచ యుద్ధంలో మరణించిన సైనికుల జ్ఞాపకార్థం నిర్మించబడింది ఈ కట్టడం 42మీటర్ల ఎత్తున వుండి దానిపై యుద్ధంలో మరణించిన 90వేల మంది సైనికుల పేర్లు చెక్కబడి వుంటాయి ఈ కట్టడం ఆర్చికి దిగువగా "అమర్ జవాన్ జ్యోతి" నిరంతరం వెలుగుతూ యుద్ధంలో భారతదేశం కోసం ప్రాణాలర్పించిన సైనికులను గుర్తు చేస్తూ వుంటుంది.

కన్నాట్ ప్లేస్ లార్డ్ కన్నాట్ 1900లో సందర్శించిన సూచనగా నిర్మించబడింది. ఇది క్రొత్త ఢిల్లీకి కేంద్రం. ప్రసిద్ధ వ్యాపార కూడలి. 67 అడుగుల ఎత్తున వుండే కట్టడం కన్నాట్ ప్లేస్ పద్మాకారంలో నిర్మించబడి వుంటుంది. మద్యలో నీటి ఫౌంటేన్ వుంటుంది. దీని చుట్టూ వుండే రింగ్ రోడ్ నుండి అన్ని వైపులకూ 9 ప్రధాన రహదారులు వెళ్ళతాయి. రింగ్ రోడ్ చుట్టూ అనేక షాపులు వుంటాయి.

కన్నాట్ ప్లేస్‌కు పడమడరగా లక్ష్మి నారాయణ దేవాలయం వుంటుంది. 1938లో పారిశ్రామిక వేత్త బిర్లా నిర్మించారు. దీన్ని బిర్లా మందిర్ అని కూడా అంటారు. స్వచ్ఛమైన పాలరాతితో నిర్మించబడిన ఈ దేవాలయం శోభ అద్భుతంగా వుంటుంది. ఈ దేవాలయంలో లక్ష్మి, నారాయణుల నిలువెత్తు విగ్రహాలు వుంటాయి. ఈ దేవాలయంలోనే శివాలయం కూడా వుండటం విశేషం.

కన్నాట్ ప్లేస్‌కు దగ్గరలోనే జంతర్ మంతర్ వుంటుంది. 1724లో రాజాజయ్ సింగ్‌చే నిర్మించబడిన ఈ ఖగోళ వేదశాల విజ్ఞాన పరిశోధనకు ఉపకరించే బ్రహ్మాండ మైన యంత్రాలు, పరికరాలు వుంటాయి. స్వతహాగా గొప్ప గణిత, ఖగోళ శాస్త్రవేత్త అయిన రాజా జయ్‌సింగ్ అభిరుచికి ఇదొక తార్కాణంగా వుంటుంది.

చాణక్యపురిలోని రైల్ మ్యూజియంలో రైలు పుట్టిన దగ్గర నుంచి ఇప్పటి వరకూ వాటి ప్రగతి పాత రైళ్ళ నమూనాలను చూడవచ్చును. ఇంకా తీన్‌మూర్తి భవన్‌లోని నెహ్రూ మ్యూజియంలో భారత్ ప్రథమ ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ గురించిన అనేక విశేషాలు చూడవచ్చు.

ఇండియాగేట్ నుంచి పృధ్వీరాజ్ రోడ్ చివరకు వెళితే సఫ్దర్‌జంగ్ సమాధి వస్తుంది. 1753లో ఔద్‌పాలకుడు సుజాఉద్‌దౌలా చేత తన తండ్రి సఫ్దర్‌జంగ్ జ్ఞాపకార్థం నిర్మించబడిన ఈ బ్రహ్మాండమైన సమాధి. ఈ సమాధి మూడంతస్తులుగా 900 చదరపు అడుగుల వైశాల్యం, 40 అడుగుల ఎత్తు డోంతో వుంటుంది.

ఇండియా గేట్‌కు ఆగ్నేయంగా పురానాఖిల్లా వుంటుంది. అసలు ఢిల్లీ ఇదేనని చెబుతారు. పూర్వం ఆ ప్రదేశం మహాభారత్ కథానాయకులు పాండవుల రాజధానిగా వుండేదని అంటారు. దీన్నే ఇంద్రప్రస్థం అంటారు. ఇక్కడ ఒక చిన్న కొండ వుంది. ఆ కొండ మీదనే పాండవులు కోట నిర్మించారని నమ్మిక. క్రీ॥ శ॥ 15వ శతాబ్దంలో ఆఫ్ఘన్ పాలకుడు షెర్‌షా సూరి అప్పటికున్న శిథిలావశేషాల స్థానంలో బ్రహ్మాండమైన కోట నిర్మించాడు. ఈ కోటలో షేర్ మంజిల్, ఒక సమాధి వుంటాయి. ఈ షేర్ మంజిల్ హుమాయున్ చక్రవర్తి లైబ్రరీగా ఉపయోగించేవాడు. హుమాయూన్ చక్రవర్తి ఇక్కడే కాలు జారిపడి చనిపోయాడు.

పురానాఖిల్లాకు కొద్ది దూరంలో హుమాయూన్ సమాధి వుంటుంది. 1574లో నిర్మించబడిన ఈ అద్భుత సమాధి మొగల్ వాస్తు శాస్త్రానికి ప్రతీకగా వుంటుంది. హుమాయున్ భార్య హజీబేగం చే నిర్మించబడింది. పర్షియన్, ఇండియన్ వాస్తు శాస్త్రాల సమ్మేళనానికి ఈ సమాధి ఒక ఉదాహరణ. ఈ సమాధి చుట్టూ విశాలమైన తోటలు వుంటాయి. తాజ్‌మహల్‌కు పూర్వం నిర్మించబడిన ఈ సమాధి ఎర్ర రాతితోను, తెలుపు, నలుపు చలువ రాతితోను నిర్మించబడింది. ఇక్కడ హుమాయూన్ సమాధి గాక ఇంకా అనేక మంది మొగల్ ప్రభువుల సమాధులు కూడా వున్నాయి. ఇచ్చటనే ఆఖరి మొగల్ చక్రవర్తి 2వ బహదూర్ షా బ్రిటిష్ వారికి లొంగిపోయాడు.

హుమాయున్ సమాధి దగ్గరలోనే నిజాముద్దీన్ ఆవులియా దర్గా వుంటుంది. ఈ ప్రదేశం ముస్లింలకు పెద్ద యాత్రాస్థలం. అల్లా ఉద్దీన్ ఖిల్జీచే నిర్మించబడింది. ఇచ్చటనే ప్రసిద్ధ కవులులు మీర్జాగాలిబ్, అమీర్‌ఖుస్రో షాజహాన్ కుమార్తె బేగం జహనారా సమాధులు కూడా వున్నాయి. ఇచ్చట సంవత్సరంలో రెండు సార్లు నిజాముద్దీన్ ఆవులియా వర్ధంతి రోజున, అమీర్‌ఖుస్రో వర్ధంతి రోజున ఉర్సు ఉత్సవాలు బ్రహ్మాండంగా జరుగుతాయి. ఈ ఉత్సవాల్లో పాల్గొనటానికి దేశం నలుమూలలనుంచే గాక అనేక ముస్లింల దేశాల నుంచి కూడా భక్తులు ఇచ్చటకు వస్తారు.

సప్దర్‌జంగ్ నుంచి 5 కిలోమీటర్లు వెళ్ళితే ప్రసిద్ధ కుతుబ్‌మీనార్ వస్తుంది. 234 అడుగలు ఎత్తు వుండే ఈ కట్టడం భారతదేశంలో కెల్లా ఎత్తైన గోపురంగా ప్రసిద్ధి చెందింది. ఈ కట్టడం 5 అంతస్తులుగా వుంటుంది. పైకి ఎక్కటానికి మెట్లు వుంటాయి. 1199లో బానిస వంశం మొదటి రాజు కుతుబుద్దీన్ దీనికి పునాది వేశాడు. తరువాత అతడి వారసులు దీన్ని పూర్తి చేశారు. దీన్ని ఎర్రరాయి, పాలరాతితో నిర్మించారు.

కుతుబ్‌మినార్‌కు దగ్గరలోనే ఐరన్ పిల్లర్ వుంటుంది. క్రీ॥ శ॥ 4వ శతాబ్దంలో దీన్ని ఒక హిందూ రాజు నిర్మించాడు. ఆనాటి నుంచి ఈనాటి వరకూ దాదాపు 16 వందల సంవత్సరాలు – ఈ ఇనుప స్తంభం అన్ని వాతావరణాలకూ తట్టుకుంటూ ఏ మాత్రం

తుప్పు పట్టకుండా ఇప్పుడే నిర్మించినట్లుండే ఈ ఇనుప స్తంభం లోహశాస్త్రజ్ఞుల్ని కూడా ఆశ్చర్యపరుస్తుంది

కుతుబ్ మీనార్‌కు తూర్పుగా మెహ్రౌల్లీ, బదార్‌పూర్‌లో తుగ్లకాబాద్ వుంటుంది. 1321-1325 సంవత్సరాల మధ్య గ్యాసుద్దీన్ తుగ్లక్ చే నిర్మించబడింది ఈ కోట. ఈ కోట ప్రస్తుతం శిధిలావస్థలో వుంది. ఈ కోట అప్పుడు 13 దర్వాజాలతో దుర్భేధ్యమైన కోటగా నిర్మించబడింది.

లోడిరోడ్‌లో సికిందర్‌లోడీ, మహమ్మద్‌షాల సమాధులుంటాయి. పచ్చపచ్చని మైదానాలు, పార్కుల మధ్య ఈ సమాధులు ప్రశాంత వాతావరణంలో వుంటాయి.

ఇక పాత ఢిల్లీలో కొన్ని ముఖ్యమైన విశేషాల్ని చూద్దాం. ముందుగా ప్రసిద్ధి చెందిన రెడ్‌ఫోర్ట్(ఎర్రకోట)ను చూద్దాం. మన దేశ స్వతంత్రదినోత్సవం నాడు భారత ప్రధాని ఇక్కడే జాతీయ జెండా ఎగురవేస్తారు. 1639లో షాజహాన్‌చే నిర్మించబడింది ఈ కోట రాజధాని ఢిల్లీకి మార్చాలని నిర్ణయించిన షాజహాన్ చక్రవర్తి షాజహనా బాద్ అనే పేరుతో యమునా నది ఒడ్డున ఒక పట్టణం నిర్మించాడు. అప్పుడే ఈ ఎర్రకోట నిర్మించబడింది. ఎర్రరాతితో నిర్మించబడింది కాబట్టి ఈ కోటకు ఆ పేరు వచ్చింది బ్రహ్మాండమైన ఈ కోటను నిర్మించటానికి 9 సంవత్సరాలు పట్టింది. ఈ కోట ప్రాకారాలు పొడవు 2 1/2 కిలోమీటర్లు వుంటాయంటే ఈ కోట గొప్పతనాన్ని ఊహించవచ్చు ఈ కోటకు రెండు బ్రహ్మాండమైన గేటులుంటాయి. లాహోర్ గేట్ అని ఢిల్లీ గేట్ అని వీటి పేర్లు. లాహోరు (పాకిస్తాన్) దిక్కుగా వున్న గేట్‌ను లాహోర్ గేటు అంటారు రెండో గేట్ ఢిల్లీ గేట్ అంటారు ఈ కోటలో ప్రజల ఫిర్యాదులు వినే ప్రదేశం(దివాన్-ఇ-ఆమ్) చక్రవర్తులు రహస్య సమావేశాలు, మంత్రులు, సామంతులతో సమావేశమయ్యే సభాస్థలిని దివాని ఖాస్ అని అంటారు దివాని ఇ ఆమ్ 500 అడుగుల పొడవు 300 అడుగుల వెడల్పు వుంటుంది. మధ్యన 10 అడుగుల ఎత్తుగల పాలరాతి ప్లాట్‌ఫారంపై సింహాసనం వుంటుంది దివాని ఖాస్ 32 స్తంభాలతో శిల్ప కళా నైపుణ్యంతో శోభిల్లుతూ వుంటుంది. ఈ దివాన్‌ని ఖాస్‌లోనే ఆనాడు నెమలి సింహాసనం వుండేది. మోతి మసీదు కూడా కోటలోనే వుంటుంది. ఔరంగజేబ్ తను ప్రత్యేకంగా ప్రార్ధనలు చేసుకోవటానికి ఈ మసీదు నిర్మించుకున్నాడు. ఇంకా ఈ కోటలో రంగమహల్(రాణులు వుండే భవంతి) వుంటుంది. రంగ్‌మహల్ 1530 అడుగుల పొడవు 630 అడుగుల వెడల్పు వుంటుంది. ఖాస్ మహల్(చక్రవర్తి మందిరం)లే గాకా రాజులు, రాణులు ఉపయోగించిన ప్రత్యేక స్నానాల గదులు (హమ్మామ్స్) కూడా వుంటాయి. వేడి నీరు, చన్నీరు, వచ్చే ఏర్పాట్లే గాక నీటి ఫౌంటెన్లు కూడా ఆనాడు ఏర్పరచారు.

కోటకు వెళ్ళే దారిలో నౌ బత్‌ఖానా వుంటుంది ఇది మూడు అంతస్తుల భవంతి. ఈ భవంతిలోనే ఆనాడు రోజుకు 5 సార్లు వాయిద్యాలు వాయించేవారు. ప్రస్తుతం ఎర్రకోట దగ్గరలో చట్టాచౌక్ పేరుతో షాపింగ్ కాంప్లెక్స్ ఏర్పడింది.

ప్రసిద్ధ జమా మసీదు కట్టడం షాజహాన్‌చేత ప్రారంభించబడి ఔరంగజేబ్ చేత పూర్తిగావించబడింది. ఈ మసీదు ఎర్రకోటకు ఎదురుగానే వుంటుంది. ఈ మసీదు మన దేశంలో కెల్లా పెద్ద మసీదుగా పేరు గాంచింది. దీని నిర్మాణం 1650లో ప్రారంభమై పూర్తి కావటానికి 6 సంవత్సరాలు పట్టింది. ఆ రోజుల్లోనే దీని నిర్మాణ వ్యయం 10 లక్షల రూపాయలట ఈ మసీదు పొడవు 200 అడుగులు, వెడల్పు 100 అడుగులు. ఈ మసీదుకు మూడు ద్వారాలుంటాయి. 200 అడుగుల ఎత్తుగల డోమ్‌తో రెండు వైపులా 150 అడుగుల ఎత్తు స్తంభాలతో ఈ మసీదు ఢిల్లీకే అలంకారంగా వుంటుంది. అచ్చమైన పాలరాయి ఎర్రరాతి నిర్మించబడిన ఈ మసీదులో 20వేల మంది కూర్చొని ప్రార్థించుకోవటానికి వీలైనంత సువిశాలంగా వుంటుంది. ఇచ్చట హజరత్ మహమ్మద్ కాలిముద్రలు, ఆయన కేశ విశేషం భద్రపర్చి వుండటం మరో విశేషం.

చాందిని చౌక్ వెండి బంగారు ఆభరణాల తయారీకి, అమ్మకానికి ప్రసిద్ధి గాంచిన ఈ చాందిని చౌక్‌లోనే ఆనాడు మొగల్ చక్రవర్తులు, రాణులు తమకు కావల్సిన నగలను కొనుక్కునేవారట.

ఢిల్లీ గేట్‌కు కొద్ది దూరంలో యమునా నది ఒడ్డున మహాత్మాగాంధీ సమాధి రాజ్‌ఘాట్ వుంటుంది. నలుచదరంగా నల్లరాయితో నిర్మించబడిన ఈ సమాధి పచ్చిక మైదానాల మధ్య వుంటుంది.

ఈ సమాధికి దగ్గరలోనే శాంతి వనం వుంటుంది. ఇది మనదేశ ప్రథమ ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ సమాధి. దీనికి దగ్గరలోనే పండిట్ నెహ్రూ కుమార్తె మాజీ ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ సమాధి (శక్తిస్థల్) వుంటుంది. శాంతివనంకు కొంచెం దూరంలో మాజీ ప్రధాని లాల్‌బహదూర్ శాస్త్రి సమాధి (విజయ్ ఘాట్) కూడా వుంటుంది

పాత ఢిల్లీకి కొత్త ఢిల్లీకి మధ్యలో ఫిరోజ్‌షా కోట్ల వుంటుంది. 1354లో ఫిరోజ్ షా తుగ్లక్‌చే ఈ ఫిరోజ్ షా కోట్ల అనే పట్టణం నిర్మించబడింది. ఈ పట్టణం అప్పుడు యమునా నది ఒడ్డున వుండేది. ప్రస్తుతం ఆనాటి పట్టణం యొక్క శిథిలావశేషాలు మాత్రమే వున్నాయి. ఇచ్చట క్రీ॥ పూ॥3వ శతాబ్దానికి చెందిన అశోక్ స్తంభం 13 మీటర్ల ఎత్తు వుంటుంది. ఈ స్తంభం మీద బ్రహ్మి లిపిలో అశోకుని శాసనాలు చెక్కబడి వుంటాయి.

ఢిల్లీ సందర్శించటానికి వెళ్ళేవారు జనపథ్‌రోడ్ వెళ్ళి తీరాల్సిందే. ఈ బజారు లో

అన్ని రకాల వస్తువులు - లెదర్ వస్తువులు, దుస్తులు, బంగారు నగలు, పుస్తకాలు - ఒకటేమిటి ఏ వస్తువు కావాలన్నా ఇచ్చట కొనుక్కోవచ్చును. ఈ జనపథ్‌కు దగ్గరలోనే కాటేజ్ ఎంపోరియం వుంటుంది ఇచ్చట మన దేశం నలుమూలలో తయారయ్యే అన్ని రకాల చేతి వస్తువులు దొరుకుతాయి. దర్‌నగర్ మార్కెట్, అజ్మల్‌కాన్ మార్కెట్‌లు కూడ మూడవగిన పెద్ద వ్యాపార కేంద్రాలు

ప్రతి సంవత్సరం జనవరి 26న రిపబ్లిక్ ఉత్సవాలు ఆగస్టు 15న స్వాతంత్ర్య దినోత్సవాలు ఢిల్లీలో అత్యంత వైభవంగా జరుగుతాయి. ప్రతి ఒక్కరూ ముఖ్యంగా విద్యార్థులు ఈ ఉత్సవాల్ని ఒక్కసారైనా చూసి తీరాలి. దసరా పండుగకుజరిగే రామలీల ఉత్సవాలు కూడా ఢిల్లీలో వైభవంగా జరుగుతాయి

# 29 పాండిచ్చేరి

వైశాల్యం - 492 చదరపు కిలోమీటర్లు రాజధాని - పాండిచ్చేరి. జనాభా - 7 లక్షల 89 వేలు. మాట్లాడే భాష - తమిళం, తెలుగు, మళయాళం, ఇంగ్లీషు, ఫ్రెంచి.

కేంద్రపాలిత ప్రాంతమైన పాండిచ్చేరి నాలుగు ముక్కలుగా వుంటుంది. పాండిచ్చేరి, కారైకాల్, మహే, యానాం

1. పాండిచ్చేరి పట్టణం, చుట్టుపల్ల గ్రామాలు కలిసి 290 చదరపు కిలోమీటర్లు వైశాల్యం వుంటుంది పాండిచ్చేరి తమిళనాడు రాజధాని మద్రాసుకు దక్షిణంగా 162 కిలోమీటర్ల దూరంలో వుంటుంది. దక్షిణ ఆర్కాట్ జిల్లా పాండిచ్చేరికి మూడు వైపులా వుంటుంది. ఒక్క వైపున అంటే తూర్పున మాత్రం బంగాళా ఖాతం వుంటుంది. 2. కారైకాల్ పట్టణం చుట్టుపల్ల గ్రామాలు కలిసి 160 చదరపు కిలోమీటర్లు వైశాల్యం వుంటుంది. కారైకాల్ కూడా తమిళ నాడులోనే వుంటుంది. పాండిచ్చేరికి 150 కిలోమీటర్ల దూరంలో



దక్షిణంగా వుంటుంది కారైకాల్‌కు మూడు వైపులా తంజావూర్ జిల్లా వుంటుంది తూర్పున బంగాళాఖాతం వుంటుంది 3 మహే, చుట్టుపల్ల 3 గ్రామాలు కలిసి 10 చదరపు కిలోమీటర్ల వైశాల్యం వుంటాయి మహే కేరళ రాష్ట్రంలో తెల్లిచేరికి 8 కిలోమీటర్ల దూరంలో వుంటుంది బంగాళాఖాతం ఒడ్డున వున్న పాండిచ్చేరికి తిన్నగా పడమర 653 కిలోమీటర్ల దూరంలో అరేబియా సముద్రం ఒడ్డున వుంటుంది మహే 4. యానాం ఆంధ్రప్రదేశ్‌లోని తూర్పు గోదావరి జిల్లాలో కాకినాడకు 20 కిలోమీటర్ల దూరంలో బంగాళాఖాతం ఒడ్డున వుంటుంది యానాంగాక చుట్టుపల్ల 6 గ్రామాలు ఇందులో భాగమే వీటి వైశాల్యం 20 చదరపు కిలోమీటర్లు. పాండిచ్చేరికి యానాంకు దూరం 840 కిలోమీటర్లు

ఈ విధంగా అక్కడొకటి ఇక్కడొకటి వున్న ఈ నాలుగు కలిపి ఎందుకు కేంద్ర పాలిత ప్రాంతంగా వేయాల్సి వచ్చిందంటే - ఈ నాలుగు ప్రాంతాలు లోగడ ఫ్రెంచి వలసలుగా వుండేవి. 300 సంవత్సరాలు ఇవి ఫ్రెంచి పాలనలో వుండి 1954లో మాత్రమే భారత్‌కు అప్పగించబడినాయి ఈ నాలుగు ప్రాంతాలలో ఫ్రెంచి పరిపాలన, పద్ధతులు ఆచార వ్యవహారాలు ఒకే రీతిగా వుండటం వలన దూర ప్రాంతాలలో వేరు వేరుగా ఉన్నా ఈ నాలుగింటిని కలిపి కేంద్ర పాలనలో వుంచారు.

పాండిచ్చేరి వేదకాలం నుంచి ప్రసిద్ధి చెందినది. పురాణ కాలంలో అగస్త్య మహాముని ఇచ్చటనే ఆశ్రమం ఏర్పాటు చేసుకున్నాడని ప్రతీతి. వేద కాలంలో పాండిచ్చేరిని వేదపురి అని పిల్చేవారు. ఇచ్చట క్రీ॥ శ॥ 9వ శతాబ్దంలో (బీహార్‌లోని నలందా విశ్వవిద్యాలయం క్షీణించిన తర్వాత) సంస్కృత విశ్వవిద్యాలయం వుండేదని చరిత్రకారులు చెబుతారు. ఆనాడు అనేక మంది వేదపండితులతో వేదపురి కళకళలాడుతూ వుండేదట. వ్యాపారరీత్యా కూడా వేదపురి ప్రసిద్ధి చెందిన పట్టణమే. క్రీ॥ శ॥ ఒకటవ శతాబ్దం నుంచి వేదపురికి రోమ్ సామ్రాజ్యంతో వాణిజ్య సంబంధాలు వుండేవని తెలుస్తోంది.

1673 నాటికి వేదపురి ఒక చిన్న గ్రామంగా మిగిలిపోయింది. పల్లెకారులు ఎక్కువగా నివసించేవారు అదే సంవత్సరం ఫ్రెంచి ఈస్ట్ ఇండియా కంపెనీవారు ఈ గ్రామాన్ని వాణిజ్య కేంద్రంగా ఏర్పాటు చేసుకున్నారు. వారే వేదపురికి పుదుచ్చేరి అని పేరు పెట్టారు. పుదుచ్చేరి అంటే కొత్త గ్రామం అని అర్థం. క్రమేపీ పుదుచ్చేరి పాండిచ్చేరిగా మారింది. 1693లో పాండిచ్చేరిని డచ్‌వారు ఆక్రమించుకోగా దీని కోసం ఫ్రెంచి వారికి డచ్చి వారికి పోరాటం జరిగి 1699లో పాండిచ్చేరి తిరిగి ఫ్రెంచి వారి చేతుల్లోకి వచ్చింది. ఫ్రెంచి వారి ఆధీనంలో పాండిచ్చేరి అభివృద్ధి చెందింది. 1706లో పాండిచ్చేరి జనాభా 40 వేలు కాగా అప్పట్లో బ్రిటిష్ వారి క్రింద వున్న కలకత్తా జనాభా

22 వేలు మాత్రమే !

ఫ్రెంచి వారు 1721లో మహేను 1731లో యానాంను 1738లో కరైకాల్‌ను ఆక్రమించుకున్నారు. ఈ విధంగా ఫ్రెంచి వారి ఆధీనంలో దాదాపు మూడు శతాబ్దాలుగా వున్న ఈ ప్రాంతాల్ని 1954లో భారత్ ఆధీనంలోకి వచ్చినాయి.

పాండిచ్చేరి జనాభా 5 లక్షలుపైన, కరైకాల్ జనాభా లక్షన్నర, మహే జనాభా 30 వేలు, యానాం జనాభా 15 వేలు. ఈ జనాభాలో 86 శాతం మంది హిందువులు, ముస్లింలు 6 శాతం, క్రిష్టియన్లు 6 శాతంగా వుంటారు. ఇచ్చట అక్షరాస్యత హెచ్చుగానే ఉంటుంది. 65 శాతం ప్రజలు అక్షరాస్యులు.

పాండిచ్చేరి అసెంబ్లీలో 33 మంది సభ్యులు వుంటారు. ఒక లోక్‌సభ సభ్యుడు పాండిచ్చేరికి ప్రాతినిధ్యం వహించుతాడు.

గింజినది పాండిచ్చేరిలోను, అరసలార్(కావేరి ఉపనది) కరైకాల్‌లోను, మహేనది మహేలోను, కరింగ నది యానాంలోనూ ప్రవహిస్తూ వుంటాయి.

పాండిచ్చేరిలో 46 శాతం ప్రజలు జీవనాధారం వ్యవసాయం. వరి ప్రధాన పంట. ఇంకా పప్పుధాన్యాలు చెరకు, వేరుశనగ, ప్రత్తి కూడా తగు మాత్రంగా పండుతాయి. కరైకాల్‌లో వ్యవసాయ కళాశాల కూడా వుంది.

పాండిచ్చేరి పారిశ్రామికంగా అభివృద్ధి చెందింది. 6 బట్టల మిల్లులు, 2 చెరకు మిల్లులు, ఒక పేపరు మిల్లు, సిరమిక్ పరిశ్రమలు వున్నాయి. ఒక మందుల ఫ్యాక్టరీ కూడా వుంది. ఇంకా చాలా చిన్న చిన్న పరిశ్రమలు కూడా వున్నాయి.

పాండిచ్చేరి పట్టణం ఫ్రెంచి సంస్కృతీ సాంప్రదాయాల నిలయంగా వుంటుంది. పట్టణం తిన్నగా వుండే రోడ్లతో పరిశుభ్రంగా వుంటుంది. ఫ్రెంచి వారి పద్ధతి ప్రకారం ఇక్కడ ఇప్పటికీ పోలీసులు సమతలంగా వున్న ఎర్రటోపీలు ధరించుతారు. ఫ్రెంచి వీరవనిత జోన్ ఆఫ్ ఆర్క్, ఫ్రెంచి గవర్నర్ డూప్లేల విగ్రహాలు కానవస్తాయి. ఫ్రెంచి కాన్సల్ ఉపయోగించిన ఫ్రెంచి పద్ధతులలో కట్టిన భవంతి కానవస్తుంది.

పాండిచ్చేరిలో ముఖ్యంగా చూడదగినది అరవిందో ఆశ్రమం. పూర్వాశ్రమంలో ప్రసిద్ధ స్వతంత్ర సమర యోధులు, విప్లవ వాది అయిన అరవింద ఘోష్ రాజకీయాలకు స్వస్తి చెప్పి 1925లో ఈ ఆశ్రమం స్థాపించారు. ఈ ఆశ్రమంలో వుండటానికి, దర్శించటానికి దేశం నలుమూలల నుంచే గాక విదేశాల నుంచి కూడా అనేక మంది వస్తూ వుంటారు. అరవింద మహాయోగి గొప్ప తత్వవేత్తయే గాక ప్రసిద్ధ రచయిత కూడా. ఆయన రచించిన "లైఫ్ డివైన్" 'సావిత్రి' అనే గ్రంథాలు అనేక భాషల్లోకి తర్జుమా

చేయబడి ప్రపంచ వ్యాప్తంగా ప్రసిద్ధి పొందినాయి. అరవిందులు 1950లో చనిపోయారు ఆ తర్వాత అరవింద ఆశ్రమం యాజమాన్యం బాధ్యత మదర్‌గా ప్రసిద్ధి చెందిన ఫ్రెంచి వనిత చేబట్టారు ఆవిడ కూడా 1973లో మరణించారు.

అరవిందో ఆశ్రమం అంటే మామూలు ఆశ్రమం లాంటిది కాదు. ఈ ఆశ్రమంలో వుండే వ్యక్తులు ఎవరి పనులు వారే చేసుకోవటమే గాక ఎవరికి వచ్చిన వృత్తి వారూ చేస్తూ వుండాలి. ఎవరూ సోమరిగా కూర్చోవటానికి వీల్లేదు. ఈ ఆశ్రమం క్రింద ప్రింటింగ్ ప్రెస్, ఫర్నిచర్ ఫ్యాక్టరీ, ఆయిల్‌మిల్ చేతితో తయారు చేసే పేపర్ ఫ్యాక్టరీ, లాండ్రి మొదలైన అనేక పరిశ్రమలేగాక పొలాలు కూడా వున్నాయి. డైరీలు ఉన్నాయి ఆశ్రమంలో నివసించేవారు. వీటిలో ఏదో ఒక దాంట్లో ఎవరికి వచ్చిన వృత్తి వారు చేస్తూ వుండాలి ఆశ్రమానికి చెందిన కట్టడాలు, పొలాలు పాండిచ్చేరి పట్టణం నలుమూలలా వుంటాయి ఎవరికి చేతనయిన వృత్తి వారు చేసుకుంటూ ప్రశాంతంగా తృప్తిగా రాగ ద్వేషాలకు అతీతంగా ఆదర్శ మానవుడిగా జీవించటమే అరవిందో ఆశ్రమం యొక్క విశిష్టత. అరవిందో, మదర్ సమాధులు కూడా చూడదగిన విశేషాలే.

అరవిందో, మదర్ ఆశయాలకు అనుగుణంగానే పాండిచ్చేరికి 6 కిలోమీటర్ల దూరంలో అరోమిల్లి (ఉదయిస్తున్న నగరం) అనే అంతర్జాతీయ నగర నిర్మాణం 1968లో ప్రారంభించబడింది. 800 హెక్టార్ల స్థలంలో ఈ నగర నిర్మాణానికి శంఖుస్థాపన చేశారు. అరవిందో, మదర్ సిద్ధాంతాలకు అనుగుణంగా వివిధ మతాల వారు, దేశదేశాల వారు, విభిన్న జాతులవారు, ఇచ్చట శాంతి, సౌభ్రాతృత్వాలతో నివసించే మహదాశయంతో దీన్ని ప్రారంభించారు. ప్రారంభమైన కొత్తలో ఈ అరోవిల్ నగర నిర్మాణానికి ప్రపంచ వ్యాప్తంగా పెద్ద ప్రోత్సాహం లభించింది. వివిధ దేశాల ప్రముఖులు వారి వారి దేశాల నుంచి తలా కాస్త మట్టి తీసుకు వచ్చి ఈనగర నిర్మాణానికి అందుకురార్పణ చేశారు. భారత రాష్ట్రపతి నగర నిర్మాణానికి శంఖుస్థాపన చేశారు. మొదట్లో బాగా సాగిన ఈ నగర నిర్మాణం 'మాత' మృతి చెందటంతో నగర నిర్వాహకుల మధ్య పేచీలు వచ్చి అసంపూర్తిగా మిగిలిపోయింది.

ఆనాడు డూప్లే (ఫ్రెంచి గవర్నర్) నివసించిన భవంతినే నేడు 'రాజ్ నివాస్' అంటున్నారు. ఇందులో పాండిచ్చేరి లెఫ్టినెంట్ గవర్నర్ వుంటున్నారు.

పాండిచ్చేరిలోని జవహర్‌లాల్ నెహ్రూ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పోస్ట్ గ్రాడ్యుయేట్ మెడికల్ ఎడ్యుకేషన్ వైద్య పరిశోధనలకు బాగా ఉపయోగిస్తుంది.

1827 లో స్థాపించబడిన రోమా రోలా లైబ్రరిలో పెద్ద లైబ్రరీ. దాదాపు లక్ష పుస్తకాలు ఈ లైబ్రరీలో వున్నాయి. ఇందులో ఫ్రెంచి గ్రంథాలు కూడా చాలా

వుంటాయి. దీనికి అనుబంధంగా వున్న పాండిచ్చేరి మ్యూజియంలో ఫ్రెంచి వారసత్వానికి అద్దంపట్టే అనేక విశేషాలు వున్నాయి

ప్రసిద్ధ తమిళ కవి సుబ్రమణ్య భారతి నివసించిన గృహం పాండిచ్చేరి లోనే వుంది. దేశ స్వతంత్ర పోరాటంలో పాల్గొన్న సుబ్రమణ్య భారతి బ్రిటిష్ వారికి దొరకకుండా వుండేందుకు 1908లో ఇచ్చటకు వచ్చి స్థిరపడ్డారు. ఈ ఇంట్లోనే సుబ్రమణ్య భారతి ప్రసిద్ధ గ్రంథాలైన కన్నన్ పట్టు, కుయిల్ పట్టు అనే గ్రంధాలు రాశారు. ప్రస్తుతం ఈ ఇంటిని ఆయన స్మారక మందిరంగా ఏర్పాటు చేశారు.

పాండిచ్చేరి చుట్టుపట్ల అనేక దేవాలయాలున్నాయి. పాండిచ్చేరికి 23 కిలోమీటర్ల దూరంలో వరదరాజ్ పెరుమాళ్ దేవాలయం వుంది. ఈ దేవాలయం 12వ శతాబ్దంలో నిర్మించడింది. ఇదే చోట పూర్వం ఒక సంస్కృత కళాశాల వున్నట్లు ఈ ఆలయం మీద శిలాశాసనాల్ని బట్టి తెలుస్తుంది. పాండిచ్చేరికి 25 కిలోమీటర్ల దూరంలో శ్రీ మూలాంతర్‌లో ఒక ప్రాచీన దేవాలయం వుంది. ఇంకా విల్లునూర్, వీరం పట్టణం, తిరువందర్ గ్రామాల్లో శైవ, వైష్ణవ దేవాలయాలే గాక చర్చిలు కూడా వున్నాయి. పాండిచ్చేరికి 24 మైళ్ళ దూరంలో మదగారిపట్టులో ఈశ్వరన్ దేవాలయం చూడదగినది. ఈ దేవాలయం 11వ శతాబ్దంలో రాజరాజుచే నిర్మించబడింది.

# 30 చండీఘర్

వైశాల్యం - 114 చదరపు కిలోమీటర్లు. రాజధాని - చండీఘర్. జనాభా - 6 లక్షల 40 వేలు. మాట్లాడే భాషలు - హిందీ, పంజాబీ

చండీఘర్ ఢిల్లీకి 264 కిలోమీటర్ల దూరంలో పంజాబ్, హర్యానా, హిమాచల్ ప్రదేశ్‌ల సరిహద్దులలో వుంటుంది.

వైశాల్యం రీత్యా చండీఘర్ సుమారుగా హైదరాబాద్ నగర వైశాల్యంలో సగంగా వుంటుంది.

చండీఘర్ నూతనంగా నిర్మించబడిన నగరం భారతదేశానికి స్వతంత్రం రాక ముందు ఉమ్మడి పంజాబ్ రాష్ట్రానికి లాహోర్ రాజధానిగా వుండేది. భారత్, పాకిస్తాన్‌లు విడిపోగా లాహోర్ పాకిస్తాన్‌కు వెళ్ళింది. దాంతో పంజాబ్‌లో ఏ పట్టణాన్ని రాజధానిగా చేయాలనే సమస్య ఎదురైంది. పంజాబ్‌లో వున్న పెద్ద పట్టణం అమృత్‌సర్‌ను



రాజధానిగా చేద్దామంటే అమృత్‌సర్ పాకిస్తాన్ సరిహద్దున వుండి పోయింది అందువలన అమృత్‌సర్ పంజాబ్ రాజధానిగా వుండటానికి అనువైనది కాదని నిర్ణయించి రాజధానిగా వుండటానికి ప్రత్యేకంగా ఒక పట్టణాన్ని నిర్మించాలని తలపెట్టారు ఆ విధంగా హిమాలయ పర్వత పాదాల దగ్గర శివలిక్ కొండల దగ్గర 1950లో చండీఘర్ అనే నూతన పట్టణ నిర్మాణానికి అంకురార్పణ చేశారు అత్యంత ఆధునికంగా నిర్మింప తలపెట్టిన ఈ పట్టణానికి రూపకల్పన చేసే బాధ్యతలను ప్రసిద్ధ ఫ్రెంచి వాస్తు శాస్త్రవేత్త లీకార్బు జియర్‌కు అప్పగించారు

ప్రస్తుతం చండీఘర్ వున్న ప్రదేశం లోగడ ఖాళీగా కొండలు గుట్టలు ముళ్ళపొదలతో నిండి వుండేది చండీఘర్ నిర్మాత లీకార్బుజియర్ ఈ ప్రదేశం పరిశీలించి నీటి సౌకర్యం బాగా వున్న కారణంగా పట్టణ నిర్మాణానికి ఈ స్థలం అన్ని విధాలా అనుకూలమైనదని నిర్ధారించి పట్టణ నిర్మాణం ప్రారంభించాడు 1950 నుంచి 1965 వరకు సాగిన నిర్మాణపు పనులతో చండీఘర్ అత్యంత ఆధునిక నగరంగా రూపుదిద్దుకొంది నగరాన్ని 47 సెక్టర్లుగా విభజించి నిర్మించారు నూతనంగా నిర్మించిన నగరం కాబట్టి బజార్లు ఎట్టి వంకర్లు లేకుండా తిన్నగా వుంటాయి కట్టడాలు కూడా ఆధునికమైన సకల సౌకర్యాలతో చూడముచ్చటగా వుంటాయి నగరం ప్రక్కనే రెండు చిన్న నీటి ప్రవాహాలు వుండి నగర ప్రజలకు మంచి నీటి కొరత లేకుండా చేస్తాయి ఒక్క మాటలో చెప్పాలంటే చండీఘర్ మోడల్ నగరంగా రూపుదిద్దుకొంది

చండీఘర్ పేరు చండి (దుర్గ) దేవత పేరు మీదుగా వచ్చింది 1964లో పంజాబ్ నుంచి హర్యానాను విడదీసి నప్పటి నుంచి ఈ రెండు రాష్ట్రాలకు ఇదే రాజధానిగా వుంటున్నది అయితే ఇది తాత్కాలిక ఏర్పాటు మాత్రమే లోగడ జరిగిన ఒప్పందం ప్రకారం చండీఘర్ పంజాబ్‌కు శాశ్వత రాజధానిగా వుంటుంది హర్యానా వేరొక పట్టణాన్ని రాజధానిగా చూసుకోవల్సి వుంది ఈ కారణంగా చండీఘర్ 1966 నుంచి కేంద్రపాలిత ప్రాంతంగా వుంటున్నది చండీఘర్ పరిపాలన కేంద్రప్రభుత్వం నియమించిన 'అడ్మినిస్ట్రేటర్' చేతుల్లో వుంటుంది ఒక లోక్‌సభ సభ్యుడు పార్లమెంటులో చండీఘర్‌కు ప్రాతినిధ్యం వహించుతాడు

చండీఘర్ జనాభాలో 74 శాతం మంది ప్రజలు హిందువులు 22 శాతం మంది సిక్కులు చండీఘర్‌లో అక్షరాస్యత శాతం హెచ్చుగా వుంటుంది ఇక్కడి ప్రజలలో 78 శాతం మంది అక్షరాస్యులే

చండీఘర్‌లో 2700 హెక్టార్ల భూమి సాగులో వుంది ఇందులో గోధుమ, వరి, జొన్న పండుతుంది మొత్తం చండీఘర్ వైశాల్యంలో నాలుగోవంతు అడవిగా వుంటుంది

బ్రా ప్రాజెక్టు నుంచి ఉత్పత్తి అయ్యే విద్యుచ్ఛక్తిలో 3.5 శాతం చండీఘర్ వాటా క్రింద వస్తుంది.

చండీఘర్ పారిశ్రామికంగా కూడా ముందడుగులో వుంది పెద్ద, మధ్య తరహా పరిశ్రమలు 15 వున్నాయి. చిన్న పరిశ్రమలు 3 వేలు దాకా వున్నాయి

నూతనంగా నిర్మించిన చండీఘర్ లో దర్శించదగిన ప్రదేశాలే గాకుండా అసలు మోడల్ నగరంగా నిర్మించబడి, పూతోటలతో పచ్చిక మైదానాలతో తిన్నగా వుండే బజార్లతో వుండే ఈ పట్టణమే ఒక విహార స్థలం ఈ మోడల్ టౌన్‌ని చూడటానికి దేశం నలుమూలల నుంచే గాక విదేశాల నుంచి కూడా నిత్యం అనేక మంది టూరిస్టులు వస్తూ వుంటారు.

మొదటి సెక్టర్‌లోనే ప్రభుత్వ కార్యాలయం (సెక్రటేరియట్) వుంటుంది ఆ రోజుల్లోనే ఈ సెక్రటేరియట్ నిర్మించటానికి 1కోటి 40 లక్షలు అయింది. ఈ సెక్రటేరియట్ పైన వుండే రూప్ గార్డెన్ శోభాయమానంగా వుంటుంది. ఈ రూఫ్ గార్డెన్ నుంచి చూస్తే మొత్తం నగరం అంతా కనబడుతుంది. సెక్రటేరియట్ దగ్గరలోనే హై కోర్టు వుంటుంది. దీని నిర్మాణానికి అప్పుడు 65 లక్షలు అయింది. దీనికి దగ్గరలోనే అసెంబ్లీ భవనం వుంటుంది. ఈ భవనం విశేషం ఏమంటే చాంబర్ రూంకి పైన ఒక డోం నిర్మించారు. డోం తొలిగించితే సూర్యకాంతి లోనికి వస్తుంది. ఈ భవనం నిర్మాణం ఖర్చు అప్పుడు కోటిన్నర అయిందట.

మొదటి సెక్టర్‌లోనే బ్రహ్మాండమైన హస్తం గుర్తును నిర్మింపజేశారు ఈ మధ్యనే. ఈ హస్తం గుర్తు మానవ సమైక్యతకు చిహ్నంగానే గాక చండీఘర్ నగరాన్ని దర్శించటానికి రమ్మని సైగ చేస్తున్నట్లు నిర్మించారు.

మొదటి సెక్టర్‌లోనే ప్రసిద్ధ రాక్ గార్డెన్ వుంటుంది. చండీఘర్ అందచందాలకు మరింత శోభ నిచ్చే ఈ రాక్ గార్డెన్ ఒక వినూత్న సృష్టి. విశ్వామిత్ర సృష్టి. కొద్ది చదువుతో కొద్దిపాటి ఉద్యోగస్తుడిగా పనిచేసి ఉద్యోగం చాలించి ఈ రాక్‌గార్డెన్ అనే అద్భుతాన్ని సృష్టించిన వ్యక్తి నెక్‌చంద్. 30 సంవత్సరా లనుంచి ఈ రాక్ గార్డెన్ కోసం తన జీవితాన్ని శక్తి యుక్తుల్ని ధార బోస్తున్నాడు నెక్‌చంద్. ప్రస్తుతం 12 ఎకరాల మేర విస్తరించియున్న ఈ రాక్ గార్డెన్‌ను 60 ఎకరాల వరకూ పెంచాలని నెక్‌చంద్ ఆశయం.

రాక్‌గార్డెన్ అనేక విభాగాలుగా వుంటుంది. ఒక విభాగం నుంచి మరొక విభాగానికి వెళ్ళటానికి 3 అడుగులు మాత్రమే ఎత్తుగల ప్రవేశ ద్వారం గుండా తల బాగా వంచుకొని

వెళ్ళాలి. ఈ విధంగా నెక్‌చంద్ నిర్మించటానికి కారణం చూడటానికి వచ్చిన ప్రజలు ఈ విధంగానైనా తన గార్డెన్‌లోని అసంఖ్యాక దేవుళ్ళు, దేవతా బొమ్మలకు వినయంగా తలవంచటంగా భావిస్తాడు. ఈ గార్డెన్ మొత్తం తిరిగ్గి చూడాలంటే 3 గంటలుపైగా పడుతుంది రాక్ గార్డెన్‌లో పక్షులు, జంతువులు, మనుషులు, దేవతలు, దేవుళ్ళు, ఆకారాల్లో రూపొందిన బొమ్మలు 20 వేలు పైగా వుంటాయి. నెక్‌చంద్ వీటిని తయారు చేయటానికి ఉపయోగించేవన్నీ పనికిరానివని బయట పారవేసే వస్తువులే! చిల్లులు పడినవని పారేసిన బకెట్లు, పగిలిపోయిన సీసాలు, బెజ్జాలు పడి పారేసిన కుండలు, మాడి పోయినవని ఆవల పారేసిన ఎలక్ట్రిక్ ట్యూబ్‌లైట్లు, స్విచ్‌లు, పాతచెప్పులు, చిత్తు కాగితాలు, పనికిరాని ప్లాస్టిక్ సామాగ్రి, రాళ్ళు రప్పలు - అసలు ఒకటేమిటి చెత్తా చెదారం క్రింద పారేసిన ప్రతి వస్తువు నెక్ చంద్ చేతిలో మరో రూపు దిద్దుకొని అదొక పక్షిగానో, జంతువుగానో మనిషిగానో తయారవుతుంది పగిలిపోయిన గాజుల నుంచి పక్షి బొమ్మ, మోటార్ సైకిల్ ఊచలతో నర్తకీమణుల బొమ్మలు, గుడ్డ పేలికల నుంచి దేవతల బొమ్మలు మలచటం నెక్‌చంద్ విశ్వామిత్ర సృష్టికి తార్కాణం.

రాక్ గార్డెన్ సృష్టితో నెక్‌చంద్ కీర్తి విదేశాలకు కూడా పాకింది. అమెరికావారు నెక్‌చంద్ చేత వాషింగ్‌టన్‌లో ఇటువంటి గార్డెన్ ఒకటి నిర్మింపజేసుకున్నారు. ఫ్రాన్స్, జపాన్ దేశాల నుంచి కూడా నెక్‌చంద్‌కు ఆహ్వానాలొస్తున్నాయి. ఫ్రెంచి మ్యూజియం అధికారి నెక్ చంద్ గురించి ఈ విధంగా శ్లాఘించారు. "సృష్టించటంలో భగవంతునికి పోటీ నెక్‌చంద్ మాత్రమే!"

రాక్‌గార్డెన్‌కు దగ్గరలోనే సుఖాన సరోవరం వుంటుంది. మానవ నిర్మితమైన ఈ సరస్సులో బోటు షికారు, గాలంతో చేపలు పట్టటం వగైరా చేస్తారు టూరిస్టులు.

16వ సెక్టర్‌లో జకీర్‌గులాబితోట వుంటుంది. 30 ఎకరాలలో వుండే ఈ గులాబి తోట ఆసియాలో కెల్లా పెద్ద గులాబి తోట. ఇందులో 2500 గులాబీ రకాలు వుంటాయి. ఫిబ్రవరిలో ఈ గులాబీ తోటలో పుష్పాలు వికసించి అత్యంత మనోహరంగా వుంటుంది. అప్పుడే ఇక్కడ గులాబీ ఉత్సవం జరుగుతుంది. గులాబీ అభిమానులు అనేకమంది ఇచ్చటకు వస్తారు. ఆ సంవత్సరం గులాబీ "పుష్పరాజు, రాణి" అను ఎంపిక చేస్తారు.

10వ సెక్టర్‌లో ఒక ఆర్ట్ మ్యూజియం వుంటుంది. ఈ మ్యూజియంలో భూగర్భ త్రవ్వకాలలో బయల్పడిన అనేక విశేషాలు వున్నాయి. ఇంకా రాజస్తానీ, కాంగ్రా, మొగల్ పెయింటింగ్స్‌ను కూడా ఈ మ్యూజియంలో చూడవచ్చు.

17వ సెక్టర్‌లో బస్సు స్టేషన్ వుంటుంది. రైలు స్టేషన్ పట్టణానికి కొంచెం దూరంలో వుంటుంది చండీఘర్‌కు విమాన సర్వీసు కూడా వుంటుంది.

ప్రభుత్వోద్యోగుల కోసం కట్టిన 14 తరగతుల గృహ సముదాయం కూడా చూడదగినదే పలు బెడ్‌రూంలతో నిర్మించబడిన ముఖ్యమంత్రి నివాసం దగ్గర నుంచి క్రింద స్థాయి ఉద్యోగుల కోసం నిర్మించిన రెండు బెడ్‌రూంల నివాసాలలో కూడ సమస్త సౌకర్యాలు ఏర్పాటు చేశారు ఎక్కడికక్కడ పోస్టాఫీసు, బ్యాంకు, వైద్య సౌకర్యం, కూరగాయలు ఒకటేమిటి అన్నీ అందుబాటులో వుండేటట్లుగా ఏర్పాటు చేసి మోడల్ నగరం పేరుకు తగ్గట్లుగా చేశారు. పంజాబు గవర్నరే చండీఘర్‌కు లెఫ్టినెంటు గవర్నరుగా వ్యవహరిస్తుంటారు

# 31 డయ్యూ & డామన్

వైశాల్యం - 112 చదరపు కిలోమీటర్లు జనాభా - 1 లక్ష 1 వెయ్యి రాజధాని డామన్ మాట్లాడే భాషలు - మరాఠీ, గుజరాతీ

డయ్యూ, డామన్ అనే రెండు కేంద్రపాలిత ప్రాంతాలు గుజరాత్ రాష్ట్ర తీర ప్రాంతంలో వుంటాయి డామన్ గుజరాత్ తీరంలో బొంబాయికి ఉత్తరంగా 160 కిలోమీటర్ల దూరంలో వుంటుంది డామన్‌కు ఉత్తరంగా భగవాన్ అనే నది దక్షిణాన కలీం నదులు వుంటాయి తూర్పున గుజరాత్ రాష్ట్రం వుంటుంది పశ్చిమాన అరేబియా సముద్రం వుంటుంది

డయ్యూ కాంబే జలసంధిలో వుంటుంది వెర్వాల్ నౌకాశ్రయంకు దగ్గరగా వుంటుంది ఈ దీవి సౌరాష్ట్ర (గుజరాత్) ద్వీపకల్పం ఈ దీవిని వేరు చేస్తూ ఒక కాల్వ వుంటుంది డయ్యూ దీవి నుంచి గుజరాత్ భూభాగానికి వెళ్ళటానికి టాడ్ అనే గ్రామం వద్ద ఒక బ్రిడ్జి వుంటుంది ఈ విధంగా డయ్యూకు ఒక వైపున కాల్వ మిగతా మూడు వైపులా అరేబియా సముద్రం వుంటుంది

డామన్ వైశాల్యం 72 చదరపు కిలోమీటర్లు కాగా డయ్యూ వైశాల్యం 40 చదరపు కిలోమీటర్లు డయ్యూ 10 కిలోమీటర్ల పొడవు 4 కిలోమీటర్ల వెడల్పు వుంటుంది



డామన్ జనాభా 61 వేలు. డయ్యూ జనాభా 40 వేలు.

డయ్యూ, డామన్‌ల వైశాల్యం మన హైదరాబాద్ వైశాల్యంలో సుమారుగా సగం వుంటాయి

డామన్ వాతావరణం ఎక్కువ తేమగా సమశీతోష్ణంగా వుంటుంది. డయ్యూ వాతావరణం వేడిగా వుంటుంది.

డయ్యూను 1534లో పోర్చుగీసు వారు ఆక్రమించుకున్నారు. 1559లో డామన్‌ను ఆక్రమించుకున్నారు. గోవాతో పాటు ఈ డయ్యూ, డామన్‌లు అప్పటి నుండి 1961 వరకూ పోర్చుగీసు వారి ఆధీనం లోనే వున్నాయి. డయ్యూ పూర్వం ప్రసిద్ధి నౌకాశ్రయంగా వుండేది పోర్చుగీసు వారికి డయ్యూ పెద్ద వాణిజ్య కేంద్రంగా వుండేది. 1961 డిశంబరులో ఈ ప్రాంతాలు పోర్చుగీసు పాలన నుంచి విముక్తి చేయబడినాయి. మొదట్లో గోవా, డయ్యూ, డామన్‌లు ఒకే యూనిట్‌గా కేంద్రపాలిత ప్రాంతంగా వుండేవి. 1987లో గోవాను ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పర్చటంలో మిగిలిన డయ్యూ డామన్‌లు కేంద్రపాలిత ప్రాంతాలుగా వుండి పోయినాయి. కేంద్ర ప్రభుత్వం తరపున లెఫ్టినెంట్ గరవ్నర్ ఈ ప్రాంతాల పాలన చేస్తాడు. లెఫ్టినెంట్ గవర్నర్‌కు లోబడి డామన్, డయ్యూలను పరిపాలించటానికి ఇద్దరు పౌర అధికార్లు వేరువేరుగా వుంటారు. లోక్ సభలో ఒక సభ్యుడు ప్రాతినిధ్యం వహిస్తారు.

డయ్యూ, డామన్ ప్రజలు అత్యధిక సంఖ్యాకులు వ్యవసాయదార్లు. వరి, గోధుమ, వేరుశనగ ఇచ్చట పండే పంటలు. అడవుల విస్తీర్ణం తక్కువ. ఇచ్చట చెప్పుకోదగిన పరిశ్రమలు ఏమీ లేవు. చిన్న పరిశ్రమలు మాత్రం కొద్దిగా వున్నాయి.

డామన్ మధ్యగా డమన్ గంగా నది ప్రవహిస్తూ డామన్‌ను రెండు భాగాలుగా చేస్తుంది వీటినే ఉత్తర డామన్, దక్షిణ డామన్ అంటారు. ఉత్తర డామన్‌ను లిటిల్ డామన్ అని కూడా అంటారు. లిటిల్ డామన్‌లో హెూటళ్ళు, బార్లు ఎక్కువగా వుంటాయి. దక్షిణ డామన్ లేక బిగ్ డామన్‌లో ప్రభుత్వ ఆఫీసులు, చర్చిలు వుంటాయి. డామన్ సముద్రం ఒడ్డున వున్నా అచ్చట బీచ్‌లు మాత్రం ఏమీ బాగుండవు. మురికిగా వుంటాయి. అందువలన ఈ బీచ్‌లలో పెద్దగా జనం కన్పించరు.

డయ్యూ పట్టణంలో పోర్చుగీసు వారు పెద్ద కోట నిర్మించారు. శిధిలావస్థలో నున్న ఈ కోట ఇప్పటికీ చూడదగినదే. డయ్యూలో రమ్ సారా విరివిగా దొరుకుతుంది. ఇక్కడ ఇదొక పెద్ద పరిశ్రమ. సారాప్రియులు అనేక మంది చుట్టుపట్ల ప్రాంతాలనుంచి ఇచ్చటకు వచ్చి రమ్ సారా త్రాగుతూ వుంటారు. డయ్యూలో ఇంకా రెండు మూడు చర్చిలు కూడా వున్నాయి. డయ్యూ పట్టణం అంతా వంకర టింకరగా ఇరుకు రోడ్లతో వుంటుంది.

